# శ్రీ మదాంజనేయ మహాదేవతాయై నమః

కం॥ గండర గండండై యు
ద్దండ పిశాచోపహతుల దయ మనుపంగా
గండి క్షేత్రంబునఁ గొ
ల్వుండెడు వీరాంజనేయుఁ డోమున్ జగమున్॥



తే॥ గీ॥ శ్రీ రఘూద్వహుం డెచటఁ గీర్తింపఁ బడునొ
యచట నంజలి శిరమున నవధరించి
బాష్ప పరిపూర్ణ నేత్రుఁడౌ పవన సుతున
కంకితం బిత్తు నీ కృతి నధిక భక్తి॥

# -:విద్వల్లోకమునకు విన్నపము.:-

తమిళభాషలోని మహాకావ్యములలో 'ఇళంగోవడిగళ్ కృత శిలప్పది కారము' తల మానికము. ఈ మహాకావ్యమును బ్రప్రథమముగాఁ ద్రమిళాంధ్ర మహాసముద్రముల నొక్కగ్రుక్క నాపోసనముగొన్న కీ॥ శే॥ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు తెలుఁగులోనికి ననువదించిరి. వీరి కృతికి మునుపో, వెనుకో బహుభాషా పారంగతులు కీ॥ శే॥ A. S. P. అయ్యర్ (M.A.I.C.S. బారిష్టర్) గారు ఈ మహాకావ్యమునే ఆంగ్లభాషలోనికి ననువదించియుండిరి. ఆ తర్వాత కళాప్రపూర్ణులు, విమర్శకాగ్రేసరులు, మన్మిత్రులు శ్రీ మరుపూరు కోదండరామి రెడ్డిగారు 1961 సంవత్సరమున అయ్యర్‌గారి కావ్యమును దెనుఁగులోనికి గద్య రూపముగా "మంజీరగాథ" అనుపేర వెలయించిరి.

ఈ కథనే నేనిప్పుడు తెనుఁగున "మంజీర విలాసము" అనుపేర స్వతంత్ర కావ్యముగా నిర్మించితిని. ఈ స్వతంత్ర కావ్య నిర్మాణమునకుఁగావలసిన శిల్ప మును, ఆలంకారిక సామగ్రినంతయు సంతరించుకొని స్వతంత్ర కల్పనములను, భావములను సంఘటించుకొని,

"అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః
యథా స్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"

అను సూక్తి కనుగుణముగా నా నేర్చిన విధమునఁ గావ్యమును రచించితిని. ఇందుఁ దమిళ కవుల సంప్రదాయములుగాని వారి కవితారీతులుగాని స్పృశింపఁ బడలేదు. ప్రాచీన సంస్కృత సాహిత్య సంప్రదాయములు ఆంధ్రకవి శ్రేష్ఠ రీతులు మాత్రమిందనుసరింపఁబడ్డవి. కావ్య స్వతంత్ర ప్రతిపత్తికి భంగము వాటిల్లునేమోయని 'శిలప్పదికార' కావ్యమును జూడలేదు. (తమిళభాషా వాసన యొక్కింతయు లేమింజేసి) చివరకుఁ దదనువాదమైన 'అందియకత'ను గూడ, జదువలేదు. ఇందులోఁ జెప్పఁబడ్డ భావములన్నియు స్వతంత్రములు. నాకుఁ దోఁచినవి. ఆ భావములు సయితము ప్రాచీన సంస్కృతాంధ్ర కవితా సంప్రదా యములకు ననుగుణమైనవి. కథాగమనమునకు నడ్డంకులుగా నాధునిక విమ

ర్శకులచే భావింపఁబడుచున్న యష్టాదశ వర్ణనములను బొత్తిగా విసర్జింపక "స్పృష్ట్వా త్యక్త్వా" అన్నట్లుగాఁ బరామర్శించితిని. పాత్రముల మనస్తత్త్వ చిత్రీకరణమునకు, నాటకీయతకు, రసస్ఫోరక శిల్పమునకుఁ బ్రాధాన్యమిచ్చి రచనను సాఁగించితిని. ఈ ధ్యేయమును సాధించుటకే వర్ణనాత్మక శైలి నాదరింపక, సంభాషణాత్మక శైలినిఁజేపట్టితిని. శిలప్పదికారమునకు, ఈ కావ్యమునకు సామ్యము కథయందే కాని యితర విషయములఁగాదు.

కణ్ణగి చెలికత్తెలలో నొకర్తయైన 'ప్రియంవద' పాత్రము నా కావించిన సృష్టి, మూలకథలో లేదు. దానిచేత నడిపించిన రాయబారము సయితము నా కల్పించినదియే. ఈ కావ్యమునఁ దెనుఁగుఁదనముఁ బ్రతిబింబింపఁజేయుట నా ప్రధానోద్దేశము. ఆ యుద్దేశమీ కావ్యమున సమగ్రముగా నెఱవేఱనేని నా ప్రయత్నము సఫలమైనట్లేయని భావింపఁగలను. మూలకథలోని భావములకు,నిందలి భావములకు నెచ్చటనేని సంవాదమేర్పడుటను గాకతాళీయముగాఁబరితలు భావింపనగును.

ఈ కావ్యమునకు నార్థిక సాహాయ్యమును (5000 రూప్యములను) సమకూర్చిన శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ ఇంజనీరింగ్ కళాశాల ప్రొఫెసర్‌గారును, చిరంజీవులును, విద్యా సంపన్నిధానులునునగు శ్రీ కొప్పరపు లక్ష్మినారాయణ B.E. (Hons) M.E. Ph.D. M.I.B.P. M.I.E. M.I.S.T.E. గారికి కృతజ్ఞతల నర్పించుకొనుచున్నాను.

ఈ యార్థికసాహాయ్యమును గావించుటకు చిరంజీవులు శ్రీ కొప్పరపు లక్ష్మినారాయణగారి నున్ముఖుని గావించిన నవ్య సాహితీ సమితి అధ్యక్ష కార్యదర్శులు, చిరంజీవులు నయిన షేక్. మహమ్మద్ ముస్తఫా (M. A. Ph. D) తెలుఁగు లెక్చరర్) గారికిని, ప్రధానాంధ్ర భాషా పండితులు A. C. దస్తగిరి (P O L భాషాప్రవీణ) గారికిని నా కృతజ్ఞతను వెల్లడించుకొనుచున్నాను. ఇంతమాత్రమేగాక ప్రూఫ్రులు దిద్దుటకు సయితము తోడ్పడి నాకుఁగుడియెడమ భుజములుగా నుపకరించిన వీరిరువురికి మఱి మఱి కృతజ్ఞతను వెల్లడించు కొనుచున్నాను.

"మంజీర విలాసము" యొక్క చిత్తుప్రతిని బరిశీలించి అక్షర స్ఖాలిత్యాది దోషములను సరిదిద్దిన నా సహోపన్యాసకులు శ్రీ యస్. పాండురంగయ్య M.A.

గారికిని, శ్రీ డి. నరసింహులునాయుఁడు M A. గారికిని నా కృతజ్ఞతాపూర్వకాభి నందనములను సమర్పించు కొనుచున్నాను.

ఈ కావ్యమును మొదటినుండి తుదివరకుఁజదివి యమూల్యములయిన సలహాలను, సవరణల నొసంగిన సాహిత్యాలంకార పండితులు అష్టావధానులు నయిన బ్రహ్మశ్రీ అవధానము చంద్రశేఖర శర్మగారికి నమస్కృతి శతము లర్పించు కొనుచున్నాను.

నా కావ్యమును జదివి తమతమ యమూల్యములయిన యభిప్రాయ ముల నందించిన విద్వద్వరేణ్యులు సర్వశ్రీ అవధానము చంద్రశేఖరశర్మ, యస్వీ జోగారావు, తుమ్మపూడి కోటీశ్వరరావు, జి. యన్. రెడ్డి, సి. వి. సుబ్బన్న శతావధాని, యెల్లంరాజు శ్రీనివాసరావుగార్లకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కార ముల నర్పించుకొనుచున్నాను.

ఈ కావ్య నిర్మాణమున నాకు శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారి 'మంజీరగాథ' కరదీపికయైనది. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకముల నర్పించుకొనుచున్నాను,

ఈ కావ్యము నచిరకాలములో నందముగా ముద్రింపించి యిచ్చిన సారథిప్రెస్ (ప్రొద్దుటూరు) అధిపతులకు, శ్రీ రంగస్వామిగారికి నా ధన్యవాద ముల నర్పించుకొనుచున్నాను.

హృదయాహ్లాద కరంబులైన కవితారీతుల్ సజావై "శిల
ప్పది కారంబు"న నున్న వెల్లఁగలవే ప్రత్యగ్రమౌ దీన? న
న్నది పోనాడి స్వతంత్ర కావ్యమను యాథార్థ్యంబు భావించి నె
మ్మది "మంజీర విలాసమున్" జదువుఁడీ మాన్యుల్ సుధీగ్రామణుల్

ప్రొద్దుటూరు.
రుధిరోద్గారి నామ సంవత్సర
భాద్రపద శుద్ధ సప్తమి.

ఇట్లు,
విద్వజ్జనవిధేయుఁడు
బండ్ల వేంకటరమణయ్య.

# —: కృతిపోషకుని ప్రశంస :—



శా॥ "శ్రీ నెక్కొల్పితి వక్షమందు, నను నీ చేనైన లాలింప రా
దో" నాఁగా "నచలా! క్షమాఖ్య యుడివోదో నీకు,? నీ సింతగా
నే నాఁడేని వహించితే" యని భుజం బీఁ జాఁచు శ్రీశుండు ల
క్ష్మీనారాయణుఁ బ్రోచుఁ గావుత యశశ్శ్రీ భోగ భాగ్యంబులన్ 1

సీ॥ ముంజేతి కంకణంబునకు నద్దం బేల?
జాతి రత్నమునకు సాన యేల?
పదియారు వన్నెల పసిఁడికి మెఱుఁ గేల?
గందంపు బొమ్మకుఁ గలప మేల?
యందమైన మొగాన కద్దెడు పసు పేల?
తావిపూవున కొండు తావి యేల?
ప్రొద్దు పొడుపును జూపుటకు దీపం బేల?
జగ మెన్ను ద్విజునకు జందెమేల?

తే॥ గీ॥ లక్ష్మినారాయణుని గుణలతిక కేల
యొండొక పొగడ్త ప్రాఁక? ని యూరివారు
పల్కు చుండుట వీనులఁ బడుట స్తుతికిఁ
బెడమొగము వెట్టియు నొకింత వెల్లడింతు. 2

ఉ॥ తీయని మాటవాఁడు, వెనుదీయక యన్నది చేయు వాఁడు వి
ద్యాయతనంబు నా యశము నందిన వాఁడు సుహృజ్జనాళి కా
ప్యాయన మిచ్చువాఁడు వినయంబునఁ బండిన వాఁడు లక్ష్మినా
రాయణుఁ డిమ్మహాకృతికి నర్థ మొసంగిన వాఁడు పేర్చుతన్. 3

తే॥ గీ॥ వెన్న వంటి మనం బున్న విజ్ఞు; డంతొ!
యింతొ? యాశ్రయించిన వారి కిచ్చువాఁడు;
దైవ చింతన గలవాఁడు భావుకుండు।
పుణ్య చరితుండు నా కృతి పోషకుండు. 4

# కృతిపోషకులు :



డాక్టర్ K. లక్ష్మీనారాయణ, B. E. (Hons) M. E. Ph.D

M. I. B. P. M. I. E. M. I. S. T. E.

Professor of Mechanical Eng.

**S. V. U. College of Engineering**

**TIRUPATI.**

కం॥ తన యన్నది తుదముట్టఁగ
నొనరించెడు శక్తి, యుక్తి యొప్పిన విద్వ
జ్జనుఁ డని లక్ష్మీనారా
యణువినుతింతురు సుహృజ్జనావళి యెపుడున్. 5

కం॥ కన్నన్యముఁ గననేరుచు
తన్నే కన నేర దట్లు ధార్మికుఁ డితఁడ
న్యోన్నతి గణింప నేరుచు
స్వోన్నతి గణియింపఁ దొడ్డు లూఁది పలికినన్ 6

సీ॥ తన యశో విస్తారమునకుఁ గైరవము లు
త్పలములై కొలఁకుల దాఁగి కొనఁగ
తన వచో మాధుర్యమున కమృతరసంబు
మధు వను పేరూని మహికి డిగ్గ
తన మనో నైర్మల్యమునకు సాక్షిగ హిమ
ధర మంతటిది వెల్లఁదనము ఁదాల్ప
తన మహా గాంభీర్యమున కుదన్వంతుండు
స్తబ్ధుఁడై యెచటికిఁ దరల కుండ;

తే॥ గీ॥ తన ప్రియంభావుకతకు బాంధవ జనంబు
జంగమ యశో ధ్వజంబులై సాఁగు చుండ;
ధర్మశీలుండు సుప్రియ దర్శనుండు
లక్ష్మీనారాయణుండు శ్లాఘాత జగతి. 7

కం॥ లక్ష్మిని నా కృతి కొసఁగిన
లక్ష్మీకర కొప్పరపు కుల శ్రేష్ఠుఁడు శ్రీ
లక్ష్మీనారాయణుఁ డా
లక్ష్మీ వల్లభు కృపా విలాసము ఁగనుతన్ 8

# అ భి ప్రా య ము

డాక్టర్ సి. వి. సుబ్బన్న శతావధాని
26—8—83 ప్రొద్దుటూరు.

ఇళంగోకవి తమిళమున "సిలప్పదికార మనెడి కావ్యము రచించెను. తమిళ కావ్య పంచకమున రెండవదిగా లెక్కింపబడుచున్న యీకావ్యము ముప్పది యధ్యాయములతో 1652 పద్యములతో నొప్పుచున్నది. ఇది ప్రాచీన ద్రావిడ సామాజిక జీవన విధానమునకు అద్దముపట్టి, జైనమత ప్రశస్తి కి గద్దియ పెట్టినది. కథాప్రాణ మంతయు చరమాధ్యాయమున నున్నది. కథ – సామాన్య కథ కాదు; చదువరి నెత్తురు నట్టె కుతకుత నుడికించు నట్టిది.

అట్టి "సిలప్పదికార" ద్రావిడ కథ గైకొని, శ్రీవెంకట రమణయ్యగారు సంస్కృతాంధ్ర కావ్య నాటక ప్రబంధ సామగ్రి బండ్లకెత్తి "మంజీర విలాస" మనుపేర. అయిదు ప్రకరణములు, ఉత్తర భాగము, వెరసి 1443 పద్యముల ప్రబంధముగా సంతరించిరి.

మంజీర విలాస ప్రబంధమున ద్రావిడ సమాజరేఖగాని, జైనమత శాఖ గాని అంతగా కానరావు. ఉండిలేనట్లున్నవి, అంతట తెలుగు దేశము, తెలుగు వారి ఆచార వ్యవహారములే పైకొన్నవి.

ద్రావిడ కవి సమయ వర్ణన విశేషము లీకవి స్వీకరింప లేదనుట కొక చిన్న తారకాణ—

తమిళకవి యిళంగో శోభనపుఁబెండ్లికూతురైన కణ్ణగి కన్నులు షణ్ముఖుని శూలాయుధపు టంచులవలె నున్నవని కోవలన్నుచే కైవారము చేయించెను. అగ్ని ప్రసాదమున బుట్టిన కన్యక కనుక, అగ్నిబీజుడైన అమర సేనాని యొక్క ఆయుధ కళ లామెచూడ్కులందు స్ఫురించుట అంతవింత కాక పోవచ్చు. కాని, మన కది వాడుకలో లేని పద్ధతి.

తెలుగుకవి దాని తట్టు జూడలేదు. నాయకుడు గదిలో నడుగు బెట్టుట, "రభసాశ్లేష" మున బట్టుట యౌగపద్యముగ జరిపించెను.

"కథాపరిణతి" చే ప్రబంధమునకు చారుత సమకూరునని కవి సిద్ధాంతము. (చూ॥ 3 – 93)

కణ్ణగి కన్యకాశబ్ద వికృతి కాబోలు.

మనైక్కనుడు "దుర్విధి మన కడుపున నొక కాయ గాయింపడాయె నెక్కరణిని బున్నామనరక మీగ గలవార" మని భార్యతో నసును. (1 – 35) "గంపంత సంపద కలదు సెట్టికి గాని, కడుపున నొకకాయ కాయదాయె" నని లోకు లాడుదురు. (1 – 37) తరువాత చుట్టాల పడతులు "ఈయమ్మ కడుపున నీనాటి కొక కాయ కాచుట మిగుల భాగ్యంబు గాదె" యని ప్రశంసింతురు. (1 – 57) ఒత్తి ముమ్మాఱు వక్కణింపబడిన యీ "కాయ" కణ్ణగి. కోరుకొన్నది, కలిగినది, కాయ. ఈ కాయ రసతరంగితమై తియ్యని పండు కాలేదు. నేలబడి పగిలి పైకెగిరిపోయెను.

తల్లిదండ్రులు కణ్ణగికి పెండ్లి చేయుదలచుకొన్నారు. ఈ సంగతి తెలిసికొన్న కూర్మిచెలులు గేలిసేయగా, కణ్ణగి చిటపట మనుచు, వెఱ్ఱులార! ఆలు లేదు, లేదుచూలు, కొడుకు పేరు సోమలింగ మన్న సామెతవలె నున్నవి గద మీమరుక్తు" లనును. (1 -- 102) అనగా, తాను సంసారము చేయుట, పిల్లల గనుట యుండదని, అప్రయత్నముగ, అమెనోట ఆ మాటలు వెలువడినవి.

ప్రథమ సంగమవేళ పతికి కాయ "నా వాప్తేష్టమై" తన శలాటుత్వమును నిరూపించుకొన్నది. (1– 118)

కోవలన్న వేశ్యతో కాపురము చేసి బిడ్డను గనెను.

అనాథస్త్రీ యోర్తు "అరుదౌ నపత్యము కలుగుత నీకున్" అని కోవలన్న నాశీర్వదించెను. ( 2 -- 86) కాని, ఆ విధవ ఆశీస్సు ఫలించ లేదు.

తిరిగినచో నడదీవియ (1 -- 65) పలికినచో "చిటపట" (1 -- 102) కూర్చున్నచో "పొగ గట్టిన దీవము" (3 – 93) రాజు కడకేగుచో, "బడబానల

జ్వాలా", "యిరమ్మదార్చి", "దావహేతి", "యగ్నిలోహిత" (5—421) ఇట్లు కణ్ణగి మధురానగరము నిర్దహింపజాలు నాగ్నమూర్తిగా చిత్రింపబడినది.

ఈ రీతిగా లోనారసి చూచిన, పరిణ్నత్యభిముఖముగా సాగిన కథావల్లరి కనబడును.

ఇక రచనలో కాళిదాస భవభూతుల పదచ్ఛాయ లెక్కడ జూచిన నక్కడ గోచరించును.

"ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలా కమలపత్రాణి గణయామాస పార్వతీ"

అనెడి కుమార సంభవ శ్లోకమునకు తెనుగు పద్య మెంత చక్కని యనువాదమో పరికింపుడు.

"ఆ పలుకు లెల్ల వించు లీలాపయోజ
పత్రములు లెక్క పెట్టుచు స్వజనయిత్రి
పార్శ్వమున నధోముఖియయి పలుకకుండెఁ గణ్ణగియు" (1—107)

డగ్గుత్తికతో వాక్యము నసంపూర్ణముగా ముగించుట యొక రచనాశిల్పము. భవభూతి, శ్రీరాముని గురించి

"త్వంజీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వమంగే
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం తామేవ — (నిశ్వస్య)
శాంత, మథవా, కిమిహోత్త రేణ?"

(ఉత్తరరామ చరిత నాటకమ్. 3–20)

అని వాసంతిచే పలికించినాడు.

తెనుగున — "భూనాథు భటులు నట్ట నడువీధి నీ ప్రాణనాధు........ నింతకంటెను జెప్పెడి దేమి గలదు?" (5–854) అని మదారి కణ్ణగితో జెప్పుట గమనింపదగును.

అండాళమ్మ గర్భవర్ణనము భట్టబాణ భణితుల కను ప్రాసము (1–50)

పతివెంట మధురకేగు కణ్ణగి, విరాట నగరమున కేగు తిక్కన సోమ యాజి ద్రౌపది వలె కనిపించును. (5—6)

ప్రథమ రతి వర్ణన ప్రౌఢ ప్రబంధ కవుల తీవి. (1—118)

"చీకటి కందెన పగిది దిక్చక్రనాభిహత్తి కొనియుండె" ననుట ప్రబంధ కవుల శ్లేషవిచ్ఛిత్తి రమణీయ మార్గము.

కాగా, పద్దియము లన్నియు తీర్చిదిద్దిన బొమ్మలవలె ముద్దుగ నున్నవి, వానిలో సీసములదే అగ్రతాంబూలము. ద్వితీయ ప్రకరణము నందలి 136, 149, 192 పద్యముల కూర్పు పరమ రమణీయము.

పుర వర్ణన సందర్భమున — "సాలీం ద్రుకమ్మరీం డ్యగసాలెలు, కుమ్మరులు, రజక సౌచిక శబరుల్ మాలలు, వద్రంగులు నందోలి నివాసం బొనర్తు రొక్కొక వీధిన్" (1 – 16) అని చెప్పబడినది. చాకలి యుండి మంగలి లేకపోవుట కొఱత. నాగరికులకు క్షౌరము ముఖ్యము. కనుక. ఆటవికులైన శబరుల తొలగించి, క్షురకుల జేర్చుట యొప్పు.

"కుషీ", "పైలా పచ్చీసు" వంటి హిందూస్తానీ పదము లిందు. చమత్కార జనకములుగా ప్రయుక్తములు: ఇక్కడ "కుషీ" కుశలార్థ బోధకము.

"పైలా పచ్చీసు" = పహిలా పచ్చీస్, అనగా తొలి పాతిక (25) యని యర్థము. తొలిపాతిక కోడె ప్రాయము. ఆ వయసు దాటి, దూసరా పచ్చీస్ లోనున్న వ్యక్తి నుల్లాస పఱచుట కన్నమాట.

"పనసకాయ దొరికినపుడే తద్దినము పెట్టుమన్నట్లు" అది తెలుగు సామెత. బోగము దాని చెలి వసంతమాల కోవలన్నతో "పనస పండబ్బినప్పుడె పండుగ యను సూక్తి వినవొ? లజ్జించుట యుచిత మయ్యో!" యనును. (2—121) పైకి "పండుగ" యన్నను అది తద్దినమే. భార్యకు తద్దినము పెట్టి

అన్నవాక్యం నైషధీయ పాండిత్య వైభవ స్ఫోరకం, ఈ రచనకు వ్యతిరిక్తంగా

"మనకితరుల గిట్టకపో
యినంత మాత్రమున నింద్యు లెట్లపుదురు?" 3 – 80

అన్న సూక్తి రచనలో ఎంత వ్యావహారిక వచోన్యాస సౌలభ్యమున్నది?
అలాగే "తిట్టిన తిట్టు తిట్టకిది తిట్టినది." 2 – 85

"ఒరులకు నేమొనరించునో
నరుండడియ యీ జగంబునన్ బ్రాపించున్" 5 – 484.

పద్యంలో తిక్కనగారి "ఒరులేయవి యొనరించిన నరవర!" పద్యం స్ఫురిస్తున్నది.

## చ మ త్కా రో క్తు లు

కం॥ నీ చెలువను గాలంబున
కీ చేతో జాతసుభగు డెఱయయ్యె, నహో
కాచమణిని మణి యని యా
లోచించె వణిక్కులపతి లోలదృంగతా! (2 – 172)

వణిక్పతి మణికి – కాచమణికి భేదం తెలియనివాడు కావటం వ్యాపారానికి నష్టం. ఇది కొంతకు కొంత విజయ విలాస చమత్కారం.

కం॥ కావేరి పూ్వం పట్టణ
మా విభునకు రాజధానియై యలరు; రిపు
క్ష్మావరులు వెన్ను సూపుదు
రావిభు వ్యాఘ్ర ధ్వజంబు నటుగన్గొన్నన్ (1 – 5)

రాజు వ్యాఘ్రధ్వజుండు కనుక శత్రువులు వెన్నుచూపటం సహజమే. కావేరిపూ్వం – రిపుక్ష్మా – శబ్ద సంయోజనం లోని వ్యతిరేకత – వైరుధ్యంకు (రిపు × రిపు) పద్యభావం కావటం చమత్కారం.

"అన్నపూర్ణకు నుద్దియయ్యమ్మ యన్న
అతిశయోక్తి కి కాదంట కాదతిశయోక్తి" (1 – 34)

అనటం చమత్కారంగా వుంది.

కానక కానక కన్నను నాండాళు
గుమ్మడి పండంటి కూతుఁగనియె (1 – 58)

(1 – 81) – ఇవి నానుడ్లు – లోకోక్తులు – సామెతలు – వీటిని పోత పోసిన పద్యాలు.

కావ్యంలో సామెతలు అనేకం వాడబడటం సోమనాథుని మార్గాన్ని విస్పృతం చేయటమే.

## శృంగార రస నిర్వహణ

ఇది ద్వితీయ ప్రకరణంలో మాధవీ కోవలనుల ప్రణయ లీలా ఘట్టం

"రసికుడాతం డధరబింబ రాజకీర
మై పయోధర చాతకంబై ముఖాబ్జ
భృంగమై హస్త పల్లవ పికము నగుచు" (2 – 134)

అన్నచోటి రూప కాలంకారం, శృంగారాన్ని సొగసుగా పోషిస్తున్నది.

"పాలయుల్కఁ దీర్పంగ" (2 – 136) పద్యమంతా దోహదక్రియల నెపగా సంయోగ శృంగారాన్ని సుకుమారంగా వ్యంజిస్తున్నది, పద్యాంతంలో మాధవీ వల్లరికి సుకుమారతరుఁడు కోవలన్" అన్నచోట సుకుమార శ్లేష తరుఁడు) రసాన్ని భంగించక పోవటం కవి చాకచక్యాన్ని నిరూపిస్తున్నది.

అవికకు నిముడని వలిచ
న్గవఁ బండించుకొని కాముక స్వామి కనెన్ (2 – 199)

ఈ ప్రౌఢవక్రోక్తి కాముక స్వామి – దృష్ట్యా రసాన్ని పండించు ంటున్న మాట.

హంస తూలికా తల్పముపై
"నారిగ మారిన మారుని బీరంబన నున్న మాధవి" (2 - 123)

ఇక్కడ మాధవి (లత) మారుని బీరమే నారిగ మారిందనటంలోని ప్రాషోక్తి తరువాతి పద్యంలోని "కైతవకుసుమశరాసన!" అన్న సంబుద్ధితో సమన్వయిస్తూ సంయోగ సౌభాగ్యాన్ని పోషించడం సొగసుగా వుంది.

## క థా కా లం

ఈ కథ ఎప్పటిదో! 1800 ఏండ్ల క్రిందటిది. (1 – 41) ఆనాటి సంఘం నాటి సాంఘికాచారాలు – నాటి చరిత్ర – నాటి మత పరిస్థితులు – రాజ్యపరిస్థితులు – ఇవన్నీ కావ్యంలో చిక్కగా, చక్కగా వర్ణితం కావడం సాహిత్య దృష్ట్యా చరిత్ర దృష్ట్యా – గౌరవించదగ్గ విషయం.

కావ్య ప్రారంభమంతా ఒక ప్రాచీనతను – దాని వైభవాన్ని కళ్లకు కట్టిస్తున్నది. ప్రత్యేకంగా 1 –5 నుండి 24 పద్యందాకా ఆ వర్ణనమున్నది. రాజు రాజధాని — కోట — తోట — అందలి మానవులు — వస్తు సంభారాలూ ఇవన్నీ నాటి రాజ్య వైభవ చిహ్నాలుగా నేటికీ ఆశ్చర్యంగా కనిపిస్తాయి. చాతుర్వర్ణ్యంలో మొదటగా వైశ్యవర్ణన (20) కథానాయికా నాయకులు వైశ్యులు కావటంవల్ల ఔచిత్యం శోభితమవుతున్నది. 23వ పద్యంలో

ప్రతి వస్తు ముఖమున బరువును వెలయును
స్పష్టంబుగా దేశ భాష నుండు"

నన్నమాట నేటిస్థితినీ సూచిస్తున్నది నాటి వైఖరితోపాటు

1 –83లో అగ్నిహోత్రాదులు వైశ్యులకున్న విషయం స్పష్టం చేయటమేకాక ఆర్యనాగరకతను సూచిస్తున్నది. ఇందుకే రాజు ఆర్య ద్రావిడ నాగరకతలను సమంగా పాలిస్తున్నాడని చెప్పబడ్డది.

దేశి మార్గ నృత్యాలు (102)లో పేర్కొనటం పై విషయానికి పోషకం. ఆనాడు ద్రావిడ దేవతలు — భూత చతుక్కం (1—2) గ్రామదేవత (1) కొఱ్ఱవైగుడి (పుట 273 --14 పద్యం) వీటితో పాటు ఆర్య దేవతలు – శివ – మాధవ – షణ్ముఖ – బలరామ కృష్ణదేవాలయాలున్నవట (1 – 24)

ఇది వైదిక మత విషయంకాదా కథలో జైనచారణ కథ (పుట 188) వల్ల జైనమత విషయం. బౌద్ధవిహార ప్రశంస వల్ల (పుట 167) బౌద్ధము, ఆ నాడు సామరస్యంలో వున్నట్లు వర్ణింపబడటం నాటి మత సామరస్య దృష్టి నేటికి కన్నెఱ్ఱ బౌద్ధ విహార వర్ణనములో – పంచ శాఖా సముపేతమౌ బోధి మహీజవర్ణనవుంది. బహుశా అశోక చక్రవర్తి పాలనలో ఇది సింహళందాకా – ఈ మార్గంగా – వ్యాపించినట్లు భావింపవచ్చు. క్రీ. పూ. 269 నాటి అశోక చక్ర వర్తి శాసనాలు మధురా ప్రాంతంలో లభిస్తున్నాయన్న చరిత్ర కథనం ప్రకారం

బౌద్ధంతో పాటు బోధి వృక్షమూ ఆదేశంలో ప్రతిష్ఠితమై యుండాలి. 190వ పుటలో జైనాలయ వర్ణన నాటి వాస్తు స్ఫురణను తెలియచేస్తున్నది. గుడి శిఖ రం 3 గొడుగులుగా – ఒకదాని మీద నొకటిగా – చెక్కబడ్డదట. ఈ త్రిసంఖ్య కర్థం అదే పుటలో 116వ పద్యం వివరిస్తున్నది. దేహం–మనస్సు–అహంకారము ఈ మూటిని జయిస్తేకాని ముక్తి లేదన్న మత సిద్ధాంతానికి మూడు ప్రతీకలట.

(1) యజ్ఞశ్రీ శాతకర్ణి (2వ శకం.) కాలంలో గ్రంధ రూపం పొందిన మ. పు.లో ఈ దేవత పేర్కొనబడినది.

బౌద్ధ స్థూప నిర్మాణంలోకూడా ఈ మూడు గొడుగులు (Tyres)న్నాయి. అవి త్రిరత్న సూచకాలంటారు. కాగా నాడున్న చారిత్రక–మత స్ఫురణ ఎంత దొడ్డదో చెప్పటానికి కాదు.

ఇంతేకాక ఆనాడు శాతవాహన దేవాలయమున్నదట. పుట (155) దీన్ని గురించి శాతవాహన సంచికా నిర్మాతలు కూడ పేర్కొన్నారు.

కావ్యంలో పంచమ ప్రకరణానంతరం ఉత్తరార్థమన్న విభాగమున్నది. ఇది రామాయణ ఉత్తర కాండ విభాగాన్ని సూచించేది. 276 పుటలో వెన్మలి దేవి వనవాంఛ సీతావనవాంఛ, ఇలా దక్షిణోత్తరదేశసమన్వయ దృష్టి

దేశి మార్గ నృత్యాలు (102)లో పేర్కొనటం పై విషయానికి పోషకం. ఆనాడు ద్రావిడ దేవతలు — భూత చతుష్కం (1—2) గ్రామదేవత (1) కొల్లివెగుడి (పుట 273 --14 పద్యం) వీటితో పాటు ఆర్య దేవతలు - శివ - మాధవ - షణ్ముఖ - బలరామ కృష్ణదేవాలయాలున్నవట (1 - 24)

ఇది వైదిక మత విషయంకాదా కథలో జైనచారణ కథ (పుట 188) వల్ల జైనమత విషయం. బౌద్ధవిహార ప్రశంస వల్ల (పుట 167) బౌద్ధము, ఆ నాడు సామరస్యంలో వున్నట్లు వర్ణింపబడటం నాటి మత సామరస్య దృష్టి నేటికి కన్నెట్ట బౌద్ధ విహార వర్ణనములో - పంచ శాఖా సముపేతమౌ బోధి మహీజవర్ణనవుంది. బహుశా అశోక చక్రవర్తి పాలనలో ఇది సింహళందాకా - ఈ మార్గంగా - వ్యాపించినట్లు భావింపవచ్చు. క్రీ. పూ. 269 నాటి అశోక చక్ర వర్తి శాసనాలు మధురా ప్రాంతంలో లభిస్తున్నాయన్న చరిత్ర కథనం ప్రకారం

బౌద్ధంతో పాటు బోధి వృక్షమూ ఆదేశంలో ప్రతిష్ఠితమై యుండాలి. 190వ పుటలో జైనాలయ వర్ణన నాటి వాస్తు స్ఫురణను తెలియచేస్తున్నది. గుడి శిఖ రం 3 గొడుగులుగా - ఒకదాని మీద నొకటిగా - చెక్కబడ్డదట. ఈ త్రిసంఖ్య కర్థం అదే పుటలో 116వ పద్యం వివరిస్తున్నది. దేహం-మనస్సు-అహంకారము ఈ మూటిని జయిస్తేకాని ముక్తిలేదన్న మత సిద్ధాంతానికి మూడు ప్రతీకలట.

(1) యజ్ఞశ్రీ శాతకర్ణి (2వ శకం.) కాలంలో గ్రంథ రూపం పొందిన మ. పు.లో ఈ దేవత పేర్కొనబడినది.

బౌద్ధ స్థూప నిర్మాణంలోకూడా ఈ మూడు గొడుగులు (Tyres)న్నాయి. అవి త్రిరత్న సూచకాలంటారు. కాగా నాడున్న చారిత్రక-మత స్ఫురణ ఎంత దొడ్డదో చెప్పటానికి కాదు.

ఇంతేకాక ఆనాడు శాతవాహన దేవాలయమున్నదట. పుట (155) దీన్ని గురించి శాతవాహన సంచికా నిర్మాతలు కూడ పేర్కొన్నారు.

కావ్యంలో పంచమ ప్రకరణానంతరం ఉత్తరార్థమన్న విభాగమున్నది. ఇది రామాయణ ఉత్తర కాండ విభాగాన్ని సూచించేది. 276 పుటలో వెన్మల్ దేవి వనవాంఛ సీతావనవాంఛ, ఇలా దక్షిణోత్తరదేశసమన్వయ దృష్టి

ఆర్య ద్రావిడ నాగరకతా సమన్వయమూ చిత్రిస్తున్న కావ్యమిది. ఆనాటి సంఘానికిది మణి దర్పణం. అందుకే ఆ కావ్యప్రశస్తి నేటిదీ మంజీర విలాసంగా ధ్వనిస్తున్నది.

ఇదంతా తమిళ కవి ప్రశస్తి మరలా తెలుగు కవి ప్రశస్తి ప్రారంభిస్తే

## వర్ణనలు

ఆండాళు గర్భవతి కావటాన్ని కవి వర్ణించిన తీరు. ఆక్కడి ఉపమానాలు వైదిక ప్రతీకలు. ప్రతీకే కాలక్రమాన ఆలంకారంగా వివృతమైనది.

రత్నశలాక గర్భమున దాల్చిన విదూరభూమి—అగ్నిగర్భశమి—మెఱుపు దాగిన మేఘం—సరస్వతిని అంతఃప్రవాహంగాగల త్రివేణి—ఇత్యాదులు ప్రతీకలే తప్ప అలంకారాలు కావు. ఇది ప్రాచీన కావ్య దృష్టి.

కణ్ణగి మధురారాజ్యాన్ని శపించిన తర్వాత

కం॥ నా రమణుఁడు నేఁబడమటి
ద్వారంబున నాఁడుపురికి వచ్చితి మిటనా
ధీరుఁడు చన నొంటరిగాఁ
దూరుపు ద్వారమున వీడుదుఁజా బురినకటా!

అని తనలో అనుకొంటుంది.

ఈ తూర్పు పడమటి వాకిళ్లు కేవలం వైదిక ప్రతీకలే. జీవుని రాకపోకలకు — సుఖదుఃఖాలకు — ఇహపర లోకాలకు సంకేతాలుగా శ్రౌత వాఙ్మయ ప్రసిద్ధమైన విషయం.

I—82 పద్యం సూర్యవర్ణనను రోజవర్ణనను గర్భంగా కలిగినట్టిది. దీన్ని క్రింది పద్యంలో ఇన శబ్దం పట్టిస్తున్నది. "ప్రాచికి మొగంబున దీర్చిన చుక్కబొట్టనఁ" అన్నమాట నాజూగ్గా వుంది. భారతీయ స్త్రీ ముఖంమీద బొట్టులాగా

ఒక నగరంబున్నది దానికి రత్నాభరణ మను వణిజుఁడు కలఁడొకా నొకఁడు– (1–193)–ఇక్కడ రత్నాభరణమన్నమాట వణిజ శబ్దంతో ఎంతో సమన్వయిస్తున్నది.

కణ్ణగి-కోవలనుల మధురానగర ప్రయాణ వర్ణన నేటి వాస్తవికతా వాదానికి ప్రాచీనోదాహరణం.

కం॥ "మెకములకై వేట కాండ్రు" 5 -- 16
మధ్యేకేదారంబు............
............గనిమలపై నెండ్రుల్
మధ్యాహ్న సమయమునకు స

మధ్యూషితములో (5 — 18) పుట 173 నుండి 177 దాకా పరచుకొన్న వర్ణనలన్నీ తమిళకవితా సరస్వతిగా మారిన ఘట్టం, సహృదయులకు పుక్కిటి బంటి వర్ణనలు.

మధుర దగ్ధమౌతున్నది, ఆ పొగల వర్ణన శిలప్పది కారములోని కెంపు ప్రక్కనున్న నీలమణి

"రవరవగాఁ బొగల్ కవిసి యెలుఁగుబంట్లు

మేనివెంద్రుకలకు సూనులగుచు (5 – 101) చాలా అద్భుతమైన వర్ణన.

కణ్ణగి దీనావస్థను వర్ణిస్తూ
పరిమళ హీనమైన ప్రసవంబువలెన్............కథా పరిణతిలేని

దుష్కవి ప్రబంధము రీతి (3 – 93) అన్నపోలిక విశాఖదత్తుని ఈ మాటకు ప్రతిదీపం

"కుకవి కృత నాటకస్యేవ అన్యన్ముఖేఽ న్యన్నిర్వహణే" ఈ కావ్యం అలాంటిదికాదు. కథా సాంద్రత, వర్ణనా వైభవం. అలంకారౌచిత్యం శబ్దప్రౌఢి – ప్రబంధరీతి – సకల కవితా సామగ్రికి సరస్వతి, ఆ సరస్వతికిది విలాస మంజీరము.

ప్రొఫెసర్ S. V. జోగారావు, M. A., Ph.D.
ఆంధ్ర యూనివర్సిటి, విశాఖపట్నం.

# సహృదయభూమిక

అమ్మబాబో! ఎంత మహేతిహాస మొక సంప్రదాయ మహోద్యమమున సాగివచ్చి అర్థభావనాదరిద్రమైన అద్యతనాంధ్ర సారస్వత సముద్రమున అమృత భాండమువలె అవతరించినది!

ప్రాచీన ద్రవిడ వాఙ్మయ ప్రపంచమున శిరశ్శేఖరమైన శిలప్పది గార మహా కావ్యమునకు మానస పుత్రిక యిది. సహస్రాధిక పద్య తరంగములలో తన యుత్తుంగ నిత్య గంభీరత్వము నలవోక ప్రదర్శించు సారస్వత సాగర మీ కావ్యము. మనశబ్ద శాస్త్రములు నిఘంటువులు లక్షణ గ్రంథములు శ్రవ్యకావ్యా లంకార శాస్త్ర గ్రంథములందును ప్రసక్తములైన సంస్కృతాంధ్ర పదజాలము పలుకుబడులు నానుడులు సామెతలు వ్యాకరణ మర్యాదలు ప్రసిద్ధచ్ఛందస్సులు అలంకారములు గుణములు వృత్తులు రీతులు శయ్యలు పాకములు అనేక విషయముల కేకైక సువిశాల లక్ష్యభూమిగా నిలువగల అర్హతను దక్కగొన్న గ్రంథరాజమిది. ఆధునిక శిల్పదృష్టితో చూచినను కథాకథన విధానమునను, రసజనక సామగ్రీ సజ్జీకరణమునను పాత్ర చిత్రణమునను నిపుణ నిర్వహణము గల కావ్యము. విషయ గౌరవము సరేసరి. అయితే ఏవం విధ వస్తువులు పాత్రలు భాష ఛందస్సు కవి సమయములు కల్పనలు వర్ణనలు అలంకార చమత్కార ములు నెవరికి కాబట్టిన విప్పుడు?–మముబోటి కతిపయ మందభాగ్యులకు తప్ప, మందయ తమ భాగ్యమనుకొనువారి కెట్లును ఇవి రుచింపవు. వీనిని వారు మూచూడరు. మాభాగ్యమే మందగించు చున్నది. కాన ఏకాంతముగా నొక్కంత మాచూపటు గిరవాటు వైతుము – మేము మందిలో నొకరమే గాని మందలో వారము కాముగావున. ఈ మా కొద్దిమంది కోసమా మీ విలువగల కాలమును. కర్చువెట్టి మీ శక్తిని ధారపోసితిరి! ఆహా! మీ సహృదయ జగద్ధిత కవితా సిద్ధితో పాటు మీ త్యాగబుద్ధి నేమందునయ్యా! బండ్ల వేంకట రమణయ్యా!

నన్ను బృహద్భూమిక వ్రాయుమని మీ రడగలేదు. చిన్న అభిప్రాయము వ్రాయుమంటిరి. బృహద్భూమిక వ్రాయుమన్నను నా కిపుడు తీరిక యెక్కడి యది? ఇంతే సంగతులు. చిత్తగించ వలెను.

యస్వీ.

ప్రొఫెసర్ G. N. రెడ్డి, M. A., Ph.D.
శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి, తిరుపతి.
30–6–83.

# అభినందన

భారతీయ భాషా సాహిత్యాలలో సంస్కృతం తర్వాత ప్రాచీనమైనది తమిళం. సంస్కృత వాఙ్మయ ప్రభావం తమిళ సాహిత్యం మీద వున్నట్లు పరిశోధించి చెప్పినా, తమిళ వాఙ్మయంలో తనదై, మౌలికమైన. అనన్యమైన భాగం మెండుగా వుందని సాహిత్య వేత్తల సిద్ధాంతం. సాహిత్య సిద్ధాంతాలలోను, సాహిత్య శాస్త్రంలోను, "తమిళ దేశీయము" అని చెప్పదగిన అంశాలు తమిళ వాఙ్మయంలో ఎన్నోవున్నాయి. ఇది తమిళులకు గర్వకారణం కూడాను. తమవికాని వాటిని యథాతథంగా సంగ్రహించడం తెలుగువారి లక్షణం. తమిళుల పద్ధతి వేరు. అన్యమైన వాటిని స్వీకరించవలసినపుడు అసమానమైన బుద్ధి యుక్తులతో తమవిగ చేసుకొని నకలు అసలును మరుగు పరచేలాగ రూపొందించుకొని రాణించడం తమిళ సంప్రదాయం. నిజంగా ఇది మెచ్చుకోదగ్గ విషయం.

మన దేశంలోని విద్యావంతులకు పాశ్చాత్య కవుల్ని, పాశ్చాత్య సాహిత్యాన్ని గురించి తెలిసినంత, తమభాషా సాహిత్యాలను గురించి, ఇరుగు పొరుగున వున్న ఇతర భారతీయ సాహిత్యాలను గురించిగాని, తెలియదంటే అతిశయోక్తి కాదు. నిజానికి మన పిల్లలకు "ఎస్కిమోల"ను గురించి తెలిసినంత "ఏనాదుల్ని" గురించి తెలియదు.

సాహిత్య రంగంలో అనువాదం, అనుకరణ, అనుసరణ, తొలినుండీ ఆంధ్రులు ఆదరించిన సంప్రదాయం. అయితే, ఏ కారణాల వల్లనో మనకు ఇరుగు పొరుగునవున్న తమిళ, కన్నడ సాహిత్యాల నుండి అనువాదాలు చెప్పదగినవన్ని రాలేదు ముఖ్యంగా తమిళంలో శిలప్పదిగారం, మణిమేఖల, వంటి మౌలిక కృతులు సాహిత్య వేత్తల దృష్టిలో గొప్పరచనలు, ఇటీవల "ఆంధ్రకంబ" అని అన్వర్థ బిరుదాంకితులైన కీ॥ శే॥ పూతలపట్టు శ్రీరాములు

రెడ్డి గారు మొదట కంబరామాయణాన్ని ఆంధ్రీకరించి, అటుపిదప మరికొన్ని తమిళకావ్యాల్ని అనువదించారు. వారు అనువదించిన శిలప్పదికారానికి "అంది యకత" అని పేరు పెట్టారు. మంజరీ ద్విపదలో సాగిన అనువాదమిది. 1957లో తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే ప్రకటితం. అటు తర్వాత వచనంలో "మంజీరగాథ"ను మరుపూరి కోదండరామిరెడ్డి గారు ప్రకటించినారు. ఆంగ్ల వచనంలోని ఒక గ్రంథాన్ని ఆధారంగా చేసుకొని వ్రాసిన రచన ఇది. ప్రస్తుతం విద్వత్కవితిలక శ్రీ బండ్ల వేంకటరమణయ్య గారు తమిళ శిలప్పదికార కావ్యాన్ని "మంజీర విలాసమ"ను పేర మన కందిస్తున్నారు – చాల ప్రశంస నీయమైన ప్రయత్నం. నిర్వచనంగా, తెలుగు ప్రబంధ ఫక్కీలో ప్రౌఢంగా నిర్వ హించిన రచనమిది. కావ్య కవితా ప్రియులకు ఆదరణీయమైన రచన. అల్లి బిల్లి వచన కవితకు ఆదరణ ఎక్కువవుతున్న ఈ రోజుల్లో ఇట్టి మహాకావ్య రచనకు, ప్రకటనకు పూనుకోవడం సాహసమే అవుతుంది. అందువల్ల గ్రంథ కర్త శ్రీ రమణయ్య కవిగారిని, ప్రకటన సంస్థ నవ్య సాహితీ సమితిని అభి నందిస్తున్నాను.

తమిళ శిలప్పదికారం అన్ని విధాలా విలక్షణమైన కావ్యం. తత్కర్త ఇళంగో కవి "కణ్ణకి కోవలన్" కథల్ని ఆధారంగా తీసుకొని ఆనాటి సామాజిక విశేషాల్ని ఎన్నిటినో ఇందు ప్రతి ఫలింప చేసినాడు. ఆచార వ్యవహారాలే కాకుండ, సంగీతం, నృత్యం, శిల్పం ఇత్యాది లలిత కళలన్ని పారిభాషిక పద ప్రయోగంతో వివరించినాడు. శ్రీ రమణయ్య కవిగారి బహుముఖ పాండిత్యా నికి ఈ రచన యొక నిదర్శనమని చెప్పవచ్చు. పద్యాలు చక్కని ధారతో వర్ణనలు మిక్కలి ఔచిత్యంతో, పాత్రపోషణ చిక్కని సంభాషణలతో సాగిన రచన మిది.

మంజీర విలాసాన్ని మనకందిస్తున్న శ్రీ రమణయ్య కవిని ఆంధ్ర కవి పండిత లోకం అభినందించి, గౌరవించాలని ఆశిస్తున్నాను.

సాహిత్యాలంకార పండితులు. సాహిత్య శిరోమణి, విద్వాన్ అష్టావధాని.
*అవధానము చంద్రశేఖరశర్మ,*
రిటైర్డ్ లెక్చరర్
శ్రీ మలయాళ స్వామి ఓరియంటల్ కళాశాల, ప్రొద్దటూరు.

# అభినందనము

మిత్రులు శ్రీ బండ్ల వేంకటరమణయ్యగారు రచించిన 'మంజీర విలాస కావ్యమును తుదముట్టఁ జదివి యానందించితిని. కథా శరీరము తమిళమునకు జెందినది యనుటయే గాని యిందలి సంస్కృతీ చైతన్యము అచ్చముగ ఆంధ్ర జాతీయమే. కథా పాత్రముల తలఁపులు మెలపులు, పలుకులు కులుకులు ఆచారములు అన్నియు తెలుఁగు వారివే. 'గంపంత' సంపద 'కడుపున నొకకాయ కాయదు,' గుమ్మడి పండంటి కూతురు' మున్నగు తెలుఁగువారి జాతీయములు కోకొల్లలు. కథా కథనమునకు ననుకూలమైన యిందలి శైలి పాఠకుని నప్రయత్నముగనే ముందునకు నడిపించును. వర్ణనములు నాతి దీర్ఘములై కథాగమనమునకు భంగము కలిగింపవు. సంభాషణములలో నాటకీయత పొందుపడినది. కణ్ణగి యుద్యాన విహారములోని చెలికత్తెల సల్లాపములు కళాపూర్ణోదయమును దలపించును.

వర్ణనలలోఁ బెక్కుతావుల సంస్కృతాంధ్ర సాహితీ నందనములోని కమ్మఁ దావు లలవోకగా వీచును. "రసికుఁడాతఁ డధరబింబ రాజకీరమై" (2 – 134) ఇత్యాది పద్యమున రూపకము. ఈ కవి సాహితీ మర్మజ్ఞతకుఁ దార్కాణము. ఈ ఘట్టములోని పెక్కు పద్యము లిట్టివే.

సంస్కార వశమున నప్రయత్నముగనే దొరలిన యా యల్లిక మత్త కాశినీ, హంసనాదినీ" త్యాది శబ్దములు తాఁకు రాళ్లవలెఁ దోచినను సందర్భమును బట్టియు నందముగాఁ బొందించిన వివరణమును బట్టియు సుబోధములై పాఠకునకు నున్నతస్థాయి సాహిత్యముతోఁ బరిచయమును గలిగించునవిగా నున్నవి. కణ్ణగి మాధవులతోడి కోవలను. శృంగారమును వర్ణించిన పట్టులు నాయికల యంతరువులకుఁ దగి యౌచిత్యము నెడ కవికి గల మెలఁకువనకు నద్దము పట్టుచున్నవి.

కేవలము కథగానే తీర్పఁబడిన మూలములోని వివరములనన్నింటిని యథాతథముగా చెప్పవలయునను పూనికను కవి వహింపకుండినచో ప్రధాన సన్నివేశము లింకను సుశ్లిష్టములై కథలోని చిక్కదనము పెరిగి యుండెడిదేమో అనిపించును.

సారళ్యమును ప్రౌఢియు సరిసరిగాఁ బెనఁగొన్న యీ రచనము కథయును కావ్యమునునై కథా కావ్యముగా వైశిష్ట్యమును సంతరించుకొని సహృదయులగు, నిరుదెరగుగల పాఠకులకును నాహ్లాదము కలిగించుననుట నిస్సంశయము.

ఉభయ భాషా వైదుష్యమునను, కవన సౌభాగ్యమునను కృతహస్తుఁడగు నీకవి నుండి మఱికొన్ని యుత్తమ కావ్య శిల్పముల నాశించుచు, ఈ కావ్యమును హృదయ పూర్వకముగా నభినందించు చున్నాఁడను.

పరమేశ్వరుఁడీ కవి మిత్రునకుఁ జిరాయురారోగ్య భాగ్యములను ప్రసాదించుఁగాక.


బ హు భా షా కో వి ద

*యల్లంరాజు శ్రీనివాసరావు* M.A,

రిటైర్డు లెక్చరర్, ప్రొద్దుటూరు.


# ప్ర శం స

మంజీర విలాసమనే పేరుగల ఈ ప్రబంధాన్ని రచించినవారు శ్రీ బండ్ల వేంకట రమణయ్యగారు. వీరు నాకు బహుకాల మిత్రులు. దీన్ని ఆ మూలాగ్రంగా చదివి అభిప్రాయం వ్రాసిఇవ్వమని ఇచ్చారు నాకు. అలాగే ఆ మూలాగ్రమూ చదివాను. ఆముక్తమాల్యదలాగా ఇది కూడ ఒక విఢ సంప్రదాయానికి సంబంధించిన చరిత్ర. కోవెలన్ కణ్ణకి అనే వారిందులో నాయికా నాయకులు, ఈ కథకు తమిళంలో చాలా పెద్ద ప్రచారముంది. ఇలాంటి చారిత్రికమైన గాథను తీసుకొని తెలుగులో చక్కగా దిద్ది తీర్చారు మిత్రులు రమణయ్యగారు తద్వారా ఎన్నో చక్కని నీతులు ధర్మాలు లోకానికి బోధించారు.

సాధారణంగా రచయితలలో కొందరికి పాండిత్య భారం జాస్తి. మరి కొందరికి భావనాశిల్పం హెచ్చు. ఇద్దరికి కూడ కావ్య నిర్మాణంలో మంచి క్షాత

హస్తగతయుండి తీరాలి. అప్పుడే ఆ కావ్యం నిండుగా ప్రకాశించేది. రమణయ్యగారి లక్షణాల నన్నింటినీ అంతో ఇంతో పుడికి పుచ్చుకొన్నవారే. యథాశక్తిగా ఏది ఎక్కడ చూపాలో అక్కడ చూపుతూనే వచ్చారు, తిక్కన లాగా శబ్దానికీ శిల్పానికీ ఎక్కువ ప్రాముఖ్యమివ్వకుండా ప్రతిపాద్య మైన విషయం మీదనే దృష్టి పెట్టుకొని దానిని స్పష్టంగా చెప్పటంలో సంతృప్తి చెందాడీ రచయిత.

రామాయణంలోని పోలికలు కొన్ని కనిపిస్తున్నాయి. కథానిర్మాణంలో వాటి నిగమనించి తదనుగుణంగా కథాంశాలను నిర్వహిస్తూ వచ్చారు. రమణయ్యగారు ఇది గ్రంథంలో కొంతలోతుకు దిగి పరిశీలించగలిగితే భావుకులకు తప్పకుండా స్ఫురించే విషయం. ఏవం విధ విశేషణ విశిష్టంగా ఈ కావ్య నిర్మాణ మొక నూతన ఫక్కిలో నిర్వహించిన రమణయ్యగారు నిజంగా అభినందనీయులు. ※


"సాహిత్య రత్న"
షేక్. మహమ్మద్ ముస్తఫా, M. A. M.Phil,
ఏ. సి దస్తగిరి, భాషా ప్రవీణ, పి. ఓ. యల్,
అధ్యక్ష కార్యదర్శులు
నవ్య సాహితీ సమితి, — ప్రొద్దుటూరు.


# భక్త్యంజలి



కం॥ శ్రీ రామచంద్ర పదసే
వారతుఁడు, సువర్ణ గండి వాస్తవ్యుఁడు, సా
మీరి, రమణయ్య కవికి ను
దార యశశ్శ్రీ లొసంగుతఁ గృప నెపుడుఁ.

ఉ॥ ఆతత శిష్యవత్సలుని, నార్ద్రమనస్కుని, సంస్కృతాంధ్ర భా
షాతిలకుఁ, గుణాలయుని, సత్కవితానిధి, శేముషీధరుఁ,
ఖ్యాతికిఁ బ్రాకులాడని నిగర్వుని శ్రీ హనుమత్పదాబ్జసే
వాతుర భావు నెన్నెద మహర్నిశముఁ రమణయ్య పండితుఁ

కం॥ ఒకపరి మిత్రుఁడగుచు నిం
కొకపరి గురుఁడగుచు మా మహోదయమే కో
రు, కవి తిలకుండు రమణా
ర్యు కవితకుఁ గలుగుత మెప్పు దుద్యత్ కీర్తుల్.

ఉ॥ దాపరికంబులేని మది, ధార్మిక వర్తన, సాధుశీలముౝ
కోపము తాపముౝ గనని కూరిమి, విజ్ఞత, సంస్కృతాంధ్ర భా
షా పరి పూర్ణ పాండితి, ప్రశస్తముగాఁగలవాని నయ్యాయో
ధ్యాపతిబంటు పావని, సదా రమణయ్య కవీంద్రు నోముతన్

సీ॥ ఏ కవీశ్వరుఁడు సాహిత్య భావుకులకు
మధురా విజయ కావ్య మధువు పంచె
ఏ రచనా కళాకృతి శివానంద మ
హిమ్నఃస్తవ కవితా హేలఁజూపె
ఏ మహనీయుఁడు వేమ భూపాలీయ
కావ్య రసం బెల్ల కరువు గట్టె
ఏ రసవేది మంజీర విలాస ప్ర
బంధ ధ్వని మది కింపంగఁగూర్చె

తే। గీ॥ అతఁడు గుణపక్షపాతి విద్యార్థులకు సు
లభుఁడు కవితా గురుఁడు మాకు లలిత గుణుఁడు
బండ్ల వంశాబ్ధి సోముండు, భావుకుఁడగు
సరస కవికి రమణున కంజలి శతంబు



# —: విషయసూచిక :—

## —: పూర్వార్ధము :—

### ప్రథమ ప్రకరణము



### ద్వితీయ ప్రకరణము

## ఉత్తరార్ధము

శ్రీ ర స్తు

# మంజీర విలాసము

## ప్రథమ ప్రకరణము.

కం॥  ల కిరవు లలితకలా
శైలూషుల కాటకొలు వసాధారణ భో
గాలకు నివాసభవనము
నా లీలాస్పదము దక్షిణాపథ మొప్పుఁగా.

సీ॥ దండకాటవిని వాతాపిదానవు మేని
కండ లెవ్వాని కయ్యెఁ గజ్జుకుట్లు.
బ్రహ్మగిరిని గఠోరతపంబు సాఁగించి
కావేరి నెవ్వాఁడు కల్గఁజేసెఁ,
నెవ్వాఁ డాయుర్వేద మెల్లను శోధించి
సిద్ధవైద్యముఁ బ్రకాశిత మొనర్చె,
వారాశి యెవని హస్తారవిందంబునఁ
దేనియబొట్టుగాఁ గాననయ్యె

తే॥ గీ॥ ద్రమిళభాషకు లిపి వ్యాకరణ మెవండు
కరుణ నొనరించె నట్టి యగస్త్యమౌని
యధివసించు లోపాముద్రయనుఁగుమగఁడు
ప్రాభవాఢ్యుఁ డాదక్షిణా పథమునందు॥

సీ॥ తమిళుల కారాధ్య దైవత మాతండు
ప్రాగబ్ధినున్న 'జావా' 'సుమత్రా'
మున్నగు పలుద్వీపములకుఁ బెక్కింటికిఁ
బయనించి యచట నివాసముండి

యార్యనాగరకత యట్లనె ద్రావిడ
నాగరకత వర్ధనంబు సేసి
యుభయ సంస్కృతులను నొండొంటితోఁ దీవి
యలరీతిని బెనచి యలరినాఁడు.

తే॥ గీ॥ దారుఁ డతఁడు ప్రోదియొనర్చినట్టి ద్రావి
డార్య నాగరకతలతో నష్టవిధము
లైన యైశ్వర్యములతోడ నలరుచుండు
చోళరాజ్యంబు లోకసంస్తుతకథంబు. 3

తే॥ గీ॥ పాలన మొనర్చె నద్దానిఁ బదునెనిమిది
నూర్లయేండ్లకుఁ బూర్వ మనూనగుణుఁడు
భానువంశ సంజాతుండు పరమదాత
చోళరా జొక్కరుండు విశ్రుతయశుండు. 4

కం॥ "కావేరిప్పూం" పట్టణ
మావిభునికి రాజధానియై యలరు;రిపు
క్ష్మావరులు వెన్ను సూపుదు
రా, విభువ్యాఘ్రధ్వజంబు నటుఁ గన్గొన్నన్. 5

సీ॥ కరికాళచోళ భూకాంతపూర్వుండు, ది
గంతప్రరూఢ యశోంకురుండు
కావేరుఁడనుమహీకాంతుండు దనుఁగోర
సహ్యాద్రిపైఁదపశ్చరణదీక్ష
నున్న యగస్తి ప్రసన్నుఁడై పార్శ్వస్థి
తకమండలూదకధారవలనఁ
గావేరిసృష్టిని గావించి యాప్రాంత
మున కమృతమయ జీవన మొసంగె;

తే॥ గీ॥ నీ నదీముఖద్వారమం దానగరము
సంపదల కెల్ల నిలయమై పెంపు గాంచె;
నాలుగుదెసల దేశదేశాల కెల్ల
వర్ధి వాణిజ్యకేంద్రమై యలరుచుండె 6

సీ॥ వరుస విక్రమసింహపుర మండలంబునఁ
గలసియున్నట్టి 'కాకండినాడు'
తిరుపతిక్షేత్ర ముత్తరమున నెల్ల; వె
ల్లూరుతరంగిణీతీర మెల్ల
దక్షిణంబున, సముద్రం బెల్ల తూర్పునఁ;
బడమటఁ జేరభూభాగ మెల్ల
గాఁ జోళరాజ్యంబు కంటకదుర్భేద్య
మై, సిరి కాటపట్టై వెలింగె;

తే॥ గీ॥ ఫాలనయనాభుఁడౌ కరికాళవిభుని
పాలనమున సౌభాగ్యంబు ప్రాభవంబు
దాని కబ్బె; సమర్థుండు పూనెనేని
యెట్టిరాజ్యంబు నభివృద్ధి నెనయుఁగాదె ॥ 7

సీ॥ ఎవఁడు జయపతాక లెత్తించె హిమశైల
మవధిగా నెల్లరాజ్యములలోన;
వెణ్ణిరణంబున వ్రేటాఱుతునియలు
గా నేఁడు చేరరాడ్గణము నఱికె
రావణులంకకు రాణువ నెవ్వాఁడు
నడపించి తనశక్తి యడరఁజేసె
నాగుల నాగపట్నమ్ము గైకొని యుత్త
రమున నెవ్వాఁడు యశోరమను బెంచె;

తే॥ గీ॥ నధిగత హిమాద్రిమార్గంబులందు నొక్క
దాని కెవఁడు చోళపదాభిధాన మొసఁగి
యచటి దుర్గాలఁ జెక్కించె వ్యాఘ్రకేత
నంబు, వెలుగొందుఁ గరికాళ నాముఁడతఁడు. 8

సీ॥ అతఁడు కట్టించిన యమరాలయంబులు
కుధరంబు లంతేసి గోపురములు
పాదుకొల్పిన ఘనప్రాకార వలయంబు
లతిరమణీయ రాజాలయములు,

తరుగుల్మ సుందరోద్యానవనము
లధ్వగశ్రమ మాఁగ నందందుఁ బెట్టించి
నట్టి విశ్రాంతిమహా గృహమ్ము

తే॥ గీ॥ లవియు నివియును నవనేల? నన్నియునుఁ ద
దాతన తమిళదేశాత్యుదాత్త లక్ష్మిఁ
జెప్పకయ చెప్పచుండు; నా క్షితివరమణి
ఇంతవాఁడని వర్ణింప నెవరితరము? 9

తే॥ గీ॥ మూరుమైళ్ళ పొడవునఁ గావేరి కతఁడు
పొర్లుకట్టలు పోయించె; నుల్లసింపఁ
జేసెఁ బంద్రెండు వేవురిచేత నాన
కట్టఁ గావేరికి వెఱంగుగలుగ భువికి. 10

తే॥ గీ॥ ఏలకులు,లవంగాలు,మిర్యాలు నుప్పు
ముత్యములుపవడంబులు మొదలయిన ప
దార్థముల యెగుమతికి నౌకాశ్రయముగ
వన్నెకెక్కెను గావేరిపట్టణంబు॥ 11

కం॥ తొడితోడిసెంబియన్నను
నొడయఁడు, కరికాళపూర్వుఁడొకఁ డింద్రమహం
బెడపక యొనర్చె మున్నట
నడర ముదము చైపూత్తర్ణిమారంభమునన్॥ 12

సీ॥ తొడితోడిసెంబియన్దొర మొదల్పెట్టిన
యింద్రోత్సవమునకు నించుకేని
వెలితి గానట్టి కావేరిప్రప్రథమాబ్ధ
పుష్కరోత్సవమును మొదలువెట్టి
కరికాళచోళ భూకామినీ దయితుండు
శ్రీ కనుగుణముగాఁ జేయఁజొచ్చె;
నాయుత్సవములు ప్రజానందదాయులు
తత్పురమునకు సాంద్రప్రశస్తిఁ

తే॥ గీ॥ బెంచె నైశ్వర్యమున, భోగవిభవముననను,
బరతరానందముననను నప్పట్టణంబు

ప్రాలి నిత్యకళ్యాణంబు పచ్చతోర
ణంబుగా నుత్తరకురుదేశంబు మించె॥ 13

సీ॥ మరుపూరుపాక్క నామంబుతోఁ బట్టణ
పాక్క నామముతో విభక్తమయ్యె
రెండుపేఁటలుగాఁ బురీశ్రేష్ఠ కావేరి;
యారెంటిలోన నౌకాశ్రయమున
కుపకంఠమునయందు నొప్పిదమౌ మరు
పాక్కమనఁ పేఁట;యాభాగమందు
నెత్తైన హర్మ్యంబు లెన్నియేనియు నొప్పు;
నాహర్మ్యములలోన యవనులాది

తే॥ గీ॥ గాఁ గల విదేశజనములు కాపురంబు
సేయుచుండు రత్నకాంత లక్ష్మీప్రసాద
పాత్రు లగుచు;నక్షీణ సంపదలతోడ
విపణిపంక్తు లొప్పారుఁ దద్వీథులందు॥ 14

కం॥ పలువన్నెల పట్టాంబర
ములు రత్నంబులు, ప్రవాళములు, వైదూర్యం
బులు, ముత్యంబులు, పచ్చలు
వెలలేనివి యమ్ముదు రట విపణుల వణిజుల్. 15

కం॥ సాలీంద్రు, కమ్మరీం,డ్రగ
సాలెలు, కుమ్మరులు, రజకసాచిక శబరుల్
మాలలు, వడ్రంగులు నం
దోలి నివాసం బొనర్తు రొక్కొకవీథిఁ. 16

తే॥ గీ॥ తైలములు, కాంస్యతామ్ర పాత్రములు. నూలు
వస్త్రములు, మద్యమాంసాది వస్తుజాత
మమ్ము వారు ప్రత్యేకంబులైన రాజ
ధాని శాఖానగరములఁ గానిపింత్రు॥ 17

తే॥ గీ॥ సూనములు. చందనములు కస్తూరివీణె
లూదువత్తులు, నెలవత్తు లాదియైన

వస్తువులు విక్రయించెడి వారిగోల
వాదవాదాల వినఁబడుఁ బ్రత్యహంబు. 18

తే. గీ॥ మొలగొలుకులు, బంగరుతీగియలు, కుసుమలు
ముల్లెసరులు మున్నగు ధాన్యములు సమృద్ధి
గా, ఫలించి విసాల దీక్షికలకుఁదేరఁ
బడి యుట వెనప్పు నేత్రపర్వంబు ప్రజకు. 19

సీ॥ ఈపేట కావలివైపున నున్న పెఁ
బయలునకు సవిధ ప్రాంతమందుఁ
బణహైన పట్టణపాక్కంబు పాలుపారు
నవనాగరకులకుఁ వాసభూమి;
ఇటు విశాలంబులై యెల్లచోట్లకుఁ దార్చు
రథ,రాజ,విపణి మార్గములు కలవు;
విపణిమార్గమునకు నెప్పుడు నిరుగడనం
గల్లు బారులుదీరి కానిపించు

తే. గీ॥ నంపెక విశాల రాజాధ్వమందు భూరి
సంపదలతోడఁ బలువిలాసములతోడ
వైశ్యవర్యులుందురు రాజభవనములకు
నధికములగు సౌధముల భోగార్హు లగుచు॥ 20

సీ॥ వానికిఁ జెంగట వర్తిల్లు బ్రాహ్మణ
క్షత్రియ భూస్వామి సముదయములు
వసియించు వాడలు; వానికి వెన్క నం
తఃపుర పణ్యాకాంతలు భిషజులు
ప్రఖ్యాత రత్నవర్తకులు, దైవజ్ఞులు
వసియింత్రు వేర్వేరు వాడలందుఃఁ
బొలుచుఁ బేట నడిమి భూరి శృంగాటక
మందు 'భూతచతుక్క' మనెడు నొక్క

తే. గీ॥ గ్రామదేవత లోకవిఖ్యాతమహిమ
యొక్క యామత ప్రాఁకి యయ్యుగ్రశక్తి
ప్రహరి తిరుగుచు నగరిఁ గాపాడుచుండు;
ఖలజనులపాలి మిత్తియై క్రాలు నద్ది॥ 21

ఉ॥ కేరుచు నద్ది యొక్క పాలికేతను బెట్టి పురంబు నల్గడ౯
బాఱుచుఁ జోరవృత్తి నిశఁ బ్రాఁకుచుఁ జిక్కిన కూటయోగుల౯
జారులఁ జోరుల౯ ఘన విశంకట దంష్ట్రలఁ జీల్చి యంతక
క్రూరముఖంబుఁబోని తన ఘోరముఖంబున మ్రింగి త్రేనుచు౯ 22

సీ॥ అచటి సంతబయలునందలి సాలల
గుట్టలై సామగ్రి కట్టలుండు
'నివ్వియా యయ్యవి' అవ్వియా యయ్యవి'
యని వానిపై ముద్ర లమరియుండు
ప్రతివస్తుముఖమున బరువును వెలయు వి
స్పష్టంబుగా దేశభాష నుండు
నాపణ్యశాలల కాపుగాఁ జుట్టుగో
డలు లే వొకానొక వెలుగు దక్క

తే॥ గీ॥ లేరు కావలివారు; వ్యాపారు లెవ్వ
రర్ధరాత్రంబునం దుండ రచటఁ; గాని
పశ్యతోహరు లేరు నవ్వానిఁ దాఁక
రచటి గ్రామదేవత దెబ్బ కడలుకొంట.

సీ॥ ఈగుడియే కాక యింక నెన్నియొ గుడు
లమ్మహా నగరంబునందుఁ గలవు;
"మణివట్టు"నను పేరి మాధవుని గుడి మ
హానిరూఢ మలరు వాన;నింక
శివున కింద్రునకు లక్ష్మికి షణ్ముఖునకును
బలరామ కృష్ణదేవులకుఁ గలవు
గుడులు; వాని నికటక్షోణిని సప్త బౌ
ద్ధవిహారములుఁ బవిత్రమగు బోధి

తే॥ గీ॥ వృక్షముఁ దగు: నింకొకవాడ వెలయుఁ బంచ
జైనయోగిపుంగవుల పంచపరమేష్ఠి
శైలతలము; నశోకవృక్షము; విశాల
వేది నున్నయది పసిండివిరులు పూయు॥ 24

## —: మనైక్కను :—

ఉ॥ ఉన్నతగోత్ర సంభవులు; నూర్జితసత్త్వులు. దానశీలు రౌ;
పన్నులపాలి కల్పములు భద్రగుణంబుల కాటపట్టు లౌ;
భ్యున్నత కీర్తిసంపదలఁ బొంపిరివోయినవారు; కోట్లు పె
క్కున్నను టెక్కు మొక్కటియు నూననివారు వణిగ్వతంసముల్॥25

కం॥ పెక్కురు వసింత్రు పట్టణ
పాక్కంబున; వారిలోనఁ బ్రభువను కీర్తిన్
దక్కించుకొనియె ఘనుఁడు 'మ
నైక్క'న్నాముండు మూర్తనయమో యనఁగన్ 26

కం॥ మిను విఱిగి మీఁదఁబడ్డను
దనుకఁడు; ధైర్యంబు విడఁ డధర్మపథంబున్
గొనఁ డన్యులఁ గనలింపఁడు;
గనలఁడు దానును; నతండగణ్యుం డగుచున్॥ 27

కం॥ బీదాబిక్కల కాతం
డాదరువు; సుపర్వధేను వనదల కపర
శ్రీదుఁడు; మంచికి మార్పే
రైదానమ్మందుఁ గర్ణుఁడను కీర్తిఁ గొనెన్॥ 28

సీ॥ బేహారమున నందెవేసిన చేయిఁయౌ
నామనైక్కన్ వణిక్స్వామి పంపు
నిఖిల పణ్యపదార్థ నివహపూర్ణంబులు
వాణిజ్యనౌక లప్రతిహతముగ
సప్తపాథోనిధి జలములఁ బయనించి
పలుదేశముల తీరములకుఁ జేరి
యచటి వ్యాపారుల కావస్తువుల నమ్మి
వాని మూల్యంబుగా బహుసువర్ణ

తే॥ గీ॥ రత్నరాసులు గొనివచ్చి ప్రత్యహంబు
వాని భాండగృహమునఁ గుప్పలుగఁ బోయు
గంపలకొలంది మణులు బంగార మెచట
నింతుమని వానిభటులు యోజింతు రెపుడు॥ 29

సీ॥ అతఁడు కావేరీమహాపగా తీరాన
బహుయత్నమునఁ గట్టఁబడ్డ యొక్క
ప్రాసాదమందు నివాసంబు సేయు; న
ద్దానికి ముందుభాగాన వెల్గు
సురపతిచాపసుందర మొక్క తోరణం
బద్దాని కీవల నలరు నొక్క
సహకారవనమందు జలయంత్రములఁ బసం
దైన కేళాకూళి యమరు నొందు

తే॥ గీ॥ దాని కిరుగడఁ బ్రమద కాంతారమందు
నొక్క కేళీమహీధర మొప్పు; దాని
ప్రాంతమున నొక్క కాంచన వాసయష్టి
స్ఫటిక మణిగణ గుంభితఫలక మెసఁగు. 30

కం॥ కురవకములు కంకేళులు
సురపొన్నలు కేసరములు చూతమ్ములు చా
మరపుష్పంబులు మున్నగు
తరువు లతని ప్రమదవని నితాంతం బమరున్. 31

సీ॥ పాలగచ్చమరింపఁబడ్డ కుడ్యంబులు
కూర్పఁబడిన మణికుట్టిమములు
దంతిదంత వినిర్మిత ద్వారబంధాలు
సుప్పాణి ముత్యాల సోర్ణగండ్లు.
జలయంత్రఘటిత మజ్జనమందిరంబులు
పరికర్మమునకు నేర్పడ్డ గదులు.
నైకచిత్రములు వ్రాయంబడి నేత్రప
ర్వంబు ఘటించెడు వాసగృహము.

తే॥ గీ॥ దీవియలతోడ వ్రేలాడఁ దీయఁబడ్డ
గాజుకుప్పెల గుత్తులగములు గలిగి
కనకగిరి నా నలరు మనైక్కన్ వణిగ్వ
తంసు ప్రాసాద మభినవోద్యత్ప్రభంబు. 32

సీ॥ అతిలోక సౌందర్యవతి మూర్తిగయికొన్న
గృహనీతివిద్య, యుత్కృష్టచరిత
యిల్లాలతని కొప్పు నిందిరాదేవి నా
రాయణదేవుని కట్లపోలెఁ
గాత్యాయనీదేవి గంగాధరుని కట్లు
పౌలోమి దైవతపతికిఁ బోలె
దానిపే రాండాళు దయితాశిరోమణి
యనిదాని నిరుగువా రంద ఱందు

తే॥ గీ॥ రెంతపుణ్యంబు సేసెనే నిట్టిదాని
సతిగఁ బురుషుండుఁ బొందంగఁ జాలు నొక్క
కడచిచన్న పుట్టున మనైక్క స్వ్రిభుం డొ
నర్చిన సుకృత మ్మంచు జనంబు లంద్రు. 33

తే॥ గీ॥ ఎవ్వరే నెప్పుడే రా నభీష్టమృష్ట
భోజన మిడి సేవించు నాపుణ్యమూర్తి;
అన్నపూర్ణకు నుద్ది యయ్యమ్మ యన్న
నతిశయోక్తి కాదంటఁ గా దతిశయోక్తి. 34

—: సంతాన ప్రాప్తికై వగపు. :—

సీ॥ ఎట్టి వారికినేని నేదో యొకానొక
లోప ముండు నని పల్కుదురు పెద్ద
లట్టి వారల పట్ల ననపత్యతారూప
దోషమై తలసూపె; దుర్విధి మన
కడుపున నొకకాయఁ గాయింపఁ డాయె నె
క్కరణిని బున్నామనరక మీఁగ,
గలవార' మని పతి పలుక నాండాళమ్మ
వదనంబు వసివాళ్ళు వాడుచుండు

తే॥ గీ॥ దాని దురవస్థఁ గనుగొని యూనుఁ దాప
మెద మనైక్కస్వ్రిభుండు; వారిర్వు రెట్టి
దాయ యయ్యె దైవంబు సంతాన మిక
మనకుననునుచుఁ గన్నుల నీరు చినుకుచుంద్రు 35

సీ॥ ఒకనాఁటి బ్రాహ్మ ముహూర్తాన నతఁడు కా
వేరీనదీ దర వికసిత శత
పత్రగంధము దాల్చి పవనాంకురమ్ములు
పైకొను వేళ శ్రీపతిఁ దలఁచుచు
హంసతూల శయనమందు మేల్కని లేచి
నిజభృత్యజనము వెన్వెంట రాఁగ
సహబాంధవుం డయి చని యత్తరంగిణి
సలిలప్రవాహాన స్నాన మాడి

తే॥ గీ॥ సంధ్యవారిచి గాయత్రి జపము సేసి
సైకతస్థలమున నిల్చి సవిత కెఱఁగి
సేవకులు ధౌతవస్త్రాలు చేతఁగొంచుఁ
బార్శ్వములఁగొల్వ నింటికి వచ్చుచుండ. 36

సీ॥ గంపంత సంపద కలదు సెట్టికిఁగాని
కడుపున నొకకాయ గాయదాయెఁ
బూఁచిన తంగేటి పొలుపున నున్న యాం
డాళు గొడ్రాలుగాఁ దూలనాయె
నీపుణ్య చిత్తుల కీ యనపత్యత
మూలదైవం బేల మాన్పఁడాయె
నిట్టిది కంటిమే యెందేని? హరిహరీ!
పగవారి కేని నీపట్టు వలదు

తే॥ గీ॥ తలను వ్రాసిన వ్రాఁత నుదప్పికొనఁగఁ
జాలునే యెట్టివాఁడును జగతిలోన
నంచుఁ దలకొక రీతిగా నాడువారు
చెప్పికొను మాట లాయన చెవులఁ బడియె. 37

ఉ॥ ఈ కరణిజ్ఞ వధూటు, లను నేర్చెదు మాటలు గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందమున, గ్రొచ్చిన పుండునఁ గార మట్టు లెం
తో కలగింప గుండియ నదూష్య చరిత్రుఁడు సెట్టి దైవమే
లా కరుణింప దీయనద నంచుఁ దలంచుచుఁ జేరె గేహముఞ్జ. 38

తే॥ గీ॥ చేరి గృహకృత్యములు దీర్చి ధీరుఁ డవుట
నాంధ్రు పలికిన నుడులకు నార్తుఁడయ్యు
నోవి గొన కుండఁగా, నయ్యూనగుణుని
యింటి కొక సిద్ధపూరుషుం డేగుదెంచె. 39

ఉ॥ వచ్చిన వాని కర్ఘ్యమును బాద్యము నాసన మిచ్చి మ్రొక్కి ‹మీ
రెచ్చటినుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కేగుదెంచినా
రిచ్చ వహించు మీ కఖిల మెల్ల కరస్థము మీకు; మిమ్ము మీ
సచ్చరితంబుఁ జూడ విన సర్వశుభంబులు కల్గ కుండునే? 40

కం॥ ననుఁ గరుణించుటకై వ
చ్చిన గౌరీవల్లభుఁడవొ? శ్రీనాథుఁడవో?
వనజోద్భవుఁడవొ? తెలుపుఁడు;
నను మీశిష్యుని గృతిఁ బొనర్పుఁడు; స్వామీ! 41

కం॥ అని భక్తిఁ బలుకు సెట్టికి
ముని యను 'నే నొక్క సిద్ధపురుషుండను; నా
కొనరిన దివ్యజ్ఞానం
బున నీ వనపత్యుఁడ వని బుద్ధి నెఱిఁగితిన్'. 42

చం॥ అనవిని యా మునైక్కను మహావణిజుండు మహాత్మ! నేను సె
ట్టిని; సిరి యెంతయేనియు గడించితి; దేనికి లోటు లేదు నా
కనఘ! యపత్యహీనుఁడనునై వెతఁబొందుచు నున్నవాఁడ,నీ
యనదకు సంతు గల్గెడి యుపాయము సెప్పి యనుగ్రహింపుఁడీ! 43

కం॥ అని వేడి చెమ్మగిల్లిన
కనుగవతో లేచి నిలిచి ఘటితాంజలియున్
వినయానతుండు నగు సె
ట్టిని గని సస్మితుఁడగుచు జటిశ్రేష్ఠుఁ డనెన్. 44

కం॥ ఏల విచారంపడెదో?
యీలాగున? నీ యభీష్ట మిదె నెఱవేరున్
గిలిని నారాధింపుము
వాలాయముగ నపత్యభాగ్యము కలుగున్ 45

కం॥ అని పలికి సిద్ధపురుషుఁడు
చనిన మనైక్కన్విభుండు జాయా యుతుఁడై
యనలు యథావిధి నభ్య
ర్చన సేయఁగ మొదలువెట్టె సద్భక్తి మెయిన్. 46

## ....: సంతానలబ్ధి. :....

కం॥ అనలార్చనతోఁ బాటుగ
ననదలకు నకించనులకు నధికప్రీతిన్
బొనరించె నన్నదానం
బనయం బుపహారయుక్తి నాతం డంతన్. 47

కం॥ అనలార్చనాప్రభావం
బునన్ మనైక్కన్ వణిక్ప్రభుని భార్యకుఁ ద
ప్పెను నెల; నలుఁపును వెలుఁపును
జనుముక్కులఁ జెక్కుల నతిశయముగఁ దోఁచెన్. 48

కం॥ ఆండాళమ్మకు మేనన్
బాండుద్యుతి; మట్టితావి వదనాబ్జమునం
దుండుట కని మూర్కొని దయి
తుం డంతర్వత్నియైన తొయ్యలి మెచ్చెన్ 49

సీ॥ రత్నశలాక గర్భమునఁ దాలిచిన వి
దూరభూమి యన, నంగారకీల
నుదర భాగమ్మునం దూనిన శమి నాఁగ,
చంచలాలతిక లో నించుకొన్న
జలధర మాలికబలె. సరస్వతిని లో
నిలుపుకొనిన త్రివేణీస్థలి యన
నడుమ శుక్తిని దాల్చిన కలశపాథోని
ధానవీచి యనంగ; భానురోచి

తే॥ గీ॥ నంతరమునఁ బూనిన యుదయావనిధర
మేఖల యన నంతర్వత్ని మెఱసెఁ గరము

శ్రీమన్నైక్కనుపత్ని యశేషబంధు
వర్గమున కెల్లఁ గన్నులపండు వగుచు. 50

సీ॥ ప్రసవకాలం బంతఁ బ్రాప్తించెఁ బ్రారంభ
మయ్యె నాండాళమ్మ కంత కంత
కెక్కువై నొప్పఁ; లిల్లిల్ల నిండుకొనిరి
చుట్టుప్రక్కల యాండ్రు; "చూలు కలిగె
నింత కాలానకు నేమగునో" యని
పొక్కుచు గుజగుజ వోవువారు;
"సుఖముగాఁగాన్పగుఁ జూచుఁ జల్లగ స్వామి
యదరుపా టేల'ని యాడువారు

తే॥ గీ॥ 'పాపఁ డుదయించు' నని పల్కువారు "కాదు
పాపయే' యని శపథంబు పట్టువారు;
'అరయుదము గాక' యనువారు నగుచు నతివ
లందఱును దలకొక రీతి నాడుచుండ. 51

సీ॥ "సుఖముగాఁ బ్రసవించె సుత నొక్క స్వామిని'
యనువార్తఁ దెచ్చిన యతివ కొసఁగెఁ
బూర్ణపాత్రంబుగా ముత్యాలపేరు మ
న్నైక్కన్ మహాత్ముఁ డానందపడుచు;
నంతకుమున్న సౌధాంతరమునయందు
గుమ్పుకోలుగ గుమిగూడి యున్న
వనితలు తమతమ భవనంబులకు నేగి
రంతఁ బ్రసూతిగృహంబునందుఁ

తే॥ గీ॥ జేయఁదగిన కృత్యములెల్లఁ జేసి చనిరి
మంత్రసానులు; వేఱొండు మహిళ వచ్చి
దైవకృపఁ దల్లి బిడ్డ భద్రముగ నున్న
వారు; రండ'ని యంజలి పట్టి నిలిచె॥ 52

కం॥ దైవం బీనాఁటికి నా
చౌ వాంఛితముల్ ఘటించె; నన్వయ మెల్లన్
బావన మయ్యెను గీలిశ్రృ
పా వైభవమహిమ భాగ్యవంతుఁడ నైతిన్. 53

తే। గీ॥ ఈశ్వరుఁడు కన్నుదెఱచిన నెట్టి కోర్కి
యేనియు ఫలించు మనుజుని కేని కేని
ఈశ్వరేచ్ఛాను సారంబ యీజగంబు
వర్తిలుచు నుండు ననుచు భావమునఁ దలఁచి 54

కం॥ మును చనుదాని పిఱుందన
మనైక్కను విభుఁడు ప్రసూతి మందిరమునకుꣳ
జని నయనామృతవర్తినిఁ
దనయుఁ గనుంగొని పులకిత తనుఁడై తనిసెꣳ. 55

సీ॥ పదిదినములు సన్నపిదప నాండాళమ్మ
కాప్తులు పురుడు పోయ ననుపదమ
కులపురోహితుఁడు వర్తిలఁ జేసెఁ బుణ్యాహ
వాచన మాపయి బారసాల
వేళఁ 'గణ్ణగి' యనుపేరు బిడ్డకు జన్మ
తారానుగుణముగాఁ దండ్రిపెట్టె
నంత క్షత్రియవర్ణమై త్రివర్ణములకుఁ
బ్రత్యేకముగ సాఁగె బంతి కుడుపు

తే।గీ॥ తక్కు కొలముల వారికిఁ దానబహువి
ధాన్న భక్ష్యభోజ్యము లాదియౌ పదార్ధ
ముల నొసంగె మనైక్క న్విభుండు దైవ
దత్త మెల్లరికినిఁ బ్రదాతవ్యమనుచు. 56

... కణ్ణగి బాల్యము ...

సీ॥ పట్టుపాన్పునఁ బసిపాపతోనున్న యాం
డాళమ్మఁ గాంచి చుట్టాలపడఁతు
లీయమ్మ కడుపున నీనాఁటి కొకకాయ
కాఁచుట మిగుల భాగ్యంబు గాదె!

ఈచిన్ని పౌరసాని యెల్లరి కన్నుల
కమృతమై యొప్పుట యరిది కాదొ?
లంకంత యింటికి నింక నీపసిబిడ్డ
నడదివ్వెయై వెల్గు నడపుగాఁత

తే. గీ॥ రావె నను(గన్నతల్లి! వరాల మూట!
రావె ప్రాణంబు ప్రాణంబ! రావె యనుచు
బుజ్జవము సేయు నాండాళు పొలప మరసి
మురియుద మనుచుఁ జనిరి గేములకు నంత. 57

సీ॥ కానక కానక కన్నను నాండాళు
గుమ్మడి పండంటి కూతుఁ గనియెఁ
బుణ్యంబు కొలఁదిని బురుషుండు దానంబు
కొలఁది బిడ్డ లనెడు పలుకు నిజమ
ఏనోము నోఁచిరో యింతియు మగఁడును
నాపాపఁ గనుటకుఁ బ్రాగ్భవమున
బంగారుబొమ్మ యాపసిపాప కన్పండు
వై యెల్లచుట్టాల కనుఁగు కాదొ?

తే. గీ॥ ఈ పసరుమొగ్గ నలనల్ల నింతయింత
యై పరువ మెక్కి తావుల నడరఁజేయు
కాలము మన మెల్లను జూఁడగలమొ? లేమొ?
యనుచుఁ బౌరకాంత లెపుడు నాడుచుండ్రు. 58

తే. గీ॥ దివ్వెయును దీధితియుఁబోలెఁ దీవియయును
జివురునుంబోలె; నలినియు నవదళంబు
నుంబలె వెలింగి రేకతల్పంబునందుఁ
దల్లియును బిడ్డయును మహోదారకాంతి. 59

కం॥ బాలసుధాకరరేఖకు
వేలయు వార్నిధియుఁ బోలెఁ బ్రీతివడిరి యాం
డాళుమనైక్కన్విభుడా
బాలిక కధికప్రమోద భరితాత్మకులై 60

సీ॥ ఉగ్గు కారము వెట్టి యుదరంబు నిమురుచు
'వాతాపిజీర్ణ'మటఁ పలుకుఁ బలుకు;
నూనియఁ దలయంటి మేనెల్ల మర్దించి
పలుచగాఁ బసుపున నలుగువెట్టు;
చీకిరేనుపాడితో జిడ్డువోఁ దోఁమి న
ఖంపచాంబువుల బోర్కాడఁజేయుఁ
దాపితాతో మేని తడియొత్తి కురులార్చి
వలపు సాంబ్రాణి ధూపంబు వట్టు

తే॥ గీ॥ బొమలఁ గనులఁ గాటుకఁ దీర్చు; బుగ్గచుక్క
వెట్టు; నొసటిపై నేరేటి విత్తుబొట్టు
దిద్దు; నూయల పొత్తులఁ దెండఁబెట్టి
పాడు జోల లాండాళమ్మ ప్రత్యహంబు. 61

ఉ॥ మేడల నల్వలంకులకు మిన్కులు చిందుచు బొజ్జతోడఁ బా
రాడుచుఁ గొన్నినాళ్ళు; ధర హస్తతలంబులు జాను లూఁది దోఁ
గాడుచుఁ గొన్నినాళ్ళడుగు లట్టొక టిట్టొక టుర్వి మోఁపి తూఁ
గాడుచుఁ గొన్నినా ళ్లిడియె హర్షము నాబిడ కన్నవారికిఁ. 62

కం॥ 'తా'యని 'తాతా' యని 'అ
త్తా'యని తొక్కుపలు కాడు దారికఁగని యెం
తో యానందంపడి రా
జాయాపతు లిర్వురును నసామాన్యముగఁ. 63

తే॥ గీ॥ తప్పటడుగులు వేయుచు దాదికేలి
నూఁతగాఁ గొని నడచుచు నొయ్య నొయ్య
యేగి నేలఁబడిన బిడ్డ నెత్తికొంచు
'నొచ్చెనే' యని పితరులు నొచ్చికొంద్రు. 64

కం॥ నడదీవియ పగిదిని నే
కడ కాపాపయరుగుఁ గనకమయంబుగ నా
కడ వెల్గును; బాయఁగ నా
కడయ మహానీలమయముగాఁ గన్పట్టున్. 65

## —: కిణ్ణగి యౌవనావిర్భావము :—

సీ॥ తనతోడి యాడువారిని రెండుజట్లుగా
విభజించి, మున్నాడు పెండ్లివారి
జట్టున కోర్తు గచరిగాఁగ మగపెండ్లి
వారిజట్టున కగ్రచారిణి యయి
తక్కు బాలికలును దలిదండ్రులును జూచి
సారె కిప్పావ క్రీడారసంబు
క్రోలు నోయని యెంచగుజగుజ రేనుల
నబ్బాల కణ్ణగి యాడి మురియుఁ

తే॥ గీ॥ గేళికోద్యానమునఁ గెళాకూళిచెంతఁ
దీర్చి దిద్దిన కృతకాద్రి దెసకుఁ బాఱు
విడులతేనియ కాలువదరుల వెలయు
తీవజొంపాల జిగిబిగి తెరవులందు. 66

తే॥ గీ॥ మల్లెపూవునఁ గ్రమముగ మధువు సొర
భంబు చేరుతెఱంగునఁ బాదుకొనియె
నా నలిననేత్ర గాత్రంబునందు జనదృ
గంచలాస్వాద్య లావణ్యయౌవనములు. 67

తే॥ గీ॥ అంగముల నెల్లజవ్వన మలమికొనుడు
నొక్కచో లేమి పరిణాహ మొక్కచోట
నొక్కచోటఁ గాఠిన్యంబు నుంటఁజేసి
చిల్కలకొలికిమత్త కాశినిగఁదనరె. 68

కం॥ చతురస్రభాసురముగా
సుతకుఁ బ్రథమయౌవనంబు శోభిల నాండా
ళతివేలానందముతోఁ
బతికనె నొకనాఁటి రాత్రి వాసగృహమునన్ 69

## — వివాహ యత్నము —

సీ॥ వక్రించిన విధి యవక్రముగా స్వామి!
గొడ్డుతనము వీఁగి కూతుఁ గంటి;
నాబిడ్డ యింతింతయై కంటివిందైన
ప్రథమ యౌవనమున వఱలు; దాని

శేతి రూపసంపద, రమవైభవమున, భా
రతి వాక్యపరిణతి, క్షితిక్షమాప్తి,
నంచు వేనోళ్ల నుతించుచు నున్నారు
మనపురంబున నున్న జనములెల్ల;

తే॥ గీ॥ లేకలేక జనించిన యీకుమారి
పదియు నాలుగేండ్లది యయ్యె వైశ్యకులము
పడుచులకు నెల్ల నిది పెండ్లివయసు కానఁ
గన్యకకుఁ దగు వరు నెమకంగ వలయుఁ. 70

సీ॥ ఈడువచ్చిన బిడ్డ యింటనుండుట తల్లి
కింతంత బాధ గాఁ దేకశయ్యఁ
కన్యకల కశస్త్రకల్పిత వధ మంత్రు
తెలిసిన పెద్ద లీపలుకు మీకుఁ
దెలియనిదని కాదు దేవ! నా తెలుపుట
యనిపల్క నాండాళు కనియె విభుఁడు
కణ్ణగికి వివాహకాలంబు దాపయ్యె
నంచు సంబంధంబు లరయు చున్న

తే॥ గీ॥ వాఁడ; నిది యెఱుంగక నీవు పల్కు టెంత
ఖేలవే? నేఁడు నగరానఁ బెద్దసిగల
వారు నాగరకులు వణిక్ప్రభువు లొక్క
పనికి నొకచోట సభసేసి రనఘమతులు. 71

చం॥ అచటికి నేను నేగితి, నుదారగుణుండు మసత్తువాసు శ
స్త చరితు, లాఢ్యవైశ్యులు, యశస్వులు పెక్కురు వచ్చి చేరినాఁ;
రుచితముగా. నొసంగిరి యొకొక్కరికిన్ సభవారు పూజనం
బ్బచిరమ పూర్తియయ్యె సభ యంతట నాకడకున్ స్మితాస్యుఁడై 72

తే॥ గీ॥ అరుగుదెంచె మసత్తువా న;తని తీరుఁ
గాంచి యేదో విశేషంబు గల దటంచు
నెంచితిని నేను; నంతలో 'నెల్లవారు
కుశలమే? యన 'నౌ న'ంటిఁ గొంత కతఁడు. 73

సీ॥ నేనొక మాట నీతో నాడఁ గోరితిఁ;
గరుణించి విను మనైక్కన్మహాత్మ!
మన వంగడములు రెండును నిప్పరమునఁబ్ర
ఖ్యాతంబు లైనవి; కాన మాకు
టుంబము మీదు కుటుంబము నొండొంటి
తోడఁ బెన్గొంట యెంతో ముదావ
హం; బట్టి సంబంధ మడరు వైవాహిక
బంధంబుచేత; వివాహమును వి

తే॥ గీ॥ వాదమును సములకు సరిపడు నటంచు
పల్కుదురు పెద్దలెల్ల; వైభవము ప్రాభ
వమ్ము, శౌచమ్ము, కీర్తి సంపద్విశేష
మొప్పు నీకును నాకును నొకవిధముగ. 74

కం॥ అనలుని వరమహిమముచే
జనించెఁ గణిగి త్వదంగజాతగ నని నే
మును వినియుంటిని; నాక
న్యనాకుఁ గోడలిగ ని మ్మనన్యగుణాఢ్యా. 75

ఉ॥ నాకుఁ గుమారుఁ డొక్కరుఁ డనంగు వసంతు జయంతు రూపరే
ఖా కమనీయతన్ గెలువఁ గల్గినవాఁడు కలండు, సద్గుణ
శ్రీకలితుండు; పూరుషుల శ్రీపతి యట్టిఁడు; పేరు కోవలన్
నీ కతఁడల్లుఁడౌట తగు; నే నిది పూర్వమ నిశ్చయించితిన్. 76

ఉ॥ నా విని సంతసంపడితి; నాదు వినిశ్చయ మా మసత్తువాన్
తా వినిపింపు మంచడిగినన్ వెడ నవ్వుచు నీదు మానసం
బే విధి నుండునో యనుచు నే నపుఁగాదన కూరకుంటి; ని
ప్డీవెటు నిర్ణయించినను నేనది కాదన; సమ్మతించెదన్. 77

సీ॥ అనరాదు గాని రూపున నాకుమారుండు
జితమన్మథుండు సుశ్రీకగాత్రుఁ
డిన్నగరంబున నెల్లకన్య లతండ
దయితుండు కావలెఁ దమ కటంచు

మ్రొక్కిన వేల్పుల మ్రొక్కక తక్కటి
వారికి మ్రొక్కుచున్నారట! మన
బిడ్డ యదృష్ట మేవిధమున నుండునో?
కోవలఁ గణ్ణగి కూర్మిమగఁడు

తే॥ గీ॥ కాఁగలఁడొ? లేఁడొ? దైవంబు కన్ను దెఱవఁ
బరిణయం బెంత? యైన నివ్వారి బిడ్డ
వీరి సుతున కాలగునని యేరు నిర్ణ
యింతు; రింతకు నీభావమేమి? చెపుమ! 78

సీ॥ అనవుడు కనుగవ మినుకులు చినుకంగ
నాండాళు విభునకు ననియె నిట్లు
మనతోడి సంబంధమునకు మసత్తువా
నాసగొంట మనభాగ్యమ్ము సుమ్ము
నాయెద యెట్లుండునో యని యమ్మహా
మహున కీవు బదులు మాట యీక
ఏల వచ్చితి వని జాలిగా వాపోవు
నాలికి నిట్లను నవ్విభుండు.

తే॥ గీ॥ నడిగి నంతనె ఊఁయన నలుసుకారె
ఆడుబిడ్డలు గల మనయట్టివారు?
కాన నట్లంటిః గాక! శ్రీ తానరాఁగ
ముందు కాలడ్డముగ సాఁచు మూర్ఖుఁడున్నె? 79

సీ॥ అతఁ డుత్తమ గోత్రజాతుండు శ్రీవిభుం
డందెవేసినచేయి త్యాగమందు
మున్నొకసారి యీభూమిని దారుణ
క్షామ సంక్షోభంబు సంభవించె
నాకాటకంబున నఖిల జనంబును
గూటికి గుడ్డకు గోడు గుడిచెఁ
గరుణార్ద్ర చిత్తుఁడై ఘనుఁడు మసత్తువా
నన్నవస్త్రము లిచ్చి యాదు కొనియె

తే॥ గీ॥ నఖిల జనముల; దానికి నచ్చెరువడి
రాజ బిరుదం బొసంగె విక్రమ గుణైక

ధనుఁడు కరికాళ చోళుఁ డాతనికి; నిట్టి
వానితోడి సంబంధంబు మాన నగునె? 80

సీ॥ అనుడు నాసతి వెండియును గాంతుతోడ 'శు
భస్య శీఘ్ర' మ్మను వచనసరణి
నిశ్చితార్థమునకు నీవొక శుభతిథి
వచ్చిల్లు దినము నేర్పరుపు మయ్య!
కన్నెనియును నొండెఁ గళ్యాణమేనియు
వచ్చిన నాఁప నెవ్వరితరంబు?
జేప మసత్తువాన్ జేని సౌధంబున
కరుగుము; మన నిశ్చయంబు దెలుపు

తే॥ గీ॥ మాలసించిన నమృతంబు నగు విషంబ
నంగ 'నౌ'నని యతఁడును నాతితోడఁ
దలిమమునఁ దెంచె వారిపల్కులు వినిన ప్రి
యంవదాఖ్య, కణ్ణగికి వయస్య పొంగె. 81

ఉ॥ అంతటఁ జక్రదంజకుఁ డనంతతమః పరిభావకుండు దు
ర్దాంతకర ప్రతాపిత పరాఙ్ముఖరాజుఁడు, వేదమూర్తి, భా
స్వంతుఁడు సర్వభూభువన జంగమదీపము, పద్మినీమనః
కాంతుఁడు తోఁచెఁ బ్రాచికి మొగంబునఁ దీర్చిన చుక్కబొట్టనన్. 82

కం॥ ఇను నుదయమునకు మున్నుగ
మసైత్కను ప్రబుద్ధుఁడై రమణియును దానున్
బొనరించిరి కాల్యంబుల;
ననలునిఁ బూజించి రతిసంమచిత భక్తిన్. 83

ఉ॥ అంతఁ బురోహితున్ బిలువనంపి యభీష్టముఁ దెల్ప నాతఁడ
త్యంత శుభావహంబు తిథి యట్టిద వాసర మంచుఁ దెల్పినన్
సంతస మంది తోడన మసైత్కనుసెట్టి, మసత్తువాన్ నుడుల్
స్వాంతమునన్ దలంచుచుఁ దదాలయ మొప్పెడు వాడకున్ జనెన్ 84

కం॥ చనుదెంచు నతని కెదురుగఁ
జని, వగుచు మసత్తువాన్ స్వసదనంబునకున్

గొనితెచ్చి యర్ఘ్యపాద్యా
సనాది పూజన మొసంగి జాయా యుతుఁడై 85

కం॥ కడచిన దినమున నీకడ
నడచిన వృత్తాంత మెల్ల నానాతికి నే
ర్పడఁ జెప్పితి, నది, కణ్ణగి
కొడుకున కాలగుటకంటెఁ గొండెకఁ డున్నె? 86

కం॥ అని పలికి 'నిశ్చితార్థం
బునకు మనము సుముఖుల మని పోయి తెలుపఁ డే
మనునో మనైక్కను విభుం
డనుచున్నది; యీవు దీని కనుకూలుఁడవే? 87

కం॥ అనఁగ విని మనైక్కను మీ
యనుజయు నాతోడ నిట్లు యనినది; దైవం
బనుకూలించెడు నెడ నే
ననుకూలుఁడఁ గాకయుండనగు నెట్లనుచున్. 88

ఆ॥ వె॥ వీడుకోలు వడసి వేగ నింటికి నేగి
యెల్లవిషయ మాలి కెఱుఁగఁజెప్పి
కూతు రెఱుఁగకుండు రీతిని నడువగా
నొప్పు మనకు నంచు నుండె; నంత. 89

...: *కణ్ణగి చెలికత్తెలతో నుద్యానమునకేగుట* :...

చం॥ తనయుడిగంపు బోటులు, నుదారగుణాఢ్యలు చెల్మికత్తెలున్
దనుఁగొలువన్ బ్రియంవద సదర్పముగా మునుసాఁగఁ గేళికా
వనమున కేగెఁ గణ్ణగి సువర్ధిత చూతలతా ప్రవాళముల్
తనుపుగ మేసి కూయు పికతండము రమ్మని సారెఁ బిల్వఁగన్. 90

సీ॥ జలయంత్రముల తుంపురుల దుమారము గ్రమ్మి
చలిమిరి సిరుల నెక్కొలుపు చోట
విరులతేనియల చూఱలఁగ్రోలి యొసఁగేఁగు
నెలఁదేంట్ల పాటలు వెలయుచోటఁ

డెలిదమ్మి విరుల నంచెలు గట్టి కలహంస
ములు కనుపండువు గొలుపుచోట
పలికప్పురపు టనంటుల పుప్పొడుల శర
త్సమయ చంద్రిక పుట్టి సాగుచోటఁ

తే॥ గీ॥ పచ్చవిలుకాఁడు పిలిచినఁ బలుకుచోట
పూవలపు గుబాళింపులు పొలయుచోట
గొలువుదీఱఁ గ్రొఁగ్గి బోట్లుఁ జెలులు గొలువ
దానికడఁ బ్రియంవదయు నాసీనయయ్యె। 91

ఉ॥ ఆ నలినాక్షులం దొకతె యప్డు ప్రియంవదఁ గాంచి మాకు నే
దేని యొకానొకం డుబుస, హీనరసంబుగఁ జెప్పవే యనం
గా, నుబుసేలనే? జరుగఁగాఁగల వృత్తము పల్కెదాన నాఁ
గా 'నిజమైనఁ జెప్పుమని కప్పుగి కోర వయస్య యిట్లనున్. 92

కం॥ ఒకనగరం బున్నది; దా
నికి రత్నాభరణు మన వణిజుఁడు కలఁడొకా
నొకఁడు; మహైశ్వర్యంబున
కకృతకశేవధి యనంగ నతఁ డలరారున్. 93

కం॥ ఆతనికి నిల్లా లొకగుణ
వతి యున్నది; భర్తృపాదపంకజసేవన్
సతత మొనర్చుచు విగ్రహ
వతియౌ గార్హస్థ్య మనఁగ భామ యొసంగున్. 94

కం॥ వారిం గని ప్రజ లక్ష్మీ
నారాయణులని నుతిం బొనర్చు; నిఖిలదై
వారాధనమున నేనిన్
వారికి సుచిరంబు కడుపుపండక పోయెన్. 95

ఉ॥ అంతట సిద్ధుఁ డొక్కఁడు తదాలయభూమికి వచ్చి వారికిన్
సంతతి లేమి దివ్యమగు జ్ఞానముచేత నెఱింగి యగ్ని ని
శ్చింతముగా భజింప ఫలసిద్ధి లభించు నటంచుఁ జెప్పి ని
ష్క్రాంతుఁడు గాఁగ వా రనలుఁ బ్రార్థనఁజేయఁగఁజొచ్చి రర్థిమై. 96

కం॥ అనలారాధన మహిమం
బున నాదంపతుల కొక్క పుత్రిక పుట్టెన్
జననేత్రలేహ్యరూపం
బున నొప్పెడు నాశిశువును బొగడిరి లోకుల్ 97

కం॥ క్రమముగఁ బెరిగిన తదప
త్యమునకు నెలజవ్వనంబు తనువునఁ దోఁపన్
బ్రమదంపడి తలిదండ్రులు
కొమిరెకు వరు నెమకుట కిటకున్ వచ్చిరటే! 98

తే॥గీ॥ ఆ యువతిపేరు కణ్ణగి యంట! దాని
కగు వరునిపేరు కోవల నంట! నేఁడొ?
ఱేఁపొ? నిశ్చితార్థంబు వర్తిల్లునంట!
ఇదియ జరుగఁబోయెడు వృత్త మింతులార! 99

చం॥ అని పలుకంగఁ గణ్ణగి దృగంచల పాటలకాంతి సోఁకి యా
నన మరుణాంబుజంబుగ; మనంబునఁ జొక్కియుఁ దెచ్చికోలుపె
న్గినుకఁ గలంగుచున్, సకుల, గేలికిఁ బూనఁగఁబోవు వారిఁ ద
ర్జని బెదరించి వైచెను విలాసపయోజమునన్ బ్రియంవదన్ 100

సీ॥ కణ్ణగి కరకేళి కంజాతతాడనం
బునకుఁ బ్రియంవద బుస్సుమనుచు
నున్నమా టన్నందు కులుకేల? పెండిలి
యాడవో మగవాని ననుచు దెప్పెఁ
దానుగా నాడదు తలిదండ్రు లూఁయను
దాఁకని యొక్కర్తు తాఁకనాడెఁ;
జక్కెర చేదని జంకెడు జవరాలు
కితిఁ గల్గినదని యొక్కతె వచించెఁ

తే॥ గీ॥ పెండిలికి మున్న యీపాటి బిగువుచూప
కున్న నలఁతిగాదే' యని యొర్తు గొణగెఁ;
'క్రొత్త పెండ్లికూతుర!' యని కొసరి కొసరి
చిట్టకము లాడు చొక్కతె చిలికి నవ్వెఁ. 101

సీ॥ గువ్వకోళ్లోని తన కూర్మిబోట్లిటు గేలి
సేయంగఁ గణ్ణగి చిటపటమను
చీప్రియంవద మీకు నేదేదియో చెప్ప
నదియెల్లయు విని సత్యంబటంచు
మది విశ్వసించి నామర్మంబు లుచ్చిపో
మీ రాలిఁగొంటిరి; మిమ్ము నెల్ల
వెకసి కోపంతంబు వేయింపకున్న నా
పేరు కణ్ణగి కాదు; వెఱ్ఱులార!

ఆ॥ వె॥ ఆలు లేదు; లేదు చూలు; కొడుకు పేరు
సోమలింగ మన్న సామెత వలె
నున్నవిగద మీదురుక్తులంచు గృహాభి
ముఖిగనైనఁ బిఱుఁదఁ బోయి రెల్ల 102

## —: కణ్ణగి--కోవలన్‌ల సమాగమము :—

తే॥ గీ॥ అంత నొకదినమ్మున నిశ్చితార్థమయ్యె
బంధుజన సమక్షంబునఁ, బరిణయోత్స
వంబునకుఁ బురోహితుఁడు తద్వాసరమున
నిర్ణయించె ముహూర్తం బనింద్య మొకఁడు. 103

సీ॥ పురమునం దెల్లెడ మొదలయ్యె నంత న
ల్గడలఁ గావేరిపుష్కరమహామ
హం భామహంబున కాండామ్మమనైక్కను
కణ్ణగితోఁబాటు కదలి వెడలి;
రవ్వారి పిఱుఁదఁ బ్రియంవద మొదలుగఁ
గూర్మిబో ట్లెల్లరు కొలువఁజనిరి;
వారి కొక్కయెడఁ గోవలను, మసత్తువాణ
పండిన భాగ్యంబు పగిది నెదురు

తే॥గీ॥ పడిరి; కణ్ణగియును మసత్తువాను బ్రక్క
నున్న మధురమూర్తిని సఖీవ్యూహమునకు
వెనుకగా నిల్చి కనుగొని తనిసె; నతఁడుఁ
గణ్ణగిని నిర్నిమేషంపుఁ గనులఁ జూచె" 104

తే।గీ॥ ఒకరి కుశలవృత్తము మఱియొక్క రడిగి
కొని తమతమ హర్మ్యములకుఁ జనిరి; చనెడు
తఱిఁ గణ్ణగి చెలికత్తె లెఱుఁగకుండఁ
దిరిగి చూచుచుఁ బ్రియు తరితీపు వెంచె; 105

మ॥ మదనుం డొండె, జయంతుఁ డొండె వరుఁడన్మాటల్ వయస్యల్ ప్రియం
వదతోఁబా టొకగొంతుతోఁ బలుకఁగా స్వాహా వధూస్వామి భా
గ్యదుఁడౌ మాకని యామనైక్కను విభుం డాండాళు సానందులై
రెద, నుద్వాహమహాగమంబునకు నన్వీక్షించు చెంతేనియుఙా. 106

తే॥ గీ॥ ఆపలుకు లెల్ల వించు లీలాపయోజ
పత్త్రములు లెక్కవెట్టుచు స్వజనయిత్రి
పార్శ్వమున నధోముఖియయి పలుక కుండెఁ
గణ్ణగియుఁ బెండ్లిరాఁక నుత్కంఠ పెరుఁగ. 107

## —: కోవలన్ కణ్ణగుల వివాహ మహోత్సవము :—

తే॥ గీ॥ పెండ్లి రానున్నదని మగపెండ్లివారు
నాడు పెండ్లివారును సప్రయత్నముగ స్వ
కార్యముల మున్గి యొండేమి కానరైరి;
ధారుణి నెవరి లోకంబు వారిది గద. 108

సీ॥ శుభముహూర్తదిన మించుక గదియఁ బురంబు
సొంపుగా సమలంకరింపఁబడియె
నుభయపక్షముల బో ట్లుద్వాహమహమున
కనుపమాలంకరణాభిలాష
నదరి మైఁదీవల నాభరణ ప్రసూ
నములు దాలిచి గజేంద్రముల నెక్కి
యుత్సవంబుగఁ జను చొక్కొక్క వీధిలోఁ
దమకు సన్నిహిత బాంధవుల, నగరి

తే॥గీ॥ పెద్దల, సుహృజ్జనుల నెల్లఁ బిలిచి రత్న
వముల నెండవ యింద్రలోకమునఁ బురము
పూర్వ మెన్నండు నెఱుఁగని పొలుపు దాల్చి
యఖిల మంగళైక నిధాన మయ్యె; నంత, 109

సీ॥ స్వభవనములనుండి బయలుదేరిన వధూ
వరుల జట్లొక చతుష్పథమునందు
నెదురుపకోల్ తగ నిర్వహించి సతౌర్యత్రి
కంబుగఁ జంద్రరజంబుఁ బరిమ
ళార్ధంబు పఱపుచు సాతపత్త్రంబులై
మడపులపైఁ గాలినడకఁ జనగఁ
బిఱుఁద నుల్లెడక్రిందఁ బేరటాం డ్రరివేణి
మున్నగు వస్తువుల్ మోఁచి తేర

తే॥గీ॥ నక్షతలు, పుష్పములు, లాజ లబల లెల్ల
మఱిమఱిఁ గురియఁ గళ్యాణమండపము. వ
ధూవరులు జేరుకొనిరి; గోధూళిలగ్న
సమయమునకు నూతనరతిస్మరులు వోలె" 110

సీ॥ పోహళించిన యాణిముత్యాల సరములు
నలుఁగెలంకులకు వెన్నెలలఁ జిమ్మఁ;
బొన్నంచుల జిలుంగు మొహమలు చాందినీ
మించులు గుడుగుడు గుంచమాడ;
గరుడపచ్చల మాలికలడాలుచాలు ద్వా
రమునందుఁ బచ్చతోరణముఁ గూర్ప;
రతనాల దివ్వెల ప్రభ లుపయమనమా
గతులకు నెల్ల నారతుల నెత్త

తే॥గీ॥ కదళికలు పోకబోదెలు కట్టఁబడ్డ
స్తంభములు సేవకులువోలెఁ దనర నొప్పు
పరిణయపు మండపము వధూవరులు చొచ్చి
రనుపమంబుగ వివిధతూర్యములు మ్రోయ" 111

సీ॥ ద్వారమందున్న ముత్తైదువు లవ్వధూ
వరులఁ దోడ్కొని లోన కరిగి పైడి
పీటలఁ గూర్చుండఁబెట్టఁ బురోధ యు
ఖాశాస్త్రముగఁ బెండ్లితంతు జరిపి

తదుపరి మాంగల్యదాయకములగు మం
 త్రముల సుస్వరమధురముగఁ జదువఁ
జంద్రుండు రోహిణీ సంయుక్తుఁడౌ పుష్క
 రాంశమ్మునందుఁ గన్యాకరాంబు

తే॥ గీ॥ జంబు చేపట్టి యగ్నికి సప్రదక్షి
ణముగ సప్తపది యొనర్చి నగరిలోని
వారు సేసలు సల్లఁగా వరుఁడు తాళి
గట్టె మూఁడుముళ్లుగ వధూకంఠసీమ 112

తే॥ గీ॥ అనితరవిభవమ్ముగ నైన యావివాహ
మహమునకు వచ్చియుండిన మహివిభుండు
ప్రథమఁ బరిణీతులైన దంపతుల మ్రోల
మూఁడుపిడికిళ్ళ సేసలు పోసి చనియె. 113

కం॥ సతి శిరమునఁ బతియును సతి
పతితల ముత్యాల సేసఁబ్రాల్ గురిసిరి; పె
న్గుతుకముతో వాసంతీ
లతికయు సహకారము విరులంబలె నంతన్ 114

సీ॥ కొడుకుఁ గోడలిఁ గాంచి కురిసె నానందబా
 ష్పముల మసత్తువాన్ సద్మశుచి నెఱ్ఱ
కూతు నల్లునిఁ గాంచి కూర్మి పెండ్లముఁ దాను
 తనువు దాలిచె మనైక్యను యఖులయి
ఆలుమగలఁ గాంచి యానందపారవ
 శ్యము నొందిరి ప్రియంవదాది సఖులు
కణ్ణగి కోవలన్ కథ వ్రాయుకుండఁగా
 వతెనని పలికిరి పౌరజనులు

తే॥ గీ॥ ఈకుమారు లిర్వురును నూతేంట్లపంట
గా వెలయుదురు గాకని దీవెన లిడి
రెల్ల పుణ్యసతులు; పురోహితుఁడు చూప
వరుఁడు వధు వరంధతిఁ గాంచి లరుసమొసఁగ 115

చం॥ పరిణయ మెల్లనుఁ ముగిసె; బాంధవు లెల్లరు సాఁగి పోయిరీ;
కరణిని౯ బెండ్లి సిప్పరి నొకండును మున్నొనరింపలేదటం
చరుసము పొంది రెల్లరుఁ బ్రియంవద మున్నగు బోట్లు నవ్వధూ
వరుల కభీష్టమున్ బొనరుపన్ నియమించె మనైక్క నంతటన్ 116

సీ॥ వియ్యంకు లిరువురు విధిచోదితమ్ముగఁ
గులపురోహితులచే వెలయఁజేసి
రా దంపతులకు గర్భాధానమహ మెల్ల
యాప్తబాంధవుల సమక్షమందు;
సమలంకృతంబైన శశికాంత మణిమయ
వాసగేహమున నవ్వధువు వరుసి

నొక్కటిగ నొనర్చి యొక్కొక్కరుగఁదదా
వాసగృహము తోనఁ బాసి చనిరి;
తే॥గీ॥ అల్ల నవ్వుకొంచుఁ బ్రియంవదాది సఖులు;
హంసతూలికాతల్పంబు నంతికమున
నున్న తనదుచెంగటికి నొయ్యొయ్య డాయఁ
గోవలను, భీతి వడఁకె నా గోల యంత. 117

మ॥ సభయోత్కంప తనుచ్యుతాంబరదశా సంరోధిదోర్నాళమై;
రభసాశ్లేష పరాఙ్ముఖీకృత కుచప్రత్యంతమై;వామ్యభా
ర భృశాకుంచిత గూహితోరుజఘనప్రాగ్భారమై, కోవలన్
బ్రభుఁ జొక్కించె నవోఢసంగమము నావాప్తేష్టమయ్యుం గడున్" 118

ఆ॥వె॥ వామ్యభారవశతఁ బైకొన నీయమి
వసుని మేనితాఁకు కరఁచి చెఱచు
కతన నేమొ? సొలసి సతి కొంత మెత్తనై
పూనెఁ గేళికాభిముఖ్య మంత 119

తే॥గీ॥ బిగువు సడలెఁ; (గ్రీడన్ దృష్ట పెరిగె; స్మరుఁడు
కట్టుగినిఁ గోవలనును వాకట్టుకొనియె
నాది నముషిత మాళ్ళబ్ధమయ్యె నంత,
మందు ముషిత 'మూర్ధ్వబద్ధమై యడరె రతము; 120

కం॥ తొలికోడి కూసె; నంతటఁ
జెలువుని కౌఁగింటఁ గూర్కు చిలుకల కొలుకుల్
మెలకువగొని; రజ్జంబుల
వలపులు వ్యాపించెఁ; జుక్క ప్రాగ్దిశఁ బొడువన్ 121

కం॥ అరుణోదయ మయ్యెఁ; బు
ష్కరిణీ నలినీ ముఖాంబుజంబులు విరిసెన్;
మరుదంకురములు వీఁచెన్;
బరఁగెఁ బెలదెలనికాంతి నాల్గుచెఱఁగులఁ 123

కం॥ పులుఁగులు కలకలఁ గూసెఁ;
బలుచన గాఁజొచ్చెఁ దమము; పంకజవనముల్
కలకలలాడఁదొడంగెఁ;
గలువలు ముకుళించె; ఁదేఁటికదుపులు మొఱసెఁ 123

కం॥ తరుణవరుని బిగికౌఁగిటఁ
గరంగి యరనలఁగియున్న కణ్ణగియును, నం
బరమును. అవికను, దుఃఖమును
సరిదిద్దుచు వెలికి నల్లఁ జనుదేరంగన్ 124

ఉ॥ అంతకుమున్నమేల్కనిన యాబిడబోట్లు ప్రియంవదాదు ల
ల్లంతనఁ జూచి క్రమ్మికొన నప్డు కలంగుచు మోవిఁ జెక్కులఁ
గ్లాంతతనూలతఁ స్వవసనంబునఁ గప్పిన; బోటులుఁ గటా 125
క్షాంతములఁ హసించిరి వరాధిగత స్మరజృంభణోద్ధతిఁ

సీ॥ ఆలుమగల స్నానమార్చి దువ్వలువలు
కట్టనిచ్చిరి యుడిగంపుఁజెలులు;
లమృతోపమానంబు లభిమతాహారంబు
లాండాళ్లు కూతున కల్లునకను
దివస మొసంగుచుఁ దియ్యంబుఁ నెయ్యంబుఁ
బెనచుచుండుట మనైక్కనుకు నచ్చె
నభిమతభోగంబు లనుభవించుచు నత్త
వారింట నుండెఁ గోవలను; కొన్ని

తే॥గీ॥ దినము లిప్పగిదిఁ గడచి చనినయంతఁ
గోటరమునకుఁ దమముద్దుఁగోడలిఁగొని
పోవఁ గమనైక్కను భవనమునకు వచ్చి
రత్తమామ లిర్వురొక పుణ్యాహమందు. 126

....: అంపకము :....

తే॥గీ॥ అవనిపతు లేనియును దమయాత్మజలకు
నీయనంతటి యరణంబు నిచ్చి కూతు
నల్లు సాఁగ ననుపుచు వియ్యంకులు విన
ననె సభార్యుఁడయి మనైక్క నల్లున కిటు 127

చం॥ కడు మృదు వీకుమారి; యొకకార్యము సేసి యెఱుంగ దెన్నడుఁ
బొడమె హుతాశుసత్కరుణఁ బుట్టకపుట్టినదౌట మేము ప్రే
ముడి బెనుపారఁ బెంచితిమి; ముద్దును గోమును మాకు దీన నె
క్కుడు; సుకుమార! దీనినెటు కూర్తువొ? యేగతి నేలుకొందువో? 128

సీ॥ అని వాకొనుచును వియ్యంకులతో వెండి
యును 'మీకుఁ జెప్పఁదగినది లే దొ
కండై; న నొకమాట కణ్ణగి మీబిడ్డ
గాఁ జూచికొనుఁడు; మా కంటిపాప
గాఁ జూచుకొంటిమి కన్నది మొదలుగ;
గోల యియ్యది; యెట్లు కోటరంబు
సేయునో? యనుచు మాచిత్తంబు వడఁకు; నై
నను మిమ్మగని యూఱటను వహించు

తే॥ గీ॥ నని పలికి కణ్ణగినిఁ గాంచి 'యమ్మ! మమ్ము
నట్లు నీయత్తమామల నాదరించి
పతికి నెదురాడక యుభయవంశములకు
వన్నె దేవమ్మ యను చశ్రుబాష్ప మూనె॥ 129

కం॥ కనులం బాష్పం బూనిన
మనైక్కనును గాంచి బంధుమహిళలు నాండా
ళును గణ్ణగియును నాళీ
జను లూనిరి యశ్రువులు వెసఁ బ్రియంవదయుఁ 130

తే॥గీ॥ కణ్ణగినిఁ గోవలనునకుఁ గానిపించి
బాష్పముఁ దుడిచికొనుచు వైస్వర్య మొదవ
మాటికినిఁ గ్రేటుకొనుచును బోటు లెల్ల
విని మెయి గరుపాటు వహింప ననియె నిట్లు॥ 131

చం॥ కొడుకునకంటె నెక్కుడుగఁ గూర్మినిఁబెంచిరి తల్లిదండ్రు లీ
బుడుత; ననుంగుబోట్లమయి ముచ్చటఁ గూరుతు మేము దీని, కీ
బిడ భవదీయ హస్తమునఁ బెట్టితి, మీ రుచిరాంగి నీవు నె
న్నడు విడకుండు టొప్పు నయనప్రియ! పూవును దావియుంబలెన్॥ 132

తే॥గీ॥ అనిన నశ్రులు విడుచుచు ననుఁగుబోట్ల
నెల్లరిఁ గౌఁగిటం గ్రుచ్చి; తల్లిదండ్రు
లకుఁ బ్రణామం బొసఁగి కోవలనుకుఁ బిఱుఁదఁ
జాన యత్తవారింటికి సాఁగిపోయె॥ 133



శ్రీ ర స్తు

# మం జీ ర వి లా స ము

## ద్వి తీ య ప్ర క ర ణ ము.

... కణ్ణగి యత్తవారిల్లు చొచ్చుట. ....

కం॥ తముఁ బాయుటకంటెను గూ
రిమిబోటులఁ బాయుటయ దరికొలుపు సుత నం
చు మనైక్కను దలఁచి యనిపె
నమితభయంబునఁ బ్రియంవదాదుల వెనుకన్ 1

శా॥ తల్లిం దండ్రినిఁ బాసివచ్చిన మనస్తాపంబు దావాగ్నియై
యుల్లంబున్ దరికొల్పు చుండినను. సద్యోజాత కాంతానురా
గోల్లాసామృత సారపానముద మెంతో శైత్యమున్ గూర్ప రం
జిల్లెన్ గణ్ణగి కోవలన్ భవనలక్ష్మీదేవి నాఁ బచ్చగన్॥ 2

సీ॥ జననీజనకులకు సములని తలపోసి
యత్తమామల సేవ లాచరించుఁ;
బతియ ప్రత్యక్షదైవంబని యెంచి త
దభిరుచి కనువుగ ననుసరించుఁ;
గులబంధువుల కెల్లఁ దలలోని నాల్కగా
వరలి సద్గృహిణి యన్ప్రథ వహించుఁ;
బలుకుఁబ్రల్లదన మెవ్వలనఁ జూపక యింటి
కరుదెంచు పేదల నాదరించుఁ;

తే॥గీ॥ దల్లిదండ్రులకర్హయౌ తనయ యంచు
శ్వశురుల తలంపునకుఁ దగ్గ వధు వటంచుఁ
బురము వారలు వేనోళ్ళఁ బొగడుచుండ
నచిరకాలానఁ గణ్ణగి యసము గాంచె! 3

## —: గోవలన్ కణ్ణగుల వనవిహారము :—

చం॥ అనుదివసంబు కణ్ణగి ప్రియుంవదతోఁ దనుఁగొల్వఁ గేలికా
వనలతికా నికుంజములఁ; బ్రాంతవిలాస మహీధ్రభూములన్
స్వనదలికంకణాంబురుహపాణిమనోహరపద్మినీవధూ
ప్రణుత సరస్తటంబుల నిరంతవిహారము సల్పెఁ గోవలన్॥ 4

కం వనితామణితోఁ గేళీ
వనమున విహరించు చొక్కపరిఁ గణ్ణగికిన్
ననిచిన యొకచూతలతిక
వనప్రియన్ సప్రియుఁ గనఁబఱచుచుఁ బలికెన్, 5

చం॥ నునుఁజిగురాకు లిచ్చుచుఁ, దనుంగొనవేడుచు, మోము మోమునన్
జొనుపుచుఁ, గాళ్ళవ్రేళ్ళఁ బడుచున్; బయివ్రాలుచుఁ; ద్రోఁపుగాం
చుచున్
ననుపున వేడు కాంతుని వనప్రియ యొల్లదు; మౌగ్ధ్య మూనియో?
మునుపటి వానిధౌర్త్య మెదఁ బూనియొ? పైకొను సిగ్గుబల్మినో? 6

చం అనవిని పల్కెఁ గణ్ణగి ప్రియా! యొకనాడు వనప్రియుండు వీఁ
డనయము సేసియుండుఁ బ్రియకంచుఁ దలంచెద; సప్రియంబు సే
యనియెడ నింతధూర్త యగునా యొకకామిని? యన్యభోక్త నం
గనలు సహింతు రేగతి?మగల్ విటకాం డ్రవు టప్రసిద్ధమే? 7

కం॥ అనరాదు గాని కాంతా
జనంబు తమిగలది యగుట్లు పైగణ నుహిమం
బున నడచి పడక ధైర్యము
కనిపింపఁగఁ జేయు; మగలు కలఁగుదురు తమిన్॥ 8

కం॥ చెలువుగఁ బలికిన చిలుకల
కొలికిని గవుగిటికిఁ దార్పఁ గోవలను దృగం
చలమునఁ బిలువ నది ఝుళం
ఝుళత్కటకచరణ యగుచుఁ జనె నవ్వలకున్ 9

కం॥ ఆరావమున కలరి మం
జీరము లియ్యవి త్వదంఘ్రిసితములు కలమం

జీరంబులు సత్యమ రం
భోరూ! యనఁ గాంత స్వప్రియున కిట్లనియెన్ 10

సీ॥ ఇచ్చినది మదంబ యీయందియల నాకుఁ
ప్రాభృతకముగఁ బాత్రంబ నంచు
మును తొడిత్రొడిసెంబియను విభుం డివ్వాని
స్వయముగా మాకుటుంబమున కొసఁగె
వీనిగర్భంబున వెల మదింపునకు నె
క్కఁగరాని పద్మరాగములు కలవు;
ఈ యందియలతోడ నెనవచ్చునవి యీప
దారు లోకంబులయందు లే వ

తే॥గీ॥ టంచు మాతల్లి యెపుడు వచించు స్వామి!
ప్రాణతుల్యంబు లీనూపురములు నా క
నంగ బోటియు దానును నాఁటి వనవి
హారము ముగించి చనిరి స్వహర్మ్యమునకు: 11

సీ॥ నిత్యాన్నదానంబు నెఱపుచు నతిథిస
త్కారాలకు మొదటి తానకమయి;
నృత్యగీతాదుల నెఱి యెఱింగి లలిత
కళలకుఁ బ్రభుఁడను ఖ్యాతినంది
పాటకచేరీల బాగోగుల విమర్శ
నైపుణి జాణతనంబు సూపి
పలుతెఱంగుల జానపద నృత్యములలో న
ఖిలమర్మముల కొలందుల గ్రహించి

తే॥గీ॥ నగరి నేమూల నేభవనమున నేని
నిర్వహింపంగఁ బడుచున్న నృత్యములకుఁ
దప్ప కేగుచు నాట్యప్రదర్శనాతి
లంపటుం డనఁదగెఁ గోవలన్విభుండు॥ 12

## —: చిత్రపతి :—

ఉ॥ ఆపురి నాట్యరంగమున ఖ్యాతి వహించి వసించు నాట్యవి
ద్యాపరసీమ చిత్రపతి యన్ వెలచేడియ యొర్తు కెక్కడే

నా పువుఁబోఁడి నాట్యమన నప్పురి యంతయుఁ బోయి కన్గొనున్
జేపును మాపు సమ్మదము జిమ్మి గగుర్పొడువంగ గాత్రముల్ 13

తే॥ రాజులును వారిసుతులు నా రాజవదన
లాస్యభంగిమములకు లాలసు, లగుదురు;
కోవలఁ దానియాట నొక్కొటియుఁగూడఁ
దప్పి యెఱుఁగఁడు నృత్యగీతములఁ బేర్మి॥ 14

— ఊర్వశి శాపవృత్తాంతము —

సీ॥ ఒకనాఁటిరాత్రి సెజ్జకుఁ గణ్ణగిని దార్చి
కోవల నిట్లనుఁ గులవధూటి;
కిన్నగరంబునఁ జెన్నొందు నొక్కర్తు
వారభామిని చిత్రపతి యనంగ;
ననవద్యసర్వాంగియైన మాధవి దాని
కూతురై కొమరారుఁ గులుకులాఁడి
నృత్యగీతాదులా నెఱజాణ కుద్భవిం
చినదాది వెన్నుఁబెట్టినవి యంద్రు

తే॥ పేరుగలయది సామాన్య వేశ్యగాదు;
మున్నగస్త్య శాపంబునఁ బుట్టువొందె
నంట యూర్వశి మాధవి యనెడు పేర
నిచట; దాని వంశంబున నిదియుఁ బుట్టె 15

కం॥ అనవిని సతి యేకారణ
మున నాయూర్వశి కగస్త్యముని శాపం బి
చ్చెను? వినఁగా నౌత్సుక్యము
జనించెఁ దెలుపు మనఁగఁ బతి సతి కిట్లనియెఁ 16

సీ॥ ఒకదినంబున నింద్రు నోలగంబున లాస్య
మూర్వశి యొనరించు చుండె మున్ను;
భామయాటకుఁ బ్రక్క వాద్యముగ సురర్షి
మెలకువగా వీణ మీటుచుండెఁ
గాని నారదునకే కతముననో లయ
తప్పిపోవుచునుండె; దాన నున్న

యింద్రసూతి జయంతు నీక్షించు చాటపై
మనసుపెట్టక తమి మునుఁగుచున్న

తే॥ యూర్వశికినిఁ దాళము దప్పుచుండె; మొదటి
నుండియును దాని గమనించుచున్న సభ్యుఁ
డయ్యగస్త్యుండు కోపంబు నాఁగలేక
వారిరువురికి నిట్లు శాపం బొసంగె; 17

సీ॥ ఈయుపకృతి కూర్వశీ! యీవొక గణిక
కిల నర్తకిగ నుదయింతు గాఁక!
స్వర్లోకపతితనూభవుఁడు జయంతుండు
పుంకీచకంబుగఁ బుట్టుఁగాఁక!
కావేరిపురమునఁ గాఁగల యింద్రోత్స
వముల నీసంతతివారు నీవుఁ
దత్కీచకంబునే తాళపుఁ గోలగాఁ
దీర్చిదిద్దుకొని నర్తింత్రు గాఁక

తే॥ అపుడు పాకశాసని యాట కాఁక గాఁక
వంశలాస్యదండంబయి పరగుఁ గాఁక
అట్లు విబుధనాయకుని మీరర్చనములఁ
గొలిచినట్టి వారలుగఁ గాఁగలరు గాఁక 18

తే॥ కలహభోక్త యశ్రద్ధకు ఫలముగ భువిఁ
దన్మహతికిఁ బ్రాశస్త్యంబు తగ్గిపోయి
దానితోడఁ బోటీపడఁదగిన పెక్కు
విధములయిన జంత్రమ్ములు వెలయుఁగాక!" 19

కం॥ ఏవంవిధ శాపంబునఁ
గావేరీపట్టణమున గణికగ, నావి
ర్భావం బొందెను మాధవి
గా, విబుధాప్సరస యుర్విఁ గళల కిరవనన్ 20

తే॥ నయనలేహ్యమౌ ప్రాయంబు, నాట్యగీత
కళలఁ బాభవస్థాన. మె క్కుడను గనని
యంగసౌష్ఠవం బొప్పు నాయాటవెలఁది
ప్రజలఁ బ్రగ్రహాకృష్టులంబలె నొనర్చె 21

సీ॥ ఆసమయమునన నాదేశము నిరీతి
గా నుండుటకు నైయగస్త్యమౌని
యాదేశమునఁ జోళభూదారమణి తొడి
త్తొడిసెంబియను నింద్రునిమహంబు
ప్రారంభ మొనరించె; నయ్యింద్రు నాజ్ఞ భూ
తచతుక్కమన్ గ్రామదైవతంబు
పాపులఁ జోరులఁ బట్టి శిక్షించుచు
నుండె; నామొదటి యింద్రోత్సవంబు

తే।గీ॥ నందు నాడె జయంతు రూపాంతరమయి
కెరలెడు లయనిర్దేశక కీచకాను
సారముగ మాధవియు, దాన శాపముక్తి
జరుగ నమరావతికి వారు మరలఁ జనిరి 22

కం॥ ఆమాధవి సంతతివా
రేమర కింద్రోత్సవమున నేటేట సమ
స్తామోదముగ నొనర్తు ర
సామాన్యములైన నృత్యసంగీతమ్ముల్ 23

.... మాధవి ...

ఉ॥ ఆవెలయాలు చిత్రపతియాత్మజ మాధవి చారుతా విశే
షావహ సుందరాంగలతికాంచిత యౌటయ గాక నృత్యవి
ద్యావిభవాధిరాజ్యము ననన్యముగాఁ గొని పేరుగొన్న ప్ర
జ్ఞావతి; దానికీడనఁగఁ జాలిన నర్తకి లేద యిప్పురిన్ 24

సీ॥ ఐదవయేటనే యాకన్యక యనన్య
సాధారణప్రజ్ఞ జనని యెఱిఁగి
యిన్నగరమున సమీడ్య నాట్యాచార్యు
నొక్కని దానికి నొజ్జఁ జేసె;
నాతండు దేశిమార్గాభిధములయిన
నృత్యగానమ్ముల నేరుపరి, భ
రతనిగదిత భావరాగతాళంబులఁ
బలునాట్యభంగిమంబుల బుధుండు;

తే॥గీ॥ వల్లకీమురళీ వాద్యవాదనముల
సమ్యగవబోధుఁడు ద్రమిళసంస్కృతముల
మధురతర గేయకారుఁ, డమ్మహితుశిక్ష
నాటపాటల మాధవి యతిశయించె 25

కం॥ పదునైదేఁడుల ప్రాయము
మొదలవ్వటయ నృత్యగానములఁ గన్నాకై
యెదుగుచు మాధవి కీరితి
నదభ్రముగఁ జోళరాజ్య మందు గడించెన్. 26

తే॥గీ॥ గానమందేని నృత్యమందేని రూప
మందునేని లావణ్యంబు నందునేని
దానికి సరి యాచోళభూధవుని యేలు
బడి, నొకర్తయు లేదని పల్కుటరుదె? 27

కం॥ ఆ మాధవి సౌందర్యం
బే మోహనగాత్రులం దొకింతేనియు లే
దా; మె కళావైదుష్య మ
సామాన్యంబని యశోధ్వజం బెత్తఁబడెన్ 28

కం॥ కన్నుల పండువుగా నా
వన్నియల మిటారి నృత్యభంగిమముల మున్
గన్నాఁడఁ; గణ్ణగీ! నీ
వున్నాతో వచ్చి చూడఁబోలు ననంగన్ 29

కం॥ నీయభిరుచి కనుసారిణి
నై యే వర్తింతు; దానియాటఁ గనుఁగొనన్
నాయెద తమిగొనె; జేఁపటి
సాయంతన మీవు నేనుఁ జనుదము స్వామీ 30

కం॥ అని పలికిన కణ్ణగిఁ గను
గొని హర్షాంబునిధిఁ దేలెఁ గోవలను; హృదీ
శుని సంతసపఱిచితి నని
వనితయు నుప్పొంగె; నంతఁ బలపల వేఁగెన్ 31

## ...: మాధవీ నృత్య సందర్శనము :...

సీ॥ తెలవారుటకు మున్న తలిమంబు వీడి యా
ల్మగ లిరువురును కాల్యములు దీర్చి
క్రమముగాఁ గులదైవతముల కెల్లను యథా
పూర్వముగా భక్తిఁ బూజసేసి
యంగరాగముల మైనలఁది యంగకముల
నవరత్నముల భూషణములఁ దాల్చి
వలపుల కెరటాలు నలువలంకుల నించు
పూలసరములు క్రొమ్ముడుల ముడిచి

తే।గీ॥ అవనిపుల కుచితమయిన యాన మెక్కి
చిత్రపతి యున్న హర్మ్యంబు చేరుకొనిరి
సంజవేళఁ గళాసరస్వతి యనంగఁ
గ్రాలు మాధవి నృత్యంబు గాంచుకొఱకు 32

సీ॥ వారిఁ గన్గొని చిత్రపతి లేచి కేల్మోడ్చి
యొక పట్టుపాన్పున నునిచి లోని
కరిగి, నీనృత్యంబు నాలికిఁ గాన్పింప
నోయేమొ? మాధవీ! యువిదతోడ
వచ్చియున్నాఁడు కోవలను, నీవును బద్ధ
పరికరవై రమ్మ వారికడకు.
నిదె వచ్చుచున్నది యేమియుఁ దడవులే
దని మున్న చని తెల్పుదును లతాంగి!

తే।గీ॥ యని వచించి వారికడకు నరిగె మఱల;
మాధవి గృహీతనేపథ్యమండన యయి
వచ్చు చొక చిల్కదివ్వెకంబంబునీడ
నిలిచి కణ్ణగిఁ గనుగొని తలఁచె నిట్లు 33

ఉ॥ తామరగద్దె వీడుకొని ధాత్రికి డిగ్గిన లక్ష్మియో యనం
గా మెఱుఁగాఱు నీతరుణిఁ గాదని; కాళుల వ్రాలి దీననై
యీ మధుసూదనోపముని నెంతయు వేడితి నే నితండు నా
మోమయినం గనం డ;యినఁ బోలదు పక్కన నాకు వేసరన్ 34

తే॥గీ॥ ఆటపాటలఁ బ్రీతియన్ వ్యాజమున ని
తండు నాకయి వచ్చు నన్ తలఁపుఁ గలిగి
కైవసపడుఁబోయని యుంటిఁగాని నామ
నోరథము నిజముగ 'నేతిబీర' యయ్యె 35

చం॥ ఆనితలపోసి మాధవి యొయారపుటొప్పున నేగుదెంచి స
న్నసినదు ముబ్బుగుబ్బల వణంకుచు నుయ్యెల లూఁగ. సోఁగ వా
ల్గనుల మెఱుంగు కోవలను కణ్ణగులన్ మిఱుమిట్లు గొల్పఁగా
వినతియొనర్చి వారలకు వేడుక నాట కుపక్రమించుచున్ 36

తే॥గీ॥ ఒజ్జపై పాట పాడంగఁ. బజ్జ నున్న
తల్లి తాళంబు సఱచంగఁ దాను బాట
భావ మభినయించుచుఁ బదద్వయము కదపె
నల్లఁ బట్టెడ గజ్జియల్ ఘల్లుమనఁగ 37

ఉ॥ కంకణనిక్వణం బొలయఁగా, జఘనాంచిత హైమమేఖలా
కింకిణికల్ నదింప. మనుఁగ్లుడ యూఁగ, నితంబ మాడ వీ
నాంకపతాకయట్లు మేయియంతయుఁ దూఁగఁ. మొగంబు గీతభా
వాంకితమై రహింపఁగఁ దదగ్రమునన్ బచరించె నృత్యమున్ 38

కం॥ ఒకచె క్కొకచ నొక్కబుజ
మొకతొడయును నొకనితంబ మొకబదియుం గొం
డొక కనరా నొరగ నా
సకియ నిలిచెఁదుదిని నొక్కస్తంభముపొంతన్ 39

తే॥గీ॥ దాని యాటకుఁ గణ్ణగి తనిసి నాథు
వదన మీక్షించెఁ నాతఁడా వారయువతి
తత్తదవయువ ప్రసితనేత్రమ్ములు దివి
యంగ నేరక సతిచేష్ట నరయఁడయ్యె 40

తే॥గీ॥ మోహితుఁడయి తేరినవాఁడుబోలె నతఁడు
కణ్ణగినిఁజూచి యేదేని కాన్క నిత్తు
ననుచుఁ దనకంఠమున వ్రేలు హార మొకఁడు
జేరఁబిల్చి మాధవి కంఠసీమ వైచె 41

తే॥గీ॥ అతని చేతాఁకు సోఁకి యయ్యాటవెలఁది
చనులు పులకించెః హర్షవిస్ఫారలోచ
నముల వానినిఁ బానమొనర్చునదియుఁ
బోలెనై మెల్లగ మరలిపోయె నదియు; 42

ఉ॥ అంగజుతేరి వారువమునట్టుల మాధవి నర్తనంబు సే
యంగని తత్పరుండయిన యాతని వృత్తము మ్రింగలేక క్ర
క్కంగను లేక కణ్ణగి వికార మొకండును జూప కింటి కే
గం గనుగొల్పు, నాతఁడును గాదన నేరక యేగె దానితోఁ 43

## —: కణ్ణగి కోవలనుల ఏకాంత సంభాషణము :—

సీ॥ సదనంబుఁజేరి మజ్జనమాడి తొడి పూసి
షడ్రసోపేత భోజనము సేసి,
మోహనమందిరమున కేగి, క్రొంబట్టు
పదుకఁ గూర్చుండిరి పతియు సతియు;
నంత నాపడఁతి స్వకాంతునకుఁ గరాంబు
జమునఁ గప్పురవీడియముతుఁ నొసంగ
నతఁడు దానినిఁ బరధ్యానముఁ గొనంగ
"నాథ! మీరేదో మనంబునందు

తే॥గీ॥ తలఁచుచున్నా రనఁగ నాతఁ డులికిపడి న
తాంగి! మాధవి నృత్యవిద్యానవద్య
భావముఁ దలంచుచుంటి, నీపయి నుపేక్ష
పూనుటగ నీవు తలపంగఁబోకు సకియ! 44

ఉ॥ నాయెద నున్నదాన వొకనాతికి వేఱొకదాని కిందు నే
నీయను జోటు నెన్నడు నొకింతయు, సుందరి, నృత్యగీతవి
ద్యాయతనంబు మాధవియు నకుల కెక్కుడుగాని యోవరాం
గి! యెటు లాత్మకెక్కుఁ దలఁక్రిందుగఁ దాఁడప మాచరించెనేఁ 45

తే॥గీ॥ నృత్యసంగీతములపైని నెమ్మివలన
మాధవియెడ వహింతుఁ బ్రేమం బొకింత
దాన నటనిటనుం బరధ్యాని నైతి
నింత మాత్రంబగాక యొండేమి లేదు. 46

కం॥ గానంబైనను, నృత్యం
బైనను నన్గరఁచు వాన నతిలోలత్వం
బేనూనిన కతమున వే
శ్యానిలయమ్ములకుఁ బ్రాఁకుటయ్యె ననంగన్ 47

ఆ॥వె॥ వల్లభునకుఁ బక్షపాతంబు నృత్యగా
నంబులంద వారవారియందుఁ
గాదని మదితలఁచి కణ్ణగి హర్షబా
ష్పములు రాల వెండి పలికె నిట్లు 48

సీ॥ అంతమాత్రమున కేయాపదయును రాదు
సుభగ! దానికి నాకసూయ లేదు
మాధవి నృత్యంబు మనసారఁ దిలకించి
యానందమును బొందుఁ డార్యచరిత!
ఆనంద మీ వొందు టానందమౌ నాకు
మీ మార్గగామిని! స్వామి నేను
ననిన కణ్ణగి కాతఁ డాభిజాత్యము ధైర్య
మౌ దార్యమును గలయాలి వీవు;

తే॥గీ॥ చారుతా విశేషంబున్న సాధ్వి! నీకు
నప్రియం బొనరించు టన్యాయ మనుచు
నాతి గాఢబాహూపగూహనము కాన్క
గా నొసంగిన నాకలకంఠి కరఁగె; 49

ఉ॥ అంతట నాలి కప్రియ సమాచరణంబున కోడి యావణి
క్కాంతుడు కోవలన్ ధ్రొలివికార మొకించుక మోసులెత్తినన్
స్వాంతము చిక్కఁబట్టుకొని సాఁగఁడు సంతతనృత్యగాన సం
క్రాంతమనస్కుఁడయ్యె వెలకామిని మాధవివాడ కేనియున్ 50

కం॥ మాధవికథ యా నిబిడప
యోధర కణ్ణగి మనంబునుండి తొలఁగె నే
యాధియుఁ దానెఱుగక ని
ర్బాధముగాఁ గోవలన్ బ్రవర్తిలఁ దొడఁగెన్ 51

తే॥గీ॥ ప్రొద్దుపొడుపు క్రుంకుడులు నెఱుంగ కుండ
దయితతోఁగూడి యతఁడు ప్రత్యహము వాకొ

సంగరాని యానందమన్ వార్ధి మునిఁగి
తేలుఁగ నువారు ముక్కుపై వ్రేలుమోఁప 52

కం॥ కొడుకుం గోడలిఁ గని యే
వడువుననే స్రుక్కె నెపుడు పండునొకో మా
బిస కడు పని మిక్కిలి త్వర
పడుచుండిరి లో మసత్తువాఁ దత్సతియున్ 53

కం॥ కవవాయని జక్కవలని
యువజాయాపతుల వారి నొక గొంతుక నా
భువిలోని వారలెల్లరు
మివులం బొగడందొడఁగిరి మెచ్చుచు నెపుడున్ 54

కం. ఆవిధి నడరిన కణ్ణగి
కోవలనుల ప్రణయవార్ధి క్షోభించుచు ఝం
ఝూవాత మొకఁడు భయదం
బై వీవం దొడఁగె విధి యననుకూలముగన్ 55

## ఇంద్రోత్సవమునకుఁ గోవలన్‌ను రాజాహ్వానించుట

సీ కరికాళచోళుఁ డాపురిలోనఁ బ్రారంభ
మొనరింపనుండె నింద్రోత్సవంబు
రాజుకొల్వున నెల్లరసికుల మ్రోలఁ బ్ర
ప్రథమమ్ముగాఁ జిత్రపతితనూజ
మాధవి యయ్యింద్రమహమున నర్తింప
గావతెఁ గాలికి గజ్జెకట్టి
యాసమయంబున నారాజనర్తకి
యధిపుచే బహుమతి నందఁగవతె

తే గీ ఆ బహుమతి నేఁడు గొనుఁ గ్రయం బొసంగి
యట్టిసభ్యుని మాధవి యాత్మవల్ల
భునిగఁ జేపట్టఁగవలె నప్పురిని నద్ది
ముందునుండి యాచారమై పాదలుచుండె 56

తే॥గీ॥ ఎవనిఁ గదలించి చూచిన, నెవని నోట
విన్న నేమూల కేగిన నన్నగరిని
మాధవీదేవి నృత్యమఁజ మాటదక్క
అన్య మొక్కండు వినుటకు నబ్బదాయె 57

సీ॥ వణిగన్వయామృత వారాశిచంద్ర! క
ళాప్రపూర్ణా! కోవలన్ మహాత్మ!
చైత్రపౌర్ణమిని వాసవమహం బారంభ
మౌ మననగరంబు నందు; దానఁ
జిత్రపతితనూజ చిత్రనాట్యకళాస
రస్వతి మాధవి రసికజనుల
ప్రోల నృత్యమొనర్చు; నీలీలఁ గనుగొన
రావలె నీవంచు రాజునొద్ద

తే॥గీ॥ నుండి యాహ్వానపత్ర మొక్కండు వచ్చెఁ
గోవలను కఁదిగని వాఁడు కుముల దొడఁగెఁ
నెల్లవారు నృత్యమునకు నేగ నిశ్చ
యించుకొన నాతఁడీ విధి నెంచఁదొడఁగె 58

కం॥ మును మాధవి నృత్యముఁ గను
గొని మోహంబు న్వహించి కులకాంతకు నా
ర్తినిఁ గలిగించితి; నాచదు
రున కేనుం జనుటొ? వెనుదిరుఁగుటో? యెఱుఁగన్ 59

శా॥ ఆనాట్యంబును జూడ రమ్మనుచు నాకాహ్వానలేఖఁజ ధరి
త్రీనాథాగ్రణి పంపినాఁడు; చననే తేఁడల్కతో నన్ను నే
మైనంజేయును; జేనితోడి పగ సర్వానర్థసంధాయిః యెం
దేనిం బోయితినేని నన్ గణిక మైహేలల్ సతాయింపవో? 60

మ॥ సభ కే నేగక యుంట శ్రేయ మ్మఁట వేశ్యానృత్యముం జూచి మో
హభరం బొందకయుండు టెంతయు నశక్యం; బింద్రియోన్మాద, మా
గ భరం బెవ్వని; కుచ్చిపాతెడు కటాక్షశ్రేణి యొయ్యారి తా
ర్ప భృశాకృష్టుఁడు కాని గండుమగఁ డెవ్వండీ త్రిలోకిన్ విధీ! 61

కం॥ చిలుకల కొలుకుల వాల్చూ
పులకున్ బులకింపకునికిఁ బురుషుల దేహం

బులు స్థాణువులో? గ్రావం
బులో? మహీధ్రములో? లోహములో? వజ్రములో? 62

కం॥ వటబీజమంత మోహము
పొటిపొటి మోసై మొలకయి మొక్కై మ్రానై
పుటపుట నగునే నూటా
ర్పుట తలమే యాసరోజరుహునికి నేనిన్ 63

ఉ॥ దైవమ! యెట్టిచిక్కునకుఁ దార్చితి వింద్రునియుత్సవాన కేఁ
బోవక యుండరాదు; మఱిఁ బోవనురాః దిదియెట్టులైన నా
చావునకే ఘటిల్లినదిః సర్వము కణ్ణగితోడఁ జెప్పి యా
పావని యేమిపల్కు నది పాయక చేయుట నాకు మేలగున్ 64

కం॥ అని చింతించుచు నిజగృహ
మునకున్ జనుదెంచి భూవిభుని యానతియున్
దన కళవళపడుటయును
వినిచినఁ గణ్ణగి యొకింత విస్మయపడుచున్ 65

కం॥ పురమున నింద్రోత్సవ మట
అరుదెమ్మని తోఁడు పతికి నాహ్వానమ్మున్
గరమర్థిఁ బంపినాఁడట
యరుగుట కనుమతి నను విభుఁ డర్థించు నటే! 66

ఉ॥ పొమ్మన నొక్కకీడొదవుఁ బొమ్మనకున్న మఱొక్క కీడు ప్రా
ప్తమ్మగు మున్ను మాధవికి దక్కునొ యన్నభయమ్ము నాదు డెం
దమ్ము నగల్చుచుండెఁ నది తప్పిన దొక్కరవంత కాని దై
వమ్మెటు త్రిప్పునో యితనిభావము నన్నకలంత యేర్పు నన్ 67

కం॥ కడచిన దినముల వల్లభు
నడవడి స్తుతిపాత్ర మగుచు నడచినఁ దీక నా
గడనచెలివృత్త మీతని
యెడలో మాసినదియంచు నెన్నుదుఁ నైనన్ 68

కం॥ మును చన్న నూయి, వెనుకకుఁ
జన గోయి యటన్న సూక్తి చందంబై నా

మన మురియాడుచు నున్నది;
మనోవిభున కేమి మాఱుమాట యొసఁగుదున్ 69

కం॥ పొమ్మన నోరాడదు; దై
వమ్మ శరణ్యమని యెంచి భామిని "ప్రియ! నా
ట్యమ్మనఁగాఁ బంచప్రా
ణమ్ములుగద మీకుఁ: కాన నవయక చనుఁడీ! 70

కం॥ అనవిని మొగమింతై నీ
యనుమతి యబ్బినది నాకు నౌ మేలనుచున్
దిని కట్టి, పూసి, తొడి యా
యన నగరారామమునకు నరుగుచు నొకచోన్ 71

సీ॥ కన్నులఁ గాంచె నకాండంబుగా నొక
దారుణదృశ్యంబుఁ; దరుణుఁ డొక్కఁ
డున్నతుం డేడియో యొక్క హత్యాభియో
గంబునఁ గూటసాక్ష్యం బొసంగి
నందుకుగా ఖైనియానతిచేఁ దలఁ
గోల్పోవ నున్నాఁడు; కొమిరె యొకతె
యాతనిచెంత నత్యంతకరుణముగా
విలపించుచున్న; దాబిడకరంబు

తే॥గీ॥ లందు నొకపసికూన బాలేందు వనఁగ
నొప్పియున్నది; 'ఈనాధుఁ డుర్వి వీడి
చనిన దీనిఁబోషించెడు నన్ఘు లెవ్వ
రనుచునున్నది ధారగా నశ్రులురల 72

సీ॥ కని డాసి విస్మయంబున మునింగినవాఁడు
నుంబోలెఁ గోవలన్ యువకు పొంత
నున్న తలారిని నున్నమిత కుతారు
నీతఁడెవ్వం? డీమె యెవతె? యేల
ఏడ్చుచు నున్నది? యీపాప యెవ్వరి?
దీకలరూపు నాకెఱుఁగఁ జెప్పు
మనవాఁడితఁ డొక హత్యాభియోగంబునఁ
గూటసాక్ష్యం బిచ్చెఁ; గుపితుఁడైన

తే॥గీ॥ ప్రభుఁడు తలఁదియఁగా నన్నుఁబనిచె; నిద్ది
వీనిపెండ్ల మీకసుగందు వీరు గన్న;
దితని నెడఁబాయ లేక యీ యతివ యేడ్చు
చున్నది; యనాథ" యని చెప్పె నున్నరూపు. 73

తే॥ గీ॥ వానిపల్కులు విన్న కోవలునకు దృ
గంతముల నశ్రుబిందువుఁ లాత్మ శిబి ద
ధీచి జీమూతవాహనుల్ దోఁచినఁ గ
ళంబుఁ గ్రేటుకొం చతఁడు తలారి కనియె 74

ఉ॥ ఏనొక శంకలేక యిదె యెక్కడ వధ్యశిలన్ మృతిన్ గొనన్
వీనికి మాఱు నన్నుఁ దెగవేయుము నీవెద జంకుకొంకులన్
మాని తలారి! ఔనివచనంబును బొల్లుగఁగాదు నీవు నా
ప్రాణము వీనిప్రాణమునకై బలిగొంటకు సమ్మతింతువే? 75

సీ॥ ఆపల్కు లాలించి యాతఁడీయన మధూ
న్మత్తుఁడో? యొండె యున్మత్తుఁడో? య
టం చాకులపడి రెండవసారి యాపాద
మస్త మీక్షించి, తన్మహిత మంగ
ళాకృతియుఁ దదమూల్యాంబరాభరణాలు
తిలకించి. యతఁడొక దివ్యమూర్తి
యని తలపోసి సాష్టాంగకమ్ముగఁ ప్రణా
మశతంబు లర్పించి మాన్యచరిత!

తే॥గీ॥ ఇట్టి ప్రార్థన మున్నెట్టిఁడేని సేయఁ
డెంతయును విచిత్రంబన నంతమాత్ర
మునకు నేపుట్టియును మున్గిపోవ దొప్పు
కొనుమనుచుఁ గోవలన్ వేడికొనఁ దలారి 76

మ॥ 'నను నీవివ్విధి వేడికొంట యనఘా! న్యాయాపచారంబు; వీఁ
డనృతోక్తిన్ గలుషం బొనర్చెను నృపన్యాయాలయంబున్; మహా
త్ముని నిన్నీతనిమాఱు త్రుంచుట మహాదోషంబు కాదొక్కొ? రా
జనిదేశంబు నతిక్రమించుటకుఁ బూజ్యా! నేనపస్మారినే? 77

కం॥ ఇరువదియేఁడులు ధరణీ
శ్వరు సేవించితి ప్రమాదపడక; ప్రశంసా
పరుఁడౌ నేలిక ననుఁగనఁ
దురాత్ము వీనినిఁ గృప విడి దోషి నగుదునే? 78

కం॥ నేనీ యసదాచారుని
ప్రాణము బలిగొందు ననుచు రాజభటుం డెం
తే నిశితకుఠారముతో
వాని శిరము భూమితలముపైఁబడ నఱికెన్ 79

తే॥గీ॥ ధరణిఁ జాపకట్టుగఁబడ్డ తరుణుఁ గాంచి
మొదలు నఱికిన కదళికపోలె వాని
పత్నియును మూర్ఛమునిఁగెఁ గోవలను భీతుఁ
డై నిలిచె నట స్థాణువు నట్లపోలె 80

తే॥గీ॥ కొంతకొంతగ స్థాణుత్వ మంతరింప
గోవలన్మహాత్ముండు సరోవరాంబు
వల్లినీపత్రమునఁ దెచ్చి యాననమునఁ
బలుచగాఁ జల్లి సతి మూర్ఛవలనఁ దేర్చి 81

చం॥ పలికె నభాగ్య! కోల్పడితి వల్లభుఁ; బోయినవారు రారు; దే
హులు తనువూనుచుంద్రు; విడుచుందురు; కొమ్మలఁబుట్టి రాలు నా
ఫులగతిః నెట్టివారు విధికోల్తలకుం దలయొగ్గ కుండలే
రిల' నని హేమటంకశత మిచ్చెను వెండియు నూరడించుచున్ 82

కం॥ ఆయోదారపు మాటల
కాయౌదార్యమునకా నతానన మది నెం
తో యాశ్చర్యంపడి యి
ట్లాయనతోఁ గ్రేటుకొనుచు నల్లనఁబలికెన్ 83

కం॥ నీ యీ యీవి కృపాపర!
నా యీ కన్నకసుగందు నను క్షుద్బాధన్
ద్రోయక కాపాడెడు న
య్యా! యే నీమేలు మరవనయ్య మహాత్మా! 84

కం॥ కరుణాపరావతారము

పరిద్రజన యాతనా విదారణపక్షం
బరుదౌ నపత్యము సుధా
కరబింబము జలధికిబలెఁ గలుగుత నీకున్ 85

కం॥ అని యాశీర్వాదము సే
సిన యాసతి వీడుకొల్పి శ్రీమంతుఁ డతం
డు నిమేషశూన్యవీక్షణ
మున నడిచనుచున్న మార్గమున్ గనుచుండెన్ 86

సీ॥ వృత్తంబునెల్ల నిరీక్షించుచున్నవ
ధ్యస్థలాధికృతుండు దానకర్ణ!
ధర్మమును యథాతథమ్ముగాఁ బూర్తి సే
సిన నాకుఁ బారితోషికము లేదొ?
యనిన దాతవ్య మ[illegible] లేదీనాఁటి
కని కోవలన్ బల్కె నతఁడుసు దొర!
యొకబిడ్డ నాకును నున్నది; నేనంత
సంపన్నుఁడను గాను సామి యనుడు

తే॥గీ॥ నట్టియినఁ గొమ్ము నీయపత్యంబుకొఱకు
నంచుఁ బదిపైడిమొహరీలు కొంచ కొసఁగె
నంతఁ గోవలనునకు వాఁడనియె నిట్లు
సంభ్రమాశ్చర్యభయము లాస్యమునఁ గదుర 87

ఉ॥ ఈకలియందునున్ సుజను లీదృశు లిప్పరి మిమ్ముబోంట్లు సు
శ్రీకులు వాసముంట ప్రజసేసినభవ్యతపంబు; బొందెతో
నాకముసేరుపుణ్యులు త్వదన్యులు పుట్టుట కల్ల! నీయశః
శ్రీకి జగంబు నాట్యఖురళీత్వము పూను వదాన్యశేఖరా! 88

కం అనిపల్కి వాఁడును జనఁ
గను నేనీనాఁడు పుణ్యకార్యద్వితయం
బొనరించి సుకృతి నైతిని
[illegible]నని కోవల నాత్మలోన నలరెన్ బిదపన్ 89

సీ॥ అచోటు వీడ్కొని యాతఁ డొక్కించుఁక
ముంగెలనికిఁ జాఁగి పోవఁబోవ

దవ్వున వాసవోత్సవ కలకల మమం
దముగఁ దత్కర్ణరంధ్రములఁ బడియె
నానంద పరవశులైన ప్రేక్షకులతో
నరనాథపథము క్రిక్కిరిసి యుండె
ఖడ్గహస్తులు, చాపకరులు, గజారూఢు
లాశ్వికులు రథికు లాదియైన

తే॥గీ॥ భటులు బార్లుబార్లుగ సూత్రపట్టినట్లు
నడచుచు నొనర్చు వివిధవిన్యాసములను
బౌరు లెల్లరు వీక్షించి ప్రమదవార్ధి
మునిఁగితేలుచుండిరి తలపోయ కొండు 90

సీ॥ పడయాచులును, మరవలును, వెల్లాలులు
వడకులు మున్నగు ప్రథనజీవు
లాసైనికులలోన నత్యంతముఖ్యులు;
భటులెల్ల మరుపూరు పాక్కమునకుఁ
జెందినవారుగా, సేనాధిపతులెల్లఁ
బట్టణపాక్కము వారుగాఁగ
నుండిరి; వారికి దండ నిసుముచల్లి
నను రాలనంత జనంబు గ్రామ

తే॥గీ॥ దేవతాలయ ప్రాంతానఁ దెట్టువయ్యె;
నమ్మహాదేవి కెదుట నాత్మార్పణంబుఁ
గొంచక భటు లిరువురు గావించుకొనిరి
ప్రజలు జేవెట్ట దేశ సౌభాగ్యమునకు 91

క॥ ఇంతల నంతల వింతల
నంతముగాఁ గనుచు నగర నర్తనశాలా
ప్రాంతమునకుఁ గోవలనే
కాంతముగా నేగుదెంచె నతిముదిత పడుచున్ 92

సీ॥ దివినుండి భువికి నేతెంచిన వైజయం
తమన నర్తనశాల యమరియుండె;
నందుఁ బ్రేక్షకులకు నాసేచనకముగాఁ
గల్పింపబడియె రంగస్థలంబు

పొడ వెనిమిదిగజములు వెడల్పేఁడుగ
జములు ప్రమాణంబు లమరునట్టు
లిరుదెసలందు రెండేసి తల్పులు దృగ
లంకారముగ నమర్పంగఁబడియెఁ

తే॥గీ॥ జుట్టుఁ బలువగల తెఱలు శోభనించు
చుండెఁ! ద్రాళ్ళసాయమున దించుటకు నెత్తు
టకు ననువుగ నుండునటుల నొకయవనిక
కట్టగాఁబడియుండె సింగార మొలుక 93

కం॥ పలుచని యద్దపుబిళ్ళల
వలె మెఱసెడు కోవిదారఫలకంబులఁ గ
న్నుగలపండువుగా రం
స్థలవేదిక తీర్పఁబడి సజావై యుండెఁ 94

సీ॥ రంగస్థలముచుట్టు రాజులవియు శూరు
లవియు నయిన విగ్రహములు, దేవ
తాప్రతిమలు నిబద్ధంబులై శిల్పంబు
నకుఁ బరసీమ లనంగనుండె;
అందలిస్తంభంబు లవియైన చాయలు
పైఁబర్వకుండ నిల్పంగఁబడియె
శిల్పప్రపూర్ణమై చెలువారు భూరిదీ
పస్తంభ మొకఁడు ప్రభాపూర్ణనంబు,

తే॥గీ॥ వివిధచిత్రరమ్యంబయి వెలుఁగు నొక వి
తానచీనాంబరంబు నేత్రముల కింపు
పఱపురీతి నావేదికోపరితలమునఁ
జేర్పఁబడెఁ జుట్టు ముత్యాలచేరు లొప్ప 95

సీ॥ తనచైత్రయాత్ర నుత్తరభారతంబెల్ల
నుబ్బుాత లూఁపిన యుక్కుఁడీఁడు
కరికాలచోళ భూకాంతునిచేతఁబ
రాభూతులైన భూరమణులందు
నగ్రణియౌ నొక్క యార్యభూపాలు చం
ద్రాతపనిభధవళాతపత్ర

దండంబు నాఁటి మాధవి నర్తనమహోత్స
వమునకు లాస్యదండముగఁ జేయఁ

తే॥గీ॥ బడె; జయంతునకు నదియ ప్రాతినిధ్య
మూనె; దాని నిల్పెల్లయు నొసపరీ యుప
రంజితేకులతోఁ గప్పి రత్నఖచిత
ములుగఁ జేసిరి దానిసంధులు క్రమముగ 96

సీ॥ ఆనాఁటి షేప యయ్యాటకోలకు హైమ
భాండ సంభృత గాంగవారితోడ
మాధవి యభిషేకమహము నిర్వర్తించె
నారాజు నాస్థానమందు; మఱియు
నాయువనర్తకి యాదండమునకు న
మస్కరించి ప్రసూనమాలఁ దొడిగి
ఇదిగొ! కొమ్మని పురోహితుని చేతికి నిచ్చె;
నావిప్రముఖ్యుఁ డయ్యాటకోల

తే॥గీ॥ హైమభూషాపరిష్కృతమై సమూఢ
రథమగు గజముపై నుంచె; రాజు మంత్రి
దండనాథపురోహితుల్ దన్నుఁ గొలువ
సారె పటహాది తూర్యముల్ బోరుకలఁగ॥ 97

సీ॥ స్యందనమునకు గజంబునకుఁ బ్రదక్షి
ణముసేసి లాస్యదండము గ్రహించి
యంతకుమున్న రథారూఢుఁడై యున్న
యాస్థానకవి హస్తమందుఁ బెట్ట
నాతండు గాయకు చేతికి నందించె
నయ్యాటకోల; ననంతరంబ
నగరవీథులవెంట నలుగడఁ బురజనం
బుల కలకలములు పొడవుమీగులఁ

తే॥ గీ॥ దేరు జాతర సాఁగి యాభూరినృత్య
శాలఁ జేరె; గాయకుఁడప్డు సరభసముగ

దానిఁ గొనిచని రంగస్థలాన నొక్క
భద్రపీఠి నిల్పెఁ బ్రజ చప్పట్లు చఱవ. 98

తే॥ గీ॥ వైణవికులు, మార్దంగికుల్ వైణికులును
చక్కఁగాఁగల జంత్రవాద్యముల వారు
రంగతలవేదికకు నొకప్రక్కఁ గొంత
చేరువ గల స్థానముల నాసీనులైరి. 99

కం॥ కుడికాలు పెట్టి మాధవి
జలధరగర్భంబు వెడలు సౌదామిని నా
నడతెంచి రంగవేదికిఁ
గుడికడ నొకకంబ మానుకొని నిలఁబడియెన్॥ 100

తే॥ గీ॥ మాధవికి నెట్టయెదురుగా మఱియు నొక్క
స్తంభమునకుఁ జేరువ దానితల్లి. చెలి వ
సంతమాలయు నాఁటి యాచారమునకు
ననుగుణమ్ముగ నెడమవైపున నిలిచిరి. 101

సీ॥ అంతట దేవతాప్రార్థన మొనరింపఁ
బడియె నవిఘ్నతా ప్రాప్తికొరకు;
నాపైని జంత్రవాద్యములు మ్రోఁగినవి వి
విధనాదముల మేళవింపుతోడ
నంతట మాధవి యంఘ్రి ఝుళంఝుళ
త్కటకయై యల్ల రంగంబు మరుని
గజ్జెలగుఱ్ఱంబుగతిఁ జొచ్చి సభకెల్లఁ
గేల్మోడిచి యుగళగీతి నాల్గు

తే॥ గీ॥ పాదములుగలదానినిఁ బాడి దేశి
రీతిని నభినయము నొనరించి వెండి
మార్గనృత్య మొనర్చుచు మధురకంఠ
మెత్తి యొక్క ప్రణయగీతి నిట్లు పాడె॥ 102

తే॥ గీ॥ "జలదమాలిక నీకునై చాతకంబ!
నాట్య మొనరించుచున్న దానందపడుచు

నమృతబిందులు కురిసెడు; నాన నేల
సందియంపడియెదవు? త్రాసంబు విడుము" 103

తే॥ గీ॥ ఆప్రణయగీతి తీయగ నాలపించి
దాని వమజీయభావ మువాత్త ఫణితి
నభినయ మొనర్చి మధురనృత్యంబు సేయు
మాధవిని గాంచి యానంద మగ్నమగుచు॥ 104

తే॥ గీ॥ గని జనింపని రత్నంబొ కాక లతికఁ
బొడమని సుమంబొ కాక మబ్బున దొరలని
ముత్తియమొ కాక యొండౌనె? పూవుఁబోఁడి
యని విలోకిజనము విస్మయంబుఁ గొనియె॥ 105

తే॥ గీ॥ దాని లావణ్యరసము మున్నాని నాఁటి
వర కుపోషితము లయిన స్వనయనముల
నానుచున్నవాఁడుంబోలె నగుచుఁ గోవ
లన్మహాశయుండు కలావిలాసపరుఁడు. 106

సీ॥ పైనున్న యారంభ దీనినాట్యము సమీ
క్షించినచోఁ దలక్రిందుగాదొ?
ఎంతపుణ్యము సేయ నివ్వరారోహ కూ
తురుగఁ జిత్రపతికిఁ దోఁచెనొక్కొ?
ఈరూపజీవన కేభాగ్యశాలి క
న్నెఱికము పెట్టి మన్నించునొక్కొ?
దీనిచారుత చూచి భూనాయకుండ పాం
దంగఁ దాఁగుక్కిళ్ళుమ్రింగఁ డొక్కొ?

తే॥ గీ॥ పుట్టియుండుఁగాక; యికపైఁ బుట్టఁబోఁడు
గద యొయారికి భోక్త; యే కనులఁజూచు
చున్నవాఁడనొ పూఁబోఁడి? నుల్లమెంత
బిగ్గఁబట్టుకొన్నను దీని కగ్గమయ్యె॥ 107

తే॥ గీ॥ గీతికార్థంబుఁ దలఁప సిన్నాతి యిందొ
కానొక రసికు వలచినకరణి తోఁచు

నాసుకృతి నేనవ్వైన నాయట్టిభాగ్య
శాలి యెంతొకరుం డున్నె జగతిలోన॥ 108

కం॥ ఈనవలాయెడ నాకే
లా నెయ్య మకైతవముగ నావిర్భూతం
బైనదని నిర్నిమేషము
గా నొండుఁదలఁపక దానిఁ గాంచుచునుండెన్ 109

ఉ॥ అలలనాశిరోమణియు నమ్మెయిఁ దన్బొడగాంచుచున్ నిమే
షాలస పక్ష్మపంక్తి నయనాంచితుఁడై వివశాత్మకుండునుం
బోలె రహించువాని స్మరపుష్పశిలీముఖశాతతీవ్రదృ
గ్జాలముతో క్షతున్ సలుపఁజాలఁగఁ గోల్పడె ధైర్య మాతఁడున్ 110

ఉ॥ కంకణ నిక్వణం బొలయఁగా, జఘనాంచిత హైమమాలికా
కింకిణికల్ నదింప, నునుఁగీల్జడ యూఁగ. నితంబ మాడ మీ
నాంకపతాకనాఁగ మెయి యంతయుఁ దూఁగ నటించి నిల్చెనా
పంకజనేత్ర; యంత జనపాలుఁడు లాస్యముఁ గాంచి ముగ్ధుఁడై 111

తే. గీ॥ దీని నర్తనవిద్య శాస్త్రీయమై క
ళాభిపూర్ణమై నేత్రపేయంబునై ప్ర
మోదము ఘటించె మాకని భూమివిభుఁడు
దారముగఁ బ్రశంసించుచు దానికపుడు. 112

ఆ. వె॥ పైఁడిటంకము లొకపదినూర్ల యెనిమిది
పచ్చనాకుదండ బహుమతిగ నొ
సంగి యాక్షణంబ సపరివారంబుగా
మఱలిచనియె, నంత మాధవియును 113

చం॥ పదములనున్న గజ్జియల పట్టెడ నూడ్చునెపంబుతో, నధో
వదనము పూని కన్గొనుచుఁ బయ్యెదకాసెయు దిద్దు తల్లి పో
వుదమన నట్లకాకయని పోవుచు, వెన్కకు మోము ద్రిప్పుచున్
గొదుకక కోవలన్విభుని గుండియలో ఁజొరఁబాఱె నంతటన్ 114

తే. గీ॥ చనుచు నాపచ్చదండ వసంతమాల
హస్తమునఁబెట్టి సంప్రదాయానుగుణము

గాఁగ్రయంబున కమ్మెము; కలరసికులఁ
గోవిదుఁడు కోవలన్ దీనిఁ గొనగలాఁడు. 115

ఉ॥ మాల, వసంతమాల గొని మాధవితో 'నతఁ డీప్రజాళి ని
మ్మాలఁ గ్రయంబొసంగి కొని మన్ననసేయునె చిన్ని!నిన్నన
బాలిక!వెఱ్ఱివో?ప్రకటనం బొనరింపుము; వంటయింటి కుం
దేలతఁడిష్ట పర్చ్వలిడు;దీనిక యాతఁడు వేచియుండెడున్. 116

కం॥ అనిపలికి దాని వీడ్కొని
చనియెను మాధవి సజనని స్వగృహంబునకున్
బనివిన్న దానిచెలి న
ర్తనశాలాప్రాంగణస్థిత యయి జనులకున్. 117

సీ॥ పారావతంసంబులార! నాపల్కులు
చెవియొగ్గి వినుఁడు; నాచేతనున్న
యీమాల నగరిలో నింద్రోత్సవంబున
నర్తించి జనుల కానందమిడిన
నాట్యమయూరికి నా చెలి మాధవి
కాదరమున నిచ్చె నవనివిభుఁడు
కానన్కగా; దీనినే ఘనుఁడు దీనారాలు
వేయునెన్మిది యిచ్చి విలుచుకొనునొ?

తే॥ గీ॥ అతఁడ మా మాధవికిఁ బ్రియుండౌ; గొనంగఁ
దలఁచు రసికశేఖరుఁడు తాఁదడయక కొన
నౌ ననుచుఁ జాట మోచేత నచటనున్న
జనులఁ ద్రోపాడుకొంచు ముందునకు వచ్చి 118

ఉ॥ ఆ నవమోహనాంగి ప్రణయంబున కేనిదె పాత్రమౌదు, నే
మైనను నౌనుగాక' యని యాత్రముతోఁ గర మల్లఁజాఁచి య
ద్దాని గ్రహించెఁ; దత్క్రియ ముదారముగా నిడి కోవలన్మహా
శ్రీనిధి 'ఈకులీనుఁడిటుచేయునె యంచు జనంబు రాపడన్. 119

చం॥ తనగృహకర్త్రి మాధవి యథార్థము పల్కిన దంచు నంగనా
జన నయనావలేహ్యమగు జవ్వనముం బొలివోనివాని వా
నినిఁ బొడఁ గాంచి మాధవి కనింద్యకుఁ గన్నెఱికంబు పెట్టవ
చ్చిన కమనీయమూర్తి యని చిర్నగవొప్ప వసంతమాలయున్ 120

తే.గీ॥ అతని జెట్టఁబట్టుకొని గృహాభిముఖము
గా నడచుచు నతండు మొగంబుద్రాల్పఁ
బనసపం డబ్బినప్పాత పండుగయను
సూక్తి వినవొ? లజ్జించుట యుచితమయ్య! 121

శా॥ ఏపుణ్యంబుననో లభించినది మాహేలాంగి; భాగ్యంబు నీ
కై పేరెంబులు వెట్టుచున్న దిఁకనేలా సంశయం బొందు? పై
లాపచ్చీసుగ మాధవీసఖుఁడవై రాజోపభోగంబులన్
ప్రేఁపుల్ఁమాఁపులు పొందుమంచు నతనిన్ బ్రేరించు చిల్ సేరిచెన్122

కం॥ చేరిచి కొనిచని శయ్యా
గారంబున హంసతూలికా తల్పముపై
నారిగ మారిన మారుని
బీరంబన నున్న మాధవిని గాన్పించెన్ 123

సీ॥ కాన్పించి నవ్వుచుఁ గైతవకుసుమశ
రాసన! నేఁడు నీకగ్గమయ్యె
మాచెలి మాధవి, మధురాతిమధుర పూ
వును దావియుబలె నిర్వురు చరింపుఁ
డనిపల్కి కోవలనును ముందునకుఁ ద్రోసి
తలుపుబిగించి యవ్వలికిఁ జనియె;
నంతమాధవి తన యభ్యంతరగృహంబు
నతఁడు సొచ్చుట చూచి యాదరముగ

తే.గీ॥ నల్లనల్లఁ బ్రత్యుత్థాన మాచరించె'
నాతఁడును బుష్పమాలిక నతివగళ మ
లంకరించె; నదియుఁ గోవలన్విభుని స్వ
యంగ్రహాశ్లేషబంధసౌఖ్యమున ముంచె 124

కం॥ సందొలయని బిగికౌఁగిటి
యం దతనిని నిల్పుకొనియ యలనల్లనఁ బూ
వుందలిమమునకుఁ దారిచెఁ
గందర్పక్రీడఁ గౌతుకము నిగుడంగన్ 125

కం॥ పలుచని కంచెల తెగిపడె;
మొలనూల్ డిగజాఱె; నీవి పొరిఁబొరి బ్రిదిలెన్
బులకించె మేను; కన్నులఁ
బలుకులఁ నమునయముఁ దోఁచెఁ బవతికి నంతన్ 126

కం॥ పరిచుంబితాధరము, ని
ష్ఠురపీడిత ఘనకుచంబు క్రోణీబింబ
చ్ఛురితోత్పలపత్త్రంబౌ
సురతము వారికిరువురికి శోభిల్లెఁ గడున్ 127

ఉ॥ కామునిసామునందుఁ దమకంబులు మాటికిఁ దీఁగసాఁగఁగా
నేమి యొనర్చిరో? యెటు రహింగనిరో? యెటులై పెనంగిరో?
యేమెయి నుండిరో?యెఱుఁగ రిర్వురు వారలొకళ్ళొకళ్ళు పో
రామియు మోహముఁ బెరసి రాయిడిసేసిన మైకమెక్కుటన్. 128

కం॥ ఈ విధి బహుల రతిక్రీ
డా వివశాత్మకులు వారలసి నిద్రితులై
లేవంగ మఱచి రంబుజి
నీవిభుఁ డుదయించి నింగి నెలకొనియున్నన్. 129

తే॥ గీ॥ కొంతవడికి నమ్మాధవీ కోవలనులు
సారె తలుపు చఱచిన వసంతమాల
చేఁ బ్రబుద్ధులై సెజ్జఁ బాసిరి; యొనర్చి
రంత కాలకృత్యంబుల; క్లాంతులైరి. 130

కం॥ ఆనాఁడు మొదలుకొని యతఁ
డేనాఁడును నింటికరిగి యెఱుఁగఁడు; కూడున్
బానము స్నానము. భోగం
బా నవలామందిరంబునం దొనరించున్ 131

కం॥ తలఁపఁడు కొంపయు గోడియుఁ
దలఁపఁడు కణ్ణగిచరిత్రఁ; దలిదండ్రులనేఁ
దలఁపఁడు; తనయౌన్నత్యముఁ
దలఁపఁడు; మాధవినిఁదక్కఁ దలఁపఁ డొకండున్. 132

కం॥ ఇనుఁ డుదయించుట, గ్రుంకుట
లును నెఱుఁగక యెల్లప్రొద్దులును మాధవితో
డనె కడపుచుఁ దనబస దా
ని నివాసంబునకు. జెంత నెలకొల్పుకొనెన్ 133

—: మాధవీ కోవలనుల ప్రణయలీలలు :—

తే౹గీ॥ రసికుఁ డాతం డధరబింబరాజకీర
మై. పయోధర చాతకంబై, ముఖాబ్జ
భృంగమై, హస్తపల్లవ పికముఁ నగుచుఁ
దా వరారోహయైన మాధవికిఁ గూర్చు 134

సీ॥ కమ్మకస్తురిఁ జిత్రకము దిద్దుకొనువేళఁ
దాన ముంగెలన నద్దంబు నిలుపు
నటు మొగంబై కుచతటి దుకూలము మోఁపి
యంచులందీ 'హసాదని' బిగించు,
పారాణిఁ దీర్చుక బాగున్నదే యని
పదము పైకెత్తఁ జుంబన మొనర్చు
కురులు నున్నగదువ్వి క్రొమ్ముడివెట్టి పూ
లసరంబు లీయ నలంకరించు

తే౹గీ॥ సగము కొఱికిన పోఁకలు, సామిజగ్ధ
నాగవల్లీదళంబులు నగుచు నొసఁగ
నధరసుధసోఁకి రెండును నమృతమయ్యె
నాయదృష్ట మని విడెంబు సేయు నతఁడు 135

సీ॥ పాలయల్కఁ దీర్పంగ మ్రొక్కుచోఁ జరణపం
కేరుహనిహతిఁ గంకేళియగుచుఁ
జనుదోయి మోటించి సరభసబాహూప
గూహనము నొసంగఁ గ్రోవి యగుచుఁ
'బావురా పలుకులు పలికెద వినుమ'ని
స్మేరాస్యమూన నమేరు వగుచుఁ
గాన్కగా నొసఁగిన గండూషమద్యమా
స్వాద్యమని గ్రహించి వకుళమగుచు

తే. గీ॥ సాము దీర్చినాఁడవు పెఱసాము నేల
తీర్ప వనుచుఁ దిరిగి చూడఁ దిలకమగుచు
మాధవీవల్లరికి సుకుమారతరుఁడు
కోవలఁ వహించు నుపఘ్నభావ మెపుడు 136

ఉ॥ అంబులు దోయిలించి వదనాబ్జముపై వెదఁజల్లఁగాఁ గరా
గ్రంబుల నెత్తి కన్నులర గప్పుడుఁ బర్వులువెట్టు బాహుమూ
లంబుల దీప్తి వెల్గు చనులఁ దెఱగన్నులఁజూచు కాంతు రా
గంబునఁ బొంగుచుఁ జిలిపిగాఁ గను మాధవి వారికేళులఁ. 137

ఉ॥ అంబరముఁ గరాగ్రమున నంటి సడల్చిన వెల్గుదివ్వె క
డ్డంబుగఁ గొంగు నొడ్డుచు నటన్మణిహారము దివ్వెయై నవే
త్రంబులు మూసికొంచ,రకరంగి కపోలము గొట్టు కాంతఁ బ్రే
మంబునఁ గోవలఁ గలియు మాటికి నిక్కువలఁ స్పృశించుచుఁ 138

సీ॥ ఈవోడిపోయితివేని? నాకు నఖంప
చాలింగనం బిమ్ము హరిణనయన!
ఏ..నోడిపోయితినేని నీ పీరత్న
సరము పందెముగ, గొమ్ము రునితంబ!
యనిన దానికి నొప్పుకొనియె మాధవి; యంత
వారిర్వురును నొకపాన్పుమీఁద
నాసీనులై కరమర్ది సోళాదొప్పి
నాడఁదొడగిరి; యయ్యాటయందుఁ

తే. గీ: గోవలన యోటువడి యనుకొన్నరీతి
రత్నసరము మాధవి కంధరమున వైచి
యూరకయు చూచుచు న్నంత నువిద మెచ్చి
గోరువెచ్చని కౌఁగింట గ్రుచ్చె నతని. 139

ఉ॥ నిన్న ననున్ గుచద్వయిని నిల్పి ప్రియా! మణితంబు నీవు మున్
విన్నది చేయుదాన నని వేఁడకమున్న యొనర్చి తిప్పుడే
దన్ననుఁ బల్కవం చనునయంబుగ వేఁడిన నిప్పు కాదు పొ
మ్మన్నఁ బెనంగు మాధవి పదాబ్జములందు నతండు దీనుఁడై 140

ఉ॥ మించిన కేళితీపు పొడమించుటకై పురుషాయితంబు గా
వించుచు మోవి కానుకగఁ బెట్టుచు దఙ్దిలకించు వల్లభున్
గాంచి తదాస్య మాస్యమునఁ గప్పెడు మాధవిఁ జూచుఁ జాందినీ
మంచము మేలిపట్టియ కమర్చిన యద్దమునందుఁ గోవలఙ్. 141

సీ॥ చిట్టంటు సేయఁబోఁజేతికందక 'నన్ను
నంటకు మీనాఁడు తుంటరి' యని
ఎడముగా నిల్చిన 'నేల యల్గితివ'ని
చన్నంటఁబోయిన సారె గదిమి
ముద్దుగొన నొకింత ముంగెలనికి వ్రాల
వెనుకకుఁ జాఁగి తర్జని నదల్చి
కవుగింటి కాసించి కనుగొల్ప నుత్తమాం
గము నట్టు నిట్టు నడ్డముగ నార్చి

తే॥ గీ॥ చిర్నగవుతోడ నల్లంతఁ జేర నిలిచి
'సామి! యింక మూన్నాళ్లు నీసరస కేను
రాఁదగ దని పలుకుచు దూరమున కేగు
మాధవినిఁ గాంచి తుకతుక మఱుఁగు నతఁడు. 142

చం॥ పలుచనిపైఁటఁ బంటికొనఁ బట్టుక తైక బుజాలమీఁదుగా
తలఁగునెడఙ్ గుచాంశుకముఁ దాఁగొని తెచ్చియు నీకయున్నఁగ
న్నులు నెఱుపూను మాధవి ననుఙ్ గరుణింపుము సాపరాధునిఙ్
గలికి మిటారి!" యంచుఁ బడిగాపుగ నాతఁడు నిల్చుఁ జెంగటఙ్ 143

ఉ॥ 'ఈ వొకనాఁడు గాటముగ నిచ్చట నొక్కతి నిర్దయుండవై
భావజుకేళిలోన' నని పల్కిన మోముఁ బయోధరంబులఙ్
మోవి నెగాదిగం గనుచుఁ బొంగుచు నుండఁగఁ'ధూర్త! చాలుఁ బొ
మ్మావల కం'చుఁ బల్కు ప్రియురాలికి నాతఁడు కేలుమోడుచున్144

చం॥ అలుక వహించి యూరువు భుజాగ్రముఁ బట్టెకు జుట్టుచుట్టి యు
వ్వలిమొగమై కడంకచెడి పైఁబయి నూర్చుచునుండి తుమ్మినన్
శేలువునకున్ శతాయువని చెక్కిలి చెంగటఁ బల్కి మోము క
న్నులు నురముఙ్ స్పృశించెడు మనోహరికిన్ గడుఁగూర్చుఁ గోవలన్145

చం॥ అలఘు ఝుళంఝుళ త్కటకమై, నవపల్లవచారుతా సము
జ్జ్వలమయి యావక ద్రవవిభాసురమై మదలాలసంబు నౌ
కలికి పదాంబుజంబుహతిగన్న యశోకముఁ జూచి కోవలన్
జలము వహించుఁ గేళివని చాయ విహారము సల్పువేళలన్ 146

మ॥ కరపద్మంబునఁ బాదముం బొదివి లాక్షాదీర్చుఁ బారాణిఁ; గ
స్తురిఁ బత్రంబుల వ్రాయు గండముల వక్షోజంబులన్. మల్లెపూ
సరముల్ నల్లనికొప్పునిండ జొనుపున్ సాంద్రంబుగా, సర్వదా
పరిచర్యారతుఁ డెంత మేలువడెనో వాఁ డావరారోహకున్ 147

మ॥ సమపీనస్తన యుగ్మకం బదుర శింజాకంకణశ్రోత్రపే
యములౌ తాళములన్ శిఖావళము నృత్యం బార్చుచో నీవు నా
ఘుము నాఁగాఁ బ్రియ! ఆడ నార్తునని సాటోపంబుగాఁ బల్కి బె
త్తము నూనన్ సభయుండుఁబోలె లతికాంతర్గూఢుఁ డాతండవున్ 148

సీ॥ సురభిమాసంబున సుమకందుకంబులై
కమ్మని తావులు గ్రుమ్మరించు
వెచ్చని దినములఁ బచ్చకర్పూరంపుఁ
జెండ్లయి చలువలు చిలుకరించు
జడిని నిర్ధూమాగ్నిసహితహసంతులై
గోరువెచ్చఁదనంబు పాఱఁజిమ్ము
నంబుదాత్యయమున నరవిరి క్రొందమ్మి
మొగ్గలై సరసత్వ మగ్గలించు

తే॥ గీ॥ హైమశైశిరవేళల ధూమరహిత
ముర్మురంబులై క్రొవ్వేడి ప్రోవుకొలుపుఁ
గోవలునకు రతికళాకోవిదునకు
మాధవి సువృత్తపీనపయోధరములు. 149

మ॥ ఒక సంవత్సర మాతఁ డిప్పగిది నాయొయ్యారితోఁగూడి న
ర్మకళాగోష్ఠులఁ దేలుచున్ గృహము భార్యన్ దల్లినిన్ దండ్రి వ
ర్తకులన్ బంధులఁ దన్నునున్ మఱచెఁ గాంతాలోలుఁ డుండైన వా
నికి నెవ్వారును గానరా రనుచు మున్ విజ్ఞుల్ ప్రబోధింపరో? 150

కం॥ ఈ కాలముననె మాధవి
రేకెత్తిన భోగములఁ జరించుచుఁ దాల్చెన్
ప్రేఁకటి; నపూర్వసురతక
ళాకోవిదుఁడైన కోవలన్విభువలనన్ 151

... మరకతము—విశాలాక్షి ...

తే॥ గీ॥ మాధవికిఁ గైవసంబయి మందిరంబు
పాడువఱచిన భర్తకై వగచి వగచి
తనదు నాత్మకుఁదక్క నితరుల కెఱుఁగఁ
గా నలవిగాని యట్లున్న కణ్ణగిఁ గని. 152

తే॥గీ॥ మరకతము విశాలాక్షి నామముల నొప్పు
తద్భుజిష్య లిరువురు సత్రాస లగుచు
నల్ల నిట్లని పలికి రత్యంతఖిన్న
లై దృగంచలముల వేఁడియశ్రు లురల 153

సీ॥ ఇంద్రోత్సవంబున కేగిన గృహకర్త
యింటికిఁ దిరిగిరాఁ డింతదనుక
ప్రాసాద మెల్లను బాడువడినయట్లు
తోఁచును మాకు నాథుండు లేమి
నీవొంటి నొక్కయేఁ డెల్లెట్లొ యేగించి
తింతయు మేము సహించుచుంటి
మీవు సైఁచినను మేమింక సైఁవఁగఁజాల
మనుమతి నిచ్చితే నయ్యకడకు

తే॥గీ॥ నేగి యయ్యనిప్పుడ తెత్తు మీవ చూతు
వనఁ బ్రియంవదయును నొప్పికొనియె; నొండు
పలుక నేరక కణ్ణగి వల్లభుండు
కనలునేమో యనుచుఁ బెద్ద కలఁగె; నంత 154

కం॥ మరకతము పోయి పిల్చెను
స్మరాంధు డాతండు రాఁడు సదనంబునకున్

మఱియు విశాలాక్షియు స
త్వరముగ నరుదేర వేఁడెఁ బరిపరిగతులన్ 155

కం॥ వారిరువురి పిలుపునకున్
స్మేరాస్యుండగునుగాని మెత్తఁబడఁడు వాఁ
డౌరా! మాధవి మాయయొ?
పోరామి బలంబొ? నియతి పోకిరితనమో? 156

కం॥ మరకతము విశాలాక్షియు
నరుదెంచి వచించి రాప్రియంవదకున్ దు
ర్భర విరహాగ్నిజ్వాలా
పరిఖిన్నకుఁ గబ్బిగికి వివరముగ నెల్లన్. 157

తే॥ గీ॥ విభుని వర్తనమున కెవ విస్మయపడి
సాధ్వి కబ్బిగి చిత్రంబుచందమయ్యె;
నక్షు లెఱ్ఱకల్వలుగాఁ బ్రియంవద యొక
పలుకు వలుకక మాధవి భవన మరిగి 158

... ప్రియంవద రాయబారము. ....

తే॥ గీ॥ చెంత మాధవియును గ్రిందఁ జిత్రపతియుఁ
జరణముల సమీపమున వసంతమాల
బలసి తనుఁ గొల్వఁ బూవుల పాన్పుమీఁద
లీలఁ గొలువున్న ప్రభుఁ గాంచి కేలుమోడ్చి 159

ఉ॥ నేనొక చిన్నవిన్నపము నీకొనరింపఁగ వచ్చితిన్, వినం
గానగు. నున్నవెల్లరికిఁ గన్నులు; నీకును నున్న, వైననున్
గానవు, కానిపించుటకుఁగాఁ జనుదెంచితి సాహసించి, కాం
తానయనావలేహ్య! మఱి తప్పయినన్ క్షమియింపుమీ ననున్. 160

సీ॥ ఉన్నతగోత్రాన నుద్భవించిన వణి
క్కుంజరుండవు నీవు గుణసముద్ర!
కాంతుని యాయల్లకం బెన్నఁ డెఱుఁగని
కాంతల మిన్న నిన్గన్నతల్లి
మంచితనమునకు మాఱురూపంబన
నెగడు మసత్తువాఁ నీకుఁ దండ్రి;

కరికాళచోళభూవరుఁడు రాజని పిల్వ
నిక్కు మనైక్కను నీకు మామ;

తే.గీ॥ శౌచమున శీలమున సుప్రశస్తి గొన్న
తరుణి సాధ్వి కన్యగి నీకు ధర్మపత్ని
ఇట్టి నీవు వంశాచార మేటఁ గలిపి
యీకుమార్గంబుఁ గైకొంటి వేల? సామి? 161

ఉ॥ అట్టి మహోన్నతాన్వయమునందు జనించిన ధీరు నిన్నుఁ దాఁ
గట్టిన కోకకొంగునకుఁ గట్టుక యీవెలయాలి కూతు రి
ట్టట్టు యథేచ్ఛ మార్చునని యందఱు వాకొనుచుంట నాతలన్
గొట్టినయట్టు లున్నదిఁకఁ గోవిద కణ్ణగి కెట్టు లున్నదో? 162

కం॥ ఓరెము గుడువదు; ముట్టదు
నీరము; కైసేఁతయింత నెఱపదు; తెండుఱ
థారుణి నినుదక్కఁ దలఁప
నేరదు హరినేఁ దపస్వినీమణి యెపుడున్. 163

కం॥ నిను దూఱదు, నను దూఱదు
వినీతు నిన్గొనిన మాధవిని దూఱదు;దై
వనియోగంబును దూఱదు;
తనదుర్గతి దూఱ దెట్టిధైర్యము కలదో? 164

కం॥ ఏవలపుమందు వెట్టెనొ
యీవారవధూటి నీకు? నిల్లాలిమొగం
బే వీక్షింపవు; సుధ విడి
యేవిధి హాలాహలమున కిష్టముపడితో? 165

సీ॥ కానకకన్న సంతానము, మృదువని
మురిపెంబుతోఁ దల్లి ప్రోదిసేయ,
ననలువరంబున నవతరించిన లక్ష్మి
యని జనకుండు లాలన మొనర్పఁ,
గులపాలిక యటంచుఁ గులమువారెల్ల రా
గంబునఁ గన్నులఁ గప్పికొనఁగ
నుభయవంశంబుల కభయ మీ సుచరిత్ర
యని పురంబునవారు వినుతిసేయ

తే॥ గీ॥ పెరిగినది శ్రీవిశాల! నీకరము గొన్న
దెంతయు రహించు మాఁకాకు నెక్కులతిక
పోల్కినని యెంచితిమి చెల్మిబోంట్ల మేము
నాథ! యదియెల్ల గంధర్వనగరి యయ్యెఁ 166

సీ॥ కైసేసికొనుచున్న కణ్ణగి నొకరాత్రి
గని వల్లభుండు వచ్చునుగదమ్మ
యంచు వేళాకోళ మాడితి, దానికి
నలఁతినవ్వొలయు నయ్యనుపమాంగి
"ఈనాఁడు పున్నమి యేతేరకున్నె నా
స్వామి"? యంచుఁ జనియెఁ బడుకటింటి
కేలకో యారాత్రి యీవు రావైతివి
రాఁడు వల్లభుఁడని రాజవదన

తే॥ గీ॥ తనదు కైసేఁత యంతయుఁ దలఁగి చీర
కొంగు వట్టినేల, బఱచుకొని శయించె
నట్టి దృశ్యంబుఁగన్నులఁ గట్టి నట్లు
నీకుఁ జెప్పితిఁ గరఁగవే నీవు శిలవు 167

ఉ॥ ఒక్కటి విన్నవింతు బురుషోత్తమ! కణ్ణగి సాగనంపు నాఁ
డొక్కట వచ్చి మాత్రపిత లొయ్యన ‹గణ్ణగియందు మాకు గో
మెక్కుడు, లేకలేక జనియించిన దేమియు నేరదెట్టు లీ
చక్కనిచుక్క నేలుదువొ జాణఁడ! యన్నది లోఁదలంపవో? 168

కం॥ ఎండకుఁ ఇన్నిన పందిరి
యుండునె వానకు? నరునిఁ బ్రియుఁడని కదియు శ్రీ
యుండ. గణిక విడు లేమిని,
నుండును రెండింటఁ భార్య యొక్కవిధముగన్. 169

కం॥ కులకాంతయింటి కరుగుము
పలుకకు మింకొండు నాదు ప్రార్థనమును ని
ష్ఫల మొనరింపకు మనుచును
వెలయాలికి నభిముఖియయి వెండియు ననియెన్. 170

కం॥ కులకాంతల సేవించిన
కలికిని, గణ్ణిగికిఁ జెల్మికత్తెయ; నీ క
న్నులు తెఱపించుటకును గో
వలనను గొనిపోవుటకును వచ్చితి నిటకుఙ్ 171

కం॥ నీచెలువను గాలంబున
కీ చేతోజాత సుభగుఁడెఱయయ్యెఁ, నహా
కాచమణిని మణియని యా
లోచించె వణిక్కులపతి లోలదృగంతా! 172

తే॥ గీ॥ పరధనంబులఁగోరుట పాడిగాదు
పరవధూటులఁగూడుట పాడిగాదు
పరదయితులను గవయుట పాడిగాదు
దీని నీవును నెఱుగుదు తీవబోఁడి॥ 173

తే॥గీ॥ జాతవేదుని వరమున సంభవించి
పెద్ద ముత్తైదువులచేత వినుతిగొన్న
హంసనాదిని కణ్ణగి యట్టిదాని
కీ విధిని జెట్ట సేసితి వీవు చెడిపె 174

ఉ ప్రొద్దెటుపుట్టి క్రుంకునొ యెఱుంగని ముగ్ధ యెవర్తె, తండ్రి నా
యొద్దనె గద్దెపొంకము లనూనముగాఁ గఱపించినాఁడొ యే
ముద్దియ కట్టి కణ్ణగి విభుఙ్ జెఱపెట్టితి వింట నీవు నా
సుద్దిని నాలకించి స్మరసుందరుఁ గోవలనుఙ్ ద్యజింపుమా! 175

చం॥ కులసతియైన కణ్ణగిని గోడను సంభ్రమునందుఁ ద్రోఁచి యీ
వెలజవరాలు వేడుకలు వేలమువెట్టిగఁ జూపి చూపి కో
వలనను ఖైదుసేసె నని పైవడి పోదువుగాక! యేమి నీ
తలపయి నంటఁగట్టుకొని ధాత్రినిఁ గుల్కెద వోసి మాధవీ! 176

ఉ॥ నావచనంబు కోవలను నచ్చఁడు, నీవును నచ్చవంచు నే
భావమునం దెఱింగియును బల్కెదు, జవ్వన మమ్ముకొందు వీ
వేవెలకైన నెవ్వనికినేని, మనోహరమూర్తి ధీరుఁ డీ
కోవల నెట్లునమ్ముఁ దనుఁగూర్తువు నీవని? నీవు పత్నివే? 177

సీ ఏనాఁటికేనియు నీవు నీతని వీడి
మఱియొండు మిండని మరగకుండె?
లంజెఱికంబున లగ్గసు లున్నవే?
కామ్యుఁ డెకఁ డెకఁ డకామ్యుఁ డగునె?
వెలయాలికి మగండు వృశ్చికమునకు మం
దుర్వి నాస్తి యనెడు నుక్తి పాల్లె?
సిరిగల విటకాఁడు శ్రీపతి వేశ్యకు
నర్థంబులేనివాఁ డాదిభిక్షు

తే గీ వుల్లముచ్చిపో నంటి నంచులుకుగొనకు
మిందులో సత్యమున్న గ్రహింపవలయు
నీవుఁ గోవలన్ వినుట యెంతేని హితవు
దూషణము కాదు కాదిది భూషణంబు 178

తే॥గీ మాధవి! విషంబు నమృతంబుమాడ్కి మ్రింగి
జీర్ణ మొనరించు కొన్న యోషిద్వ్రతంస
మునకు యాకట్టుగికి వల్లభుని నొసంగి
నీకొనర్చితిఁ గీడు మన్నింపు మనుము 179

తే గీ దానిమాటలు విని ఇది యూనినపులి
పెంటి యని చిత్రపతియు నోర్విప్ప దాయెఁ;
గాని చెవెట్టి కలఁచిన కరణిగాఁగఁ
దాల్మి గోల్పడి మాధవి దానికనియె 180

—: మాధవి ప్రత్యుక్తి :—

కం॥ నీకై నీవేతెంచితొ?
యా కాంతారత్న మనుప నరుదెంచితివో?
యీ కాఱు లిట్లు ప్రేలితి
వీకడ గైలాటకత్తె! యేగుండియతోన్ 181

సీ॥ వక్రాలాకులు వెట్టి ప్రాథేయ పడితిమా
కోవలః రమ్ము మాకొంప కనుచు

వసవల్చు పసివాఁడొ? పాలపాపండొ? యా
తండు నావలలోన దగులుకొనఁగ
వలపుమందులు వెట్టి వలపించుకొంటి నం
టివి, నిష్ఠురుషమె యీభువన మెల్ల
నేమోహనాంగుఁడే నీమాధవినిఁ గన్న
వెఱ్ఱివాఁడవుననని వినవొ నీవు?

తే॥ గీ॥ నితని యిల్లాలు సాధ్వియే నిటకు వచ్చి
యితనిఁ గొనిపోఁక యొప్పుగా కేల యొరుల
చేత మమ్ముఁ దిట్టించుట? చేతగాని
తనమొ? కలదాన నను మదాంధ్యంబొ గాక. 182

తే॥ గీ॥ తాఁబతివ్రతఁ తనపతి ధర్మరాజు
తనదు కులగోత్రములు విశ్రుతమ్ము; లేమొ
తక్కువకొలంబు వార;మంతయు నెఱుంగు
లోక మీ వెఱుంగవుకాక పోఁకలాఁడి. 183

కం॥ నను నెవ్వతిగాఁ జూచితి
వని కణ్ణగి చెల్మికత్తియఁ గిన్కఁ గనుం
గొని మిథ్యావైస్వర్యం
బునఁ గోవలుననకుఁ బలికెఁ బొక్కుచు నిట్టుల్. 184

ఉ॥ తిట్టినతిట్టు తిట్టకిది తిట్టిన దంతయు వింటి వీవు నీ
వెట్టును గణ్ణగిప్రియుఁడ వే నిది పల్కిన యట్లు లంజియన్
బొట్టకు దేహ మమ్ముకొను పాల్తిని; దొంగకుఁ దేలు కుట్టిన
ట్లెట్టన కుంటి వీవు; విటుఁ డిట్లయినన్ బ్రదు కెట్లు సానికిన్. 185

సీ॥ నీమీఁది మోహంబుచే మాధవి సహించి
నది యీచెడిపె భాషణములనెల్లఁ
గాకున్న దీనినిఁ గడికండలుగఁ జెండి
వేయింపదో గృధ్రవాయసముల?
కేమనుకొన్నదో యీతొత్తు? కణ్ణగి
యెంగిలి పింద మొక్కింత మెక్క
చియ్యఁబట్టిన మాత్రఁ జెలఁగేఁగవచ్చునో
మీఁ దెఱుంగక; మేనిమీఁ దదెబ్బ

తే॥ మాయము, మడిచి గాఁచిన తెట్టు మాయునెట్లు?
పల్పుఁ దుడిచినఁ బడునే పాముకాటు?
పని నెఱింపు మెంటనే నీవేని నేగు
మనుచుఁ దనమోసముంచికమునకుఁ జనియె 186

చ॥ తన ప్రియురాలు మాధవియెడన్ గొఱవిఁ జెఱఁజూడినట్లుగాఁ
దనకనుచు, నావ వ్రాసిన విషంబున వెక్కుచుఁ గోవలన్ గనుం
గొన లెఱపెక్కఁగాఁ గనలు కొండొకకొండొక మ్రింగు కొంచుఁ జు
ల్కన దెడగాని చందమునఁ గణ్ణగి కూరిమి చోటి కిట్లనున్ 187

కం॥ చనుఁ జనదన కావేశం
బున నోరికి వచ్చినట్లు మొఱయుట హితవే?
ననుఁ దిట్టినఁ దిట్టెదుగా
కన నేటికి నిరపరాధయౌ మాధవినిఁ 188

కం॥ ఏ నే ద్రోహము సేసితి
మానవతికిఁ గణ్ణగికి! నమాయావిని నే
నా నాఁటికి నీనాఁటికి
నెనొకరికిఁ గీడుసేఁత నెన్నఁడుఁ దలఁపన్ 189

తే॥ గీ॥ కణ్ణగియు మాధవియు రెండు కనులు నాకుఁ
జెట్టి దేనికైనను నాదు చిత్తమవియు
నొకటి చూచుచుండినను నొండొకటి గ్రుడ్డి
యైన స్వామి వికృతిమంతు డవునొ? కాడొ? 190

సీ॥ తార బృహస్పతిదార శచీదేవి
కేనియు నారాధ్య యే గుణవతి?
చండిక మునిపత్ని సద్వంశసంజాత
యేలినపతి కనుకూలవతియె?
గౌతమమునికులకాంత యహల్య తా
నెంతటి సాధ్వియో? యేరెఱుఁగరు
కశ్యపమునికన్య కాదేవి నేనోట
వాకొనఁగల మేకపత్నియంచు

తే॥ గీ॥ వంశముంబట్టి యుద్ది యపాంసుల యిది
పాంసుల యని తేల్పంగ నెవ్వరితరంబు
భోగముకులాన మాధవి పుట్టె నంత
మాత్ర నసతియనఁ దగునె మనకుఁ జెపుమ॥ 191

కం॥ మాకులమునఁ గణ్ణిగి వే
శ్యాకులమునఁ మాధవియును సద్రత్నంబుల్
నాకీ రెండు లభించిన
వేకాలపుఁ బుణ్యమొకొ? యెఱుఁగ వచింపన్ 192

తే॥ గీ॥ నృత్యసంగీతములతోడఁ బ్రత్యహంబు
నన్నుఁ గరగించుచున్న దీయన్నుమిన్న
వాని కొక్కింత వలచిన వాఁడ నవుట
నిచట నుండఁగా నయ్యె నా కిన్నినాళ్ళు 193

కం॥ ఈకరణి వేఁడనేలా?
నాకై నేనే గృహంబునకు నేతెంతున్
నీకును నీ స్వామిని కెం
తో కన్పండువు ఘటిల్లఁ దోడ్తోఁ జనుమీ! 194

కం॥ అని పల్కి దాని నంపి త
దనంతరమ కోవలన్ రుజాతురుఁడై చ
య్యన మేడ నెక్కి జంగమ
మనోభవానల మనంగ మాధవిఁ గాంచన్ 195

తే॥ గీ॥ ఇంత యొప్పఁబల్కినె మాధవీశుఁ డితఁడు
మాధవీశుఁడె మూర్తిధర్మంబుగాక
యనుచు నెవ్వరి నేని మెచ్చని దురాత్మ
రాలు చిత్రపతియుమ లో నతని మెచ్చె 196

తే॥ గీ॥ కోపమెట్టిదొ యెఱుఁగఁడు కూళతన మొ
కింతయును బూనఁ డేరికి వంతఁ గూర్పఁ
డితఁడు రూపుగొన్న సువృత్తమేమొ యనుచు
మాధవీవయస్యయు మెచ్చె మాటి కతని 197

సీ॥ వటువాత లేచి యేపాపిష్ఠురాలినొ
గమ్ము నేకన్నులఁ గాంచినానొ?
యూ పాడుచెడిపవే నంతగాఁ బడితి ము
న్నెవ్వరు పడనట్టు లేనటంచు
మోహమలు పాన్పున ప్రోరగిలఁ బరుండి
యానిముత్యములంత యశ్రు లురలఁ
గ్రొమ్ముడి నెవరి విరు లొకటొక్కటి చింద
బుసలంత కంతకుఁ బొడవుగాఁగ

తే॥గీ॥ కాంతివడిగిన ప్రియురాలిఁ గాంచి కలఁగి
మాధవీ యనుటకు జంకి మాటలాడ
స్వరము సరిదిద్దుకొనుచుఁ గోవల నొకింత
తెలుపఁ దనయున్కిఁ దటుకునఁ దిరిగిచూచి 198

కం॥ అవినీతుఁడు కాఁడని మా
ధవి పాన్పునకుఁ గనుసన్నఁ దారిచి నగుచుజ్
జవికకు నిముడని వలిచ
న్గవఁ బండించుకొని కాముకస్వామి కనెజ్ 199

కం॥ నీకేను నేత్రకౌముది
నే? కణ్ణిగియో? వచింపు మోడక యన నీ
వేకద యన నిజమే? యనఁ
గాకేమన నధర మిచ్చి కలకల నగుచున్ 200

కం॥ నీకవుగింటికి మరఁగిన
నాకొండేటి కమృతంబునకు మరఁగిన వా
రేకరణి మధురసంబు న
నాకులమతి నానుదు? రసమాంబకరుచిరా! 201

సీ॥ అనిపల్కి మాధవి కినుమడించిన నెమ్మి
నీడెందమున నున్న నెగులు తీరె
నని నేను నమ్మవచ్చునె? నీచరణదాసు
ననవరాద్దు నన్నుఁ బొమ్మనకు మింక

నని కోవలను వేఁడ నల్కతో నట్లంటిఁ
గాక! నీనెమ్మోముఁ గాంచకున్న
నేనెట్లు జీవించుదాన, నీబాహుపం
జరశుకి మాధవి సానిగాదు

తే॥గీ॥ నీకుఁ గూర్చిన ప్రియురాలు నిర్మలాత్మ
కిడుపాటొండు లేక చెక్కించు నన్ను
ననుచు మాధవి యనుచుండ నడుగుల ధ్వని
యైన నెండెకళ్ళకు నెదయైరి వారు 202

చం॥ మఱుకణమందుఁ జిత్రపతి మాధవివాసగృహంబు సేరియొం
డొరు లెదయున్కిఁ జూచి చొరనొప్పను నాకని లోనికేగి భా
స్కరుఁడపరాశ కేగె, నిఁకఁ గాల్యములన్ బొనరింప రమ్ము సుం
దరికయి దండయా, డిగుము దారగుణాకర! నీవు హర్మ్యముఁ. 203

తే॥ గీ॥ దానిపల్కునఁ గాలకృత్యములు దీర్చి
యమృతరుచిరాన్న పానాదు లాచరించి
యిష్టగోష్ఠినిఁ దేలి యాయిర్వు రేగి
రాహితశయనమౌ భోగగేహమునకు. 204



శ్రీరస్తు

# మంజీర విలాసము

## తృతీయ ప్రకరణము.

### —: చిత్రవతి నిర్వేదము :—

కం॥ మునుకొని గణిక కడకుఁ దన
చనుటయుఁ; దనదాని కన్నచందము, విభుఁడా
డిన తీరును; మాధవి ప
ల్కినతెఱఁగుఁ బ్రియంవదయుఁ దెలిపెఁ గణ్ణగికిన్. 1

కం॥ ఒంటిగఁ గణ్ణగి, వెలవా
ల్గంటిఁ గవగూడి కోవలన్ వేర్వేఱై
యుంటకు విస్మయపడు పుర
మింటింటఁ వారివృత్తమే విననయ్యెన్ 2

కం॥ తనకూతురు గర్భము దా
ల్చినసంగతి తాన కనుట చిత్రవతికిఁ బుం
డునఁ గారము చల్లుటయై
తనువును మనమును సమముగఁ దఱతఱలార్చెన్ 3

సీ॥ అంగసౌష్ఠవము పాడఱుఁ; జెడు లావణ్య
మడుగంటు జిగిబిగి; ముడుఁగు హొయలు;
నడక యొయ్యార మణఁగు; సౌందర్యంబు
క్షయమగు; దృగ్విలాసంబు తఱుఁగు;
నంగనలకు గర్భమైన; మాధవియు గ
ర్భము దాల్చియుంట దుర్భరము నాకు;
దాని మూలమున మాధవి తనూసౌందర్య
లావణ్యములు తీఱు; లాస్యవిద్య

తే॥ గీ॥ కంతరాయంబు కలుగు; మాయన్వయము య
శంబు హృతమగు; ననుచు వసంతమాల
కన్లఁ జిత్రపతి వచించునపుడు దాని
యింటికి యదృచ్ఛఁ గౌశికుం డేగుదెంచె. 4

తే॥ గీ॥ అతఁడు కులవిప్రుఁడును జిత్రపతికిఁ బొంటి
వంటకాఁడునై యుండు నుల్లాసముగ వ
సంతమాల కౌశికునితోఁ బదురులాడ
మనసు పడినపై వచ్చె నిమ్మాడ్కి నగుచు, 5

సీ॥ "దారితప్పితొ? యొండెఁ దడఁబాటు పడితొ? మా
యాలయంబున నేఁటి కడుగువెట్ట;
భోజనంబయ్యెఁ గాబోలు దాంబూలంబు
సేయుచున్నాఁడవు; చిత్రపతియుఁ
బ్రాఁతవడెనొ యేమొ? యాతపస్విని నీకు
తెలనాకు మఱుపు లందీయ కెప్పు
డైనఁ దమ్ములము నీ వాచరించితె? ప్రాఁత
రోఁత యనుట లోకరూఢి" యన్నఁ

తే॥ గీ॥ గప్పూరపువీడియం బిచ్చు కాంత యున్నఁ
దమ్ములము సేయ వీఁడు సిద్ధంబ' యనుచుఁ
జిత్రపతిమోముఁ గన నద్ది 'చింత చచ్చి
నను బులుసు చావఁబోదని నగుచు మఱియు. 6

ఉ॥ మాకులరత్నదీపమన మాధవి నాకు జనించె; లాస్యవి
ద్యాకులగేహమన్ యశము నందెఁ బ్రభుండును సత్కరించె, సు
శ్రీకుఁడు కోవల న్విభుఁడు చేకొని కన్నెఱికంబు పెట్టినాఁ
డే కొఱగామియో యెఱుఁగ; నింతికి వ్రేఁకటి యయ్యెఁ గౌశికా! 7

కం॥ వెలయాలికి వ్రేఁకటి గొ
డ్డలిపెట్టౌటన్ గరం బడలెదన్; ప్రణయం
బులు వేఁడుకకాండ్రకు మదిఁ
బలుచన కాకుండునట్టి పాడియుఁ గలదే? 8

కం॥ ఈపాడు గర్భమేలా
ప్రాపించెనొ దైవదుర్విపాకంబున మా
పాపకుఁ దన్నాట్యకళా
వ్యాపారమున కిది యడ్డమౌ నన నతఁడున్ 9

సీ॥ జరిగిన దేదియో జరిగిపోయిన దింక
జరుగగాఁ గలదాని జరుగ నిమ్ము;
మాధవి సంసారమార్గానఁ బడ్డది
యంచులుక్కు గొనకు మయ్యనుపమాంగి
గర్భంబు కాపాడఁగా శ్రద్ధఁ జూపుము;
మద్యమాంసాదులు మాధవి గొనఁ
జన! దాఱవనెల వచ్చినదాది పడుకింట
నీయొద్దఁ గూతుఁ బండించుకొనుము

తే॥గీ॥ కోవలన్ వచ్చి మాటాడిపోవు నట్లు
చూడుము; తగదు సంగంబు చూలు గలుగఁ
గాంతలకు; వైద్యులము మేము; కాన నింత
చెప్పనయ్యె; నామాట వర్జింతు వేమొ? 10

కం॥ మనసునకు వ్యాకులత్వము
జనియింపక యుండునట్లు సాకుము కూతుణ్;
దనుపుగ నాహారం బిడు;
మనయము మాధవికి నిష్టమైనటు చనుమీ! 11

చం॥ అనుడు వసంతమాల హసదాననయై విటరాయ! తొల్లి నీ
యనువున నీవు చిత్రపతియందుఁ జరించితె? తెల్పవే! యనం
గను దెగనవ్వి చిత్రపతి కౌశిక! యొజ్జల పుచ్చకాయ వీ
వన నతఁ డేదియో మఱచినట్లు స్మరించుచు దాని కిట్లనున్ 12

ఆ॥వె॥ తాటిచెట్టునీడ, తగులు కొనినవాఁడు
నొక్కరూప యన్నయుక్తి వినవొ?
కానఁబలుకు వాఁడ ఖండితవాదినై
వినుము నానుడిని వివేకిని వయి 13

కం॥ లంజెయు ముంజెయుఁ బ్రాయము
నం జవిడవౌఁ; గొంత ముదిసినన్ ముట్టగఁనే
నిం జూడంగానేనిన్
రంజకములు గావు లలన! రసికుల కెందున్ 14

ఆ॥ వె॥ కోవల న్విభుండు గుణవంతుఁ డైనను
విటుఁడు కానఁ బెద్ద విశ్వసింప
నగునె? లంజియలకు నంటుకాంద్రకు మనం
బొక్క చోటఁ దగిలి యుండ దంద్రు 15

కం॥ లావణ్యమొ సౌందర్యమొ
కోవలనును వంటయింటి కుందేటినిగాఁ
గావించెను మాధవి భో
గావాసంబున; యథార్థమౌనా? కాదా? 16

కం॥ ప్రసవానంతర మీరెం
డు సన్నమై పోవునెడ విటుం డీతండీ
యసదృశరాగము సూపునొ?
పసచెడిన దటంచుఁ దలఁగి పాఱునొ? చెపుమా 17

కం॥ యౌవనవతియౌ సుందరి
పూవు, విటుఁడు మధుకరంబు; పూవది వాడన్
బోవు మధుప మొందొకటికి;
యౌవన మఱ నట్ల విటుఁడు నన్యకుఁ బఱచున్ 18

సీ॥ కాన మాధవికిఁ గల్గంబోవు శిశువు జీ
వనయాత్ర సుఖముగా వఱలు కొఱకు
వలసిన మడి మాన్యములు తోఁటలును దొడ్లు
రజత కాంచనరత్నరాసు లిపుడ
కోవలన్విభునుండి గుంజుకొనుము, దీనిఁ
జెప్పుట కిటకు వచ్చితిని నా.గ
నింతకు మున్న నేఁగొంత గుంజినదాన;
నీపల్కు దాఁక నేనిలుతు నెట్లు?

తే॥ గీ॥ తాను గూర్చిన లంజియ పైని మోజు
చెల్లినంతనె క్రొత్త లంజియకు నట్టు
సాcచుc గాముకుం డనుమాట సత్యమని యె
ఱుంగనే? నాకు నీవు నేర్పంగవలెనె? 19

కం॥ తాతకు దగ్గులు నేర్పెదు
భాతిసుమీ యనుచుc జిత్రపతి యను నాలో
నేతెంచి యటకు మాధవి
మాతకు నిట్లనియె నగుచు మహిసురు నెదురన్ 20

సీ॥ ఏమేమి మీరిర్వు రిందాక మాటాడి
నారొ? వినవలతు నాcగ నతcడు
మాధవి! నీవు మా మాటలు వినుచుంటి
వని మేము గమనింప మైతి మైనc
బడుచవు నీవు; మాభాషితంబులతోcడ
బనియేమి నీకు; నాపనికి నేను
నరుగుచున్నానని యవనీసురుcడు వారి
వీడ్కొని చనియె వేవేగ నెటకొ?

తే॥ గీ॥ యతcడు చనుడుc జిత్రపతి నతని యన్న
పల్కులు సుతకుc జెప్పి గర్భంబు కాచి
కొమ్ము; కనుగల్గి యుండుము; కోవలనునిc
గవయుకు మని వేcడుకొని మాధవినిc బంపె 21

—: *మాధవి గర్భమునకుc గోవలను సంతసపడుట* :—

కం॥ తనప్రాణప్రియ గర్భం
బును ముక్తాఫలము శుక్తిపోల్కిన్ దాల్పన్
గని కోవలన్మహాశయుc
డనుదిన మానందమను పయోబ్ధిం దోcగున్ 22

కం॥ దైవము చల్లగc జూచిన
నావనితకుc దనయుcడో తనయయో కల్గున్
మా వంశరత్నదీపం
బై వర్ధిలు నాయపత్య మని భావించున్ 23

సీ॥ ఒకనాఁడు మాధవి యుయ్యేల మంచమ్ము
పైనుండ దరిజేరి వన్నెలాఁడి!
ఏపాప నీకిష్టమో పల్కు మన నీకు
నిష్టమౌ పాప నాకిష్ట మంచు
వనిత పల్కినఁ గుమా యన నతండు నదియు
రీ" యని పల్కి పూరించె; నంత
మాధవి తనప్రియు మాటలతీపిచేఁ
గరఁగించి యధరంబు కానుక్కవెట్టి

తే॥ గీ॥ తనదు తల్లితోఁ గౌశికుం డనినమాట
లెల్లను ద్విచ తప్పక చెప్పి యిట్లు నీవు
నడువు మనఁగఁజాలక నీళ్ళునమలు దాని
కట్లయవుఁ గాకయని నవ్వె నాతఁడంత 24

సీ॥ మాధవి కాఱవ మాసంబు ప్రాప్తింపఁ
గోవలనుకు ముదం బావహిల్లెఁ
బ్రియునకుఁ బుట్టఁగఁబోవు బిడ్డ కాతఁడు తన
యాస్తిపాస్తుల నర్ధ మబ్బునట్లు
పత్రంబు వ్రాయించి భద్రంబు గావించె;
రాత్రింబవళ్ళు గర్భస్థశిశువు
పెరుగుదల గుఱించి పరిపరి తెఱఁగులఁ
జింతించి నదియు లోఁజింతసేయుఁ

తే॥ గీ॥ గనుల విందుగ నాప్రియ గన్నబిడ్డఁ
గాంచు భాగ్యంబు నాకెప్డు గలుగు నంచు
నొక్కదినమున కొకటిగాఁ జుక్క లింటి
యిడుపు లందిడి సారెకు నెంచుచుండు 25

చ॥ కొలువని దైవతంబులును గ్రుంకని పుణ్యనదీహ్రదంబులున్
సలుపని దానధర్మములు సంస్మృతిసేయని స్తోత్రమంజరుల్
దలఁపని పుణ్యగాథలును ద్వారని గుళ్ళును నెందు లేవు ని
ష్కలుషుఁడు వాఁడు మాధవి సుఖప్రసవంబును గోరు చాత్మలోన్ 26

తే॥ గీ॥ నెలలు తొమ్మిది నిండి కన్నులకు నించు
ముదిత పూఁచిన తంగేడుఁపోల్కి నున్నఁ
గాంచి ప్రొద్దుల నెలయుఁ బ్రాప్తించె నంచు
వాసభవనంబు కోమలాఙ్గి వదలకుండె 27

తే॥ గీ॥ మఱియుఁ జిత్రపతి వసంతమాలఁ బిలిచి
వన్నెయును వాసియును హస్తవాసియుఁగల
మంత్రసానులఁ బిలిపించి మందిరమునఁ
గనుఁగలిగి యుండుఁడని సారెఁ బనుచుచుండ. 28

సీ॥ ప్రసవకాలంబు సంప్రాప్తించె; నంత మా
ధవికి నొప్పులు రవరవగ నొదవె
గోరువెచ్చని నీటఁ గోమలాంగికి స్నాన
మార్చి, యొంటిపొరగా నంబరంబు
కటిఁజుట్టి మెలమెల్లగా నడిపించుచుఁ
గొనితెచ్చి యొకచోటఁ గూర్పుఁబడ్డ
తలిమంబునందు దాదులు పరుండగఁబెట్టి;
రంతికమందు వసంతమాల

తే॥ గీ॥ చిత్రపతి కూరుచుండి మాచిన్ని సంక
టంబు పడకుండుఁగాక! గండంబు దప్పి
పిండము బయటపడుఁగాక! వేగిరముగ
నంచుఁ గులదైవతములఁ బ్రార్థించి రపుడు. 29

కం॥ ఏమగునో? ఎట్లగునో?
భామిని కిది మొదటికాన్పు; భయమగు; నే పో
రామియు జనింపకుండుట
యే మే లిఁక నీశ్వరేచ్ఛ యెట్లున్నదియో! 30

కం॥ కనెనో? లేదో? మాధవి
కనియుండినఁ బాపఁ దెచ్చి కాన్పింపరొనా?
కమకొనగా రా, దేదో
జనించెఁ గీడంగనకుఁ బ్రసవసమయమునన్ 31

చం॥ అనితలపోయు; దైవమున కంజలిసేయు;ప్రసూతి గేహమున్
గనుగొను; నేల చిత్రపతిగాని వసంతనుఁ గాని చెంతకున్
బనుపరు మంత్రసానులని బల్వేతనందుచు;నాసుఁగ్రోవి రీ
తిని దిరుగాడు నట్టునిటుఁ దేఁకువ గోల్పడు నాతఁ డెంతయున్ 32

తే. గీ॥ ఆతని చెంతకు నొకదాసి యరుగుదెంచి
ప్రసవ మీనాఁడు కాదని పల్కి భోజ
నంబు సేయంగఁ గొనిపోవ నాల్గుమెతుకు
లాతఁ డెంగిలి సేసె వ్యథార్తుఁడగుచు. 33

తే॥ గీ॥ అంత నొప్పులు మాధవి కధిక మౌటఁ
బ్రసవమై పోవునని చిత్రపతి వసంత
మాల దాదులు నటనున్న మంత్రసాను
లనుకొనిరి కాని జరుగలే దవ్విధముగ. 34

కం॥ కడచెను రెండవదినమును
గడచెను మూఁడవదినంబు; కనియెన్ శిశువున్
బడఁతి యనువార్త చెవులన్
బడలే దా మాధవీ ప్రణయికి నొకప్డున్ 35

...: మణిమేఖలా జననము :...

కం॥ నాలుగవదినము మాధవి
బాలికఁ బ్రసవించె నన్న వార్తఁ దెలిపి రెం
తో లలిఁ బ్రసూతి వార్తా
లాలసచిత్తునకుఁ గోవలునునకు దాదుల్ 39

తే. గీ॥ అంత శీతలాంబుల స్నానమార్చి వెల్ల
పట్టు పొత్తిళ్ళ నుంచి యాపాపఁ గాని
పించి రామంత్రసానులు వేచియున్న
కోవలునునకు నానంద మావహిల్ల. 37

కం॥ దివినుండి భువికి రాలిన
నవప్రభంబైన జ్యోతి నా నిది కన్పం

డుపు కూర్చె నాకని యతం
డవిదితవేద్యాంతరుం డనాకులుఁ డగుడున్ 38

కం॥ జనియించిన రెన్నాళుల
దనుక బ్రదికి బట్టకట్టి తారాడునొ? చ
చ్చునొ? యనునొక సందేహం
బు నాశిశువు వారికెల్లఁ బొడమింపంగన్ 39

కం॥ సారెకుఁ బ్రసూతిగేహము
ద్వారము కడకేగి శిశువుఁ బరిశీలించున్;
ఆరోగ్యమె మాధవి కనుఁ
బారంబును జేర్చినాఁడు భగవంతుఁ డనున్. 40

చం॥ విరివిగ దానముల్ సలుపు విప్రులకున్; దన చెల్మికాండ్రకున్
సురచిర భోజనం బొసఁగి చొక్కు ఘటించును; బేదవారి కం
బరముఖవస్తుజాత మిడు; మంగళ శాలిని యౌను గాకకూ
తురను; గృహంబువారు తను స్తోత్రము సేయఁగ మెచ్చ నన్యులున్ 41

సీ॥ తొలుత మాకులము పెద్దలలోన నొకరుండు
పరదేశములకుఁ గావలసినవియుఁ
దనదు దేశమునందుఁ దఱచులైనవియు నౌ
సరకులు గైకొని తరణి నెక్కి
పయనంబు సేయుచో వార్ధి యొకతుపాను
గాలికి నల్లకల్లోలమైనఁ
బ్రాణసంశయదశఁ బ్రాపించియును వాఁడు
మణిమేఖలాదేవి మహితకరుణ

తే॥ గీ॥ బ్రదికి యివతలఁ బడినాఁడు: వానియట్ల
యిదియుఁ జచ్చి బ్రతికినది యేను దీని
కిడుదు నాదేవి పేరంచు నిడిరెఁ బేర్మి
నతఁడు మణిమేఖలాభిధేయంబు సుతకు. 42

ఉ॥ ఆవల నాఁటివాసరము లయ్యాయి వేడుక లింటిలోన ల
క్ష్మివిభవాను రూపముగ మేలన నెల్లరు చేసె. మాధవీ
భావుకుఁడైన కోవలను; భార్యను గన్గొని నొక్కనాఁడు వే
భావన సేయఁ డింటి దెసఁ బర్వఁగఁజేయఁడు చూపు నేనియున్ 43

...: బాలారిష్టము :...

తే॥ గీ॥ వేఁడుకలు ముగిసిన వెన్క నేడవదిన
మందు నొక్కయెట్టిని మచ్చ యాశిశువు నె
డందఁ బొటమరించెను; దాని నందఱు గని
కలవరంపడి పెద్దయుఁ దలఁకుగొనిరి 44

తే॥ గీ॥ దైవతములకు మ్రొక్కి మాధవియుఁ గోవ
లనును భక్తితో మణిమేఖల న్భజించి
బిడ్డఁ గాపాడు మని కడు వేఁడుకొన్నఁ
గోవలనునకుఁ గలఁ దోఁచి దేవి యనియె 45

శా॥ ఓయీ! బిడ్డకు నాదు పేరిడితి వెంతో ప్రీతి; నే మెచ్చితిన్;
నీయిల్లాలికిఁ బంపు మీశిశువు; దీనిన్ గణ్ణగీదేవి యా
ప్యాయంబారఁగ నెత్తి ముద్దిడినచోఁ బాయున్ జుమీ మచ్చ; నా
యీ యాజ్ఞన్ శిరసా వహింపు మిదె! కీడెంతేని శాంతించెడున్ 46

సీ॥ అని వల్కి యాదేవి యంతర్హిత యయినఁ
గోవలన్ చింతతోఁ గూన నటకుఁ
బంపకుండనురాదు, పంపనురాదు, దే
వ్యాజ్ఞ యవశ్యపాల్యంబు నాకు
గణ్ణగికి సపత్నిగద మాధవీదేవి
యిది పంపుటకు నొప్పెనేనియు నది
యీ పసిగందు నెట్లెత్తికొను? మఱెట్లు
ముద్దిడుఁ? దెలియంగఁబోల దైన

తే॥ గీ॥ నా ప్రథమపత్ని కణ్ణగి నన్నుఁజూచి
కాదనదు; పతిదేవత గాన నాదు
నాజ్ఞ పాలించు నని యెన్ని యంపె నొక్క
భటుని నవ్వార్తఁ దెలుపఁ దద్భవనమునకు 47

తే॥ గీ॥ భటుఁ డరిగి కణ్ణగికి నాథువార్తఁ దెలిపె
మరకతము విశాలాక్షి యామాటలు విని
మూఁతి ముడువఁ బ్రియంవద మోవి విఱిచి
చనదు నీకని కన్నుల సైగసేసె. 48

ఉ॥ అంతటివాఁడు నిన్విడిచి యావెలయాలికి దాఁసుడై జగం
బంతయు రోఁతవృత్తైనని యమ్మొయి నేనును బోయి చెప్ప నా
వంతయుఁ దాను మెత్తఁబడఁ డాయన పంచిన దాచరింప నీ
యంతటి దిప్పు డొప్పుకొను టాతని దౌష్ట్యము పెంచుటే చెలీ! 49

శా॥ ఈకార్యం బొనరింప నూకొనకు మీ; వెట్లంపెనో లెంకఁ దా
నే; కాలంబున నేని యిట్టి మగవా డెవ్వర్తకే నబ్బెనే?
నీకున్ గూర్చినదాన; నట్లగుట మన్నింపఁగా దగున్ నన్ను; నీ
కై కంఠంబున నూపి రున్నదనుకఁగా గావింతు నీకిష్టమున్ 50

ఉ॥ ఆవెలయాలి వాడకడకైనను బోవను; దానిమోము నే
నేవగనైనఁ జూడనని యావొకమాట యొసంగుదేని నే
నీవెలయాలి బిడ్డను యథేచ్ఛముగా స్పృశియింతునంచు నీ
నావచనంబు నీదు వచనంబుగ భర్తకు.జెప్పి పంపుమా 51

తే॥ గీ॥ ఐన నవతలిగట్టు కాదేని నీకుఁ
గణ్ణగీ! యివతలి గట్టు గాక యొండు
గట్టు లేదు; కార్యంబు నకార్య మెఱిఁగి
చేయువారికి నెప్పుడుఁ జేటు రాదు 52

తే॥ గీ॥ అని వచించె నమ్మాటలు విని సెబాసు
కార్యమిది నీకనుచు మరకతము పలికె
నదను వదలకుమని విశాలాక్షి యనియె
వారినుడి విని కణ్ణగి పలికె నిట్లు 53

కం॥ ఒరు లేయవి యొనరించిరొ
పరుసనతో మనము నవియు వారి కొనర్పం
దరతమము లెఱుఁగఁ దరమే
నరులకు నొండొరుల గుణగణంబుల నుర్విఁగా 54

కం॥ ఆ మాధవి నాకొక పో
రామిన్ గావించె నంచు రక్కసులై మీ
రీ మాటలు పలికెద రౌ
రా!మహిళలమనము సగరమని తేటపడఁగా 55

కం॥ మాధవియెడ ననురాగము
నాథుని కమితంబు; కాదనఁగరా దతఁడే
యాధారము నా కేను ద
దాధేయమ; మనుట యెట్టు లాతని విడినన్ 56

కం॥ నానాథు పంపుసేయుట
యే నాకున్ ధర్మమంచు నెఱుఁగరొ? యేలా
పానకమునఁ బుడకలవలె
నీనాఁటికి నడ్డుపడెదు రిటు చెలులారా! 57

చం॥ ఒకపసిపాప కైన సిడి యోటుఁజేయుటకై విభుండు తా
నొక భటుఁ బంపె నాకడకు; నొప్పనొ? యొప్పదొ? తాఁకి ముద్దుసేఁ
తకు సతి యంచు నిట్టితఱి దానికి నేను షరత్తుపెట్ట నన్
దికమక సేయఁ గణ్ణగి విధించె షరత్తని భర్త నొవ్వఁడే 58

కం॥ ఏమనుకొన్నను ననుకొనుఁ
డీ!మాధవి శిశువునకు సిడిం దలఁగంగా
భామినులారా! తాఁకెద
నామీఁదట ముద్దులిడెద; నయ్యయు మెచ్చున్ 59

కం॥ అని పలికి భటునిఁ గన్గొని
కొనితెమ్మా! మాధవి పసికూనన్ దోడ్తో
వినిపింపు మెల్ల స్వామికిఁ
జనుమీ! యని ముదల నొసఁగె సఖులెద జడియన్ 60

మ॥ చని వృత్తాంతము సర్వ మాభటుఁడు తూ చా తప్పకుండన్ వచిం
చె నిజస్వామికి; వాఁడు కణ్ణగి గుణశ్రీ యింత లోకోన్నతం
బని మున్నెన్నియు నమ్మకుంటి; నది నేఁడయ్యెఁ యథార్థం బహో
యనిదంపూర్వగుణాఢ్య యాలగుట భాగ్యం బంచుఁ జింతించుచున్61

తే॥ గీ॥ చేటికి వసంతమాలకుఁ జిత్రపతికి
మాధవికిని గణ్ణగి యనుమతిని దెలిపి
వారి యనుమతియును గొని పాప నంపె
భటునిచే వెండిఁ గణ్ణగి భవనమునకు 62

శా॥ ఆపాపం గొనితెచ్చి కణ్ణగికి వాఁ డర్పించె; స్నేహార్ద్రవీ
కాపాతంబునఁ జెల్మికత్తియల జ్యోత్స్నాస్నాతలం జేయుచుఁ
బాపం బెట్టిదియో కనుంగొనని యీపాపఁ గృపాపూర్ణమై
కాపాడుఁ విధియంచు నెత్తుకొని యాకంజాక్షి ముద్దాడుచుఁ 63

క॥ తనవైపు వింతగా వి
చ్చిన కనుఁదామరలఁ జూచు చెలికత్తియలన్
గనుగొని యొక యుచితాసన
మున నాసీనయయి హర్షమున నిట్లనియెఁ 64

సీ॥ చెలులార! చెంపకుఁ జేరెడు కన్నులు,
కరఁగి పోసిన పైఁడికరణి మేను;
పాల్గారు బుగ్గలు బవిరి గడ్డంబు కో
టేరుచాలుంబోలు కోఁటముక్కు
జాజిపొట్లాలకు సరులైన చేతులు
నరచందురునిబోలు నసటు నుదురు
తలకుఁ జుట్టును వెంద్రుకలు, తీర్చినపగిదిఁ
బొలుపారు నునుసోఁగబొమలు వెలయఁ

తే॥ గీ॥ గడిగి పెట్టిన ముత్యంబుకరణి నొప్పు
నీనిసుఁగు వృద్ధి నానాటఁ కెనయుఁగాత
అచ్చుగ్రుద్ది నట్లున్నవి యాత్మవిభుని
పోలికలన విశాలాక్షి పోలు నంచు 65

ఉ॥ పోలిక లయ్యుగారివియ, మోమును బొమ్మలు చెక్కులున్ జెవుల్
కాళులు తీసిపెట్టినటు గ్రాలుచునున్నవి కణ్ణగమ్మ! యీ
బాలిక కొక్కటేనియును వర్తిల దాయమ రూపురేక మా
పాలిటి భాగ్య మయ్యేడిది బాలిక నీకుదయించి యుంటినన్ 66

క॥ కన్యక పితృముఖి యగునే
ధన్య యవునటంచు వంద్రు తత్త్వజ్ఞుల సా
మాన్యగుణంబుల నియ్యది
యన్యాపత్యముల మించునని యనుకొందున్ 67

తే॥ గీ॥ అనిన మరకత మాపల్కు విని యెఱుంగ
శక్యమే యీశిశువు భవిష్యత్తు మనకు?
ననియెః నొసట వ్రాసిన వ్రాఁత ననుభవించుఁ
బ్రాణి యిహమున నని ప్రియంవద వచించె 68

సీ॥ ఆమాట లాలించి యాసాధుగుణ యను
త్తమముగ నీయపత్యంబు పెరిగి
జగతి కంతటికి నాశాజ్యోతి యౌఁగాత
మని పల్కి వెండియు నాభటునికి
ఆత్మనాథునిదైన యట్టీ శిశువు నాది
యౌఁగదే! మాధవి యనుమతింప
నీయమూల్యశిశువు నేఁ బెంచుకొనఁ గోరు
చున్న దాన నని యయ్యువిదకు నను

తే॥ గీ॥ మంతభాగ్యంబు నా కున్నదన్న! దీని
కనుమతింపనిచో బిడ్డ ననుదినంబు
గాంచుటకు నేని యీదీన కడకుఁ బంపు
మని వచింపుము విభునిపై నాన యనుము 69

చం॥ అనియె; భటుండు కణ్ణగికి నంజలిసేసి యథాతథంబుగా
జననీ! వచింతు మాధవికి సర్వము; నాయమ సమ్మతించునే
ననుదిన మేగుదెంతు న'ని యాశిశువుం గొని సాఁగిపోయె;న
వ్వనిత గుణోచ్ఛ్రయంబునకు బమ్మెరవోయిరి చెల్మికత్తియల్ 70

తే॥ గీ॥ శిశువుఁ గొనిపోయి మాధవి చేతఁ బెట్టి
భటుఁడు నిర్భయంబుగఁ జిత్రపతి వసంత
మాల వినుచుండ వృత్త మా మూలచూడ
మావిలాసికి వినిపించెఁ గోవలనుకు. 71

తే॥ గీ॥ సాధుశీల కణ్ణగి కరస్పర్శమైన
దాదిగా మణిమేఖల సిడి యంతఁ దొలఁగ
వారిదప్రవిముక్త యౌ శారదేందు
కళ తెఱంగునఁ బుటమెక్కి కడు వెలింగె 72

— చిత్రపతి సంశయము మాధవి మందలింపు —

కం॥ ఆకథ, యూకొట్టి తమ వి
వేకం బడుగంట మాధవీచిత్రపతుల్
శోకించి రెవన్ మనశిశు
వా కణ్ణగిచేతఁ బడునొ యని బహుగతులన్ 73

సీ॥ ఒకనాఁడు పసిపాప నుపలాలనము సేయు
మాధవి కడకుఁ దన్మాత వచ్చి
కణ్ణగీదేవి యీకసిగందుఁ దాఁకిన
దాదిగా సిడియెల్ల నణఁగిపోయె
మణిమేఖలాదేవి మహిమంబుగాక యెం
డేదియుఁ గాదందు; నీనిసుంగు
మనకుటుంబపు టనుమతిఁ బొంది తాఁబెంచు
కొనగోరు చున్నట్లు కొంకక యది

తే॥ గీ॥ భటునిచే వార్త పంపె; నివ్వార్తలోని
యంతరార్థం బెఱుంగ నాకంతు పట్ట
దంగిట విషంబు నాల్కపై నమృత ముండు
పలువల కటంచు విబుధులు పలుకుచుంద్రు 74

ఉ॥ ఈపసిపాప కంటఁబడ నీను జనింపఁ గుయుక్తి యొక్కఁడే
దో పరికించి వైచె వల; యొండొక టడ్డము సెప్ప కంప ని
ప్పాపను జంపి తీరు; నది పాపవినిశ్చయ; పైకి సాదు లో
లోపల వ్యాఘ్రమం చెఱుఁగు; లోభము సెందకు దాని మాటకున్. 75

కం॥ మునుపు ప్రియుంవదఁ బుత్తెం
చి నిన్నుఁ దిట్టించినది విశేషముగాఁ బా
పను గోరుచున్న దీనాఁ
డనింద్య యనఁగ నుచితంబె యాపాపిష్ఠిన్. 76

కం॥ నీరములలోని లోఁతును
నారులలో మర్మమెఱుఁగ నలువకుఁ దరమే?
పోరామిని గావించుట
కీరితి ఘటించె నంచు నే మాహింతున్. 77

కం॥ ఏపుట్టలోన మాధవి!
యే పాముండునొ? యెఱుంగు నెవ్వం? డెవ్వం
డే పట్టున నేపాపం
బేపాటిగఁ జేయునొ? తలమే యెఱుగంగన్. 78

తే॥ గీ॥ అనుడు మాధవి తల్లికి ననియె నిట్లు
తలయుఁ దోఁకయు లేని పల్కులు వచించి
నన్ను నుడికింప కమ్మ! నీ వన్నమాట
కోవలన్ విన్నఁ దానెంత కుములు నొక్క! 79

కం॥ మన కితరులు గిట్టకపో
యినంత మాత్రమున నింద్యు లెట్లగుదురు?నీ
కును నాకును గణ్ణగి న
చ్చనంత మాత్రమున జగతి సాధువు కాదో? 80

ఉ॥ బిడ్డలు లేమిఁ బ్రేముడిని బిడ్డ నొసంగిన సాఁకుకొందు నే
నొడ్డు ఘటింపనంచు నల సుందరి పల్కిన దంతమాత్ర కీ
వెడ్డెతనానఁ బాప నది హింస యొనర్చెడు నంటి వయ్యయో!
గొడ్డుదియైన నౌ, నిటులఁ గ్రూరత కెట్లొడిగట్ట నేరుచున్. 81

ఉ॥ ఆయుమచేతిచల్వ శిశువంతకు నంతకుఁ జెట్టుగట్టి కం
దోయికి నించుచున్నది; యదుష్ట నొకర్తుక దుష్టయంటి నీ
వాయి నిజంబ ప్రువ్వదొ? శుభం బొనగూర్చిన పుణ్యురాలి కం
బా! యెటువంటి చక్కని యుపాయవ మిచ్చితి; నిన్ను మెచ్చనొ! 82

కం॥ ఒక క్రూరభావ మాయమ
మొకమునఁ గన్పట్ట దంచుఁ బురివా రం; ద్రొం
డొక దూషణ మాడకు మనఁ
బకపక నగి సుతకుఁ జిత్రపతి యిట్లనియెన్. 83

కం॥ మన వంశోద్యానంబున
కనార్తవ సుమం బనంగ నావిర్భూతిం
గనె మణిమేఖల లోకం
బు నెట్లిది యశః పరిమళముల నిండించున్. 84

కం॥ అని తలపోయుచు నట్లం
టనిగా కాకణ్ణగిని సడింబఱచుట గా;
దనఘయొ? సాఘయొ? యుది నీ
వు నిందిత వెఱుఁగుదు వెఱుఁగఁబోలదు నాకున్. 85

మ॥ అది యట్లుండగ నిమ్ము; కణ్ణగి కరంబం దీయపత్యంబు ప
ద్ధ దినంబే మనవృత్తి విద్యయగు నాట్యం బంతమై పోవు; ని
య్యది సంసారుల యిండ్లలోఁ బెరిగి వంశాచారమున్ మంటఁగ
ల్పు; దుమారంబయిపోవు నొక్క త్రుటిలో మున్గొన్న
సత్కీర్తియున్. 86

కం॥ నా మొగమున్ను గని కా ద
మ్మా! మన యన్వయ యశోరమన్ గనియైనన్
భామకు బిడ నీకు మనం
గా మాధవి వల్లె యనియుఁ గలకల నగుచున్. 87

కం॥ ఓమాత! వినుము కణ్ణగి
స్త్రీ; మనమును దానియట్ల స్త్రీలము; జగతిన్.
స్త్రీమర్మము స్త్రీ యెఱుఁగును;
బాముల కాళ్ళెరులు గాక పాములె యెఱుఁగున్. 88

తే॥ గీ॥ అనిన మాధవి పల్కులు విని వసంత
మాల సెలవివాఱఁగ నవ్వి మాధవి నుడి
యర్థగర్భిత మని పల్కు నంతలోన
వచ్చె వారిచెంగటికిఁ గోవలమవిభుఁడు. 89

ఉ॥ అప్పుడ 'పాప నంపు'డని యాచన సేయుటకై యొకర్త నా
యొప్పులకుప్ప కణ్ణగి యనూనబహూకృతి నిచ్చి పంపె; వా
రెప్పుడుఁగాని పాపఁ బెఱయింటికిఁ బంపగఁ జాలమంచు నీ
యప్ప వధూటికిందెలువుమంచు వచించిరి; పోయె నద్దియున్ 90

కం॥ అంగనల నిరాకృతి కా
త్మం గోవలను కనలండు; మాధవియున్ లో
నం గలఁగదు; తక్కినవా
రంగీకృతిఁ దెల్పె నాథుఁడని పొంగి రెదన్ 91

కం॥ వారి నిరాకరణము న
య్యూరూద్భవసతి యెఱింగి యొండొండఁ దలఁకా
గారాలును మిరియాలును
నూఱుచు నున్నాఁడు విధియనుచు దురపిల్లెక్ 92

...: కణ్ణగి దీనావస్థ :...

చం॥ పరిమళహీనమైన ప్రసవంబువలెన్; రుచిఁగోలుపడ్డ భా
స్కరు కిరణంబు పోల్కిఁ; బొగగట్టిన దీపము చెల్వునన్ గథా
పరిణతి లేని దుష్కవిప్రబంధము రీతి, వియోగతప్తమై
యరుదగు తన్విగాత్రము స్వయంబుగఁ జారుత గోల్పడెన్ గడుక్ 93

కం॥ తన్ను మనోనాథుఁడా
పన్నం గావించి యొక్క పడుపుంజెలితో
నున్నాఁడని పతిదేవత
యన్నాతుక దీనవదనయై లోఁ గ్రాఁగుక్ 94

ఉ॥ అన్నము ముట్ట, దంబువుల నైనను గ్రోలదు, కన్నుగూర్క, దే
మన్నను నుత్తరం బొసఁగ దట్టిటుఁ దారదు, నవ్వ దెప్పుడున్
గన్నుల నీరు దేరదు, వికారము సూపదు; మోముఁదమ్మిపై
విన్నఁదనంబు పూనదు, వివేకము గోల్పడ దెంచు కేనియున్ 95

ఉ॥ మజ్జన మాచరింపదు, సుమంబులఁ జోలికిఁ బోదు, కన్నులం
గజ్జలముం ధరింపదు. వనంబునఁ దీవెలఁ బ్రోదిసేయ, దే
పజ్జకు సాఁగి పోదు, పరివారముఁ బాలనసేయ దింటిలో
సెజ్జను గాంచి నిన్నుఁ నను జేకొనఁ డావిభుఁడంచు వాకొనుక్ 96

శా॥ కేళాకూళుల చెంత కేగుటకునేఁ గ్రేడించుఁ; దా నొంటిగాఁ
గేళీపర్వత మెక్క జంకు; శుకసంగీతంబు నాలింప నాం
దోళించున్; గృహకేకి యాటలకు లో దుఃఖించు, నేదేదియో
యాలోచించు; భయంబు నెందు; దెసలన్ వ్యగ్రాత్మయై గన్గొనున్ 97

ఉ॥ కమ్మలు దక్క నొండొక నగన్ మెయిఁ దాల్పదు! సోఁగలైన కే
శమ్ములు సంస్కరింపదు; విషంబుగఁ గోకిల కూజితంబు దెం

దమ్మున నెంచు; భృంగనినదంబు చెవింబడ నోకిలించు. రా
గమ్మునఁగాక చంద్రుని వికారపుఁజూచిగఁ జూచుఁ గన్నులన్ 98

చం॥ ప్రతిహతయైన యాశవలె; బాగఱు శ్రద్ధబలెన్; క్షయించు సు
స్థితిగతి; సోపసర్గయగు సిద్ధితెఱంగున; శ్యామికా విలా
కృతి యయినట్టి బుద్ధిక్రియఁ గీడ్పడు ధర్మవిశుద్ధిరీతి, నా
హతయగు కీర్తి చందమున నా పతిదేవత పొందు దైన్యమున్ 99

చం॥ కనుగొను నిర్నిమేషముగఁ గణ్ణిగి బోటులఁ, దన్ను నెవ్వఁడో
దనుపుచు నున్నయట్టుల స్మితం బొనరించును; సెజ్జ నిద్రపో
వునపుడు స్వామి వచ్చితివె? పోకుము వెన్కకునంచుఁ గేకవె
ట్టును; బతిరాకయుంటకుఁ గడుంగడు నొచ్చును; మెచ్చు
దైవమున్ 100

చం॥ చెలులకు మాటు స్వప్నమునఁ జెల్వుఁడుఁ దాను నొనర్చుకొన్న కే
ళుల; నపరంజిపంజరములోని శుకంబును డాసి ఓరి! నీ
చెలువ స్మరింతువో? విభుఁడు సేసినయట్టుల విస్మరింతువో?
పలుకఁగరాదొ' యంచు వెతఁబాయఁగఁ బల్కు; వహించు నశ్రువుల్
101

ఉ॥ నాయెద స్థాన మన్య కొకనారికి నీయను నీకు దక్కఁ గాం
తా!యని వల్లభుండు మును నాకు రహంబునఁ జెప్పినాఁడు నే
నాయనమాట నిప్పటికి నాత్మ వహించియు యున్నదాన నౌ
రా! యది కల్లయం చెఱుఁగనైతిఁ గదా! యని యెంచు మాటికిన్ 102

తే॥ గీ॥ మధురవస్తుఘటనమున మాధవి విష
వస్తుఘటనమున నను నాబ్రహ్మ సేసెఁ
గానియెడ నంతమధురంబు గణిక యింత
విషము నేనెట్టు లవుదు నావిభుని కకట! 103

మ॥ అని చింతించుచు నశ్రుబిందువులు నేత్రాంభోజ యుగ్మంబునం
దనవచ్చిత్తి గఁ దాల్చు కణ్ణగిని జాతార్తిన్ విశాలాక్షి కాం
చినదై చెంతకుఁ జేరి ప్రాణసఖి! యకీణోష్ఠకంపంబుగా
ననిదంపూర్వముగా నధీరవయి యేలా యేడ్తు విమ్మోడికిన్ 104

కం॥ అనుటయు 'నేమియు లే దని
కనుఱెప్పల నశ్రులాఁగి 'కష్టగి తొలిపు
ట్టున నెంతటి పాపము సే
సినదో' యనఁగా నదియును జింతాకులయై 105

కం॥ నీ మెయి తీవియు వాడిన
దీమెయి నీవుంట పాడియే? తల్లి! మగం
డామాధవికిం జేపడి
నీమాటయె మరచినాఁ డనిన నాసతియున్ 106

ఉ॥ ఈ వ్యథయెల్లఁ దీఱుటకు నేనొనరించు ప్రయత్న మెల్లఁ బో
నవ్యయమౌచు సారె కది యంతకు నంతకు నెచ్చుచున్ మదీ
యవ్యవసాయమున్ ఫలము నందగ నీదను;తాపమో లతాం
గీ! వ్యయమౌ నుపాయ మెఱిగింపుము; నింపుము నాదు కోరికన్ 107

ఆ॥ వె॥ బుగ్గయందు సలిల మగ్గలంబుగ నూరు
నట్లు నామనంబునందుఁ గుందు
తెఱపిలేక పొడము; దీనికిఁ బ్రతిసేయ
వేని నాదు ప్రాణమేగు నిపుడ 108

ఉ॥ ఉత్తమురాలు రూపసి గుణోన్నత యింటికిఁ గోడలయ్యె; యే
మెత్తఱి నేమిపుణ్య మొకయింత నొనర్చితిమో యటంచు మా
యత్తయు మామయున్ దినము నందురు; సర్వము కల్లయయ్యెఁ; బై
నెత్తిన మాలదైవ మిఁక నేమి యొనర్పఁగఁ బొంచి యున్నదో? 109

ఉ॥ అల్లుఁడు కన్నకూతునకు నార్తి యొనర్చుట విన్న గుండియల్
జల్లను మూఁడుకాళ్ల ముదుసళ్ల కభాగ్యను నన్నుఁగన్న మా
తల్లికిఁ దండ్రి కీవెత నెదం దలపోయుచు వారు కూడు నీ
రొల్లక యుగ్గబట్టి తమ యూపిరి వాయరె నాఁడునాటికిన్ 110

కం॥ చీలు నెద, కాని రెండుగ
వ్రీలదు; మే మాను మూర్ఛ, విడ దుసు రెఱియున్
మై లో; బూడిద కాదా
యాలగలుఁచు, విధి హరింపఁడ యో! జీవితమున్ 111

కం॥ మతిశాలిని! నీకును మర
కతమునకుఁ బ్రియంవద కవగత మగునో నా
వెతయని మాటుటకై నే
వితథప్రతియత్నునై వివేకం బణితిన్ 112

కం॥ అనిన విని విశాలాక్షియుఁ
గనుగవ కెంపెక్కగా మొగము మాడ్చినదై
మును పెన్నఁడు బల్కని మా
డ్కని నిప్పులు గ్రక్కుచుఁ బలికెన్ గఱ్ఱగితోఁ 113

శా॥ తాళింగట్టిన పెండ్లమున్ సతత చింతావార్ధిలో ముంచి వే
శ్యాలోలుం డయి కొంపకేనియును రాఁ డాతండు నిన్వీడి నాఁ
డేలా యింకను నాస వానిపయి? నీరె బ్లెండమావిన్ జెలీ!
గ్రోలంగా నవు; మేలు లేని పతికై కుందంగ నీ కేటికిఁ 114

ఉ॥ ఎన్నిదఫాలు డెందమున కెక్కతెఱంగున నిన్నుఁ గూర్చి నే
విన్నపముం బొనర్చితి; వివేకము చాలని వాఁడె వల్లభుం;
డన్నియు నాలకించు; నగుఁ;నైనను మెత్త పడండు; బండయ
ట్లున్నది నాథు గుండె; యెటులుండును మెత్తఁదనంబు దానికిఁ 115

చం॥ లలితకళాభిమానము, విలాసము, రూపము, యౌవనంబునున్
గలపతి తన్నుఁగూర్చు సతి గాంచుట కేనియు రాఁడుః వాని యా
లలితకళాభిమానము, విలాసము,రూపము,యౌవనంబునున్
జ్వలనమునందు వ్రేల్చనె? యసాధువు నీపతి యన్న దోసమే 116

ఉ॥ అందని మ్రానిపండునకు నఱ్ఱును జాఁచుటగాదె వానికై
వందుటఱు; టొక్కమాఱు కులభామిని నూఱడఁజేయు మంచు భ
ర్తం దనుదానుగా మరకతంబును వేఁడి నదంట మొన్నఁ యే
మందము నాథుచిత్తః; మిఁకనైనను ఱాయిగఁ జేసికొ మ్మెదఁ 117

కం॥ నామాట సత్య. మతఁడు ప
యోముఖవిషకుంభ మంచు నున్నది యున్న
ట్లోమానిని! పలికితి ననఁ
గా మొగమెఱఁదమ్మికాఁగఁ గఱ్ఱగి యనియెఁ 118

శా॥ నాకుం గూర్చిన నాథు నిట్లనుట యన్యాయ్యం బధర్మం బహో
నీకుం గోరెటు వచ్చె నిట్లు పలుకన్? నీప్రల్లదంబుల్ లతాం
గీ! కర్ణంబుల సూదులయ్యె; వినుః మే కీడైన సైరించెదన్
నాకాంతుం బరుషంబు లాడిన వినన్ నామీఁది రాగంబునన్ 119

ఉ॥ ఆయుష మాటతీరు గని యయ్యది నీ కొనరింపఁబత్త య
న్యాయము నెట్లు లోర్వనగు నా।విని కన్నెగి తొంటిబామునం
దేయతి ఘోరపాప మొనరించితినో సఖి! యద్దినేఁటి కీ
చాయను గాంతుఁ బాపె; మును సల్పిన దిప్పుడు నిర్వేశించెదన్ 120

ఉ॥ కుంటినొ? గ్రుడ్డినో? పతికిఁ గూర్పనొ? యేలనొ కాని కోవలన్
వంటి విభుండు గొప్పగుణవంతుఁడు నన్ విడె నొక్క; వేశ్యఁ గ
న్గొంటకు నిచ్చగించిన కనుల్ ననుఁ గన్గొన నిచ్చగింపవో?
తుంటరి దైవచేష్టితమొ? తోఁపదు హేతువు కాంతుచేఁతకున్ 121

ఉ॥ ఐననుఁ గాంతు దూఱ; వినుఁ మాయనపై ననురాగ మింక దిం
తేనియు; భాగ్యవంతునకు నిచ్చిన సొమ్మెటు చక్రవృద్ధితోఁ
జానరొ! యెచ్చునట్ల ప్రియసంగతమైన మదీయరాగముం
న్యూనము కాక యెచ్చు నిఁక నొండొక టాడెద నాలకింపుమా! 122

కం॥ మాధవి గేహావాసము
నాథునకుఁ గళంకు తేదు; నలినము తాఁ బం
కైథిత మయ్యును దైవా
రాధనమున కేల పనికిరాదో? చెపుమా! 123

సీ॥ అనిన విశాలాక్షి యంగలార్పఁగ నేల?
కాంతునికై యిట్లు గ్రాఁగనేల?
యనినఁ గణ్ణగి దాని కనియె నాపతి తన
యకలంకమగు ప్రణయామృతంబు
ననుదిన మొకవెలయాలిపైఁ గురిపించి
వమ్ముచేసెడునంచు వ్యథవహింతు
దానికి నాయనధనముతోఁ బనిగాని
పనియేమి యాయన వలపుతోడ

తే॥ గీ॥ విభునియైశ్వర్య మింక నావేశ్యవలపు
తోన నిజ్జింకు లింకు నంచే నెఱుఁగుదుః
బందిరి గృహంబగునె? వేశ్య భార్య యగునె?
యన్న నాపతివ్రతకు వయన్య యనియె 124

ఉ॥ ఇచ్చటి రత్నసంచయము లిచ్చటి బంగరువెండిరాసులా
చచ్చినదాని కొంపకు నజస్రము వాఁగువిధానఁ బాఱు, లో
నచ్చిన వేశ్యకిచ్చు నరనాథులునుం గలరిట్టు లెల్ల సొ
మ్మిచ్చెడు ధర్మరా జవని నీయనదక్కఁ మఱొక్కఁ డుండునే? 125

ఉ॥ ఇంతటి సొమ్ములిచ్చి తమునే శరణంబుగ నమ్మి మిండలం
డెంతయుఁ గూర్మిలేక ధనమింకిన యంతనె వేశ్య లెట్టు లా
వంతుయు జాలిఁ జూప, రిది యచ్చెరువే! వెలయాండ్రటంచు ధీ
మంతులు భోగకామినుల మాటయు నెత్త రొకప్డుఁ గణ్ణగీ! 126

కం॥ అనవుడు కాకులు వేశ్యా
వనితలు పరపుష్టములని పలుకుట వినవో?
వనితా! వేశ్యకు శీలం
బును కొచమ్మును గణించు బుద్ధియుఁ గలదే? 127

చం॥ ఇనుము గ్రహించుఁగాని మఱియెట్లు గ్రహింపఁగ నేర్చు వోసి! కాం
చనరజతాద్యమూల్యఖనిజంబులఁ జుంబక; మట్లవేశ్యయుకా
ధనమును రత్నరాశులు ఘనంబుగ నెప్పుడుఁ గోరుఁగాని మిం
డని ప్రణయంబు శీలము కులంబు గుణంబును గోరఁ నెవ్విధిన్128

కం॥ కాముకులను యజ్వలు బహు
ధా మోహంపడి తమ ధనతారుణ్యంబుల్
ప్రేమమున వ్రేల్చు జుగదు
కామాగ్ని శరణగృహములు గణికాక్షేత్రమదల్ 129

తే॥ గీ॥ ఇది యెఱింగియుఁ గాముకు లేపి కోల
తాంగి! వెలయాండ్ర నమ్మెదు రాత్మనంచుఁ
బలుకు కణ్ణగిఁ గనుగొని పాడ యెఱగి
మరకతము వెండియును హర్షమధుర యగుచు 130

కం॥ ఈ కావ్యార్థము లేఖగ
నీకాంతుని కనుపుమను వనితఁ గనుగొని యు
వ్యాకోచముఖాంబుజయై
యాకణ్ణగి తెప్పలంద యశ్రు లడఁచుచున్ 131

ఉ॥ ఎంతటి వెఱ్ఱిదానవు సఖీ! మధుపానము సేయువాఁడు, దు
శ్చింతకు లోఁగువాఁడు వెలచేడె వలంబడువాఁడు సత్యమున్
సుంతయినన్ వినండు; వెనుచూడఁడు, ముందును జూడఁ డాత్మవి
భ్రాంతి దలంగలేఁడు సుడివడ్డ నరుండునుబోలె నెప్పుడున్ 132

శా॥ ఆవేశ్యా తృణకూపమందుఁ బడినాఁ డాత్మేశ్వరేభేంద్రు డె
ట్లో? వానిం బయికిగ్గ నెవ్వరితరం బోచెల్లి! సంభోగతృ
ష్ణావాంఛామతి కాలిసంకెలగ నానందించు చందుండుఁ గా
కీ వేసం జని ధర్మమున్ చెఱుకు మోపీ నే గతిన్ వెల్వడున్ 133

ఉ॥ వారవధూటిపైఁ బతికి వర్తిలు మోహ మికెంత కాల మీ
తీరున సాఁగు నన్నదల దేవుఁ డెఱుంగును గాక యన్న రం
భోరువుఁ గాంచి యంతదను కూరకయే వినుచొక్క పెట్టఁ గాం
తారపు టగ్గినా మరకతం బెసరేఁగి వచించె నీగతిన్ 134

కం॥ నీ వెఱుఁగవు, మేము నెఱుఁగ
మేవారు నెఱుంగరె ఱుగఁడే దేవుండున్
గోవలను వృత్తమైనను
నీ పీగను వ్రాలనీయ వెపు డాతనిపై. 135

ఉ॥ ఇంతలు సేసి చన్నపతి కేలకొ కూర్తు? వెఱుంగరాదు, నీ
వంతను గన్న ఖండలును వాయిడి యేడుచు; నీచరిత్ర కొ
క్కింత కళంక మున్నదొకొ? యేలకొ? నీపతి పుట్టుగ్రుడ్డి యు
ట్లెంతకు నిన్నుఁ గానఁడిది యెన్నఁటి పాపఫలంబొ? మానినీ 136

కం॥ ఇఁక గొన్నియేండ్ల కైనను
సకి! నీచెంతకు విభుండు చనుదేరునె? నా
వికృతిమొగంబునఁ గననీ
క కణ్ణగి వయస్యమొగము కన్గొని పలికెన్ 137

కం॥ ఏమైన జరుగనీ! నా
స్వామికిఁ జెలి! దైవదుర్విపాకంబునఁ గీ
డేమియు వర్తిలకుండం
గా మాకుల దైవతంబు కాపగుఁ గాతన్ 138

కం॥ నా పతిపదములఁ గొలుతున్;
నా పతినామంబు మనమునన్ స్మరియింతున్;
నా పతిచరితము యెన్నెదఁ;
గాపాడుంగాత బతియ కణ్బిగి నెపుడున్ 139

కం॥ పాతివ్రత్యము కంటెను
నాతికి వేఱొక్క భూషణము కలదే? స
ద్గీతంబగు సచ్ఛీలము
యేతఱి నే సతులకెల్ల నేడుగడ యగున్ 140

చం॥ ఇతర సురార్చనం బెఱుఁగ కెప్డు స్వవల్లభుఁ బూజసేయునే
సతి, యది యానవెట్టిన ససంభ్రముఁడై జలందుడు వర్షమీ
క్షితిఁ గురుపించుటన్ వినవొ? చేడియ! నా నిది సత్యమేని నీ
పతిఁ బిలిపించుకొ మ్మనుచుఁ బల్కు ప్రియంవదఁ గాంచి యిట్లనున్ 141

సీ॥ ఏనాఁటి కైనను నేతెంచు విభుఁడు నా
కడకను నొక నమ్మకంబు నాకు;
గతరాత్రి కాంతుని కౌఁగింట నిదురించి
యలరితిఁ గాని యహర్ముఖంబు
చనుదెంచి యూతియ్యు స్వప్నంబు నంతయుఁ
బాడు సేసినది; యిప్పటికిఁ గూడ
నాస్వప్నవృత్తాంత మాత్మ నెన్నిన నాశ
రీర మిదిగొ! పుల్కరించుఁ జూడుఁ

తే॥ గీ॥ దాతఁ డొకపుణ్యదినమున నరుగుదెంచు
నన్న యాశతో జీవించు చున్నదాన;
నంగనాజీవితసుమంబు నాశ యనెడు
తొడిమ పడకుండఁ గాపాడుఁ బడఁతులార! 142

గాత్రముం గౌఁగిలించుట కడు సుశీత
మమృత పానాతిమధుర మంచాత్మఁ దలఁతు 146

చం॥ అలయక పాంసుకేళి రతులై చిఱునవ్వులు చిల్కు-చుఞ్ బుసల్
బలియఁగ, బాఱ చాచుచును బర్వున వచ్చి కవుంగిలించు పు
త్రుల మలినీకృతాంగులయి తోషము నందెడు తల్లిదండ్రు లో
చెల! తొలిబామునన్ మిగులఁ జేసినపుణ్యము లెట్టివో కదా! 147

ఉ॥ ఆ యనినట్టి మాటకుఁ బ్రియంవద కణ్ణిగిఁ గాంచి యోవయ
స్యా! యనరాదు గాని విషమైనను నీకమృతంబు గాదె? నీ
వా యవినీతివర్తనునికై వలపుం బచరింతు వౌర! నీ
యీ యతి పావనప్రణయ మెట్లు వహించునొ చారితార్థ్యముఞ్ 148

సీ॥ అన విని కణ్ణిగి యట్లన వలదు, ని
ష్ప్రణయయౌ కాంత నిర్గంధసుమము;
ప్రేమ మెఱుఁగని జీవితము శ్మశానంబు
ప్రేమ దైవంబని విబుధు లందు
రంగనలకుఁ బ్రేమ మప్రతిహతశస్త్ర
మది లేనినాఁ డెల్ల వ్యర్థ మ యగుఁ
బ్రేమించు వారినే ప్రేమింప వలెనను
మాట బుధులకు సమ్మతము కాదు

తే॥ గీ॥ దుష్టు నైనను బ్రేమచే శిష్టుఁజేయ
వచ్చుఁ; బ్రేమబీజంబు లెవ్వతె యెడంద
పొలమునం దంకురింపవో? పొల్తి యద్ది
బండ యొండేని నాయసపిండ మొండె 149

తే॥ గీ॥ ప్రేమరహితుఁడు కాఁడు నావిభుఁడు సకియ!
తత్ప్రణయ రసంబునకు నపాత్రమొకతె
పాత్రమయ్యెఁ; నావిభుని నెప్పాటనైనఁ
గైవసము సేసికొందు నం చావధూటి 150

సీ॥ ఎంతేని దిటవుతో నెట్టుట్టొ కాలంబు
నొకరీతిఁ గడ్డపుచుఁ నుండె, నంతఁ

గోవలన్‌లెంక లొక్కొ_రుఁ డొక్కొ_రుఁడు వచ్చి
కణ్ణగి గృహమునఁ గలధనంబు
నయ్యె తెమ్మనె నని యడిగి కైకొనుచుండి
రున్నదంతయు నామె యూడ్చిపెట్టెఁ
జివరకుఁ దనదైన స్త్రీధనంబును నాభ
రణములనున్ సమర్పణముసేసె

తే॥ గీ॥ నన్నియును మాయమైనవి; యప్పటికిని
మిగిలియున్న యొకానొక మేలినగ, న
మూల్య మైనదానిని నమ్మి ముగుద స్వామి
యిచ్చి పంపు మన్నంత దా నిచ్చిపంపె 151

సీ॥ మాధవీదేవికి మణిమేఖల జనించి
నాఁటికి మూఁడేండ్లు దాఁటిపోయెఁ
దనతోఁడు నీడలై తనరు విశాలాక్షి
మరకతము భరింపఁదరమె తనకు
ననియెంచి కణ్ణగి యా యిర్వురినిఁగూడఁ
బనినుండి నిలిపివేసినది, తుదకు
వారిర్వురును జీతబత్త్యాలు లేకయే
యాపతిదేవత ననుదినంబు

తే॥ గీ॥ నుపచరించుటకయి తెల్పి రొప్పుకోలు
కాని యాసాధ్వి మీసేవ కాసు లేక
యేను గైకొంట యన్యాయ్య మౌ ననంగ
వారిరువురును గేల్మోడ్చి పలికి రిటుల 152

సీ॥ మచ్చెకంటిరో! నీవు వచ్చుగా మన్నప్డు
నినుఁగొల్చి యెంతయో ధనము మేము
నార్జించికొంటిమి! యది యట్టు లుండనీ
సాధ్వి! వల్లభుని వైశసము వలనఁ
బ్రాప్తించె నీకిట్టి పాపిష్టిదశ; యిప్డు
విమ వీడిపోఁకకు మనము కాదు
కాళ్ళునున్ రావు; నీకడనుండి పీ ఱ్ఱాడి
గం బూరకయు పేయు గలదు కోళ్ళ

తే॥ గీ॥ మాకు నిర్వురికిఁ దల్లి! మా యభీష్ట
మీవు కాదనకుము! నీదుసేవ మా కొ
సంగుఁ గొండంత యానంద సంపద యన
వారి కిట్టులు కన్బగి బదులు పలికె 153

ఉ॥ తుంటరి డైన దైవమిటు దుందుడుకుం బొనరించె; నింక నే
నొంటిగ నుండఁ గోరితి. నయో! యొకపోఁకయు నీక యెట్లు గై
కొంటకు నిచ్చగింతుఁ గడు కూళతనంబున మీదుసేవ! మీ
వంటి కృపాసమేతలకుఁ బాపము నాయది సోఁక నేఁటికిన్ 154

ఉ॥ నాపతి వచ్చినాఁడు సదనంబున, కేనును నావిభుండునుఙా
గాపురమున్ యథాతథముగా నొనరించుచు నున్నవార మే
లోపము లేదు మా కనుచు లోకము పల్కన దాఁక మీర లీ
దాపునకేని రాకుఁ డెడఁదన్ బరితాపము నూనకుండుఁడీ 155

కం॥ అని పలికి వారి నిరువురి
ననిపి మహాభవనమునఁ బ్రియంవదయుఁ జనఙా
జననుత బ్రాహ్మణకదళిగ
ననారతము మెలఁగుచుండె నతివిహ్వలతఙా 156

ఉ॥ మాసినచీర శ్రోణి, మెడ మంగళసూత్రము, రత్నగర్భమై
భాసిలు నూపురద్వయము పాదములన్; శ్రుతులందుఁ గమ్మలున్
వాసి ఘటింపఁ గార్శ్యము వివర్ణత నొందుచు సర్వదా సద
భ్యాసములేని విద్యవలెఁ వర్తిలు నాయమ నాఁడునాఁటికిఙా 157

ఉ॥ ఆ నిలయాధిరాజమున కప్పుడు పున్నమరాత్రియైన యా
మానవతీ శిరోమణి యమానసనిశీథిని యయ్యె నిప్పు, డా
హా! నన లమ్ము నాపణము నందునఁ గట్టెల నమ్ముటాయె నే
ప్రాణికి నేది కల్గునని బ్రహ్మకునైన నెఱుంగ శక్యమే? 158

తే॥ గీ॥ ఇంటిపనుల లెల్ల దా నిర్వహించుకొనుచుఁ
గాలముం ద్రోయు చున్నయాకాంత రవికి
మొగము వాచిన పద్మినింబోలె నా మ
హాగృహాభ్యంతరంబువం దధివసించు 159

ఉ॥ ఎన్నఁడు కాంతుఁ గాంతుని ముఖేందునిఁ; నాప్రణయ స్వరూపికే
నెన్నఁడు సేవసేసి రమియింతును; గేళివనాంతరంబునం
దెన్నఁడు పండువెన్నెల నభీష్టవిహారము లాచరింతు, నా
కెన్నఁడ శేషమంగళము లిత్తురు మా యిలవేల్పు లొక్కటన్ 160

కం॥ అని చింతిలు కణ్వాగి కిం
కను నొకయేఁడేండ్లు వరుసఁ గడచి చనెన్; గా
ని నిజేశ్వరుఁ గను భాగ్యము
జనింపదాయెను విధిప్రసాదము లేమిన్. 161

ఉ॥ నా కమనుండు శోకమున నానక యుండునుగాక, తద్యశః
శ్రీకిఁ గళంక మించుకయుఁ జెందక యుండునుగాక, వానికిన్
నాకుఁ బునస్సమాగమము నన్బునుగా కని యెంచుచున్ బలి
వ్యాకులయై కృశాంగి పతి యాగమనంబును గోరు నిచ్చలున్ 162

ఉ॥ ఈకరణిన్ నిజేశుకొఱ కెప్డు తపించెడు నావధూటి క
మ్మా! కడు నాడికొందురఁట మాధవి తజ్జననీసఖుల్ నినున్
లోకువ యైతి వంచని చెలుల్ వినిపించుట గోరుచుట్టుపై
రోకటిపోటు చాడ్పున నరుంతుదమై ఘటియించె వేదనన్ 163

ఉ॥ బాధలకెల్ల నోర్చుచు స్వభర్తకు మాటికి వెక్కి చేకవే
ణీధరయై ధరిత్రి శయనీయము గాఁగ శయించుచున్ మనో
వ్యాధికి మందు గానక యహర్దివమున్ విలపించుచున్ మహా
సాధుచరిత్ర సొంపఱఁ బ్రసన్నత గోల్పడి చిక్కె నెంతయున్ 164

సీ॥ మేదినీధూళికి మెఱుఁగులు మాసిన
వాసంతికాలత పగిది గొనుచు
ఘనము లొండొండఁ బైఁగవియుట రుచి నీఁగు
శారదశశిరేఖ చంద మగుచు
నిలువెల్లఁ గర్దమం బొలయుటచే నిష్ప్ర
కాశయౌ యబ్జిని కరణి గనుచు
నడుమంత్రమున ధూమ మడరి సుడియుటఁ బ్ర
భాహీనయౌ హేతిభాతి యగుచు

ఆ॥ వె॥ మాసినతలతోడ మలినవస్త్రముతోడ
కరుణరసము గురియు కనులతోడ
విగ్రహవతియైన విరహవ్యథ యనంగఁ
గణ్ణగి దివసములు కడపుచుండె 165

కం॥ పడియేండ్లు కోవలన్ దత్
సదనప్రాంగణమునకును జని యెఱుఁగం; డు
న్నదొ? యూడినదో? సతి యని
మదినైనం దఁలపఁ డెట్టిమౌర్ఖ్యము గలఁడో? 166

—: మాధవి యింట కోవలను ఉనికి :—

ఉ॥ తెంపుగఁ గోవలన్విభుఁ డు దీర్ఘమనోజుఁడు ముందువెన్క యో
చింపక మూర్ఖుఁడై కమల చేతను దాసి వసంతమాలచే
బంపిన పట్టుపుట్టములు పచ్చలు, రవ్వలు. పద్మరాగముల్
నింపిన భూషణంబుల గనిఁగని మాధవి పొంగు నిచ్చలున్ 167

తే॥ గీ॥ తొలివలపు మైకమున హంసతూలికా శ
యనములు, నపూర్వములగు చీనాంబరములు
మరకతంబులు మాణిక్య మౌక్తికమ్ము
లతఁ డొసఁగినవి పెక్కు లాయతివ యింట 168

తే॥ గీ॥ పసిఁడిసొమ్ముల జోలికిఁ బడఁతి పోదు
వెండిరవణంబు లన్మాట విని యెఱుఁగదు;
ముతకలని నూలుబట్టలు ముట్ట దా యొ
య్యారి కోవలఁ త్యాగమాహాత్మ్య కలన 169

ఉ॥ పూఁటకు నొక్క యాభరణమున్ ధరియించు నతర్క్యమూల్యమున్
బూఁటకు నొక్క పైఁడి జలపోసనంపుంబని వల్వఁ దాలుచున్
బూఁటకు నొక్కరీతిఁ దన మూర్ధజముల్ గయిసేయు వింతగన్
బాటలగంధి కోవలను వల్లభుఁ డూరక మ్రింగ గ్రుక్కిళుల్ 170

ఉ॥ కప్పురముఁ జవాదియును గస్తురి మున్నగు వాని వాసనల్
గుప్పెడు చందనం బలఁదు; గోరఁటమొగ్గ బుటాలచీర నా
కప్పురగంధి గట్టు; ఆవికఁ జనుదోయి బిగించుఁ గొనుపై
ముప్పదిరెండుపేటలది ముత్యపుఁబట్టు వహించు నిచ్చలుఁ 171

కం॥ ఒకయెడఁ గసరుల, విసరుల
నొకయెడఁబై; విరులు రువ్వి యొదుగు చొకయెడన్
ఐకపక నగు చింకొకయెడ
నొకయెడ దరిడాసి తలఁగు చూరించుఁ బ్రియున్ 175

సీ॥ మఱికొన్నివేళల మాధవి శివతాండ
వంబు, శ్రీ కృష్ణనృత్యంబు, స్కంధ
నాట్యంబు శ్రీగౌరి, నారాయణి, శచి ము
న్నగు దైవతంబు లొప్పగ నొనర్చు
లాస్యంబులన్ గోవలన్మహాశయునకు
నాసేచనకముగ నాచరించు
నింక నొక్కొక్కప్డు హేరాళముగ ఆలఁ
గరగించు గాంధర్వకళ వెలార్చు

తే॥ గీ॥ నృత్యగీత నిరతి వాఁడు ప్రత్యహంబు
దానికి గులాముగా నయి తలఁపఁ డొండు
ఏండ్లుపూం డ్లీతెఱంగున నేగుచుండ
వెండి యింద్రోత్సవంబు ప్రాప్తించె నంత 176

.... ఇంద్రోత్సవ విశేషములు. ...

చం॥ మహ మరుదెంచె నాకు మును మాధవి దీన లభించెఁ గావునన్
బహుమత మిద్ది నాకు నయనంబుల కించెడు నిట్టి జాతరన్
విహితములౌ విశేషములఁ బ్రీతి మెయిం దిలకింతు నంచు న
మ్మహితుఁడు కోవలన్వెడలె మాధవి. బోటులు దన్నువెన్కొనన్ 177

సీ॥ మధురనేపథ్యలు మరవజాతిభవలు
కన్నియల్ గొంద ఱొకానొకయెడ
బియ్యంబు నువ్వులు బియ్యయుఁగలిపి పొం
గించిన పొంగలి నించిన తళి
నాగ్రామశక్తికి నర్పించిరి సధూప
ముగ; వెండియుం గల్లుముంత లిచ్చి

రావలఁ బాడిరి, యాడిరి జనులకుఁ
గన్నులపండువుగాఁగ మఱియు

తే॥ గీ॥ దేశమునకు ఱేనికి శ్రీలు తెట్టువులుగఁ
ప్రజకు క్షామమారణపీడ, పరనృపాల
ధాటి లేమియుఁ గలుగంగ దైవతముల
మ్రొక్కి రెలుఁగెత్తి పలుస్తోత్రములు సలుపుచు 178

కం॥ అదిగాంచి విచిత్రంపడు
మదవతి మాధవిని గాంచి మధురస్మితుఁడై
ముదమున నా దేవతకత
మొదలు తుదియుఁ గలుగ వాఁడు ముదితకు నుడివెన్ 179

సీ॥ మున్నొక్కరుఁడు చోళభూ సార్వభౌముండు
ముచికుందుఁ డనువాఁడు భూరిభుజుఁడు
వాసుదేవుని పక్షపాతంబు వహియించి
కడుఁ గ్రూరభావుఁడౌ కాలయవన
దానవుగుహఁ జొచ్చి తనదివ్యబాహు వి
క్రమమున వానిని గావుగొనియె,
నాసాహసోపేతమౌ కార్యమున కింద్ర
దేవుండు సంతుష్టభావుఁ డగుచు

తే॥ గీ॥ ఱేని కొకదేవత నమోఘమైన శక్తి
గలుగుదానిఁ బ్రసాదించెఁ గలువకంటి!
ఱేలుఁబవలును నాశక్తి ఱేనిరాజ
ధాని మనుచు; నదియ యిది; తల్లి ప్రజకు 180

కం॥ యతిధూర్తుల దిగమ్రింగుచుఁ
బతితలఁ దూల్చుచును నన్యభార్యారతులన్
వెతవెట్టుచుఁ బురి నీ దే
వతయే శ్రీరామరక్ష ప్రజలకు నెల్లన్ 181

ఉ॥ నావుడు బల్కె వేశ్య నయనప్రియ! యే నవివాహితన్ బర
స్త్రీవశవర్తి వైతివను చెట్టయు సోఁకదు నీకుఁ గాన నీ

దేవత నిన్ను నన్నును నదేపనిగా వెతవెట్టు నెట్లు? నా౯
గా విని కోవలన్ గణికఁ గన్నులఁ ద్రావుచు సంతసంపడెన్ 182

సీ॥ వారంత మఱియొక వాడకుఁ బోయిరి;
యచ్చోట నగరంబు నందు నున్న
బ్రాహ్మణ క్షత్రియ వైశ్య పాదభవుల
కధిదైవతంబుల యవియు నైన
నాల్గుమూర్తుల యర్చనలు తిలకించిరి
కనులకుఁ బండువుగాఁగ, నవ్వి
చంద్రమోఽహిమకర స్వర్ణ తామ్రమచ్ఛాయ
సొంపుఁ జిమ్ముచునుండె; శ్రుతులు కుశలు,

తే॥ గీ॥ శూలము ధ్వజంబు. గుండ్లు త్రాసును; హలంబు
చిల్లకోలయుఁ గ్రమముగఁజేతఁబట్టి,
జాతిచిహ్నంబుఁ గాన్పించురీతి నిలిచి
చూచువారి కచ్చెరువుగఁ దోచుఁచుండె 183

తే॥ గీ॥ అచటు విడి వేఱుచోటికి నరిగి యచట
వారు పిహితాస్య యగునొక్క ప్రతిమ గాంచి
దీని గూడార్థమే మని తికమకపడఁ
గోవలన్ పల్కె వారల కీ విధముగ 184

సీ॥ ఈప్రతిమ యొకప్పుడేనియుఁ దెఱువదు
నోరు ప్రాణప్రియలార! కాని
రాజు దా నీతిమార్గమ్ము వీడి యధర్మ
సక్తుఁడై తీర్పిచ్చు సమయమందు
న్యాయాధిపతి లంచ మాసించి పక్షపా
తంబు చూపించెడు తఱినిఁ గంటఁ
దడివెట్టు; వినుఁ డిట్లు ధర్మ మధర్మంబు
వింగడింపఁగఁజాలు విగ్రహములు

తే॥ గీ॥ చేరపాండ్యభూపాలుర చెంత లేవు;
చోళభూపాలురక యీ యవేల భాగ్య
మబ్బినది నా వెఱఁగొంది యరిగి రెల్ల
వారును గవేరజాముఖద్వార; మచట 185

సీ॥ పరిపూత సహ్యజా వారిపూర్ణము లైన
యొకవేయు నెనిమిది యుదిరి కుండ
లొఁదల ధరియించి, యఖిలదేశాధీశు
లైన రాకొమరులు పూని తెచ్చి
యా జలధారల నభిషేక మొనరించి
రింద్రుని ప్రతిమకు నిద్ధభక్తి
నింకను దమిళుల కిష్టదైవము లైన
శరవణ జన్ముని, శారదాభ్ర

తే॥ గీ॥ ధవళు బలరాము, శ్యామగాత్రకుని గృష్ణు
నర్చఁ గావించి రదియెల్ల నరసి తుదకు
నరిగి "రిల్లంజియన్ రమాఖ్యన్" జెలంగు
నొకతటాకంబు నొద్దకు నుఱ వెసంగ 186

తే॥ గీ॥ అందు మునిఁగినఁ జెవిటివా రంధు లంగ
వికలులును మూఁగవారును వికృతిఁబాసి
చక్క నౌదురని యెఱింగి జాణతనము
వెలయ మాధవీదేవి కోవలనుతోడ 187

తే॥ గీ॥ మన వసంతమాలయు దీన మునిఁగి తనదు
గూను నేల తలంగదో కూర్మికాఁడ!
యనుచు నెకసక్కె మాడ నయ్యతివమొగముఁ
గాంచి స్మితముఖుం డాతఁ డిక్కరణిఁ బలికె 188

క౦॥ ప్రారబ్ధ మనుభవింపక
యేరీతిఁ దలంగనవునొ యెవ్వారికి?నం
భోరుహలోచన! యేదో
యూరక పలికితివి నాఁగ నువిదయు నూర్చెన్ 189

సీ॥ అంతట వారెల్ల నఘఘాతుకములైన
పలుదైవతముల పూజలను గాంచి
యొకపెద్ద పర్ణశాలకు నేగి; రచ్చోట
మునిపుంగవుల పోలెఁదనరుచున్న

బ్రాహ్మణ శ్రేష్ఠులు వల్లించు వేదప
  న్నాలు మాటికిని గర్ణముల గ్రోలి;
రావల యొకకొంత యరిగి వేఱొక కడ
  నొకపెద్దతేరుల యుత్సవంబు

తే॥ గీ॥ గాంచి, రారథంబులలోన స్కంధ వాస
వోగ్ర బలరామ కృష్ణుల విగ్రహములు
తీర్పఁబడియుండెఁ; బ్రజలచేఁ దేరు లెల్ల
నీడ్వఁబడుచుంట వీక్షించి రెలమి మిగుల 190

కం॥ సురగరుడ యక్షవిద్యా
ధర ఖేచర కిన్నరాది దైవతయోనుల్
సురపథమునుండి తిలకిం
చిరి యారథయాత్ర వేడ్క చిందులు ద్రొక్కన్ 191

కం॥ భేరీ కాహళ పటహా
ద్యారవ, మాయాత జనమహారావము గం
భీరమయి జనైకార్ణవ
పారము కడదాకి చెవులపండువు సేసెన్ 192

తే॥ గీ॥ కనులపండువుగా నెల్లఁ గనియుఁ గనియు
వీనులకు నెల్ల విందుగా వినియు వినియు
నెట్టులో తృప్తి నెంది వారెల్ల నిండు
మనసుతోఁ జేరుకొనిరి స్వమందిరంబు. 193

తే॥ గీ॥ ఆతఁ డావిలాసిని కొంప నడుగువెట్టి
నాఁటికిఁ బదేండ్లు నిండుకొన్నవి; యతండు
తొలుత సితపక్షచంద్రుఁడై తోఁచి తుదకు
బహులపక్షచంద్రుండయ్యె వారియింట. 194

కం॥ కనకంబు కరఁగె; ద్రవ్యము
వినష్ట మయ్యెఁ; దలంగె వివిధమణులు; చె
ల్లెన్ను సర్వము; నిర్ధనుఁడై
మనఁగాఁ గోవల నొకండు మాత్రము మిగిలెన్ 195

## కోవలన్ యెడ చిత్రవతి వసంతమాలల ప్రవర్తన

కం॥ మునుపటి రీతిని మణిధన
కనకాదిక మేకధారగా సొఁగమి నెం
డిన చెట్టునుబలెఁ గోవల
నును మాధవితల్లి చేరనుఁ శంకించుఁ. 196

తే॥ గీ॥ తన్నుఁ దేరఁగోరినది మాధవికి నీయఁ
దద్గృహమ్ము నాతఁడు చొచ్చుతఱిని గమల
మూఁతిము క్కొఱుంగనియట్లు బుసలువెట్టి
పాఁపజాతి తెఱగునఁ గోపమునఁ జూచు. 197

తే॥ గీ॥ చేతఁగల కాసులెల్లను జెల్లె; నింక
నీతఁడెండిన మడుఁగు; మేమెల్ల మీల
మొండొక మడుంగు చేరుట యుక్తమని త
దంతికమునకు రాదు వసంతమాల 198

తే॥ గీ॥ దుర్లలితుఁడు కోవలను లోఁదూఱునేమొ
యన్నవెఱఁ దద్భుజిష్యయు నెన్నఁడే నొ
కింతయును గవాటము తీయ దింటిచీమ
యైన రాఁకపోఁకలు సేయరాని యట్లు 199

కం॥ ఈమాడ్కి వారు తన్న
ప్రేమంబునఁ జూచుచూడ్కిఁ బేదనని విట
స్వామి యతఁడెఱిఁగి యిఁక నా
పై మాధవిప్రేమ యెట్లు వరలునొ? యనుచున్ 200

మ॥ ఒకనాఁ డెట్టులొ సందుచేసికొని కామోద్రేకి వాఁడింటి కే
గి కుపీ యున్నదె యోసి! మాధవి యనఁ గ్రేడించి పొమ్మన్న లో
నికిఁబోఁబోయినఁ, గాదు వెల్పలికిగా నేనన్న దంచాడు దా
నికిఁ గేల్మోడ్చుచులోన మాధవియు దానే వచ్చె నచ్చోటికిన్ 201

ఉ॥ దానినిఁ గాంచినంతనె యెదన్గల యార్తి తొలంగె వానికా;
ప్రాణసఖున్ గనుంగొనిన యంతనె యద్ది యుదీయమాన తే
జోనిధిఁ గన్న యంబుజని శోభవహించెఁ; బరస్పరేక్షలఁ
సూనములఁ మనోభవయశోధ్వజ మెత్తిరి వారు నింగికిన్ 202

## కోవలన్ యెడ చిత్రవతి వసంతమాలల ప్రవర్తన

కం॥ మునుపటి రీతిని మణిధన
కనకాదిక మేకధారగా సొంగమి నెం
డిన చెట్టునుబలెఁ గోవల
నును మాధవితల్లి చేరనుజా శంకించుజా. 196

తే॥ గీ॥ తన్నుఁ దేరఁగోరినది మాధవికి నీయఁ
దద్గృహమ్ము నాతఁడు చొచ్చుతఱిని గమల
మూఁతిము క్కొఱుంగనియట్లు బుసలువెట్టి
పాఁపజాతి తెఱగునఁ గోపమునఁ జూచు. 197

తే॥ గీ॥ చేతఁగల కాసులెల్లను జెల్లె; నింక
నీతఁడెండిన మడుఁగు; మేమెల్ల మీల
మొండొక మడుంగు చేరుట యుక్తమని త
దంతికమునకు రాదు వసంతమాల 198

తే॥ గీ॥ దుర్లలితుఁడు కోవలను లోఁదూఱునేమొ
యన్నవెఱఁ దద్భుజిష్యయు నెన్నఁడే నొ
కింతయును గవాటము తీయ దింటిచీమ
యైన రాఁకపోఁకలు సేయరాని యట్లు 199

కం॥ ఈమాడ్కి వారు తన్న
ప్రేమంబునఁ జూచుచూడ్కిఁ బేదనని విట
స్వామి యతఁడెఱిఁగి యిఁక నా
పై మాధవిప్రేమ మెట్లు వరలునొ? యనుచున్ 200

మ॥ ఒకనాఁ డెట్టులొ సందుచేసికొని కామోద్రేకి వాఁడింటి కే
గి కుపీ యున్నదె యోసి! మాధవి యనజా గ్రేడించి పామ్మన్న లో
నికిఁబోఁబోయినఁ, గాదు వెల్పలికిగా నేనన్న దంచాడు దా
నికిఁ గేల్మోడుచులోన మాధవియు ఁదానే వచ్చె నచ్చోటికిన్ 201

ఉ॥ దానినిఁ గాంచినంతనె యెదన్గల యార్తి తొలంగె వానికా;
ప్రాణసఖున్ గనుంగొనిన యంతనె యద్ది యుదీయమాన తే
జోనిధిఁ గన్న యంబుజని శోభవహించెఁ; ఖరప్పరేకలజా
సూనములజా మనోభవయశోధ్వజ మెత్తిరి వారు నింగికిన్ 202

కం॥ ప్రియుని@ గయిదండ యొసఁగుచు
శయనాగారమునకుఁ గొని చని మాధవి సు
స్మయదాననయై ప్రియ! యే
ల యార్తిఁగొన్నట్లు కన్నులకుఁ దోఁచె దనన్ 203

ఉ॥ ఆతఁడు పల్కె నన్యముగ నాత్మఁ దలంపవ యేని సత్య మ
ప్రీతి జనింపకుండ వివరించెదఁ; గొన్నిదినాలనుండి నీ
మాత, వసంతమాల, యొకమాటయుఁ బల్కరు. నన్నుఁ జూచి తా
మూఁతి ముడుంచుచున్ గముల బూతముఁ జూచినయట్లు భీతిలున్ 204

కం॥ ఎన్నఁడు మూయని ద్వారము
వన్నెలదొరసాని! తేయుఁ బవలుఁ బిహితమై
కన్నులకు నార్తిఁ గూరుచు;
నిన్నాళ్లవిధంబు గాన నిపు డీయింటన్ 205

కం॥ అనవుడు మాధవి యతనిని
స్తనములఁ బండించుకొని విషాదమ్మున నే
నిను నాథ! యని యనఁదగు; ద
గునే ప్రియా యని యనంగ గుణసంపన్నా! 206

కం॥ ఆ భాగ్యము కణ్ణగిదే
యీ భాగ్యవిహీన కద్ది యెటులబ్బు ననం
గా భయకంపితుఁడై శ్రో
ణీభారము చే నిమురుచు నేనరునఁ బలికెన్ 207

కం॥ ఈకరణిని నీవెపుడే
వాకొంటివె? యన్యపోలెఁ బలికెద వేలా?
నా కావించు ప్రతిజ్ఞ యు
శోకమనస్క వగుచు విను శుద్ధచరిత్రా! 208

తే॥ గీ॥ ఆలు కణ్ణగి; సఖి! ప్రియురాల వీవు;
నాకు గాత్రమది; మఱి ప్రాణంబ వీవు;
దానిఁ గాంచక బ్రతుకంగ నౌను నాకుఁ
గాని నిన్నుఁ గాంచక బ్రతుకంగఁ గాదు 209

కం॥ తరుణీ! మణిమేఖలపై
మురిపెము నాకెచ్చు; దాని ముద్దుమొగంబున్
మరువఁ దరంబే? కణ్ణగి
స్మరణము నీయనుటచేత మదికి స్ఫురించెన్ 210

కం॥ కావున నిఁక నే నింటికిఁ
బోవుట యనుమాట విడుము; పోయిన నిటనే
పోవుదుః మఱి జీవించిన
జీవించెద నిటఁ; ద్వదంఘ్రి సేవానిరతిన్ 211

కం॥ అనవుడు మాధవి వానిని
దన వల్లభునిగఁ దలఁచి యథాపూర్వముగాఁ
జనవిచ్చి మంచుచుండగఁ
జనె వానికి మఱియు రెండు సంవత్సరముల్ 212

తే॥ గీ॥ చిల్లిగవ్వయు మిగులక చెల్లిపోయె
నాస్తి యెల్ల నా రెండేండ్ల, కప్పు లిచ్చు
వారు కోవలన్‌సెట్టి కెవ్వారుఁ బురిని
గాగడా వేసి వెదికినఁ గానరారు 213

కం॥ కమలయు వసంతమాలయు
ను మాధవీజనని తన్ గనుంగొనుచు యథే
చ్ఛముగా గుజగుజవోవుట
కు మానసమునఁ గలఁగండు కోవల నెపుడున్ 214

## కోవలన్‌ను విడుమని చిత్రపతి మాధవికిఁ గావించిన దుర్బోధ

కం॥ ఒకనాఁడు చిత్రపతి చెం
తకు మాధవిఁ బిల్చి నీకుఁ దగిన హితంబొం
డు కుమారీ! యొనరింపఁగ
సకుతుకనై పిలిచితి; విను శ్రద్ధాళువవై 215

కం॥ ననుఁగన్నతల్లి! మాధవి!
యనయంబు దశావలంబియై కోటివిధం

బునఁ గోవల నీతఁడు నీ
దు నితంబము విడఁడు; వీనిఁ దోడ్తో విడుమీ! 216

ఉ॥ వీఁడొక దుర్వినీతుఁడు వివేకవిహీనుఁడు కట్టుకొన్న పూఁ
బోఁడికి స్వస్తిచెప్పి మనబోగము వీథికిఁజేరి కొంపయున్
గోడును విస్మరించి నినుఁ గూర్చినవాఁడునుబోలె నున్నవాఁ
డేతకునేడ? నీ కితని కీడును జోడును నేడ మాధవీ! 217

ఉ॥ కోమటిగా జనించి తనకుంగల సంపద కొల్లవెట్టి వే
శ్యా మధు నృత్యగాన వశుఁడై జనులెల్లరు ధూయనంగ నీ
భూమికి భారభూతుఁ డయి పోయినపోఁకను బోని దుష్టుఁడీ
గ్రామమునందు వీఁడొకఁడుకాక మఱొక్కఁడు లేఁడ యారయన్ 218

తే॥ గీ॥ లేఁడికంటి! మ్రింగ మెతుకు లేదు; మీస
ములకు సంపంగె నూనెయన్ పోల్కి నున్న
వీని మొగమునకును నొక వెలవెలంది
నాఁగ దేనితోఁ బకపక నగునొ? జగము 219

కం॥ తినుచును దోఁగాఁ డించుచు
గనుగొలుపఁగ వెంటఁ బడుచు ఖలుఁ డితఁ డింటన్
శునకము వలె నున్నాఁ డీ
శునకమునకుఁ దోఁకగోసి సున్నంబిడెదన్ 220

కం॥ నీప్రారబ్ధంబువనో
నాప్రారబ్ధముననో యనామకుఁ డథముం
డీప్రాఢ్భాయి విటుండై
నీప్రాణము పసరుమొగ్గ! నిలువునఁ గొనెడున్ 221

ఉ॥ జవ్వనమన్ ప్రసూనము వసన్ దులకించెడు దాఁక నిన్ను వీఁ
డీవగఁ గొల్చుఁ; బ్రేమ మెలయించు విటుండవు; నింత వాడెనే
దవ్వున కేగు; నిద్ది విటధర్మము; వానికి నీకు నొక్క రూ
పె వ్విధినైన వీని విడు టింకొకనిం గయికొంట తప్పనే 222

తే॥ గీ॥ గణిక జంగమ దీపశిఖాసమాన;
కాన నొకనిక వెల్గిచ్చి కదలకుంట

కానిపని; యన్యులకు సైత మో!నతాంగి!
వెల్గు నిచ్చుట తగవౌట వీడు మితనిఁ 223

... మాధవి ప్రత్యుక్తి. ....

కం॥ అనవుడు మాధవి తల్లినిఁ
గనుఁగొలఁకులఁ గొఱవు లెగయఁ గన్గొని ఛీ! పా
పిని నీ హితోపదేశం
బునకును నీకు నొకదండముఁ గావింతుఁ 224

కం॥ తన సర్వస్వము నేనని
మనమున నమ్మిన ఘనుండు; మాటవరున కే
ననియెద నాతని విడువన్
జనునే విభవంబు లేని సమయము నందుఁ? 225

సీ॥ ఎవ్వాఁ డొసంగిన హేరాళధనములు
మూల్గుచున్నవి మూలమూల లందు,
నెవ్వాఁ డొసంగిన యిద్ధరత్నంబులు
మురుగుచున్నవి పైఁడిబరిణె లందు,
నెవ్వాఁ డొసంగిన దువ్వలువలు బూజు
పట్టుచున్నవి వెండిపెట్టెలందు
నెవ్వాఁ డొసంగిన రవ్వల రవణాలు
కునుకుచున్నవి దివ్వెగూండ్ల యందుఁ

తే॥ గీ॥ గాఁడ తఁడ నామకుఁడు; కాఁడు ఖలుఁడు, కాఁ డ
వాంఛనీయుఁ డార్యుఁడు వణిక్ప్రభుఁడు గాక
యీవు చెప్పిన పగిదిని నిటుకులాఁడి!
వర్జనీయుండు కాఁడు; నాప్రాణవిభుఁడు 226

ఉ॥ మోహము చేతనో? యెడఁద ముచ్చట దీర్పనో? నృత్యగాన వి
ద్యాహృతుఁ డౌటనో? మన కతండు వసంపడెఁగాక; యే వరా
రోహలు వానిపొందునకు మ్రొక్కరు? భార్యయె రంభ! తా జగ
న్మోహనమూర్తి శ్రీదుఁడును మోమిటు నాకయి వెల్వనేటికిన్ 227

ఉ॥ ఇప్పటివాఁక నిద్ధధనమెంతయొ లెక్కకు రాదు; నేఁటికిఁ
దప్పట కెల్ల లేమియు కతంబు; ధరాపతు లైన వాని య
ట్లిప్పుడు నిచ్చియుండ రిది యీవు నెఱుంగుదు: లంజెతల్లివై
దెప్పటగాక యొండు గలదే? యిటులాడిన నోరు ప్రువ్వదే? 228

ఉ॥ ఇట్టియవస్థ యందును నభీష్టపదార్థముఁ జెప్పి తెమ్ము నా
గుట్టుగ నొండుపల్క కెదఁ గొంకక వే చని పామునోటఁ జే
వెట్టియు నైనఁ దెచ్చు: మును వేఁడిన వస్తువు లెన్నితేఁడు? నీ
యట్టిది సర్వముం గనినయట్టిది యిట్టులఁ బల్కనొప్పునే? 229

ఉ॥ శ్రీకమనీయుఁ గోవలనుఁ జేకొనియున్ బెడఁబాసి యుండనే
మేఁకొనుదానఁ; గాని మణిమేఖల యొక్కక్షణంబు తంద్రిసు
శ్రీకముఖాబ్జముం గనక జీవము దాల్చునె మేన; నన్నుఁ గా
దా కసిగందుమోము గని యైనను వానిని నిల్వ నిమ్మిటన్ 230

సీ॥ ఆమహాత్ముని యర్థమంతయుఁ దెగదిని
కాసులేని దరిద్రుగా నొనర్చి
యింటికి రాకుమం చేనోటితోఁ జెప్ప
గలను మాన మొకింత గలుగు నేను?
నా శరీరమునఁ బ్రాణంబన్న దూఁగాడు
నందాక నన్యునిఁ బొందఁజాల
నా సుందరాకారు నంటిన యీమేను
నన్యగాత్రస్పర్శ కనుమతింప

తే॥ గీ॥ దిటు పొడుచు సూర్యభగవానుఁ డటుఁబొడిచిన
నీ మహాదాత తనయింటి కేగుమంట
యన్యవిటునకు బడుకిచ్చి యల రొసఁగుట
నీకుఁ బ్రీతిగ నేఁ జేయునేర తల్లి! 231

కం॥ అన విని చిత్రపతి మొగం
బున వైవర్ణ్యంబు దైన్యముం దోఁపఁగఁ గూ
తును గని వెక్కుచు నా చె
ప్పిన దప్రియకరము మాధవీ! నీకయ్యెన్ 232

## చిత్రపతి కోవలనును నిష్కాసితుని జేయుటకుఁ దనకుఁ దోడ్పడ మాధవిని గోరుట.

ఉ॥ నీ వనుకొన్నయంత గణనీయుఁడు సద్గుణశాలి కాఁడ యీ
కోవల నీతఁ డెంతయు నిగూఢముగాఁ జెలికాండ్ర యొద్ద నెం
తో వసురాశి దాఁచి వెలిఁదోపఁగ నీయక యున్నవాఁడు నీ
వో వెఱిపుచ్చకాయ వయయో! యెద నమ్మితి వీవి టాధమున్ 233

ఉ॥ ఈమొనగాని ముద్దుసతి యాతనికంటెను ధూర్తురాలు, స్వ
స్వామి యెఱుంగనట్లుగ సువర్ణము, విత్తము, రాళ్లసొమ్ము లె
న్నో మిగిలించుకొన్నదని నోర్గలవారు వచింతు రింతకీ
కోమటిజంట గౌతముని గోవని నాయను టాదరింపుమా! 234

కం॥ శంబరునికి నేనిన్ వే
యుంబో యు చ్చితఁ డహో! పయోముఖవిషకుం
భంబో? గోముఖశార్దూ
లంబో? కా కితఁడు కోవలుఁ డ కాఁడమ్మా 235

చం॥ మనకులవృత్తి వైశికము మాయు నితం డిఁక నింట నున్న భా
మిని! చెడువార మెల్ల! మణిమేఖల కాటయుఁ బాట నేర్పి ని
న్నును బలె దేవదాసిగఁ గనుంగొన గోరుచు నున్నదాన; న
ప్పని కితఁ డడ్డుపుల్ల నిడి భగ్నపించెను నాదు డెందముం. 236

కం॥ గానము నృత్యము మనవం
శానుగతములైన విద్య లయ్యవి నాశం
బైన మనవంశగౌరవ
మే నిలువునఁ గూలిపోవు నితఁ డిట నున్నం. 237

కం॥ ఏకరణి నేని వీనిని
దోఁకకుఁ దాటాకుఁ గట్టి తోలఁగ వలయుం
లేకున్న సర్వముం జెడు
నీకును నాకును విపత్తు నిజముగఁ గలుగుం. 238

ఉ॥ ఏలకొ? వానిఁ బాయనని యేడ్తువు; నిన్నతఁ డగ్నిసాక్షిగా
నాలినిఁజేసికొన్న మగఁడా? యెడఁబాటున కోర్చి వాని యి
ల్లాలు పతాణి రీతి సవిలాసముగా దయివాఱుచుండ నీ
కేల భరంపడఁగా? విటుల కీపురి బొత్తిగ గొడ్డువోయెనే? 239

కం॥ పండుగనాఁడును బాఁతమ
గండే యటె? యొక్క గ్రుడ్డిగవ్వయుఁ జే తే
కుండిన వీఁడేనా విటుఁ?
డొంటొక్క కుబేరుఁ డిందు నొకఁడును లేఁడో? 240

కం॥ ఒకకొన్ని దినము లాతని
మొకమును గనకుందువేని మోహంబుడుగుఁగా
సకలంబుఁ జక్కఁబడు; వా
నికూర్చు టెంతో యెఱుంగ నేర్తువు నీవుఁగా 241

తే॥ గీ॥ దానిపల్కులు విన్న మాధవి యొకింత
మెత్తపడి వాని విడియుంట కత్తి కోఁత
నాకు నైన వానినిఁ బొమ్మనంగ నోరు
రాదు; తద్గుణాకృష్టి కోర్వంగఁజాల, 242

## మాధవి మెత్తపడుట చిత్రపతి గమనించి వెండియు మాధవికి బోధించుట.

చం॥ అన విని పల్కుఁ జిత్రపతి యాతని వీడ్కొను టెంత మాధవీ!
తనగుణ సంపదన్ వలచి దక్కను నాకిది యన్తలంపు కై
కొనదు ధనంబు. సక్తయను కొండొకభావము వాని మానసం
బున నెలకొంట నన్నతఁడు పూరికిఁ గైకొనఁ డింతకాలమున్ 243

ఉ॥ దీనికిఁదోడు వాఁ డిపుడు తిండికిలేని దరిద్రుఁ డైన లో
లోన మృషాభిమానమును లోకువగాని తెఱంగుఁ బైపయిఁగా
బూనుచు నేఁతిబీరవలెఁ బొంకము దప్పఁడు కాము కంటెనున్
జానగు నన్ను వీడఁగల జాణెతయే యిది యన్నబిఱ్ఱునఁగా. 244

ఉ॥ 'ఇంటికి రాకు మింక హృదయేశ్వర' యంచు వచింతు నెట్లు? ముం
డింటిని వానిసా మ్మతఁడు దివ్యసుఖంబుల నన్నుఁదేల్చె' నం
చంటివి; నీదుమాట సబబైనది; యాతనిమాట యెత్తిన
ప్డంటియు నంటనట్లు నలినాంబువు భంగి మెలంగు మాధవీ! 245

కం॥ ఆపైని నా తడాఖా
చూపెద; మనకమల చేత శుష్కప్రియభా
షాపారగుఁ డాకోమటి
తోపే నిష్కాసితుఁ డగురీతిఁ దలంతున్ 246

తే॥ గీ॥ కమలచేత నాతండు నిష్కాసితుండు
కాని పక్షాన నాచేత నైనఁ గాక
తప్ప దీనా ప్రతిన విను; మప్పకీరు
నేఁడుచెఱువుల నీటి నే నిదిగొ క్రోల్తు 247

....: *చిత్రపతి కమలను గట్టిడి సేయుట* :....

కం॥ అని చెప్పి మాధవిని భో
గనివాసంబునకు నంపి కమలను బిలిపిం
చి నిను నొక మహాకార్యం
బునకు నియోగింపఁదలఁచి బోటి! పిలిచితిన్. 248

కం॥ ద్వారముకడ నిలుము; దురా
చారుం డాకోమలన్ విశంక మదీయా
గారంబు చొచ్చునపుడు సు
దారుణమై యడ్డపడు మతం డొకవేళన్ 249

కం॥ బలవంతముగాఁ జొరఁగాఁ
దలఁచినఁ గటుభాషణములు తలవాయు నటుల్
పలుకుము; వానికి వెఱఁడే
నెలవంక లొసంగి వెలికి నెట్టుము వానిన్ 250

కం॥ అనిచెప్పి కమలఁబంపి త
దనంతరమ వెలవెలంది యమ్మయుఁ గాల్గా

లిన పిల్లికరణిఁ దిరుగుచుఁ
దనగృహమున నుండె మీఁదు తలఁచుచు నంతన్ 251

సీ॥ ఆయేటి యింద్రమహమ్మున కాదిన
మంతిమడిన మౌట నందఱుఁ బురిఁ
బలువన్నియల వస్త్రములు దాల్చి వీధులఁ
గలకలలాడుచు మెలఁగుచుండి
రచ్చటచ్చటఁ బెద్దరచ్చల నృత్యమ్ము
లుత్సవాలు కనువిం దొసఁగుచుంటె
వాద్యగీతాల రవంబుల నగరి యం
భోధి చందంబున బోరుకలఁగె

తే॥ గీ॥ సరససల్లాపములతోడ జనులు పలు వి
నోదములు గాంచుచు నెదల మోదమాను
లైరి; యది బహూకృతులు పేర్వేర నొసఁగు
దివస మౌటఁ గోవలను మదిం దలంచె 252

కం॥ కానుకలు ప్రియుకుఁ గొనిపోఁ
గా నాచేత నొక చిల్లిగవ్వయు లే దె
ట్లే నా మాధవిచెంతకుఁ
బోనేర్తును రిక్తహస్తముల దైవంబా!. 253

కం॥ ఏ నిచ్చిన నీకున్నను
దా నొండొక రీతిగా నెదన్ దలఁపదు; నా
పై ననురాగము కడుమెం
డా నలినాక్షికి; విశంక నరుగం జనదే? 254

కం॥ వాడుకచొప్పున నే నీ
నాఁడు ప్రియ సముద్రమజ్జనమునకు విధిగాఁ
దోడనఁ గొని చనవలె నని
వాఁ డామధ్యాహ్న మేగెఁ బడఁతి వసతికిన్ 255

....: చిత్రపతి కోవలన్‌ను బరుషము లాడుట :...

సీ॥ ద్వారంబు కడన ప్రత్యక్షమై కమల ప
ట్టైకు నానుకొని వాని మొకము గనుచు

మాధవీదేవికి మణిమేఖలకుఁ గాన్క
లేమేమి తెచ్చితి? స్వామి! యన్న
నీళులు నమలుచు నిలువెల్లనుం గొయ్యఁ
బాఱిన కోవలన్ వైపు సూచి
మూఁతియు ముక్కును ముడిఁచె; వాఁ డంతట
నవికృతుఁడై లోని కరుగఁబోవ

తే॥ గీ॥ నడ్డుకొనఁ జేయుఁ గాలును నాడక యది
యూరకే చూచుచుండ వాఁడుఱక లోని
కొకటి రెండడుగులు వెట్టి యుగ్రమూర్తి
యైన చిత్రపతిఁ గని యి ట్లాత్మఁ దలఁచె 256

తే॥ గీ॥ కమలఁ దప్పించుకొని దీని కంటఁబడితి
నకట! పొగనుండి సెగఁబడినట్టు లయ్యె
నాదు స్థితి; యిది నాదు ప్రాణంబు దీయు
నని తలఁచు లోన నది గ్రేటుకొనుచుఁ బలికె 257

ఆ॥ వె॥ అచ్చువేసి విడిన యాఁబోతుభంగి నూ
రెల్లఁ దిరిగి తిరిగి యేలవత్తు
వోయి! మాటి కింటి? కూరిలోఁ దిరుణాళ్లు
కనులకింపుఁ; బోయి కాంచ రాదొ? 258

కం॥ అన విని యతఁ డింద్రోత్సవ
మున కిది కడపటి దినము సముద్రస్నానం
బునకుఁ మాధవిఁ గొనిపోఁ
జనుదెంచితిఁ దొంటికితి సాఁగింపంగ౯ 259

సీ॥ అనుడు నమ్ముదుసలి యదికాలిమంట నె
త్తికి నెక్క నిట్టు లుల్కక వచించె
నింద్రోత్సవంబున కిది కడపటి దిన
మ౯ మాట మఱచితి; నాదమఱక
యంబుధి స్నానానకై మాధవిఁ గొనిపో
నరుగుదెంచితి రిక్తహస్త! నేఁడు

శుష్క ప్రియంబులు శూన్యహస్తంబు ల
న్నట్టులున్నది భవదాగమనము;

తే॥ గీ॥ కోట్లకుఁ బడగలెత్తిన మేటిమగలు
వారకాంతల కీనోపు వారు కాక
యీవొ? యష్టదరిద్రుఁడ వెట్టు లీయ
నోపుదువు; మాగృహమున; గాలూనకు మిఁక 260

ఉ॥ ఏమి మునింగిపోయెనని యిక్కడికిన్ బరువెత్తి నాఁడ వ
య్యా! మఘవోత్సవాంతమున నందఱు కాన్కలొసంగుచుండ నీ
వేమియుఁ దేకయుంట తగవే? యెటు లబ్బితి వీవు మాకు;? నేఁ
డేమి మొగంబు వెట్టుకొని యేగును మాధవి వార్ధి కక్కటా! 261

తే॥గీ॥ తొంటిజన్మానఁ గుత్తుకబంటి పాప
మేమొనర్చెనొ మాధవి? యీవు విటుఁడ
వైతి; నీమొగంబును వఱువాతఁ గన్న
నిచ్చువాఁడును నీకుండ నేగుఁ గడకు 262

ఉ॥ ఈవ ప్రియుండ వంచు నెద నెంచిన మాధవి కయ్యె శాంతిః ఛీ
ఛీ! విషకంఠ! నీయమృతజిహ్వత గన్గొని నేను మాధవీ
దేవియు మోసపోయితిమి; దీనత మాధవి దాల్చు నీ ప్రియుం
డేవగ కాన్కలిచ్చె? నని యెల్లసఖుల్ తనుఁ బృచ్ఛసేయుచోన్ 263

కం బాలిశ! నిను నమ్మిన మా
బాలిక యొండొక్క విటుని పజ్జకు జేరం
జాలక తల్లక్రిందు లగుచుఁ
బాలంబడి తనకలాడు బల్లిగ నయ్యెన్ 264

కం॥ ఒకయమ్మకు నొకయబ్బకు
నికరముగాఁ బుట్టితేని నీచుఁడ! వాయిం
టి కడప త్రొక్కకు మని కో
పకలుషయై పలుక నగుచు వాఁ డిట్లనియెన్ 265

కం॥ ఇంతకు నంతకుఁ బనిగొని
యింతగఁ గోపించు టేమిహితము? పదావ్వ

త్రాంతము దెలుపఁగ మాధవి
చెంతకుఁ జనువాఁడ; పథము శీఘ్రమ విడుమీ 266

## —: మాధవి పల్కులకు కోవలన్ మనస్తాపము. :—

కం॥ అనవుడుఁ జిత్రపతి పథం
బున కడ్డము తొలఁగి నిలిచెః బుడబుడ నతఁడుఁ
జని నిరలంకారగ ను
న్న నిజప్రియ మాధవి భవనంబునఁ గాంచెన్ 267

కం॥ కాంచి కడుదీనముగ మ
న్నించుము నను మాధవీ; యనిందుఁడను; బ్రయా
త్నించియుఁ గానుక తేని యు
కించనుఁడన్, సత్యవాదిఁ గినియకుము ననున్ 268

కం॥ అనవుడు మాధవి హసదా
ననయై కైసేసి కొందు, నాథ! యవలకున్
జనుము; కయిసేఁత ముగియుడుఁ
జనుదము పాథోధి కడకు స్నానమున కనన్ 269

తే॥ గీ॥ సగము కైసేసికొని పెఱసగముఁ జూపి
దయిత! కయిసేయు మని నన్నుఁ దాన యడుగు
నట్టి మాధవి యేల నన్నవల కరుగు
మనియె; నిది బాకుగా నాయమందుఁ దాఁకె 270

కం॥ ఈ మార్పునకుఁ గతము పో
రామి క్షయం బగుటయో? నిరాదరణమొ? నా
లేమియొ? మఱియొక్కండో?
యా మాధవి కెఱుకగాక యన్యుల కెఱుకే 271

ఆ॥ వె॥ పొమ్మనంగ లేక పొగఁబెట్టి నట్లున్న
దీ యొయారిపలు కిసీ! యటంచు
నింగి నెమరు వేయు చంగలార్చుచు నుండె
బంటు వోలె దాని యింట కడప 272

సీ॥ పాఱ నావైచిన పాచిక యన్న దు
ర్గర్వం బొకింతయుఁ గాన నీక
పట్టిన దెల్లను బంగార మౌనన్న
యుబ్బుటుప్పొంగిన వెలికుబ్బనీక
ఏటికి నెదురీద నేన నేరుతు నన్న
యాత్మధైర్యంబు పై కడరనీక
కాలంబు కలిసిరాఁ గాని దేమున్నది?
యన్ననమ్మిక పెఱ కందనీక
తే॥ గీ॥ కుక్కపైఁ బెట్టియో యింటి కోడిపైనిఁ
బెట్టియో వణిక్ పుత్రునిఁ దిట్టు కమలఁ
గనుల నాకట్టుకొంచు నా గణికతల్లి
యేమియు నెఱుంగనదివోలె నింటనుండె 273

*... మాధవి సముద్రతీరమున కేగుటకు ముస్తాబగుట —*

ఉ॥ వేసలి పూవుబెత్తు లరవీడగఁ దామరపూబుటాల నిం
పొ నెఱపట్టుచీర కటి నంద్రుల నందెలు, గప్పు చన్గవన్
పైని హొరంగు మేల్ముసుఁగు వర్తిల మాధవి వచ్చెఁ దుంటవి
ల్కాని సవారుగుఱ్ఱ మనఁగా వెలికిన్ హసదాస్యపద్మయై 274

కం॥ దానిఁగని నంతనె బక
ధ్యానము గావించు చింటితల్పుకడన్ ద్రమా
నై నిల్చియున్న వణిజున
కానందము వెల్లివిరిసెఁ; నార్తియు నడఁగెన్ 275

కం॥ తానిడ్డ నగలలో నొక
కైనను మాధవి ధరింప కంబుధీ కేగం
గా నరుదెంచుట వుండున
వానికిఁ గారంబు చల్లుపగిదిగ నయ్యెన్ 276

ఉ॥ ఐనను వాఁడు కుంభగతమైన ప్రదీపము వోలె నిశ్చలుం
డై నయనంబులన్ బొడము నశ్రుల ఱెప్పల నాఁగి యాఁగి క

యొ్యానకుఁ గాలుదువ్వు నొకఁ డాడిన దీని సవిత్రియంచు లో
లోనఁ దలంచుచుండెఁ బుయిలోడుచు మూసిన నోరు విప్పగన్ 277

కం॥ తనుఁ గాంచియు బెల్లము గొ
ట్టిన ఖాయి తెఱంగునఁ ముడింగిన చిత్తం
బున నుండిన కోవలనును
గని మాధవి పలికె నిట్లు గలగల నగుచుఁ 278

—: మాధవి కోవలన్ తోఁబల్కిన పల్కులు :—

సీ॥ ఇంద్రోత్సవంబున కిద్ది ధ్వజావరో
హణదివసంబు ప్రాణాధినాథ!
వాడుక చొప్పున వార్ధితీరమునకుఁ
బోడి, యాడ, మరియు పదము కాంత!
మనకునై యటఁ గాయమానము నొకదానిఁ
బ్రత్యేకముగ భద్రపరచితిఁ బ్రియ!
అందుండి మనము పూర్ణేందూదయపువేళ
చెలువంబు నెలమిఁ జూచెదము సుభగ!

తే॥ గీ॥ జీవితానందమధువు నచ్చినవిధమునఁ
ద్రావి గ్రోలున ఁద్రేతము దయిత! తెమ్ము
రమ్మని భుజంబు చఱవఁ గరంగి, కనుల
నవ్వుకయు నవ్వి సిద్ధమైనాఁడు వాఁడు 279

కోవలన్ మాధవీ ప్రభృతులతో సముద్ర తీరమునకుఁ బోవుట.

తే॥ గీ॥ వేసడము కోవలను; మాధవియు వసంత
మాల, కమలయు ఁదేరెక్కి మధురవేషు
లై పయోధితీరమునకు నాపణపుబ
జారుత్రోవ బడి ప్రయాణమైరి వేడ్క 280

సీ॥ సూత్రపట్టినయట్లు సొరిది నిల్పంబడ్డ
బంగారుటనఁటి కంబాల సొబఁగు

నాకంబముల తల కంటఁగట్టిన మహో
న్నతములైన ధ్వజాల నటననలువ
నాధ్వజంబులపయి నాస్థితములయిన
కలువడంబులచాలు జలుఁగుఁదనము
నాకల్పడంబుల నాచుంబితములైన
చంద్రశాలికల సంచయము బెడఁగు

తే॥ గీ॥ నడరు నంగళ్లవరుసల యందము గని
వానఁ బలువస్తువులు భద్రపఱచుకొనుచు
నమరు నన్యదేశముల బేహారుల ఁగను
చరిగి రవ్వారు మెల్లఁగ నబ్ధికడకు 281

సీ॥ అట సుమత్రాద్వీపమందుండి తేఁబడ్డ
పోఁకకాయలు మిర్యములు లవంగ
పట్ట, యేలకులు, లవంగాలు, పశ్చిమా
బ్దిసమాహృతములైన విద్రుమములు
మలబారుదేశపు మంచిగందపుఁజెక్క
లరబియే థోపియా ద్యాహృతములు
పాల్యంక సర్జక ప్రభృతివస్తువులు. పం
జాబుగాంధారదేశముల నుండి

తే॥ గీ॥ సూరతు బరూచరేవుల సొరిది దింపఁ
బడ్డ లవణ, మింగువ, యత్తి పండ్లు నెండు
ద్రాక్ష; సింహళనీలరత్నాలు; కోరు
వాయిముత్యాలు కుప్పతిప్పలుగ నుండె 282

తే॥ గీ॥ వెండియును గంగప్రాంతంబు నుండి తామ్ర
లిప్తి రేవునకు నతిపర్యాప్తముగ స
మాహృతంబైన వస్తుచయంబు చూచు
జనుల కెల్లను గన్విందౌ సంగుచుండె 283

కం॥ జలధి సువిశాల సికతా
స్థలంబు తత్రత్యదీప సంతాన చ్ఛా

యలలో సుస్నాతమయిన
చెలువున్ దలపించె నచటఁ జేరిన ప్రజకున్ 284

కం॥ కనుచూపు పాఱుమేరకు
వననిధిలో బెద్దబెద్దపడవలు, నావల్
చనుదెంచి యొక్కవైపున
ననుకూలముగ నిలిచి ప్రజ కచ్చెరు వొసఁగెన్ 285

కం॥ మున్నీట నోడలకు నిశఁ
దెన్నున్ గాన్పించు కొఱకు దీరంబున కా
సన్నముగ నచ్చటచ్చటఁ
బన్నిన రాఁడుల నెగళ్ళు భ్రాజిలుచుండెన్ 286

సీ॥ సహ్యజాసంగమస్థలమున సూర్యకుం
డంబని సోమకుండంబని సడి
సన్న హ్రదంబుల స్నానమాడినఁ గవ
నాయరు ప్రియులను వాక్యముబడి
వాన మాధవితోడఁ దాను స్నానంబాడి
యామరణాంత మయ్యుతివ జంట
వాయకుండుటకుఁ గోవలను దలఁచుచుండెఁ;
గాని యా కుండాల కడ జనంబు

తే॥ గీ॥ లిసుక వేసిన ఱాల నట్లి ఱకటపడు
చుంట మాధవి గని యట నోలలాట
కనుమతింపక తత్తిర మానుకొనియ
యున్న యొకతోపుఁ దూఱి ప్రియునికి ననియె 287

## ...: కోవలన్ మాధవీ ప్రవర్తనను శంకించుట :...

కం॥ విజనం బీతావు; సుమ
వ్యజనంబులఁ బూని గంధవహుఁ డిచ్చటికిన్
విజయంచేసెడు నిను నను
గజవిక్రమ! సేవచేయు కామనఁ గంటే! 288

ఉ॥ ఇక్కడి వృక్షవాటికల కెక్కిన తీవెలు పూలవాసనల్
గ్రక్కుచు, వారిరాశి జలకంబులఁ దోఁగుటఁ గొచుతావికిఁ
జిక్కి, సుగంధ మెంతయుఁ గృశింపఁగఁ బంచమునట్లు స్పర్శకుఁ
దక్కిన మందమారుతు నొనర్చుచునున్నవి గంధవాహుగన్ 289

కం॥ అలినీ కింకిణికా ప్రో
త లతా కటిసూత్ర పరభృతస్వర పరిప
క్వ లికుచ సుస్తని, యీవని
వలపులు నీపయిని గురియు వడువున నొప్పున్ 290

చం॥ వలపులు సన్నగిల్లఁ బరువం బెడఁబాసిన మావికొమ్మ తేఁ
టులరొద కూతవెట్టుచుఁ గడుంగడుఁ బిల్చిన చేరరాఁడు కో
యిలవిటకాఁడు; తొల్లిఁటి రహిన్ దలపోయఁడు; వాడుపాటు కొ
మ్మల కగునేని పల్లవసమాజ సురాగము లుల్లసిల్లునే? 291

ఉ॥ అంటినదాని ముట్టఁడు; ప్రియా యని ఝుంకృతికైతవాన వె
న్నంటిన దానినేని కనఁడా స్యమొసంగిన దాని గైకొనం
డంటిన మ్రోఁగుదాని కయి యఞ్జలు సాఁచు మధువ్రతుండు వీఁ
డొంటరిగాఁ దపించు ప్రియ నొల్లనివాఁడ వుగాదె వల్లభా! 292

కం॥ అని పలుకుచున్న మాధవిఁ
గని దీని ప్రవర్తనమున? గ్రమపరిణతి కే
మి నిమిత్తంబో యని మన
మున గోవలను విభుఁడు దలపోయుచు నుండన్ 293

తే॥ గీ॥ అదియు దాసిచేతి విపంచి యందుకొని త
దష్టతంత్రుల నొకచేత, నన్యమునఁ ద
దీయములయిన మెట్ల ర్వదియును రెండు
మీఁటు చమృతంపువాకగాఁ బాట వాడె 294

తే॥ గీ॥ పాట ముగియించి వీణియ వల్లభునకు
నిచ్చి చవులూర మీరు గొంతెత్తిపాడుఁ
డెన్నిదివసంబు లయ్యె మీప్రన్నని స్వర
మాలకించి యన నతండు ననుమతించి 295

## కోవలన్ కావేరిని స్తుతించుట

తే॥ గీ॥ కన్నతండ్రిని విడిచి మార్గశ్రమంబు
సరకుసేయక ప్రియపడి సాఁగి వచ్చి
యూర్మిబాహుల సాగరు నొక్కపెట్టి
నిఱికికొను సహ్యజను గూర్చి యిట్లు పాడె 296

శా॥ కావేరీ! వదనాబ్జమం దొదవ రాగం బూర్మికా కంకణ
శ్రీవిద్యోతితవై జడాత్ముఁడ యినన్ శ్రీ లేనివాఁడో గుణ
శ్రీవిఖ్యాతుఁడు కాఁడొ? నాదయితుఁడు ర్వీత్రాత యంచం బుధిన్
నీవూ రించెద వేకపత్నివని నిన్ గీర్తింతు వేనోళులన్ 297

శా॥ నానాథుండు బహూపభుక్తతనుఁడై నన్ నాకుఁ బ్రాణప్రియుం
డైనాఁడె ప్త గభీరమూర్తి యయి మర్యాదన్ విడండం చు నెం
తేనిన్ బొంగులు వాఱుచుందు విల నీ కెవ్వర్తయున్ సాఁటిరా
దా నాఁడేనియు నేఁడు నేనియు గుణవ్యామోహినీ! సహ్యజా! 298

కం॥ కావేరి వంచు ఁబతి నీ
పై వైముఖ్యంబు లేక వర్తిలుటకు నీ
పావనగుణసంపదయే
జీవనదాయిని! కతమని చెప్పఁగ వలెనే? 299

శా॥ నీ కల్లోలగతాబ్దగర్జితములన్ వించున్ మరాళంబు లెం
తో కంపించుచు నొక్కమాఱె గయ వ్యాధూతా యతా చ్ఛచ్ఛదా
నీకో ద్వేలసమీర సంమిళిత డిండీరంబు గన్పట్టుఁబై
పైకిన్ సాఁగెడు నీదు కీర్తిరమణీ పైతాపటంబో యనన్ 300

ఉ॥ నీయమృతోపమాంబువుల నెక్కొను సస్యము లారగించు మా
కే యెడలోటులేద పరిహీణకృపన్ గృషికాళిఁ బ్రోతువ
మ్మా! యెద నీకు మెత్తనిది; మంజులగీతుల తోడ గాయనీ
గాయనులున్ గవుల్ నుతుల గాన మొనర్తురు నిన్ గవేరజా! 301

కం॥ అని కోవలను గవేరజ
వినుతించుచుఁ బాడి చేతిపీణియ నంతం

బున నున్న మాధవి కొసఁగి
తనువుము నీపాట నన్నుఁ దరుణీ యనుడున్ 302

—: మాధవి సముద్రుని సోత్ప్రాసముగా స్తుతించుట :—

కం॥ మాధవి విపంచికఁ గొని ప
యోధరమధ్యంబుఁ గాయ లోరయఁగ నిడి పా
థోధిని నుతించెఁ దన స్వర
మాధుర్యము చింద వక్ష్యమాణవిధమునన్ 303

తే॥ గీ॥ ఫేన నవచందనంబు నెమ్మేన నలఁది
రత్నహారభూషలతోడ భ్రాజిలి యఖి
లాపగాసుందరుల ఁదేల్తువంచు సుకవు
లంట సత్యంబొ? కాక సత్యంబొ? జడధి 304

ఉ॥ నీ పులినంబునందు రమణీరమణుల్ విహరింత్రు ఛేపులున్
మాపులు; ఫేనహాస పరిమండిత వక్త్రపయోజ ముగ్ధలౌ
ద్వీపవతీనితంబినుల విభ్రమముల్ పరికించు నీపయిన్
జూపులు నిల్పి కాముకులు చొక్కు వహింత్రు తరంగిణీప్రియా! 305

ఉ॥ ఆకడ నుండి విష్ణుపద మందు జనించి పవిత్రయైన సు
శ్లోకయు దాని ప్రాణసఖి సూర్యతనూభవ యైన పుణ్యయున్;
ఈకడ నుండి సహ్యగిరి కించినపుత్రి రమింత్రు నిన్ను ర
త్నాకరుఁ డంచుఁ గాని సగరాత్మజుఁ డంచు దలంప రంబుధీ! 306

శా॥ మర్యాదన్ విడఁడంచు, లోకపతి యా మాస్వామి జామాతగా
నార్యస్తుత్యుఁడు నయ్యెనంచు నదు లత్యంతానుకూల్యంబుతోఁ
బర్యాయంబుగఁ జేరు నిన్ను; ఁదమభావంబందు నిన్నున్ మహా
హార్యాత్ముండని యేల యెంచ వొకనాఁడైనన్ నదీవల్లభా! 307

॥ నీవంశోన్నతి, నీగభీరతయు నీనిర్ణిద్రభావంబు నీ
లావణ్యంబును మెచ్చి స్వాదురస లీలాలోలయై చేరు మా
కావేరిన్ జలజంతుసంతతులకున్ గావిత్తువో? కొండలం
దావాపింతువొ? బాడబాగ్నిశిఖ స్వాహా యందువో? సాగరా! 308

## —: మాధవి సోత్ప్రాసముగఁ గావించిన కావేరీ స్తోత్రము :—

కం॥ అని సోపాలంభముగా
వననిధి స్తోత్రంబు సేసి బడిబడిఁ గావే
రిని గని సోత్ప్రాసముగా
వినుతింపఁ దొడంగె మాధవి హసన్ముఖియై 309

కం॥ జడనిధి నత్యంతచపలు
నిలవెల్లను భంగపాటు నెలకొనువానిన్
జెలువునిగఁ బడసియును లోఁ
గలఁగవు; దుఃఖంబుఁ గొనవు; కటకటపడవుౘ 310

కం॥ సావిత్రియో? యరుంధతి
యో? వేదవతియొ? సుమతియొ? యుర్వీసుతయో?
ద్రోవదియో? కా కన్యలు
కావేరీ! నీకు సాటిగారె వ్వారున్ 311

## కోవలన్ మనః పరీక్షకై మాధవి చెప్పిన కల్పిత వృత్తాంతము

కం॥ నీ వలె నేనును వాణిని!
యౌవత మానాపహారియౌ ప్రియు నొకనిన్
భావంబున గామించితి
నావైపున వాఁడునున్ బ్రణయియై యుండెన్ 312

తే॥ గీ॥ అంతఁ దద్భావ మెఱుఁగ వయస్య నోర్తు
వాని చెంతకు దూతిగాఁ బంప వాఁడు
జలధియొడ్డున నొక యభిసారవేత
సీకుటిని (దన్ను) నను సంధ్యఁ జేరఁబనిచె 313

ఉ॥ ఏనును దూతితో నటకు నేగితి; నంతకు మున్న వాఁడు పా
థోనిధి వేతసీభవన తోరణ మందున విల్లు నమ్ములుౘ
లేని ప్రసూనచాపుని వలెన్ దిరుగాడుచు నన్నుఁ జూచి స్మే
రాననుఁ డయ్యె, నేనును దదంతిక మేగఁగ సంశయించుచోౘ 314

కం॥ కన్నుల నగిదూతిక జడ
క్రొన్ననతో నన్ను వ్రేసి గుజగుజలాడన్
జన్నే? గ్రుక్కిళ్ళిత్తింగితి
మున్ని; ప్పుడు కొంకె దెట్టి ముగుదతనంబో? 315

కం॥ అని కేరడ మాడుచు వా
నిని నన్నొ కటిగ నొనర్చి నేమను నాకాం
తునికై పోయెద; (జంద్రుం
డును యామినికై భ్రమించెడున్ దూర్పుదెసన్

316

కం॥ అనిపలికి కొంతదవ్వగఁ
జనె; నన్ నాప్రియుఁడు వైతసనికుంజాంతం
బున నున్న శయ్యకున్ గొని
చని, యంకంబున ఘటించి సరసముగ ననెన్ 317

కం॥ నావక్షఃప్రియసఖివై
యావంతయుఁ గొదువలేక నలరుము, నేనున్
నీవక్షోరుహలక్ష్మి
సేవాభావకుఁడనై వసింతు నొయారీ! 318

కం॥ పూచినపుష్పంబవు నీ
వేఁచిన యెలఁదేటి నేను; నిరువుర మొకటై
వాచవిగ వలపుఁదేనియ
మేచకకచ; యానుదమని మృదుమధురముగన్ 319

కం॥ పలుకుచు. జడ దువ్వుచు, గు
బ్బలు పుడుకుచుఁ మై నిమురుచు, (బంటిమొన్ తే
జిలిబిలివాతెఱ నానుచుఁ
బలుపోఁకలు వోవుచున్న వానికి నంటిన్ 320

కం॥ స్మరసుందర; మైసిరి మగ
సిరియును గల సొగసుకాని చెందుట కంటెన్
బరమార్థం బొండు గలదె
తరుణికి; నిదె నీకు నేను దక్కితిఁ గాంతా! 321

కం॥ ఈ మలయగంధవాహుం
డీమనకావేరి; యిచటి యీ యీరంబీ
సోముండీ పూఁదీవలు
నామాటకు సాక్షు లంగనాజనకమనా! 322

కం॥ ఐనను నేను బితృపరా
ధీనను గన్యక యథావిధిని నుద్వాహం
బై నన్ను రమింపుము సుమ
కానన, కాసార, కేళికాగ్రావములన్ 323

కం॥ నామాట చెవినిఁ బడఁగనె
మోమునఁ దొల్లింటిడాలు పొరిఁబొరి సన్నం
బై ముడుఁగ నొక్కలాఁగై
నామీఁదికి వ్రాలి పలికె నలుగుడు పడుచున్ 324

కం॥ నీకోరికబడి మెలఁగుట
నాకున్ శ్రేయంబు కాని నామది నొకచీ
కా కేర్పడియున్నది నే
నీ కది వివరింతు వినుము నిశ్చలమతివై 325

కం॥ వ్యాపారార్థము నేఁడో
తేఁపో దేశాంతరం బరిగెదన్ దన్వం
గీ! పరిణయవృత్తాంతము
ప్రాపిల్లెడు నాదు తిరుగు పయనము మీఁదన్ 326

కం॥ అంత దనుక కాదని ని
శ్చింతముగాఁ జేదుమాట చెవి నాటె నతం
డంతట నాదూతియు మా
పొంతకుఁ జనుదెంచె; వృత్తమున్ వినె నెల్లన్ 327

కం॥ పిమ్మట దూతి వివాహము
కమ్మా వల నన్యదేశగామివి: కమ్మీ
కొమ్మ యభీష్టము తీర్పుము
చిమ్మకు గాలికి శుభస్య శీఘ్రః మనునుడిన్ 328

కం॥ అనియనె; నతఁడె దురాడక
వినీతు నట్లు నను దూతి వీక్షించుచు మీ
యనునట్ల సేయువాఁడను
చనుదము, ఔ చాలగడచి చనె సతులారా! 329

కం॥ అని తనదారినిఁ దాఁజనె
ననుమానంబు డిగి మేము నంబుధి తీరం
బున నుండి మాగృహమునకు
జనుదెంచితిమి తదధీన సర్వస్వాలమై 330

కం॥ తోయధిరమణీ! కావే
రీ! యానాఁడీ గిచన్న ప్రియుఁడీ నాఁడున్
నాయంతికమ్ము చేరఁడు
నాయాననమున్ గనండు, నన్నుఁదలఁపఁడుఁ 331

కం॥ ఆనాఁడు మొదలు భోజన
పానాదిక ముజ్జగించి వగచుచు ఁదుదకుఁ
దానన్నుఁ బ్రతారించుట
మానసమున నిశ్చయించి మరుగుచు నుంటిన్ 332

కం॥ నాయీవృత్తము నీవును
నీయనుఁగుఁబ్రియుండు వారినిధియును విన్నా
రే యనువున నైనను న
న్నాయన మీరలు ఘటింపుఁ డార్తియడఁపుఁడీ 333

కం॥ పురుషులు బహులంపటు ల
స్థిరప్రణయులు కపటులు ప్రతిజ్ఞాఘాతుల్
విరసులు, స్వామిద్రోహులు
కరుణాహీనులు వధూసుఖప్రతిహంతల్ 334

కం॥ మొదట రసగ్రహణంబునఁ
బదముల వ్రాలుదురు; తుదినిఁ బైకెక్కుదు రు
న్మదులై యేతాములక్రియ
మది నమ్ముట తగదు మగల మానవతులకున్ 335

కం॥ నడతురు వక్రమ్ముగఁ గీ
ర్వడకే బుస్సంద్రు; పడగవట్టుదురు కనం
బడనిత్తురు భోగము; తుది
విడుతురు కుబుసమ్ము మాడ్కి బ్రియల భుజంగుల్ 336

కం॥ తామ సురక్తిగఁ బై కు
న్నామని భావింత్రు, కడమ నల్లనిరూపం
బేమాత్రం బెన్నరు; భువి
లో మగవారు గురిగింజలున్ సమవృత్తుల్ 337

కం॥ పురుష స్త్రీప్రకృతి నుదధి
తరంగిణులలో విరించి స్థాపించె, నయో!
పరముం డతండు దాని వి
పరీత మొనరించి యున్న బాగుగనుండున్ 338

కం॥ తరువు న్నయెడకుఁ బ్రాఁకుచు
నరుగుఁ లత; స్త్రీయుఁ బురుషునాశ్రయమునకై
పరువెత్తు; నీ స్వభావము
పురుషుని ధీరుని నొనర్చెఁ బొలఁతి నధీరఁ 339

కం॥ నేనును నీవును గావే
రీ నవలాలము; వరునకుఁ బ్రియురాలవు నీ
వే నో యప్రియురాలను;
నూనం బొక్కెడ రహించు; సొలయు నొకయెడన్ 340

....: కోవలన్ మాధవి శీలమును శంకించుట :...

కం॥ అని పాడి విపంచిక ప్రే
క్కనఁ బెట్టి ప్రియాననంబు కాంచిన మును మె
చ్చిన దానికంటె నెక్కుడు
గ నాతఁడు ప్రశంసనంబు గావించు చెదఁ 341

తే॥ గీ॥ నిష్కపటముగఁ బాడితి నే నమాయిఁ
గాని యన్యాపదేశంబుగా లతాంగి

పాడి వెలయించు కొనెఁ దన వక్రబుద్ధి
భోగినికి వక్రగతి తోనె పుట్టియుండు 342

కం॥ కుమతిని నాయెడ వైమ
నస్యము దీనికి మున్నుపుట్టి యల్ల నెదుఁగుచుఁ
గ్రమపరిణామముచేఁ బూ
ర్ణమయ్యె నని దీనిపాట నా కెఱిఁగించెన్ 343

ఉ॥ నేను దరిద్రుఁడై కతన నిష్ప్రియత్వము పుట్టె నెచ్చుగా
దీనికి నంచు లోఁ దలఁచితిన్ మును పం తియకాదు మేని నా
యూనినదాని శేషమగు యౌవనలేశము నొందువాని కె
వ్వానికొ నమ్మఁబోవు నను వాసన పర్వెను దీనిగీతికన్ 344

కం॥ ఒక నిప్పటికే మరఁగెనె?
మరగం బోయెడినొ యింక మాధవి? యెఱుఁగన్
దరమే నాకా? పరమే
శ్వరుఁ డొక్కరుం డెఱుఁగుఁగాక సర్వము జగతిన్ 345

ఉ॥ గోవ నుకొంటిఁ గాని యిది క్రొల్పులి; యియ్యది పూలతీవె యై
తావులు చిమ్మునంచు బహుధా తలపోసితిఁ గాని నల్లత్రా
చై విషమున్ వెలార్చె నహహా! మదిఁ దా నొకటిం దలంపఁగా
దైవ మొకండు తాఁ దలఁచుఁ; దాళముఁ గల్పక మంచు నెంచితిన్ 346

ఉ॥ నాఁడు తలన్ ధరించి నయనంబుల కద్దికొనెన్ బయోధర
క్రోడమునన్ బిగించుకొనె; శ్రోణిని నిల్పు కొనెన్, వలగ్నమం
దూడుకొనెన్; మృదూరువుల నుజ్జటలూపుకొనెన్ యథేచ్ఛ నన్
నేఁడె వెలంది కాలికొన నెట్టెను వాడిన మాల్యముం బలెన్ 347

ఉ॥ దీని సవిత్రివోలె ననుఁ డిట్టిన దిద్దియుఁ బట్టుగుడ్డతోఁ
బూనిన పాదుకన్ మొగము మొత్తెడి తీరిది; యిన్నినాళ్లు పా
లాని విషంబు గ్రక్కినది; యయ్యయొ! యియ్యది పాపజాతి నే
నీ నవలామొగంబుఁ గన నీ కతినస్త్రని తాఁకు నోరువన్. 348

ఉ॥ ఉండకూడని తావున నుంట దోష
మందు రీ గోముఖవ్యాఘ్రి యాననమునఁ

బడక తప్పించుకొనిపోక వరముగాదె?
చిక్కి చికిలించు కంటెను? శ్రీనివాస! 349

కం॥ అని యెంచి మేనికిఁ దగు
లొ్కని యుండిన మాధవి యవిలోలభుజము ల
ల్లన విడిపించుకొనుచు ది
గ్గన లేచి యవికృత మయిన కంఠముతోడన్ 350

కం॥ ఇనుఁ డస్తమించె; నేఁటికి
మనము విహారము ముగించి మందిరమునకున్
చనుద మనుచు మాధవి తో
నని ముందున కేగ సాఁగె ననివర్తితుఁడై 351

కం॥ చనుచున్న నతనికిఁ దటం
బున నెడనెడ నున్న మిత్రములు తోడై రా
తనినిన్ సస్నేహితుఁడై
చనువానిన్ మాధవియు ససఖియై కనుచున్ 352

కం॥ నా వచనములకు నొచ్చెనొ?
పోవుద మను మాట దక్క భుజమిచ్చి సఖీ
రావే యని యనఁడేలనొ?
పూవో? పండో? యొసంగి పోఁడేల? యయో! 353

కం॥ అని చింతాకులమానస
మున శకటం బెక్కి విధుతపూర్ణగ్లాని యై
న నిశ విధంబున గేహం
బునకుఁ జనియెఁ బ్రియవియోగ మూర్ఛాతురయై 354



శ్రీ ర స్తు

# మంజీర విలాసము

## చతుర్థ ప్రకరణము.

### ...: కోవలుఁడు మాధవిని శాశ్వతముగా త్యజించుట :...

కం॥ లావణ్యానిధిని మాధవి
నావేలన్ గంచుకంబు నహిపతి మాడ్కిన్
బోవిడిచి సమిత్రుండై
కోవలన ప్పుడు పురమునకుఁ జనుదెంచెఁ 1

సీ॥ చనుదెంచి తన మిత్రజనముల వీడ్కొని
యలనల్ల నడుచుచు నహహ! యొక్క
గణికకు వశుఁడనై కణ్ణగికి బతివ్ర
తామణి కనుతాపదారుణముగఁ
వర్తిల్లితిని బదివత్సరంబులు; తెల్వి
గోల్పడి పఱచనై కులమువారఁ
బురమువార నకీర్తిఁ బొందితిఁ; దేనెలోఁ
బడ్డ యీఁగవిధాన బాధ పడియు

తే॥ గీ॥ నెట్టులో బైటపడినాఁడ నీశుకరుణ
నంచుఁ దలఁచుచు మార్గమధ్యమున నున్న
తన్నగరమహాశివనికేతనము పొంత
కరుగుదెంచె సుఖిన్నముఖాబ్జుఁ డగుచు 2

సీ॥ ఆనగరమునకు నమ్మహాశివుఁ డధి
దైవతంబును బరేత్రాతయు నయి
వెలుగొందుచుండు; నవ్వేళ కా కోవెల
యపిహితమైయుండెఁ; బ్రాంగణంబు

దీపావళుల కాంతిఁ దేజరిల్లుచు నేత్ర
పర్వంబు గానుండె; భక్తులెల్ల
రమ్మహాదేవుని నర్చించుకొని స్వమం
దిరముల కల్లన నరుగుచుండి

తే॥ గీ॥ రట్టితటిని గోవలను శివాలయంబు
చొచ్చి, తత్రత్యపార్వతీశునకు మ్రొక్కి
భక్తితాత్పర్య మెనయఁ దత్పాదపంక
జమ్ము లాత్మ నిలిపి యిట్లు స్తవమొనర్చె 3

కం॥ పరమేశ్వర! శంకర! హర!
కరుణాపారీణ! వృషభగమనా! చంద్రా
భరణా! గౌరీరమణా;
హరింపుము మదీయకిల్బిషావళి శూలీ! 4

శా॥ పాపాత్ముండ; భవత్పదాబ్జముల సేవన్ సల్పుచున్ మోక్షల
క్ష్మీపీఠంబు కనంగఁజాలు సుమతుల్ మెట్టన్ సదా యోగ్యమీ
క్ష్మాపృష్ఠం బిటఁ గాలుమోపితిని గంగానాథ! మన్నింపుమ
య్యా! పుణ్యాంగన కే మగండ నవుటన్; వ్యాపన్ను నన్ బ్రోవవే 5

కం॥ పాణిగృహీతిని విడి యొక
పాణిగృహీతన్ గ్రహించి పవలును రేయున్
బోణిమి విడి నడచితి, సుమ
బాణాసనహరణ! నన్నుఁ బాలింపఁగదే! 6

శా॥ కామాంధుండను, నీదునామ మెపుడున్ గైవారమున్ జేయవే;
శ్యామోహంబునఁ జిక్కి; యింద్రియగుణ వ్యాకృష్టచిత్తుండనై
స్వామీ! నిన్నొ కనాఁడునున్ దలఁప విశ్వాసంబుతో; మూర్ఖు న
న్నే మాడ్కిన్ దయఁ జూతువో యెఱుఁగ; నీవే నాకు దిక్కీశ్వరా! 7

ఉ॥ సంపద కొల్లవెట్టితిని; జాయకుఁ గూర్చితి నార్తి; బంధులన్
బెంపు దొలంగితిన్; జనులు వ్రేలిడి చూపినఁ బుచ్చకాయనై
సొంపు దలంగ నైతిని; విశుద్ధచరిత్రముఁ గాల రాఁచితిన్
గొంపకు హాని గూర్చితిని; గూళను నన్నెటు లేలుదో శివా! 8

దీపావళుల కాంతిఁ దేజరిల్లుచు నేత్ర
పర్వంబు గానుండె; భక్తులెల్ల
రమ్మహాదేవుని నర్చించుకొని స్వమం
దిరముల కల్గన నరుగుచుండి

తే॥ గీ॥ రట్టితఱిని గోవలను శివాలయంబు
చొచ్చి, తత్రత్యపార్వతీశునకు మ్రొక్కి
భక్తితాత్పర్య మెనయఁ దత్పాదపంక
జమ్ము లాత్మ నిలిపి యిట్లు స్తవమొనర్చె 3

కం॥ పరమేశ్వర! శంకర! హర!
కరుణాపారీణ! వృషభగమనా! చంద్రా
భరణా! గౌరీరమణా;
హరింపుము మదీయ కిల్బిషావళి శూలీ! 4

శా॥ పాపాత్ముండ; భవత్పదాబ్జముల సేవన్ సల్పుచున్ మోక్షల
క్ష్మీపీఠంబు కనంగఁజాలు సుమతుల్ మెట్టన్ సదా యోగ్యమీ
క్ష్మాపృష్ఠం బిటఁ గాలుమోపితిని గంగానాథ! మన్నింపుమ
య్యా! పుణ్యాంగన కే మగండ నవుటన్; వ్యాపన్ను నన్ బ్రోవవే 5

కం॥ పాణిగృహీతిని విడి యొక
పాణిగృహీతన్ గ్రహించి పవలును రేయున్
బోణిమి విడి నడచితి, సుమ
బాణాసనహరణ! నన్నుఁ బాలింపఁగదే! 6

శా॥ కామాంధుండను, నీదునామ మెపుడున్ గైవారమున్ జేయవే;
శ్యామోహంబునఁ జిక్కి; యింద్రియగుణ వ్యాకృష్టచిత్తుండనై
స్వామీ! నిన్నొ కనాఁడునున్ దలఁప విశ్వాసంబుతో; మూర్ఖు న
న్నే మాడ్కిన్ దయఁ జూతువో యెఱుఁగ; నీవే నాకు దిక్కీశ్వరా! 7

ఉ॥ సంపద కొల్లవెట్టితిని; జాయకుఁ గూర్చితి నార్తి; బంధులన్
బెంపు దొలంగితిన్; జనులు వ్రేలిడి చూపినఁ బుచ్చకాయనై
సొంపు దలంగ నైతిని; విశుద్ధచరిత్రముఁ గాల రాఁచితిన్
గొంపకు హాని గూర్చితిని; గూళను నన్నెటు లేలుదో శివా! 8

కం॥ దగదొట్టి నీటి కొఱకై
మృగతృష్ణకుఁ బరువులెత్తు మృగము గతిన్ దు
ర్భగవిషయంబుల శాశ్వత
మగు సుఖ మున్న దని యెంచి యార్తుఁడ నైతిన్ 9

ఉ॥ ఈవిషయ ప్రపంచమున నెల్లసుఖంబులఁ బొందఁ గోరి య
య్యో! విపరీతదుష్ఫలిత మొందితి; భవ్యులఁ గూడిమాడి నీ
సేవ యొనర్చి పుణ్యమును జేకొన నైతిని నొక్కనాఁడు; గౌ
రీవర! రెంటికిన్ జెడిన రేవఁడ; నన్ గృపఁజూడు మీశ్వరా! 10

చం॥ అనిలుఁడు, పుష్పవంతు, లిల. యగ్ని, హుతంబు, ధరిత్రి హోతయున్
ద్రిణయన! నీస్వరూప మని తెల్పు శ్రుతుల్; భవదీయతత్త్వమున్
మునులు నెఱుంగలేర నినుఁ బోలునె నాకె యెఱుఁగన్ వివేక హీ
ననకు హృషీకలోలున క నుష్ఠిత కామకళావినోదికిన్ 11

శా॥ నీ లీలం గనఁగాఁ ద్రిలోకి నెవఁడున్ లేఁడంట చిత్రంబె? శం
భూ! లోకాల సృజింతు వీ వజుఁడవై, పోషింతు విష్ణుండవై
ఫాలాక్షుండవు నై దహింతు హర! సర్వంబుం డు నీయందు; నీ
వాలక్ష్యుండవు దెల్ల యందు, గిరిశా యజ్ఞాని నన్ బ్రోవవే! 12

ఆ॥ వె॥ చిత్తసాది విషయిమత్తాశ్వధృతము నా
తనురథంబు తప్పుదారి నడపె
లోని కంటకులకు లోఁబడి; దాన ఁబా
పప్రవృత్తి కీశ! పాలుపడితి 13

శా॥ భూతేశా! కరుణామృతంబుఁబయి సంప్రోక్షించి యంతర్గతం
బౌ తాపంబు సమస్త మార్పుము, కిరీటా ర్ధేందు కాంతిచ్ఛటా
స్రోతఃపూరము నాపయిం బఱపు మక్షుద్రంబుగా నాతమో
జాతం బస్తమునొందు; నాకు శుభసంస్కారంబు ప్రాప్తంబగున్ 14

కం॥ పరసతుల మాతృభావము
పరవిత్తంబుల నగృధ్నుభావము యుష్మ
చ్చరణముల భక్తిభావము
పరమేశా! నాకు నొసఁగి పాలింపుము నన్ 15

కం॥ అని యాత్మచరిత్ర నివే
దనపూర్వముగాఁ బినాకి స్తవమున్ గావిం
చినవాఁడై యటఁ గుడ్యము
కొన నొకకంబమున కానుకొని కూర్చుండెన్ 16

ఉ॥ ఆవిధి నాతఁ డాత్మవిషయంబు సమస్తము కొంకులేనివాఁ
డై వివరించి యీశ్వరుని యాస్యమునన్ దనచూపు నిల్పి లో
నే వికృతంబు నొందక యతీశ్వరు భంగిని నుండెఁ దన్ను గౌ
రీవరుఁ డేలు నంచు నిబిరీసకుతూహలపూర్ణచిత్తుఁడై 17

## —: తిరువళ్లువర్ గీతములు :—

కం॥ తిరువళ్ళువర్ మహాముని
విరచిత తిరుకురళు గీతవితతి యథేచ్ఛన్
హరుగుడిలో నాతఁడు విన
హరుభక్తు డొకండు పాడె నపుడీ పగిదిన్ 18

కం॥ ధనమునకు మే నొసఁగు స్వై
రిణి కపటాలింగనంబు ఛీచీఁకటిలో
నొనరుచు ప్రేతాలింగన
మునకున్ సమమని వచింత్రు బుధు లెల్లపుడున్ 19

కం॥ తను దాను మనుచుకొనుచును
దనపతిఁ గొలిచి మనుచుచును, దా నాడిన మా
టను దప్పక క్షణము వృథా
చననీని పడంతి నంద్రు సతియని లోకుల్ 20

ఆ॥ వె॥ ఒకటి బాసచేసి యొండొక్కటి యొనర్చు
కపటవర్తనలగు కామినులకు
ద్యూతమద్యములకు ధూతసౌభాగ్యుఁడౌ
దైవహతుఁడు మిత్రుఁడై వెలుంగు 21

తే॥ గీ॥ చెమట యోడిచి తా సమార్జించుకొన్న
యొక్కదోసెడు గంజియ యువ్వలేని

దై రుచింపని దయ్యును నన్యదత్త
మైన యమృతంబు కంటె సొంపై రహించు 22

కం॥ నాణెమ్ము ఋజుత్వము గల
బాణము ప్రాణము హరించు; వక్రాకృతి యౌ
వీణియ మధురస్వరముల
పాణిమి శ్రోత్రేంద్రియ యుగమునకు ఘటించున్ 23

ఆ॥ వె॥ పేదవానిఁ దృణము విధమున సర్వుండు
నడుగు వైచి త్రొక్కి యగడుపఱచు
నర్థవంతు నుత్తమాంగానఁ బూదండ
కరణి సవదరించి గౌరవించు 24

ఉ॥ దుర్విధిచేత దెబ్బతిని దోరిన వాఁడపనింద కెప్డుఁ దా
నిర్వగఁ గాఁడు; మంచిదిది యియ్యదిచెడ్డది యన్వివేకమున్
సర్వము గల్గియున్ బనికి సాఁగక పౌరుష మెల్లభంగులన్
ఖర్వము సేయువాఁడె భువి గర్వ్యుఁడు కాక మఱొక్కఁ డెట్లవున్? 25

తే॥ గీ॥ మానవతియు గుణవతియు నైన భార్య
యున్నవానికి నెప్పుండదొక కొఱంత
యోగ్యురాలైన భార్య లేకున్నవాని
కెన్ని యున్నను దక్కున దేది లేదు 26

కం॥ కలనైన నాస్తియన కీ
యిలలోఁ బ్రార్థ్యంబు సర్వమి చ్చు మహోదా
తల నర్థించుటయే య
న్యుల కిచ్చుట వంటిదై మహోన్నతి కెక్కున్ 27

కం॥ ఆపాడిన గీతంబుల
నాపతితుం డాలకించి యదవదయై సం
తాపితుఁ డగుచు స్వపూర్వ
వ్యాపారము లీ విధముగ నాత్మఁదలంచెన్ 28

## —: కోవలన్ తనతొంటి నడవడిని పరామర్శించుకొనుట :—

ఉ॥ మాధవి బాహుబంధమున మాధురి యున్నది యంచు నెంచి యెం
తోధనముఁ వ్యయించితి; వధూమణిఁ గణ్ణగిఁ జెప్పరాని దు
ర్బాధకు లోనుజేసితిని: బణ్యవధూటి సమాగమంబు నా
కా ధిని గూరిచెన్; గణిక నంటుట ప్రేతము నంటుటే కదా! 29

ఉ॥ నాయనుబంధముఁ విడదుఁ నాకొ కనాఁడుఁ బ్రతీప గాదు; నే
నే యది యాచరింతు, నడియే సతి తానును నాచరించు; నన్
బ్రేయసు ఛాయనా ననుసరించును; బాయదొకా నొకప్డు నా
జాయకు గీతికాభినుతజాయకు నించుకభేద మున్నదే? 30

ఉ॥ నాతలిదంద్రులఁ విడిచినాఁడను; వారవిలాసినీ మధు
ద్యూత వినోదరక్తిని వధూమణిఁ బాసితి, నిర్ఘృణుండనై
చేతికి మున్ను పన్పడిన శ్రీని దొలంగితి; భాగ్యదేవతా
ప్రీతికి దూరమైతి; ననుఁ బిచ్చిబికారిగ లోక మెన్నదే? 31

తే॥ గీ॥ తాత ముత్తాత తండ్రులు ధర్మముగ ను
పార్జితము సేసి పెంచిన యర్థమునకు
నట్టు సాఁచితిఁ గాని ప్రయత్నపడి తృ
ణంబొ? ద్రప్సంబొ? యార్జించినాఁడఁ గాను 32

తే॥ గీ॥ కమ్మపాలు ద్రావి విషంబు గ్రక్కునట్టి
కాలసర్పంబు మాధవి; హాలహలము
మ్రింగి జీర్ణించికొన్న నారీలలామ
కణ్ణగి; విభేద మీరెంటఁ గలదొ? లేదొ? 33

మ॥ ఒక పణ్యాంగన కూటమిన్ మరఁగి నాకున్నట్టి యైశ్వర్యముఁ
సకలంబున్ మొదలంట నూడ్చితిని; నఁ సంపన్ను లెల్లన్ దృణా
నకుఁ గైకోరు; దరిద్రుఁడొ క్కరవ ప్రాణంబు న్న పీనుంగు, న
క్కకు భోజ్యంబును గాఁడు ప్రాణసతికిన్ గాఁడో శివా! భోగ్యమున్ 34

ఉ॥ ఏను విధిప్రతీపగతి నిట్లయి నాఁడను; నన్నుఁ గాంచి క
ర్మానుభవంబు నీతఁడిపు డందినవాఁడని గేలిసేయునో?

మానెను దొంటివృత్త మని మన్ననసేయునొ? లోక? మేది యో
గ్యైన ధనార్జనంబునకు నాయిత మౌదును బౌరుషంబుతోఁ 35

శా॥ నాయిల్లాలు సమస్తసద్గుణనిధానం బంచు నాకంటె ము
న్నే యీలోకము మెచ్చెఁ గాని యొక సందేహంబు నాకున్నదే
నే యాభామిని చెంత కేగి నను సాధ్వీ! యిప్డు గైకొమ్మ టం
చే యాస్యంబున వేఁడుదున్? వినునొ నాయీవేఁడికోల్? త్రోయునో? 36

ఉ॥ నే నపు డొక్క పణ్యరమణీ కుచపంజర కీరరాజునై
యేనగ నెంతగా ధనము నిమ్మని కోరితి దాని నంతగా
మానిని యిచ్చి పంపెఁ బెరిమన్, జని వేఁడిన నాదు తప్పులన్
దాను క్షమింపదో నయనతామరసంబుల కద్దికొంచు నన్ 37

చం॥ అని తలపోసి కణ్ణగి ముఖాబ్జము నేఁటికిఁ జూడ నయ్యె నా
క ని ముద మందుచున్ విడిది కంగడివీథిని నున్నదానికే
గెను; గణికాకృతం బయిన కేరడ మగ్నిఁబలెన్ దహింపగాఁ
గను లొకకొంత చెమ్మగిలఁగా మదిలోనఁ దలంచె నివ్విధిన్ 38

కం॥ సుపయోధర కుంభద్వయ
విపులతర నితంబ పులిన వేదిక వేశ్యా
ప్రప నేఁ బాంథుఁడ నయ్యు న
నపగత తృష్ణుండుఁబోలె నయితిఁ జివరకున్ 39

కం॥ దానజల మలిన గండం
బైన గజము, కేసర భయ దాననమో పం
చాననము, యుద్ధవీరుఁడు
ధీనిధియును మోహ మొందు స్త్రీసన్నిధిలోన్ 40

కం॥ శ్రీ నీచు; సరస్వతి యకు
లీనుని. భోగిని యపాత్రుఁ బ్రేమించు భువిన్
మానిని, నున్నతవంశ్యుని
జ్ఞానిని వీక్షించు గర్భశాత్రవునిఁబలెన్ 41

తే॥ గీ॥ వక్రతాభుజంగి, సుబోధ పార్వణేందు
రాహుమూర్తి, దుర్మోహగరంబు గ్రక్కు

ముష్టివల్లిక గణిక నాబోఁటి మూర్ఖు
గాక ధీరుఁ డెవ్వండు తత్కరము వట్టు 42

కం॥ చుంబకము సన్నిహితలో
హంబులన్ దివియులన్; బరోక్షమందును వేశ్యా
చుంబకము విటహృదయ లో
హంబులన్ దివియు నిది చిత్రమబ్జజుసృష్టిన్ 43

కం॥ నడదివిటీ కైవడి వెల
పడంతి సమకాలమునఁ బ్రభాఝరిలో నొ
క్కడ, నంధకారఝరి నొ
క్కడఁ బడఁద్రోయుఁ గద తన్గ్రహించిన విటులన్ 44

ఉ॥ మూలముఁ దల్లియున్ భుజగి. మూర్ధము సోదరులన్ విహంగముల్
పూలఁ గుచేటులన్ మధుపముల్ విటపంబులఁ గుంభదాసులన్
వాలుమెకాలు చుట్టుకొని వైశికుఁడన్ హరిచందనంబు సు
శ్రీలు భుజింత్రు సాధువులఁ జెంతకు జేరఁగ నీయక య్యయో! 45

కం॥ గణికలు గణకులు నితరుల
గుణములలో మంచిఁ గొనక కుత్సామతులై
గణనాపరత వహింతురు;
గుణులన్ హింసింత్రు; కొంప కూల్తురు తుదకున్ 46

కం॥ విరివతెఁ గన్పడి మాధవి
యరరే? యూరించి దాని యుడుగునఁ గల భీ
కరకాలసర్పమై నా
కరమును గొని కాటువేసి గరమున్ జిలికెన్ 47

ఉ॥ క్రొమ్ముడి దండరీతిని, సురోజములన్ బయికప్పు వోలె, గ
డ్డమ్ములఁ బత్త్రిమట్లు, నయనంబులఁ గాటుకకైవడిన్ నితం
బమ్ముల శాటిచందమున. బాహువులన్ గడియంబు మాడ్కి నన్
సొమ్ముగఁ జేసె మున్ని, పుడు చూఁడు గతం బెదలోఁ దలంచినన్ 48

ఉ॥ అల్పుల తోడ సన్నిహిత మౌటయు శాశ్వత మానహానికిన్
బల్పు ఘటించి ప్రాభవముఁ బాపుఁగదా యని హంసతూలికా

తల్పమునన్ శయించి నిజదార సమాగమ మెంచు చన్యసం
కల్పములన్ దొఱంగి గణికానికృతిన్ దలపండు కోవలన్ 49

... మాధవి విరహము ...

కం॥ అంబుధితటమున నుండి గృ
హంబున కరుదెంచి ముకుళితాననయై తా
పంబు దిగమ్రింగుకొని ప్రణ
యంబునకి దిఫలమె యనుచు మాధవియు నటన్ 50

కం॥ శయనమున వ్రాలు, నూరక
నయనంబుల నీరు నించు; నాలితనమునన్
ప్రియుఁ డరిగెఁ బాల విషమిడు
నయ మిది యని యేడ్చు; నన్ గనండని క్రుంగున్ 51

శా॥ నే నేదో స్వకపోలకల్పితకథన్ వేలావనిన్ సహ్యజా
గానవ్యాజమునన్ వచింప నది నిక్కం బంచు లో నమ్మెఁ గా
నీ, నానర్మవచో రహస్య గత శౌండీర్యంబు మెచ్చండు; వే
శ్యానైపుణ్య మెఱుంగ లేని యతఁ డెట్లౌ భావుకుండ య్యయో! 52

కం॥ హాలాహలంబు మ్రింగును
గాలాహినిఁ బువ్వుదండగాఁ దాలుచు నే
లీలావతి యానతి యిడ
బాలువలె నెవండు; తండు వర్తిలునె యిటుల్ 53

ఉ॥ కట్టెయుఁ గాల సర్పమయి కాటిడుఁ; బట్టిన బంగరంబునుఁ
మట్టియగున్; విమత్సరుఁడు మచ్చరియౌఁ బ్రియ మప్రియమ్ము నౌ
నెట్టి వివేకి కేని విధి యించుక వక్రతఁ బొందఁ గానిచో
నట్టిమహానుభావున కహా! యిటు ద్వేషము పుట్టనేటికిన్ 54

ఉ॥ ఎన్నిదఫాలు మున్ను తన కీరస మెక్కుడుగఁ బల్కలేదొ? నే;
నెన్నిదఫాలు తా నగుచు నేమియు నాక సహింప లేదొ? నే
డన్నియు విస్మరించె, నహహా! ప్రియుఁడే; మిదెయొనర్తు? నాఁడు బా
గున్నది నేఁటి కెప్పగిది నోగగు?ఁదీపునఁ జేదు పుట్టునో? 55

శా॥ ఏ నాఁడేనియు నిట్లు నాప్రియుఁడు న న్నేడ్పించెనే? కాలితో
నేనే కార్యము చేయఁబంతు నది చే నీడేర్చుఁ దా నెప్పుడున్;
నా నర్మోక్తుల కింత రోషమె పుడూనం డుగ్రుఁడై యౌర! యే
దో నొక్కం డెదలోనఁ బెట్టుకొని తా నిట్లా చరించెన్ గదా! 56

ఉ॥ ఆతఁడు లేనినేఁటి నిశ వ్యర్థము; నే నెటు లొంటిసెజ్జపై
నీ తనువుఁ వహింతు నని యింతి యొకానొక విన్నపంబు తాఁ
గేతకపత్త్రముఁ గొని లిఖించి సుగంధి లతాంతమాలికో
పేతముగా నొనర్చి విలపించుచు నిచ్చి వసంతమాలకుఁ 57

## మాధవి వసంతమాలను సందేశముతోఁ గోవలను కడ కంపుట

ఉ॥ నా శయనంబు శూన్య మిది నాస్మరలేఖము; దీన నాదు సం
దేశము నిండియున్నది ది తెప్పునఁ గాంతుని కిచ్చి నే వ్యథా
పాశనిబద్ధ నైతి నని పల్కి ప్రియుఁ గొనితెమ్ము, పొమ్ముఁ నా
నాశుగమో యనఁ జనియె నావ్యథితాత్మ వసంతమాలయుఁ 58

కం॥ చని యంగడివీథికి నా
తని విడిదిగృహంబు సేరి తల్పల్లనఁ ద
ట్టినఁ గోవలన్విభుఁడు మే
ల్కని యుండినవాఁడు లేచి గడియఁ దీసెఁ 59

కం॥ అంతట వసంతమాల ని
శాంతంబుఁ జొచ్చి నాథ! స్మరలేఖఁ నీ
కాంత యనిపె మాధవి ని
శ్చింతముగ నిను గొని రా వచించెను నాకుఁ 60

కం॥ అని పలుకుచు నాకమ్మఁ
వినయవినమ్రాంగి యగుచు వే యొసగం బో
యినఁ గైకొన కూరక, దా
నినిఁ గమ్మను గనుచు నిలిచె నిశ్చేష్టుండై 61

ఉ॥ ఆతని చేఁతకుఁ గడు వ్యథాతుర యౌచు వసంతమాల యో
కైతవపుష్పబాణ! యిది కమ్మ; విలేఖన మిందు నున్నదే?

మో? తనివారఁ జూడఁ దగదో? ప్రియురాలి నివేదనంబు నే
లా తరితీపు సేయుద? న నాతఁడు తేటి వచించె నివ్విధిన్ 62

కం॥ స్మరలేఖయొ? గిరలేఖయొ?
వరాంగి! నాకేమి యెఱుక? పఱపుగఁ జేతన్
ధరియింపు కమ్మ! నే నది
పరికింతు నన నది యట్ల పట్టఁగఁ జదివెన్ 63

ఉ॥ పూర్ణసుధాంశుఁ డేలొకొ కుముద్వతి సిద్ధరసప్రసన్న న
భ్యర్ణగతిన్ గొనండు? మధువన్ మధుపర్కముఁ గాన్క సేయుచున్
దూర్ణము రాజ! కొమ్మని నినున్ మధుపక్వణహూతిఁ బిల్చు; నీ
కర్ణములన్ జొరంబడదొ? కౌముదికై విడుదో కుముద్వతిన్? 64

## మాధవి సందేశమును చదివిన కోవలన్ పల్కిన పల్కులు

కం॥ ఆ సందేశము సదివిన
యా సరసుని మోముఁదమ్మి యరుణోత్పలమై
భాసిలె, వసంతమాలయు
మాసిన హల్లకలతోపమానముఁ దాల్చెన్ 65

కం॥ ఏలొకొ యింతటికోపం
బీ లాలితగుణునక? నుచు నింతి మనమునం
దాలోచించుచు నుండఁగ
రాలువడు స్వరమునఁ గోవలన్ దాని కనెన్ 66

కం॥ ఈ నయగారము లోసీ!
మీ నాయికకున్ సహజము; మీకులమునకున్
బ్రాణము; నాకొక క్రొత్తయె?
యైనది యేమో యయినది; యంతయుఁ గంటిన్ 67

కం॥ వచ్చిన త్రోవనె పొమ్మి
చెచ్చెర, ద్రవ్యకుము ప్రాఁత; చెప్పకు మింకొం
డొచ్చెమ్మె మియును నెఱుఁగ;
మ చ్చపలాక్షి కె ఱిఁగింపు మంతయు దాసీ! 68

కం॥ అని వెనుకకుఁ దిరిగినఁ జే
యునదే మియు లేదని, యదియును వెతఁగొని వ
చ్చిన త్రోవనే చని మాధవిఁ
గని బోరున నేడ్చి రుద్ధకంఠమున ననెన్ 69

## కోవలన్ తిరస్కారమును వసంతమాల మాధవి కెఱిగించుట

కం॥ అమ్మా! యేమని తెలుపుదుఁ
గమ్మన్ గొని బాణమట్లు కమనుని యాగే
హమ్మునకున్ జని కడు విన
యమ్మున నర్పింపఁ బోవ నాతఁడు క్రూరుడై 70

కం॥ కొనకుండిన మాధవి నీ
క నంగలేఖ నొకఁడ నిపెనని యుంటిని; వాఁ
డును విని యనంగలేఖయొ?
గినంగ లేఖయొ? యటంచుఁ గ్రేడింపంగన్ 71

కం॥ ఆపై నేమున్నదొ! యని
చూపునయినఁ బఱపరాదొ? సుభగ! యనంగా
నాపుణ్యుఁడు విరివిగ నీ
వే పట్టుకొనుము రచనము నేఁ బఱియింతున్ 72

కం॥ అన నే నట్ల యొనర్చితిఁ
గను లరుణోత్పలముల కెనగా నాతఁడు లే
ఖనమును జదువుచు, నన్నును
నొనరిచె హల్లకలతికకు నుపమానముగన్ 73

కం॥ ఏ ప్రతిసందేశమ్మును
నీ ప్రాణప్రియుఁడు నెమ్మి నీ కనుపునొ? యం
చ ప్రతిహతాశ నేఁ బం
చప్రాణాలు బిగఁబట్టి శవమ ట్లుంటిన్ 74

కం॥ అంతట నాతండు మొగం
బంతయుఁ జిట్లించుకొనుచు ననునయ మిది నే

నంతయు మును గన్గొన్నద;
యింతయు మీసఖికిఁ జెల్లు; నే బేల్పడితిన్ 75

కం॥ అని పలికి యింక నేమే
మొ? నిర్ఘృణుండై వచింపఁ బో నాయన కొ
క్క నమస్కారం బొనరిచి
కొనయూపిరితో వెలికడకున్ బర్విడితిఁ 76

కం॥ నీ యనుగుంజెలినై నే
నాయనచే మున్నుపడని యట్టులఁ బడితిఁ
మేయఁగఁబో మెడకఱి యను
న్యాయము నాపట్ల మిగుల సార్థకమయ్యెన్ 77

కం॥ ఓసీ! దాసీ! యని న
న్నా సరసుం డెన్నఁడైన నన్నాఁడె? చెలీ!
ఈ సంబుద్ధియ నీపై
నీసా తనికెం తగలదొ? యెఱిఁగించుఁ జుమీ! 78

కం॥ వనితా! భోగముకులమున
వనితగ జన్మించుకంటెఁ బర్వతముననో?
వనముననో? విషలతయై
జనియించుట మేలటంచుఁ జాలించి చనెన్ 79

—: మాధవి నిర్వేదము :—

కం॥ కన్నీరొ డ్చుచు మాధవి
నన్నొ కవేలయాలిగా మనఃప్రియుఁ డెంచెన్
మిన్నాగు వత్సనాభుల
కన్నఁ న్నాపియు మదింపు కడు దారుణమో 80

కం॥ వననిధివేలావని నేఁ
బ్రణయంబున నన్నుపలుకు ప్రాణాంతకమ
య్యేను; బెంచిన చెట్టు నఱికి
తనుఁదాఁ బైఁ ద్రోసికొను విధంబుగ నయ్యెన్ 81

కం॥ జలనిధి నువ్వెత్తుగఁ బై
కి లేచి, పడి, తీరభూమికిఁ బర్విడు న
య్యలవలె ఱేఁగిన తన పాల
యలు కీఁగి యతఁడు దరిసి మదంఘ్రుల వ్రాలున్ 82

కం॥ పాలయలుక పూని నప్పుడ
కలమంజులమైన యతని కన్గవ మొగముఁ
దిలకించెడు భాగ్యము ము
న్నలవడిన ట్లింక నాకు నలవడ దేమో? 83

కం॥ అతనికి నాకును బ్రణయం
బతిగాఁ గైతవవిహీనమై స్వచ్ఛంబై
క్షితిని న భూతో న భవి
ష్యతి యన్న ట్లెదిగి తుదకు సన్నంబయ్యెన్ 84

ఆ॥ వె॥ తగులుకొన్నవాఁడు మగఁడు తాడును నీడ
యగునె? యనుచు విబుధు లంట కల్ల
నాదు కాంతు నెడల; నాభాగ్య మని మున్ను
మురియుదు నది నీటిమూట యయ్యె 85

మ॥ అని నిర్వేదము పొందు; వ్రాలు శయనీయంబందు; బంగారు గో
ళ్లను జేఁ దాలుచు వీణ మీఁట; శుకిఁ గ్రీడాపంజరస్థన్ గనుం
గొనలన్ ముద్దిడు; ఁగేళిహంసి నిమురున్; గ్రొంగొప్పులో నున్న పూ
ల నొకం డొక్కఁడు గోటఁ జిమ్ము; ఁదను దా లాలించు కొంచూ
ఆడున్ 86

ఉ॥ పాలిన దాని మోము రుచివైభవమున్ గయికొన్నవాఁడునుం
బోలె హిమాంశుఁడ స్తగిరి మూర్ధము నెక్కెఁ; బతివ్రతాంగనా
శీలముఁ జూపువానిబలె శీర్ణతనుప్రభ లౌచుఁ దారకల్
పాలిన వయ్యెఁ; మెచ్చుకొను భంగి ద్విజావళి పల్కె వేఁకువన్ 87

## ....: దేవాండి వృత్తాంతము :....

సీ॥ అపురి సప్తదేవాలయార్చకురాలు
దేవాండి యను నొక్క దివ్యవనిత

వెలయు; నయ్యాది కడువింతమానిసి యంచు
జనులంద్రు; కణ్ణగి సచ్చరిత్ర
మద్ది కర్ణాకర్ణి నక్కడక్కడ విని
దాని శీలమునకుఁ దనిసి మెచ్చి
నేను దేవునిఁ గొన్న మానవి; మానవుఁ
గయికొన్న దేవత కణ్ణగి యని

తే॥ గీ॥ చాటుచుండు; నింద్రోత్సవ చరమదివస
మందు సప్తకుఁ దా విశేషార్చనములు
సలిపి, యయ్యర్చనాద్రవ్యసంచయముఁ బ్ర
సాదమును గొంచుఁ గణ్ణగి సదన మేగె 88

ఆ॥ వె॥ పడఁతి రూపు గొన్న బ్రహ్మతేజంబొ? శౌ
చంబు మై ధరించి సాఁగుగతియొ?
పుణ్యసముదయము నపూర్వఫలంబో? య
నంగ వెలుఁగు నా శుభాంగి నెదుర 89

కం॥ కని కణ్ణగి నీవెవతెవు?
చనుదేఁ గత మేమి? తెలుపు సఖి! సంగతముగ్
జను లిల సాప్తపదీనం
బన విన వొక్కొ? వయస్య నైతిని నీకుఁగ్ 90

కం॥ అనవుడు నయ్యాది చెలియా!
నను నెఱుఁగవె? యిప్పురంబునన్ వసియింతుగ్
నను దేవాండి యని పిలుతు
ర నఘము నాచరిత; వినుతు నఖిలము నీకుఁగ్. 91

సీ॥ కలదు 'మాలతి'యను క్ష్మాదేవతాంగన
లేకలేక జనించె నా కొమిరెకు
నొక్కండు మగబిడ్డఁ డుదయమందెనొ? లేదొ?
మృతుఁడయ్యె నాబిడ్డ డతివ యంత
దన సపత్నికుమారుఁ గొని వచ్చి తనపుత్రు
విధమున లాలించి పెంచుచుండెఁ;

బాపని కొకనాఁడు పడఁతి పాలిచ్చుచోఁ
బొరపోయె; గొంతున నిఱికెఁ బాలు

తే॥ గీ॥ పాపనికి; ద్రింగఁజాలక వాఁడు దగ్గి
చచ్చె; మాలతియును దాను సవతి బిడ్డ
మచ్చరమునఁ జంపిన దను మచ్చుకాక
కలుగు లోకాపవాదమన్ కలఁత నలఁగి 92

సీ॥ ఆబిడ్డ మృతదేహ మశ్రుస్నపితముగాఁ
దన హస్తయుగమునఁ దాల్చి పఱచి
బలరామ, శివ శాతవాహన పుష్పవ
త్తారకారీం ద్రాది దైవతముల
యాలయమ్ముల కేగి యాపాపనికిఁ బ్రాణ
దానంబు గావించి తనకుఁ గలుగఁ
బోయెడు నపవాదమును మాన్పుఁడని వేఁడెఁ
గాని యెల్లరు వరమీనివేల్పు

తే॥ గీ॥ లైన స్వేతరధర్మానుయాయు లైన
వారి దైవతమగు సప్త భవనమునకు
నరుగ నచ్చట దివ్యసుందరి యొకర్తు
కట్టెదుర నిల్చి దానికీ కరణిఁబల్కె 93

తే॥ గీ॥ పొలఁతి! తపమొ నర్పని నిన్నుఁ బోలుదాని
కే సురలు దయగొని వరమీరు; కాన
నా శవమ్ము నాకిమ్మని హస్తమందు
నుండి యొడిసి లాగికొని యత్యుగ్రయగుచు 94

కం॥ గాటపువెత వెఱగొను నా
బోటి కనఁగ నయ్యపూర్వమూర్తి నగరిలోఁ
బాటిల్లు చక్రవాళ
కోట్టా" ఖిధ రుద్రవసుధకున్ బరువెత్తెఁ 95

సీ॥ అట్లు పేరెము వెట్టు నయ్యమానుష కాంత
యాశ్మశానంబున నడుగువెట్టెఁ

నమ్మాలతియు దాని ననుసరించి పరేత
భూమికిఁ బర్వెత్తిపోయె; నచటఁ
నిశ్శబ్దమై శాకినీ ఢాకినీత్యాది
కములైన దుష్టగ్రహముల కేళి
మందిరంబై, పూర్వమానవాస్థిక లున్న
భాండగృహంబు నా నుండెఁ; దానిఁ

తే॥గీ॥ గాంచి యాబ్రాహ్మణవధూటి కడు చలించి
యిమ్మహాంధకారమున దిక్కెవ్వరి చట
నాక నుకొనుచో నట కొక్క ఢాకినీపి
శాచ మరుదెంచి యాబిడ్డఁ జమరి మ్రింగె 96

ఉ॥ దానినిఁ గాంచి మాలతి యెదన్ గలగుండయి దిక్తటుల్ ప్రతి
ధ్వానము లీనఁ గర్జభయదంబుగఁ బెట్టెను గావుకేక యొం
డా నినదంబు తీవ్రతకు నచ్చటికిన్ జనుదెంచి సప్త యు
మ్మానినిఁ గాంచి యాశిశువు మత్కృప నిప్డ సజీవుఁ డయ్యెడున్ 97

కం॥ అని పల్కి తిరోహితుఁడై
చని యర్భకు మేనఁ దూటి చక్క నిలుచుడున్
బునరుత్థానము గనె శిశు
వనంతరము విప్రకాంత యానందించెన్ 98

తే॥ గీ॥ చచ్చి బ్రదికిన బిడ్డ నాసతియు నేదకు
హత్తికొని దృష్టిదోషాపహరణమునకు
మెటిక విఱిచి ముద్దాడి యచ్చటు ద్వ్యజించి
సవతికడ కెగరోప్పుతోఁ జని యొసంగె 99

కం॥ సితపక్షంబునఁ జంద్రుని
గతి యాబిడ్డండె దిగి మగండై నన్నువ్
సతిగా వరించి, పతియై
కతిపయవత్సరము లుండి కడ కొక నాఁటన్ 100

సీ॥ తనచరిత్రము సమస్తము కలతీరు నా
కెఱిఁగించి యిది మొద లీవు భక్తి

నన్ను సేవింపుము; నిన్నెవ్వరే నీమ
గండు దేవాండి! యెక్కడికి నేగె
నని గ్రుచ్చి గ్రుచ్చి వాకొనిన వారాణసి
మున్నుగాఁ గల క్షేత్రములను జూడ
నరిగెను దీర్ఘయాత్రాకాంక్షియై యని
పల్కు మని వచించి భవ్యమూర్తి

తే॥ గీ॥ క్షణములో గుడి సప్తవిగ్రహము నందు
లీనమై పోయె; నిది నా యనూనచరిత
మీప్రసాదంబుఁ గొనుము; నీకింక నచిర
కాలమునఁ గల్గుఁ బతిసమాగమము సకియ! 101

కం॥ అని తెలిపిన దేవాండికి
ననియెఁ గణ్ణగి యదృచ్ఛ నాతఁడు నాక
బ్బినను దుదకే యరిష్టం
బొ నఁగూడునొ? యన్నభీతి యుల్లము నొంచున్ 102

కం॥ నా కొకస్వప్నము దేవాం
డీ! కల్గినదీ నడుమఁ గడిందిభయంబున్
జీకాకును గల్గించిన
దా కలచంద మెఱిఁగింతు నమ్మా! వినుమా! 103

కం॥ నేనును నాయనయు నొక మ
హానగరమునకుఁ జనితిమి; యందుఁ దురితా
ధీనులు కొందఱు పతిపైఁ
బూనికఁ గూటాపరాధమున్ మోపంగన్ 104

కం॥ నే నానగరాధిపు నా
స్థానమునకు నేగి ధర్మశాసన! రాజా!
యీనేరము నావల్లభు
పై నేలా మోపితి? విది పాపంబంటిన్ 105

కం॥ జనపతి నామాటలు విని
యును విననిచెవు లొనరించి యూరకయుండెన్

వెనుకఁ దదవనీపతి చ
చ్చె; నాతనిపురంబు నగ్నిచే నీఱయ్యెఁ 106

కం॥ నేనును నాపతియును నా
పై నైకవిధమ్ముగ సుమబాణునికేళిఁ
నానందించితి మమ్మా!
యీనాఁటికి మరుపుదగులదే మనియందున్ 107

సీ॥ నావుడు దేవాండి నమ్ముము నామాట
కణ్ణిగి! నీకు నీ కాంతున కగు
నచిరకాలమున సమాగమము; నిను నీ
ప్రియుఁడి న్నియేఁడులు వీడియుంట
జన్మాంతరమున నీసలిపిన యొకకొఱ
నోముఫలంబుగా భామ! కలిగె
సహ్యాజా సంగమస్థలమునఁ గల సూర్య
సోమకుండాలలో సారిది స్నాత

తే॥ గీ॥ వగుదు వేని నీదురితంబు లణఁగు; నీక
తంఢ జన్మజన్మములకు ధవుఁడు నగును;
నీకు దైవకృప శుభమౌ; నేఁడ పోయి
వాన స్నానంబు కావించి వత్తము పద 108

చం॥ అని వచియింపఁ గణ్ణగి యుదాత్తపతివ్రత నైన నేను భా
మిని! మఱియొండుదైవతము మేకొనఁజాలను; నాకు భర్తృభి
క్షను దయసేయుఁ డంచు బెఱసాముల వేఁడఁగ నేల యంచుఁ బ
ల్కె నది స్మేరవక్త్రయయి లేచి చనెన్ విసుమాన మొందుచున్ 109

కం॥ ఇది యైన వెనుక పు
ణ్యదినంబునఁ గణ్ణగి నిజనాథుని స్మరణన్
బొదిగొని యుండఁగ వాకిట
నొదవెఁ దలుపుఁ దట్టినట్టి యులివ ల్పముగన్ 110

## ....: కోవలన్--కణ్ణగుల సమాగమము :....

మ॥ విని దేవాంది వచోనుసారము పురావిశ్లిష్టభాగ్యంబు నా
యనుగుంగాంతుఁడు వచ్చె నేమొ యని స్నేహస్విన్నసర్వాంగి యౌ
చు నదన్నూపురయుగ్మక క్వణితముల్ సూచింపఁగా రాక నొ
య్యన నేతెంచి కవాటముం దెఱచి స్ఫాయన్నేత్రపంకేజయై 111

కం॥ కనియెన్ సామికృశుండ
య్యును గన్నులకించువాని నోట మొగంబున్
గననీయక ఱొమ్మున డా
చిన వానిని గోవలనును జివికినవానిన్ 112

తే॥ గీ॥ పొంగివచ్చెడు శోకంబు మ్రింగికొని, న
తాస్యుఁడై యున్న నాథుని యంఘ్రులందు
వ్రాలి లేవకయున్న యప్పుడతి నతఁడు
గ్రుచ్చి, యెత్తి లోపలికిఁ గేలిచ్చి చేర్చె 113

కం॥ పతిసోఁకున సతిమేనును
సతిసోఁకున దయితుమేను సరభసవృత్తిన్
ధృతపులకమ్ములుగా దం
పతులొకచిత్రానుభూతి పడసిరి లోనన్ 114

కం॥ సతి, నుద్గతబాష్పకణా
వృతాస్యఁ గన్గొని యతండు వెత గుడుచుచు నం
కతలమ్మునఁ జేర్చి నఖర
ముతోడ నశ్రులె గమీఁటి పొక్కుచుఁ బలికెన్ 115

ఉ॥ నీ మొగ మేను గాంచి తరుణీ! పదియేఁడులు దాఁటె; నైన నన్
స్వామిగ నెంతు వింటఁగల సర్వము నాకొఱ కీఁగి తెప్పు నిం
దామలినోక్తి నీపెదవిఁ దారదు; నా కులదైవతంబవో?
నామసటున్ బ్రమార్జిత మొనర్పఁగఁ బుట్టిన జహ్నుకన్యవో? 116

ఉ॥ ఆమెయిఁ గొన్ననార్తి నెద నాఁగెదు: హాలహలంబు మ్రింగియున్
జీమతలంత కీడ్వడవు; చీఁకటి వెన్నెలగాఁ దలంతు వీ

భూమి సమంబు నీకు క్షమ; మోహము నందని బుద్ధిశాలినీ
గ్రామణి వీవు; నీమొగముఁ గాంచుట నాదురితంబు రూపఱెన్ 117

ఉ॥ పూవులదండ వోలె విషభోగినిఁ జుట్టితి వెట్లు క్రొమ్ముడిన్
దావకృశాను నెప్పగిదిఁ దాల్చితి గందమువోలెఁ గొంగునన్?
గోవును బోలె సైఁచితివి క్రోల్పులి నెట్లు? నుతాపకారియౌ
కోవలనాఖ్యుఁ గాంతుఁడని కూర్చితివె ట్లు విషస్వరూపునిన్? 118

ఉ॥ జీవితభాగ్యలక్ష్మి! నినుఁ జేకొనియున్ విడనాడినాఁడ; నే
కైవడి నే దరిద్రున కగమ్యగదా! సిరి; పుట్టుగ్రుడ్డి తాఁ
బూవులదండ మూర్ధమునఁ బూనియు ఁబాముని త్రోయుఁడెట్లు? వే
శ్యావిషవల్లికారసము నానిన మత్తుని నన్నుఁ దేర్పవే? 119

ఉ॥ పూలసరంబు నంఘ్రులకు మోహముచేఁ గయిసేసికొన్న చం
డాలుఁడ; ఁగాలకూటము హఠాత్తుగ మ్రింగిన బుద్ధిహీనుఁడన్
బాలును నీరు నొక్కటని భావనసేసిన వక్రబుద్ధి; నన్
గాలచరిత్రుఁ గత్తి కొక కండగఁ జేసినఁ బాప మున్నదే? 120

కం॥ అని పలుకు కాంతు నంకం
బునుండి డేగవలె లేచి మోమె త్తగ ని
ట్లనుకంటెఁ బ్రియా! ననుఁజం
పిన మేలౌ; నవిధవ నయి ప్రీతిగఁ జత్తున్ 121

కం॥ ఈమాటలు వినఁజాలను
స్వామీ! యని యొండు వలుక సాధ్యము గామిన్
భామ మొదలు నఱికిన కద
ళీమహిజము నా ధరాస్థలిన్ మూర్ఛవడెన్ 122

కం॥ ఇలపై వ్రాలిన కణ్ణగిఁ
గల కోమల హంసతూలికా తల్పమునన్
నిలిపి సుశీతలవారిని
జిలికి, యుపచరించి తేరిచెన్ వాఁడు కృపన్ 123

కం॥ చెంగటఁ గూర్చుండి కృపా
పాంగంబుల నుపచరించు వల్లభుగాత్రం

ఖుం గరమున నిమురుచుఁ ద్రీ
తిం గని నిట్టూర్చుచుఁ బతిదేవత పలికెన్ 124

మ॥ నినుఁ బుట్టించిన బ్రహ్మదేవుఁడును నిన్ నిందించె నేనిన్ సహిం
పను; నీవే నిను నింద సేసికొనినన్ వాకట్టిన ట్లూరకుం
డను; నీ యాడినప్రల్లదంబు లెద వ్రీలన్ జేయుచున్ నాకు మూ
ర్ఛను గల్గించిన వేల పుండుపయిఁ గారం బింతగాఁ జల్లెదో? 125

కం॥ ఏపతి నేసతిఁ బాపితి
నో పూర్వపుఁబుట్టునన్ మనోహర! యెడయై
వాపోయితి; నిఁక నైనను
నాపాకగ మనుట గాక యా గత మేలా? 126

ఉ॥ నా కొకనాఁడు విప్రియ మొనర్పవు; ప్రల్లదముల్ వచింప వే
వ్యాకులపాటుఁ గూర్పవు; నయంబుగఁ గూరుతు విట్టి నీవు నా
కీ కరణిన్ బరాఙ్ముఖుఁడ వెట్లయి తంచుఁ గలంగు లోక మే
నో కొఱనోముపంట యని యుమ్మలికంబు గొనన్ మనఃప్రియా! 127

కం॥ నీ యెద యను పూఁబోదలో
నా యసితభుజంగి తూఱ నమృతము విషమై
పోయెను; భోగ్యమ భోగ్యం
బాయెన్; దెల్లనిది నల్లనై కన్పట్టెన్ 128

సీ॥ కడగండ్ల పాలాయెఁ గంచంతకాపురం
బని యొక్కనాఁడును వ్యథఁగలంగ;
నాఱుమూఁడాయె లంకంత యిల్లని తృణం
బైనను గగ్గోలు లోనఁ దాల్పఁ
బాల్పడె మచ్చకుఁ బాలవంటి విశుద్ధ
వంశంబని కొఱంతపాటు నొంద
హారతికర్పూర మట్లు కరఁగెఁ గొం
డంత సంపద యని యార్తిఁబొంద

తే॥ గీ॥ మూఁడుపూలాఱుకాయలై పొలుచుచున్న
దహహ! కట్టగి జీవితంబ న్నజనుల

వాక్కునకు నన్యథాత్వంబు పాటిలె నని
యించుకంత ప్రాణప్రియ! కించపడుదు 129

కం॥ మ్రానుగఁ గాక తృణంబుగ
మానవుఁ డుండుట వరంబు; మారుత హతిచే
మ్రాను నిపాతితమౌ; దృణ
మే నాఁడును గాదు; సృష్టి నిది వింత చుమీ! 130

ఉ॥ మేలు నశించె నా యెడల; మేకొనఁ డింటికి రా విభుండు మ
ల్లాలితుఁడయ్యె నన్ మొలకొలంది మనోవ్యథ నున్న నాకు మో
కాలి కొలంది సంతసముగా నొడఁగూడెను నీదురాక యీ
లీల గతంబు త్రవ్వకొని లేఁత ఘటించు కొనంగ నేటికిన్ 131

ఉ॥ నీ కయి కోటివేల్పులకు నిచ్చలు మ్రొక్కుచు సంతతవ్యథా
వ్యాకులనై భరంపడితి వత్సరముల్ పది; క్రమ్ముకొన్న పెం
జీఁకటి తీఱిపోయినది; చెంతకు వెన్నెల తాన ప్రాఁకెడున్
నీ కయి నేను నిల్చితిని; నీవును నా కయి నిల్వు మీశ్వరా! 132

కం॥ అనుచుఁ బ్రియు కరాలంబన
మున మెల్లఁగ లేచి వక్షమును, భుజములు, మో
మును మూపురములు నిమురుచు
ననె వెండియు సాధ్వి కనుల నశ్రువు లుబకన్ 133

కం॥ అంత యడల శ్రీపాకకు
నంత యడల సుఖములేమి కంత యడల ము
న్నంతలు పుట్టుటకును, నీ
యంతటివాఁ డి ట్టులవుట కడలెద స్వామీ! 134

కం॥ పండో? పూచెండో? వే
దొండో? భోగ్యం బని కొనియును నీస్మృతి నా
గుండియలో దోఁచుడు విష
పిండమువలె నవల విసరివేయుదు దానిన్ 135

కం॥ పాడయ్యెన్ సిరి యని యొక
నాఁడున్ విలపింప నే మనంబునఁ గాంతా!

ఓడలు బండ్ల నడచు, బం
డ్లోడలలో; నట్లకలిమియును లేమియునున్ 136

కం॥ నిను నీపుట్టునఁ గనుగొం
డునొ? లేదో? యను కలంత దురపిల్లుచు ను
న్న ననున్ దైవము కరుణిం
చినాఁడు, నీరాక శుభము చెప్పకచెప్పన్ 137

కం॥ పలకనొ? పత్రంబుననో?
విలిఖితమౌ వ్రాఁత మార్ప వీలగు; నౌనే
తలవ్రాఁత మార్పఁగా నని
పలుకు సతికిఁ గోవలన్ ప్రతాహతిఁ బలికెన్ 138

కం॥ త్రేతన్ రాముఁడు భూమిజ
చేతన్; నీచేత నేను శ్రీమతి! కలి ను
ద్భ్యాత సతీ లాభ ప్ర
ఖ్యాత యశోవిభవులముగ నైతిమి యిలలో 139

ఉ॥ కాసున కంగము మ్ముకొను కామిని చేతను గీలుబొమ్మనై
నీ సుఖసంపదన్ జెఱిచి; నీశుచిశీలము గావుగొన్న దు
ర్వ్యాసనుఁడన్! విలాసినికి వారుణికిన్ వశపడ్డవాఁడనై
నా సరివారి లోన నయనప్రియ! లాఘవముం భజించితిన్ 140

కం॥ నిను వీడిన వెనువెంటనె
ననుఁ బాసెను లక్ష్మి, నే ననాముఁడ నైతిన్
నన లమ్ము చోటఁ గట్టియ
ల నమ్ము టాయెఁ గద కోవలన్ బ్రదుకు సతీ! 141

కం॥ చే నొక్క చిల్లిగవ్వయు
లేని ననున్ బందుగులుఁ జెలిమికాండ్రురు దు
గ్గానికి నేఁ గైకొ రి టఁ
గాన నొకటి విన్నవింతుఁ గట్టిగి వినుమా! 142

కం॥ మనపురికిఁ గడుంగడు ద
వ్వున మధుర యనంగ నొక్కప్రోల్గల దది శ్రీ

కి నిధాన మందు నాదు ద
శ నిందువలె నెఱుఁగఁ డొక్కజనుఁడు, నచటికిఁ 143

కం॥ చని పాడిగ వాణిజ్యం
బొనర్చి సంపద గడించి యొకవర్షములోఁ
జనుదెంతు; సంచిమొదలే
యనువునఁ దెత్తు నను సంశయము, ననుఁ గలఁచుఁ 144

ఉ॥ నావుడుఁ బల్కెఁ గన్గొని మనఃప్రియ! కొంకుట యేల? కొమ్ము నా
యీ వెలలేని యందియల; నిప్డు బజారున కేగి యమ్మి కొ
మ్మీ వనుకొన్న సంచిమొద లీక్షణమే నడపింపు వర్తక
మ్మో వల దొంటివైభవము లందుమ యంచు వచించు పెండ్లముఁ
145

కం॥ కనుగొని కోవల నిట్లను
వనితా! సంపదకు నిన్నుఁ బాపితి; శేషిం
చిన యీ నీ యందెల న
మ్మ నాకు న్యాయంబె? పలుకుమా! యన నదియుఁ 146

కం॥ నీకుఁ గొఱగాని యందెలు
నా కేటికి? కాల్పనే మనఃప్రియ! యని బా
ష్పాకులితనేత్ర కాఁగాఁ
బైకొను బాధకుఁ గలంగి వల్లభుఁ డనియెన్ 147

ఉ॥ అందెల కేను లోభివలె యాసపడన్ మధురాపురాన నో
సుందరి! యే యుపాయమునొ చూచుకొనన్ గలవాఁడ సొమ్ముకై
అందుల కేను బోయి యొక హాయన మింటకు సమ్మతింపుమా
డెందము జాయి చేసికొని; డెప్పర మేమియు రాదు నా కటఁ 148

కం॥ నీవ సుమతింతు వను దృఢ
భావన నిది కోరిననాఁడ; ప్రతివచనంబుల్
బో విడిచి పోయి రమ్మన
వే? వల్లభ యనఁగ నింతి యిట్లని పలికెఁ 149

కం॥ రమణ! నినుఁ బాసి యొక నొక
నిముసంబును నొంటి నిలువనేర; మదీయా

గమన మనిష్ట మగునెడ వి
షమొ? వేఱొండొ? యిడి యెుంటి సాఁగుము నాథా! 150

కం॥ నా యీకోరికి కాదని
నీ యేగుట జరిగెనేని నీరో? నిప్పో
నా యాత్మబంధువౌ నని
యాయమ వావిడిచి యేడ్చె నావఱచు గతిన్ 151

కం॥ కరుణంబుగ నేడుచు న
వ్వరాంగిఁ గౌఁగింటఁ జేర్చి బాష్పకణంబుల్
కరమునఁ దుడుచుచు, గాత్రము
గరుపాఱఁగ ననునయంబుగా నతఁ డనియెన్ 152

కం॥ ఎక్కడ మధురాపురమీ?
వెక్కడ? మృద్వంగి? వచ్చు టెక్కడ? నిను నే
నక్కట! కొనిచను టెక్కడ?
తక్కుము నీవాంఛితము; వెతన్ గుడువకుమీ! 153

ఉ॥ క్రూరమృగా వకీర్ణములు ఘూకగళారవ ఘూర్ణమానముల్
భూరుహ కోటరా హిముఖ భూ గరళానల దహ్యమాన కాం
తారములౌ మహీధ్రములు దాఁటుట కుద్గతకంటకంబులౌ
దారులలోన సాఁగుటకుఁ దాళవు నీమృదు పాదపద్మముల్ 154

కం॥ ఒకచో దుర్గమగుల్మము
లొకచో గర్జజ్జ లోర్మికోద్ధతనదు లిం
కొకచో సైకతములు. వే
ఱొకయెడ విషమభువు లెన్నియో కడవవలెన్ 155

మ॥ శరభ వ్యాఘ్ర మదేభ సింహ గళ గర్జా ఘూర్ణమానా ద్రిగ
హ్వరవక్త్రంబులు తూఱి పోవునెడ హాహాకారముల్ సేయుదో?
పరువుల్ వెట్టెదొ? గుండె బెండువడఁగాఁ బాషాణమో? వజ్రమో?
మఱియెుండో? భవదీయచిత్త మని భామా దైవమున్ దూఱెదో? 156

కం॥ కావున నాపలుకులు విని
యీవు సహానుగమనమున నిచ్చ విడుమ నం

గా వామాయతలోచన
కోవలనున కనియె నిట్లు కొంకక పేర్మిన్ 157

కం॥ ఏ యెడ నీ వుందువొ? నే
నాయెడ నుందు; నెది నీకు నభిగమ్యంబో
యాయది నాకభిగమ్యము;
ఛాయపగిది నీ పిఱుంద సాఁగుదు నేనుఁ 158

చం॥ వలదని యడ్డువెట్టినను వల్లభుతోడి సహానుయానమున్
దలఁగెనె ముఁ విదేహసుత? ద్రౌపది మానెనె? యట్ల నేనునున్
పులులు, మృగేంద్రముల్ శరభముల్ వృకముల్ మొదలైన హిం
స్రముల్
గల విపినంబు త్వత్సహితఁ గాఱియవెట్టదు నన్ని కింతయున్ 159

కం॥ నీవు న్నచోటు స్వర్గము
నీవె డయైనట్టి చోటు నిరయము నాకుఁ
నీ వుండిన నే నుండఁదుఁ;
బూవు తొడిమ లేక యెట్లు పొలుచును స్వామీ! 160

కం॥ అని పలుకు కణ్ణగికి లొం
గినవాఁడై కోవలను సఖీ! శశి యస్త
బును నినుఁడుదయము నొందక
మునుపే యీనాఁడ నగరమున్ విడువ వలెఁ 161

కం॥ అనుడు తన యనుగమునమున
కనుమతి యిడినాఁడు దయితుఁడని యానందిం
చిన సతితో మధురాపుర
మున కప్పుడ కోవల నభిముఖుఁడై చనియెన్ 162



శ్రీ ర స్తు

# మం జీ ర వి లా స ము

## ప ం చ మ ప్ర క ర ణ ము.

### —: కణ్ణగి కోవలనులు స్వనగరంబును వీడుట :—

సీ॥ ఆ రేయి యింద్రమహంబు సమాప్తి నొం
దిన; దెత్తిన కొడియు దింపఁబడియె;
మంగళవారమా మహనీయదివసమ
ప్పుడ చంద్రుఁ డస్తంబుఁ బొందినాఁడు;
కడపటి జాముచీఁకటి కందెనపగిది
దిక్చక్రనాభి హత్తికొని యుండె
నపుడు జ్యేష్ఠాతార యాధిపత్యము దాల్చి
గగనావకాశానఁ గ్రాలుచుండె;

తే। గీ॥ నాతఱిని బయల్వెడలిన యట్టివారి
కాపదయొ మరణమొ గల్గునందు,రాయ
రిష్టసమయమ్మునవె దురదృష్టవశతఁ
బయనమై కణ్ణగియును గోవలను జనిరి 1

సీ॥ మహనీయు లవ్వారు మధురాభిముఖులయి
యూరి నడిమిత్రోవ ద్వారదేశ
మందుండి వెల్వడి యాపొంత నున్న వి
ష్ణ్వాలయంబున కేగి యందు నున్న
నారాయణునకుఁ బ్రణతిసేసి మఱిసాగి
యట సప్తబౌద్ధవిహారపంక్తి
కడ కేగి పంచశాఖాసముపేతమౌ
బోధిమహీజంబు మ్రోల వ్రాలి

తే॥ గీ॥ ముకుళిత కరాంబుజాతులై మ్రొక్కి లేచి
యవలఁ బరిశుద్ధ జైనాలయంబు సేరి
యందు జనులకు నారాధ్యమౌ నశోక
భూరుహమునకుఁ గడుభక్తిఁ బూజసేసి 2

ఆ॥ వె॥ పురము చివరి గవని పొంత నెల్కొన్న దు
ర్గంబు దరిసి కందకంబు కడచి
వరణ మానుకొని ప్రవర్ధమానమయిన
క్షితిపు కేళివనము చేర నరిగి 3

సీ॥ అటనుండి సాఁగి యత్యంతమనోజ్ఞమై
యుభయపార్శ్వసముది తోరువృక్ష
వాటికా చ్ఛాయమై, పఱపై, కవేరజా
స్నానఘట్ట ఘటా నుసారి యైన
ఘంటాపథము సేరి; కావేరి యుత్తర
పుదెసగా నుండిన పొర్లుకట్ట
నధిరోహణము సేసి యుపరదిఙ్ముఖముగఁ
గ్రోశంబు నడచి యకుంఠదీక్ష

తే॥ గీ॥ వివిధ సురభివల్లికా వృతి మనోజ్ఞ
మై సమున్మిషిత కుసుమోద్యాన మధ్య
భాగ గతమౌ కవుందియపల్లెఁ జేరి
రధికమార్గ శ్రమార్తి ఖిన్నాంగు లగుచు 4

—: *దంపతులు కవుందిని దర్శించుట* :—

తే॥ గీ॥ అందు నివసించుచుండు (గవుంది నాఁగ
జైనభిక్షుకి యొక్కర్తు, ధ్యానశీల;
దానఁజేసి యాగ్రామంబు జైనపుణ్య
తీర్థమై ధాత్రి సుప్రసిద్ధిని వహించె 5

ఉ॥ బొబ్బలుపోయెఁ బాదతలముల్; వసివాఁడిన గాత్రవల్లిపై
జొబ్బిలె ఘర్మబిందువులు, శోషిలెఁ దిన్నని మోముఁదమ్మిఁ; యా

గుబ్బుకొనెన్ బిపాస; యడుగుల్ దడఁబాటు వహించెఁ; గన్నులన్
గుబ్బతిలెన్ శ్రమంబు సుమకోమలి కణ్ణగికిన్ బథంబునన్ 6

తే॥ గీ॥ కణ్ణగి తదాతనావస్థ కాంచి కాంచి
కోవలనునకు నీరయ్యెఁ గుండెఁ; యెండ
కన్నె ఱుంగని మృదుసర్వగాత్రి యకట!
నాకతన నార్తిగొనె నని నవఁత నూనె 7

తే॥ గీ॥ మధుర యింకెంత దవ్వని మధురవాణి
మధురముఖుఁ దనసఖు మాటిమాటి కడుగ
నదియెఁ యల్లదియే యదే యదిగొ యనుచు
నతఁడు విహితోపచారుఁడై యుతివ కించు 8

తే॥ గీ॥ కోవలను, తట్టువడి తేఱికొన్న కణ్ణ
గియును, నడుగులపై వ్రాలి కేలుమోడ్చి
రందుఁ గల జైనమాతకు నాకవుంది
కదియు వారలఁ గనుగొని యనియె నిట్లు 9

సీ॥ ఎందుండి వచ్చుచు నిందుల కేతెంచి
నార్వరు మీరు గంభీరులార!
మీ వాలకము నాకు మీ యాభిజాత్య స
త్సంప్రదాయంబులఁ జాటుచున్న
చేల మీమొగముల నెనతేని శోకంబు
పొడుకొన్నది? నిజావాసము విడి
యధ్వశ్రమం బోర్చి యంఘ్రియానంబున
నింతదూరంబు రా నేమికతమొ?

తే॥ గీ॥ యనుడుఁ జెప్పఁ దగ్గది లేదు దారచరిత!
నా సిరులు బుగ్గియయ్యెఁ బుణ్యపురి మధురఁ
జేరి మున్ను నేఁ గోల్పడ్డ సిరిని మఱలఁ
బడయఁ గోరి పోదు నని కోవలను పలికె 10

ఉ॥ నా విని యాకవుంది నయనప్రియ! పల్లవకోమలంబులో
యీ విరిఁబోఁడి యీయడుగు లీకఠినోర్విని సోఁకి యెంతగా

నోవి వహించెనో? మనము నొచ్చెదు నా కెటులోర్చితీ వయో
పూవును నిప్పులో విసరు మూర్ఖులు లోకములోన నుందురే? 11

కం॥ సతితో మధురకుఁ జనఁగాఁ
గృతోద్యముఁడ వీ వగుట లిఖించినగతి సు
స్థితమ ని నీమొగము తెలుపు
మతిమంతులు సాఁగిరేని మరల రొకష్టున్ 12

కం॥ నేనును మీతోడుత మధు
రానగరికి వత్తు నచట రాజిలు నరివన్
జైనుని నర్చింపఁగ నా
మానస మనుదినము కడుఁ దమకపడుచుండుఁ 13

ఆ॥ వె॥ అనుడు నాదుభాగ్య మరిది యంచుఁ గవుంది
కాత్మసతిని జూపి యనియెఁ దల్లి!
దీని క్షేమవిషయమైన నావంత మా
తోడి నీయనుగతిఁ దొలఁగిపోవు 14

సీ॥ మాతోడి నీయునికి మాకు బంగరుకొండ
వంటిది; యే జన్మభాగ్యఫలమొ
అబ్బె నీ సాంగత్య మను కోవలనుఁ గాంచి
యాజైనమాత యిట్లనియె నతని
కధ్వంబు కడుదీర్ఘ మదియునుంగాక యా
యాసతాపంబుల కాటపట్టు
నిటనుండి మార్గంబు లెన్నియో కాన్పించు
నేది దగ్గఱిదియో యెఱుఁగరాద

తే॥ గీ॥ యీ యువతి కాతపవ్యథ నీఁగుకొఱకు
నడవులఁ గల నీడతెరువు లాశ్రయింతు
మేని పనస లనఁటు లాదియైన తరులు
కన్నులకు విందు గూర్పంగఁ గలవు కాని 15

తే॥ గీ॥ కానమెకములకై వేటకాండ్రు దెసల
లోఁతుగాఁ ద్రవ్వి, యాకులు వాతుల నిడి

నోవి వహించెనో? మనము నొచ్చెడు నా కెటులోర్చితీ వయో
పూవును నిప్పులో విసరు మూర్ఖులు లోకములోన నుందురే? 11

కం॥ సతితో మధురకుఁ జనఁగాఁ
గృతోద్యముఁడ వీ వగుట లిఖించినగతి సు
స్థితమ ని నీమొగము తెలుపు
మతిమంతులు సాఁగిరేని మరల రొకప్పున్ 12

కం॥ నేనును మీతోడుత మధు
రానగరికి వత్తు నచట రాజిలు నరివన్
జైనుని నర్చింపఁగ నా
మానస మనుదినము కడుఁ దమకపడుచుండుఙ 13

ఆ॥ వె॥ అనుడు నాదుభాగ్య మరిది యంచుఁ గవుంది
కాత్మసతిని జూపి యనియెఁ దల్లి!
దీని క్షేమవిషయమైన నావంత మా
తోడి నీయనుగతిఁ దొలఁగిపోవు 14

సీ॥ మాతోడ నీయున్కి మాకు బంగరుకొండ
వంటిది; యే జన్మభాగ్యఫలమొ
అబ్బె నీ సాంగత్య మను కోవలనుఁ గాంచి
యాజైనమాత యిట్లనియె నతని
కధ్వంబు కడుదీర్ఘ మదియునుంగాక యా
యాసతాపంబుల కాటపట్టు
నిటనుండి మార్గంబు లెన్నియో కాన్పించు
నేది దగ్గఱిదియో యెఱుఁగరాద

తే॥ గీ॥ యీ యువతి కాతపవ్యథ నీఁగుకొఱకు
నడవులఁ గల నీడతెరువు లాశ్రయింతు
మేని పనస లనఁటు లాదియైన తరులు
కన్నులకు విందు గూర్పంగఁ గలవు కాని 15

తే॥ గీ॥ కానమెకములకై వేటకాండ్రు దెసల
లోఁతుగాఁ ద్రవ్వి, యాకులు వాతుల నిడి

యున్న గోతులు, పన్నిన యుచ్చులు మన
కాలిబందాలుగా నయి గాసి గూర్చు. 16

తే॥ గీ॥ అంతమాత్రంబ గాదు, తెర్వరుగు వేళ
వాలుగా వీ్రిలఁ బండిన పనసపండ్ల
మొత్తములును, నారికెడంపుబొండ్లములును
పైని రాల నేమగునో దైవంబ యెఱుఁగు. 17

కం॥ మధ్యేకేదారంబు సు
మధ్య చన బెదురుగొను: గనిమలపై నెండు్రిల్
మధ్యాహ్నసమయమునకు స
మధ్యుషితము లౌ; ఁదిరుగు జలాహు లటనటన్ 18

ఉ॥ కాలికి నీటిపాము? మఱి కర్కటకంబొ? తగుల్కొనంగ నీ
బాల భయంబు సెంద దెటు? బారులుగా నఱవంగి కర్షక
స్త్రీలు గిరాటువేయ సొరిదిఁ గనిమన్ బడు కల్వగడ్డిపుం
జాలఁ బదంబు మోఁపి యెటు జాఱక తా నడచున్ ధృతాత్మయై 19

ఉ॥ దారిని నేగుచోఁ జరణ తామరసంబులు కొక్కఱాలచే
సారెకు వ్రీలి పుండ్లయిన సాఁగద యీ సతికిన్ బ్రయాణ మే
తీరున? నాపయిఁ జెఱులో? తేళులో? సోఁకినఁ గల్గఁబోవు నా
క్రూరత గోరుచుట్టుపయి రోఁకటి పోటగుఁ గీర్తివర్ధనా! 20

సీ॥ అయిననూ మన కింక నన్యమార్గమ్ము తే
దీ యరిష్టంబుల నీఁగు టెట్లొ?
యన వెతంబడుచునే యాకవుంది తన భి
క్షాభాజనము వలకండ్లసంచి
నెమ్మియూఁకలకట్ట నెమ్మిఁ గైకొని యుపా
ధ్యాయు లాచార్యుల ర్షతులు సిద్ధు
లాదిగాఁ గలిగిన యతిపూత జైనతీ
ర్థంకరులకు భక్తిఁ బ్రణతిసేసి

తే॥ గీ॥ అధ్వ మగుఁగాత మాకుఁ గళ్యాణద మని
యా త్మ నెన్నుచు సాఁగె; నద్దాని పిఱుఁద

గోవు వెన్కొను చూడలేవఁ గణ్ణ
గియును గోవలన్విభుఁడు సాఁగిరి కడంక 21

....: కవుంది గావించిన కావేరీ ప్రశంస :...

తే॥ గీ॥ వారు మూవు రొక్కొంచుక దూర మేగి
కడకుఁ గావేరి వెల్లువకట్ట నెక్కి
రప్పుడు కవుంది వారికి ననియె నాక
వేరజాతరంగిణిని దా వ్రేలఁ జూపి 22

సీ॥ ఈనది కావేరి; యీదక్షిణాపథ
మందలి నదులకు నన్నిటి కిదె
మేల్బంతి; కొడగుభూమికి నితంబము బ్రహ్మ
గిరి దీని పుట్టిల్లు; శరదవసన
మీధరణీధర మహీనసింహవ్యాఘ్ర
వారణా దిక హింస్ర భయద మయ్యు
ఫల పుష్ప పరిపూర్ణ పాదప వల్లికా
భరితమై నేత్రపర్వం బొనర్చు

తే గీ శిఖరముల నాశ్రయించి వర్షించు నెపుడు
జలధరమ్ము; లీనదియుఁ దత్సలిల మాని
పుష్టయౌ; నీ మహీధ్ర మీభూమి నమృత
దానమున నదీమాతృక గా నొనర్చె 23

తే॥ గీ॥ తామరబుటాల సలిలవస్త్రంబు దాల్చి
యూర్మికా కంకణమ్ముల మొనపరితన
మింతగాఁ గ్రాలఁ గావేరి యేగు గనుఁడు
కడలియొడయునిఁ గనులారఁ గాంచుకొఱకు 24

శా॥ ఈ కూలంకష కడ్డుకట్ట నిటనే యేర్పా వినిర్మించె హే
లా కృత్తాహితరాజకుండు కరికాల క్షోణినాథుండు మున్;
లోకం బెల్ల నుతించు నేఁటికినిఁ బైలోకాలఁ గానీ యధో
లోకశ్రేణిని గాని తత్సముఁ డనల్పోద్దండుం డఁడం చాతనిన్ 25

కం॥ బలుపుకొని ఫాలు నీ నది
సలిలంబులఁ బెంపుఁ గాంచి శాలిక్షేత్రం
బులు కడు సస్యశ్యామల
ము లగుచుఁ గన్పిందు గూర్చు పొలుపుగ్ గనుఁడీ 26

కం॥ కావేరీ జలపూరము
చే వెలసిన చిన్నపెద్దచెఱువులు చుట్టున్
గ్రేవలఁ గల వెన్నెనియు
జీవన మివి కర్షకులకు జీవన మిడుటగ్ 27

—: *కణ్ణగి కోవలనుల దారి నడిమి దృశ్యములు* :—

తే॥ గీ॥ సహ్యజా తటంబుబడిఁ బచ్చనిపొలాలు
కనుచు నాకవుంది నుడులు వినుచు నల్లఁ
గణ్ణగియును గోవల నానకట్ట దాటు
చలరి రెంతయు వివిధదృశ్యములు కనుచు 28

సీ॥ వెన్నుల బరువున వెడ వంగి తముఁ గన్న
ధర మ్రొక్కున ట్లున్న వరిపొలాలు
సజ్జనులగు వారి సంపద లెదుగు నీ
కరణి నన్న ట్లున్న చెఱకుచేలు
భోగివల్లీ పూగములు సంగతికి నుదా
హరణ మన్న ట్లున్న యాకుఁదోఁట
లున్నతి యన్న యిట్లుం ట బాగని తెల్పు
తోయాన నున్న టెంకాయతోపు

తే॥ గీ॥ లిట్లు పచ్చగాఁ గాపుర మెసక మెసఁగు
టరిది యని తెల్పు నట్లున్న యరఁటితోట
లరుసమున సతీపతులు మాయట్టు లుంట
మేలని పలుకు నట్లు న్న పూలమడులు 29

మ॥ పనమోపుగ్ దలకెత్తి సాఁగు మని చెప్పగ్ నోరు రాక ట్టుని
ట్టును గన్గో జిగిచూపుముల్కి నెదపట్టుం జీల్చు చొ య్యారమై

న నడఁ జాఁగెడి గబ్బిగుబ్బెతల వెన్కన్ నిల్చి పింపిళ్ళుగూ
యు నితంబంబుల నట్టె చూచుచు నహోహో యఁ దగుల్బా

జులుఁ 30

కం॥ చెఱి యొక కొన మొనపంటన్
గఱచుక దరహాస పూర్వకముగాఁ జెఱకుఁ
బఱపఱ మని చీల్చుచు రస
మఱిముఱి పడకా ని తృప్తులౌ నాల్మగలుఁ 31

ఉ॥ ఆకులచాటుపండి ది నయంబుగ దీనికి దోటివెట్టు టె
ట్లో కద యంచు నెంచుచు, సలోభముగా, నొక చెట్టుక్రింద నా
జూకుగ నిల్చియున్న యొకసుందరిఁ గాంచుచుఁ జెల్మికానికిన్
డాకను మీఁటి చూపుచుఁ దడంబడు కొండొక కోడెమిండఁడున్ 32

సీ॥ కట్టెండలకు వెన్ను క్రాఁగి మాడుడు బీళ్ల
బురదగుంటలలోనఁ బొరలి పొరలి
మొఱకుమై జుమ్మని ముసరు దంశముల స
పంకపుచ్ఛముతోడఁ బఱపి పఱపి
తొడిబడ నమలిన కడి సామ వియ నోటఁ
గమిచికొనుచు నుర్వు కార్చి కార్చి
ముంగాళ్ళపై లేవఁబోయియుఁ జలిమిరి
సొగపునకుఁ బడియు సోలి సోలి

తే॥ గీ॥ బురదతీఁ గెల నెట్టెంబు పొలుపుఁ బూని
మృత్క్రిముల కాటునకుఁ బుట్టు మేనిదురద
పాపికొన గడ్డివాముల పార్శ్వతలము
సారెకును ఱాచుకొనుచున్న సైరిభములు 33

ఉ॥ యౌవనదుర్మదంబునకు నానిన మద్యమదంబు తోడు కాఁ
గా వలకారియేల లతిగాఁ బచరించుచుఁ గల్పు దీయుచున్
బూవులదండకున్ బ్రతిగఁ బూనిన సంకులదండలన్ బెడం
గై వెదప్రీలు క్రొమ్ముడుల నందము చిందెడు మాలకన్నెలున్ 34

కం॥ సరసిజపత్రగతుండౌ
వరునికెలను నొక్కక్షణము పాయక యేదో

యెర తాఁ దిన్నది ప్రియునికి
సరసముగా నొసఁగుచున్న జక్కవచెలియున్ 35

చం॥ సరసిరుహాకరంబులఁ బ్రసన్నముగా విహరించి, నల్లతా
మరలయియేలఁ దూఁగి, మధుమద్యము కుత్తుకబంటి గ్రోలి ని
ర్భరమదమై తటంబుదరిఁ బ్రొబ్బలిదీవెలమేడలోనికిన్
బిరబిర పోయి పత్త్రిశయనీయము నెక్కిన యంచజంటయున్ 36

తే॥ గీ॥ ఒక్కయెడ వరిచేలలో నోదెల (బన
గట్టి తలకెత్తుకొని తెచ్చి కళ్ళముల స
పుంజముగఁ బాఱవైచిన మోపులఁ బిడి
వాటు కొట్టుచుండిన కృషీవలుల గములు 37

తే॥ గీ॥ ఒండుకడఁ గళ్ళములలోన దండిగఁ బడి
చెడని పిడివాటు కొట్టినచెత్త, నపుడ
నుఱిపిడి నొనర్పఁ దిరుగుటకొఱకుఁ ద్రాఁట
బంతిగాఁగట్టి విడిచిన బటువుటెడ్లు 38

తే॥ గీ॥ వాడుకగఁ బెట్టు తిరిపెపువడ్ల కొఱకు
మేలురాసి యొనర్చు కళ్లాలలోన
వీరగాథలు పాడుచు వేచియుండు
జోగులును జంగములుఁ బంబజోళ్ళవారు 39

కం॥ వరిపొలములలో నెల్లెడఁ
బరిగకునై యేగుదెంచు ప్రాయపుటాండ్రున్;
వరుసగ నిలబడి వారల
పరువంబున కాసఁజేయు బరవసకాండ్రున్ 40

చం॥ పడియల దేవి ముక్కుకొనఁ బట్టిన నత్తల బొమ్మడాయలన్
పడఁతులకున్ సరాగముగ వాతులఁ జొన్పెడు స్వాతికొంగలున్;
మెడ లొకకొంతగా మెలఁచి మేనుల వ్రాలిన కీటకంబులన్
బొడుచుచు రొంపిమీలఁ దిని మోముల నీటినిఁ గ్రక్కు బాతులున్ 41

కం॥ కను దనుప నడచుచుండిరి
గనిమలపై వారు మెల్లగాఁ బుష్పోద్యా

న నట న్మరుత్కుమారుఁడు
తనుఁడాఁ గుశలం బడుగు విధమున నెదుర్కొ౯ 42

ఉ॥ చల్లనిపైరుగాలి, బడి సాఁగుచు మేనిశ్రమంబు మాన్చెఁ; ను
త్ఫుల్ల లతాప్రసూనముల పొంకము కన్నులవిం దొనర్చెఁ; గో
కొల్లగ మూఁగి కూయు పులుఁగుల్ శ్రుతిపర్వ మొనర్చెఁ బచ్చనౌ
పల్లెలత్రోవ నేగుతఱి వారలమువ్వురి కింపు పెంపుగాన్ 43

ఆ॥ వె॥ అట్లు నడక సాఁగు చాల్మగలు కవుంది
యవనిసురులె యున్న యగ్రహార
ములు దరిసిరిః యచటి పొడవులౌ మిద్దెలు
వానిపైని ధూమపంక్తిఁ గాంచి 44

సీ॥ వారి కిట్లనియెఁ గోవలను విభుం; డివ్వి
వేదవేదాంగకోవిదులు విప్రు
లావాస మున్నట్టి యాలయమ్ములు, వీని
యగ్రాన జలదంబు లట్లపోలె
నలమి యున్నది ధూమ మవలోకనము సేయుఁ,
డనవర తాగ్నిహోత్రాదిభవము
కాఁబోలు; వీరు సత్కర్మనిరతులు; సం
కల్పమాత్రమున లోకముల కెల్ల

తే॥ గీ॥ నఖిలకళ్యాణములఁ గూర్తు రనుట యబ్బు
రంబె? యిమ్మహాత్ముల యునికి గ్రామజనుల
కెల్ల శ్రీరామరక్ష యంచేఁ దలంతు
ననినఁ గణ్ణగియుఁ గవుంది హర్షపడిరి 45

సీ॥ అగ్రహారంబుల నధిగమించి కవుంది
మున్నుగాఁ గోవల౯ పొలఁతితోడ
మఱికొంత దవ్వేగి సిరి కొటపట్టులౌ
మఱికొన్ని గ్రామసీమములు దరిసెఁ;
నాగ్రామముల రైతు లక్కడక్కడ నిక్షు
రసభాండముల నధిశ్రయణులందు

నించి బెల్లపుపాగు నొనరింపఁ గట్టియల్
రగిలించు చుండిరి; పొగలు రేఁగి

తే॥ గీ॥ యాకసమున కెగయు చకాలాంబుదముల
మాడ్కి నుండె; వేఱొండు గ్రామముల కడలఁ
దిప్పలై వరికుప్పలు తెరువులెల్లఁ
గప్పితెఱఁగున విప్పలై క్రాలుచుండె 46

తే॥ గీ॥ ఒక్కపల్లియ పొలిమేర నొక్కరైతు
భక్తిసంయుక్తి నెదురేగి ప్రణతుఁడగుచు
చెఱకుపా ల్దెచ్చి మున్నుగా నరుగుచున్న
జైనమాత కుపదగ నొసంగ, నదియు 47

ఉ॥ శ్రావక తన్ను బిడ్డల తెఱంగునఁ గొల్చుచు నున్న కర్షకున్
గోవలనుం గనుంగొనుచుఁ గూరిమి నిట్లను, బిడ్డలార! యెం
తే వడ సోఁకి మార్గమునఁ దూలితి రిక్షురసంబుఁ దృప్తిమై
త్రావుఁడు; దీన మీ కయిన తాపము సర్వము తీరు నావుడున్ 48

ఉ॥ అయమ పల్కనం మగఁడు నాలును దద్రసభాండ మెంతయో
తీయము గాఁగ నందికొని దీర్ఘసువిస్తృతశాఖ మాయత
చ్ఛాయము నైన చెంగటి రసాలమహీజతలంబు సేరి రా
ప్యాయితచిత్తులై పిఱుఁదు వాయక వెన్క నాకవుంటియుం 49

తే॥ గీ॥ శీతలచ్ఛాయ మామావిచెట్టుక్రిందఁ
గూరుచుండి యాదంపతుల్ గ్రోలి రిక్షు
రసము నన్యోన్యపీతపాత్రంబు గాఁగ;
వెండియును సేదఁదేఱి రా; వెన్కవిభుఁడు 50

కం॥ అమృతోపమాన మిక్షుర
స మానితిమి తృప్తిగాఁ; బ్రసన్నతయుం గొం
టిమి జైనమాత; యనఁగాఁ
బ్రమదంబున నదియుఁ గోవలనునేకు ననియెన్ 51

ఉ॥ గానుగఁ బెట్టి ఖండములుగాఁ జెఱకున్ నలిగించి కైకొనున్
మానవజాతి పాలి; టుల మాటికి మానసముల్ మథించి సు

జ్ఞానముఁ బొందు యోగి; పలుసారులు దుఃఖపరంపరాగ్నికిన్
లోనయి వెన్క సౌఖ్యసుధలో గృహకర్తయుఁ దోఁగుఁ బుత్త్రికా! 52

ఆ॥ వె॥ శ్యామికన్ దొలంచి సంశుద్ధి కాంచన
మునకు నగ్ని కూర్చు పోల్కి, లేమి
నవగుణమ్ము నొకట నపనయించి సుగుణా
మావహించు నరున కనఘచరిత! 53

ఉ॥ ఆ వచనాల పొందికకు నాల్మగ లిర్వురు మెచ్చుచుఙ్ బ్రియా
ణావసరజ్ఞులౌ కతన నచ్చటు వీడ్కొని పోఁగి రంతలోఁ;
బూవులతావిమోపు తమ మూర్ధములందు ధరించి వారికిఙ్
ద్రోవ బడిన్ సహాధ్వగుల తోయముఁ దాలిచెఁ బిల్లతెమ్మెరల్ 54

## —: శ్రీ రంగ క్షేత్రము :—

తే॥ గీ॥ వారు ప్రత్యహ మొకకోసు దూరమునకుఁ
బెచ్చు నడువలేకుండియు వివిధదృశ్య
ములను గాంచుచు శ్రీరంగమును గతిపయ
దినములకు జేరి యత్యంతతృప్తి గొనిరి 55

కం॥ కావేరీతటిఁ బుణ్య
శ్రీ వెలుగొందఁ రహించు శ్రీరంగంబుఙ్
గోవలను గాంచి ధన్యుం
డై వల్లభ కిట్టు లనియె నమితాదరుఁడై 56

కం॥ శ్రీరంగనాథునికి నీ
శ్రీరంగము ప్రాణమైన క్షేత్రంబౌ శ్రీ
వారి చట ననంతశయనులు
గా రాజిలుచున్నవారు కలకాలముగఙ్ 57

కం॥ ఏపుణ్యఫలమొ? నేఁటికిఁ
బ్రాపించెను రంగనాథు పదసన్నిధి; నా
పాపంబు లెల్లఁ దీఱిన
వీ పుణ్యస్థలి నటంచు నెఱఁగెఙ్ భక్తిన్ 58

తే॥ గీ॥ నాథు వెంబడి భక్తి వినమ్రగాత్ర
యగుచుఁ గణ్ణగీదేవి రంగాధిపునకు
రంగనాథుని కర్పించెఁ బ్రణతిశతము
హర్షబాష్పాలు కన్నుల నలమికొనఁగ 59

కం॥ వార చటు వీడి యించుక
దూరంబున నున్న కడిమితోపున్ గని ఛా
యారామణీయకమున క
పారామోదంబు నొంది బలువిడి నుండన్ 60

## ...: జైన చారణుఁడు :...

ఆ॥ వె॥ వారి కడకు జైనచారణుం డొక్క రుం
డంతరిక్షగామి యగుచు వచ్చి
వ్రాలె; వారు నంత వాని యంఘ్రులకు సా
ష్టాంగముగ నెఱఁగిరి యమితభక్తి 61

సీ॥ అపుడు కవుంది మా యఘుతూలములు వీని
మహిమానలజ్వాల మాడుఁగాక"
యని కేకవైచిన దాగతుండును గణ్ణ
గినిఁ గోవలన్వభుఁ గనులఁగాంచి
తనకు సిద్ధించిన త్రైకాలికజ్ఞాన
మహిమచే వారికి మధురఁ గలుగఁ
బోయెడు చేటును మొదలంట నెఱిఁగియు
సకల సంసర్గవర్జకుఁడు ద్వంద్వ

తే॥ గీ॥ దూరుఁ డైన కతంబున వారి నటకుఁ
బోవలదని యుఁగొని పోఁ బొరయుఁ గీడు
మీకు నని కాని పల్కక మిన్నకుండె
విధివిధానంబు నెవఁడు తప్పింపఁగలడు 62

తే॥ గీ॥ కాని వారలతో మధురానగరికి
నరుగుచున్న కవుందికి ననియె నిట్లు

కర్మసూత్రంబు లెల్ల నఖండ్యములను
జ్ఞాన మెఱుక గదా నీకు జైనమాత! 63

తే॥ గీ॥ మానవుండు తొల్లింటి జన్మమునఁ జేసి
కొన్ని సుకృతదుష్కృతములకున్ ఫలంబు
ననుభవించు నీ జన్మాన. నవ్వి తలఁగ
వెట్టిని హితోపదేశాన నేని ధ్రువము 64

కం॥ మును సేసిన కర్మంబుల
కనువగు ఫలములన యంది దసురులు, వేల్పుల్
మునులును, మహిమాన్వితులగు
జనులును; గర్మంబు దలఁగఁ జన దె వ్వనికిన్ 65

సీ॥ చల్లినవిత్తుల జనియించు మోసుల
వలెఁ గర్మముల ఫలంబులు జనించుఁ
నాయాయికర్మంబు నాయాయిఫలము వె
న్కొను, వృషమును వెదగోవు వోలె
నెవ్వాని కేనియు నీఁగ నసాధ్యంబు
ప్రారబ్ధ మది తపాలు ననుభవమునఁ
నేవిత్తు విత్తిన నావృక్షమే మొలచ్చు
నేకర్మ కాఫలమే జనించుఁ

తే॥ గీ॥ బయుల గాలిలో నిడ్డ దీపంబువోలె
స్నేహపూరితం బయ్యును జీవి జీవ
నప్రదీపంబు మలఁగు నే నాఁటికేని
దీని కాదనువాఁ డీజగాన లేఁడు 66

తే॥ గీ॥ కాన నీ వష్టగుణపూర్ణుఁడైన కేవ
లాత్మ దేవదేవుని హృదయమునఁ గనుము
నామ, రూప, జనన మరణ వ్యతీత
యౌ విభూతియే పరమాత్మఁ డని యెఱుగుము 67

తే॥ గీ॥ పుట్టు వాదిగ జీవంబు పోవు దాఁక
ఆచరింపుము సత్యమైనట్టి ధర్మ

మదియ దేహబంధానకుఁ దుది, యొసంగు
నదియ నీకు మోక్షాధిపత్యంబు తుదకు 68

సీ॥ అని జైనచారణుం డొనరించు ధర్మోప
దేశ మాలించి యుత్తరగున నల
జైనమాత కవుంది వానికి ననియె నేఁ
బరమవిజ్ఞానికి నరివనునకుఁ
దక్క నొండొకనికిఁ దలయొగ్గి మ్రొక్క; నిం
కొండు నాలింప; సత్యోపదేష్ట
కొకనికిఁ గాక వేఱొండువారలకుఁ గై
మోడ్పు గావింప; నప్పుణ్యమూర్తి

తే॥ గీ॥ యరివను పదాబ్జములు దక్క యన్యములగు
పుష్పములు దలఁదాల్ప" నావుడు నతండు
జనన మరణ బంధ విముక్తి సత్వరముగఁ
గల్గు నీకని దీవించి కడచి చనియె 69

సీ॥ అతఁడు చన్నఁ గవుంది యనుయాయి లిర్వురు
వెనువెంట రాఁగఁ గావేరి దాఁటి
యవ్వలి యొడ్డున కరిగె; నాదేవున
కంతికమునసె యుద్యాన మొండు
సురుచిర ఫలపుష్ప శోభితంబై యుండె,
నాశ్రమదవన మధ్యంబు నందు
ననుపమ శిల్పకళా ఖిరామ్యమునకు
విడిదినా నొక్కకోవెల వెలుంగుఁ;

తే॥ గీ॥ గోవలను గణ్ణగియును నా కుసుమ పరిమ
ళంబునకు ముగ్ధులై దేవళంబు నడిమి
పుష్పవనమునఁ దిరుగుచుఁ బొల్పు మిగిలి
యా రతీమన్మథులు పోలె నలరి రంత 70

....: *కవుంది జారిణీజారుల శపించుట* :....

తే॥ గీ॥ తెగిన గాలిపటంబనఁ దగులుకొన్న
తులట నొకర్తు గొంతు నా కుసుమవని క

దూరముగ నరిగెడు నొక్క ధూర్తవిటుఁడు
ప్రమదసాగరమగ్నుల వారిఁ జూచి 71

కం॥ దరిసి కవుందిని గని యా"
యిరువురు రతిపుష్పబాణులే" యని యడిగెన్
కరుణామయి యాభిక్షుకి
చురచుర నాదుర్విటుఁ గనుచుఁ బాకొనియెన్ 72

తే॥ గీ॥ వారు రతిమన్మథులు కారు; వారు నరుల;
యదియునుంగాక వార పత్యములు నాకు
వారి దరియకు మెంతయు; దారి నడచి
నడచి మిక్కలి బడలియున్నారు వారు; 73

కం॥ ఆమాటలు సోత్ప్రాసము
గా మనముఁ గాడిపాఱఁ గటకటపడుచా
కాముకుఁ డా స్వైరిణియును
నాముదుసలికిన్ గవుంది కని రీ రీతిన్ 74

సీ॥ భిక్షుకి! నీ వతి వృద్ధవు; శాస్త్రాలు
వేదాలు సదివిన విజ్ఞురాల
వేభూమి యందైన నే కోదరులగు వా
రా ల్మగలగుట యెట్లు వ్వ!? యన్న
వారల యశ్లీలవాక్కులు విని కర్ణ
ములు రెండు కణఁగి మూసికొనియె
నంత ఁగవుంది కోపారుణాస్యయయి న
క్కలై మృగాకీర్ణ కాననమ్ము

తే॥ గీ॥ లందుఁ గ్రుమ్మరుచుండు డంచా విటద్వ
యంబునకు ఘోరమైన శాపం బొసంగెః
నంత వారు సృగాలంబులై హఠాత్తు
గా వనంబునఁ గూయుచు గాసి గొనిరి; 75

సీ॥ అతికరుణంబుగ నవ్వారు కూయు కూఁ
తలకుఁ దమహృదయంబులు గలంగ

నా జైనభిక్షుకి యాస్యంబు గాంచి కో
వలను గణ్ణిగియును బలికి రిట్టు
"లజ్ఞానజనితంబు లైన దోషంబులు
క్షంతవ్యములు నాక కనలుగొంట
పూజ్యపాదాబ్జ! మీబోంట్లకు నర్హంబె?
ఈ కాముకులకు నింకెపుడు తలఁగు

తే॥ గీ॥ శాప మ"నఁగవుంది తన దుశ్చరితమునకు
నరుఁడు ఫలమొందు; దప్ప దెన్నటికి; స్వబల
మన్యబల మెఱుంగక యెవం డపథవర్తి
యౌ నతండు వీరలభంగి హానిఁబొందు; 76

మ॥ అదిగో! యా కనిపించుచున్న దురయూరా; పల్లెకున్ జెంతను
న్నది హింస్రా తిభయంకరంబగు నరణ్యం బొందు, వీర చ్చటన్
పదియున్‌రెండు సమల్ సృగాలముల రూపానన్ వెతన్ జెంది యొం
దెద రాపిమ్మట శాపమోక్షణము సందేహంబు లే దిందునన్ 77

—: వారణము :...

కం॥ ఒకపులుఁగు సిలుఁగు పాలై
యొక యున్మదవారణంబు నుసురుగొనె నిటన్
సకులార! దాన నీదీ
నికి వారణ మనెడు పేరు నేఁటికి నిలిచెన్ 78

కం॥ ఈపరిసరభూమిని సుమ
హాపాదప మొక్కఁ డుండె; నందొక శాఖన్
గాపుర ముండెన్; సుఖపర
మై పారావతయుగ మొకఁడు నపాయముగన్ 79

కం॥ ఆ మిథునము మదనక్రీ
డా మధురమ్ముగ దినమ్ములన్ గడపుచు నొం
డేమియు నెఱుఁగక యుండం
గా మిడివేసవిఁ గపోతి గర్భము దాల్చెన్ 80

కం॥ ఆ వేసవిఁలోనే పా
రావతవధు వొక్కనాఁడు ప్రాణేశున కిం
పా వహిల గ్రుడ్లువెట్టె మ
హా వనిరుహ విటప బద్ధమౌ నీడమునన్ 81

కం॥ ఆ మరుసటి దివసమున మ
హా మదదంతావళ మొకఁ డాతపతప్తం
బై మహితచ్ఛాయంబౌ
నా మహిరుహమూలము కడ కరుదెంచె వడిన్ 82

కం॥ అరుదెంచి దానినీడన్
బరిపూర్తిగ సేద దేఱి వారణ మపుడా
తరుశాఖ నందికొనె నిజ
కరమును నిగిడించి బెదరగాఁ బావురముల్ 83

కం॥ కరమును గనుగొని యాపా
వురములు వారణము దీనఁ బోవిఱుచునొ యీ
తరుశాఖ? నంచు నేక
స్వరమున వలద నుచు దానిఁ బ్రార్థనసేసెన్ 84

కం॥ ఐనను వినోద కుతుకా
ధీనం బైన గజము ద్విజ దీనావస్థన్
లో నెన్నక నీడసహిత
మైన మహీజాతశాఖ నవనిన్ గూల్చెన్ 85

కం॥ పెళపెళ మను ధ్వనితో భూ
స్థలి నా తరుశాఖ గూలె జవమున, నండం
బులు జెనతోఁ జిదురైనవి;
పులుఁగులు నా తరువు విడిపోయిన వార్తిన్ 86

కం॥ పోయి యొకచోట నెలకొని
యాయతమగు వగపు నొందె; నపుడు కపోతం
'బో' యని విముక్తకంఠం
బై యేడ్చు కపోతిని గని యనె నిప్పగిదిన్ 87

కం॥ జరిగినదానికి వగచుట
భరంపడుట నిన్నుబోటి పడఁతికిఁ దగునే?
కర మెఱుకం గలదానవు;
స్థిరచిత్తవు; వంతఁ గూటి చివుకుట మేలే? 88

కం॥ పోయిన గర్భంబును నీ
వే యనువునఁ బడయఁ గలవ హీనధృతిఁ జా
యా! యవలంబింపుము; విధి
దాయ మన కొనర్చె నిలుఁగ ధన్యత పేర్మిన్ 89

కం॥ మన మిర్వురము సుఖంబుం
డిన ఁటేపో? మాపో? పల్లటీ! చూ ల్గాదో?
కనవో గుమ్మడిపండ్లకు
నెనయవౌ బిడ్డలు; వగన్ వహింపఁగ నేలా? 90

కం అని పలుకు దయితు నాస్యం
బు నెగాదిగఁ గని కపోతి పోయిన భాగ్యం
బునకై చింతిలు; నా ప్రా
ర్థన సేయుము నన్నుఁ గూర్చు ప్రణయివి యౌ దేన్ 91

కం వారణము నాకడుపు ని
ష్కారణ మగలించె; దీనికై తగిన ప్రతీ
కారం బొనరిచి యాస్తం
బేరమమున్ గూల్చి యిడుము ప్రీతిని నాకున్ 92

కం అని దీనంబుగఁ బ్రార్థిం
చినఁ గన్నులు నీరు దేఱఁ జేడియ! నీప్రా
ర్థనమే నొనరింపన యే
మన నేటికి నాకు నంచు మగఁ డూరార్చెన్ 93

తే॥ గీ॥ పిదప నవి మిత్త్రములు ముక్కుపిట్ట, తేనె
టీగ, కప్ప చెంతకుఁ బోయి వేగ వినిచె;
నయ్యెడరుఁబాటు తమదిగా నవి గణించి
బదులుసేఁతకు నాయత్త పడి తలంచె 94

కం॥ దాయ కడున్ లావరి. మన
మో యత్యల్పులము; కాన యుక్తి యొకండే
దో యూహింపక యాతని
డాయుట మనమెల్లఁ జచ్చుటయ కా, కొండే? 95

కం॥ అని యా యైదు వితర్కిం
చినవై, యేదొ యొకయుక్తి చే మత్తేభం
బును డాసిన వం;తటఁ బి
ట్ట నాలుగె సఖేపఁ దటపటాయింపనిదై 96

కం॥ బరవసమునఁ గుంభస్థలి
సరభసముగ వ్రాలి సామజము రెండుఁ కనుల్
కఱకగు ముక్కునఁ బొడిచెను
బొరిఁబొరి జెన కాఱికాఱి భూమిన్ బడఁగన్ 97

కం॥ అంతట నయ్యంధకరి ది
గంతంబులు మాఱుమ్రోయ నగ్గహన వన
ప్రాంతమున ఘీంకరించుచు
నెంతో వ్యథఁ బరువు లెత్తె నెల్ల చలింపన్ 98

మ॥ ఖగ చంచూ హత నేత్రమై నడచుచున్ గంధేభ మయ్యార్తి కో
ర్వగలే కొక్క సుశీత లాంబుసరసిన్ వ్రాలంగ యోచించి గ
ట్టిగ గర్జించుచుఁ, గాన నెల్లెడల నాటికించుచున్ జేరె నొ
క్క గుహాభీకరమైన కొండచఱి నుగ్ర వ్యాఘ్ర సంఛన్నమున్ 99

కం॥ ఆ కొండచఱికుఁ గ్రిందుగ
భేకం బొకలోయ నుండి బెకబెక మనుచున్
వే కూసె; గజం బట నే
దో కొలను న్నదని ధ్వని కెదురుగ నడు గిడెన్ 100

మ॥ ఇడెనో? లేదొ? గుభాలునన్ బడియె మత్తేభంబు నా లోయలో
నడగొం డొక్కటి వజ్రపాతమున ఖిన్నంబైన చందాన: న
ప్పుడు పారావతదంపతుల్ మురిసి రా మోదానఁ బొంగెన్ బులుం
గె; డ హర్షించెను దేనెఁటీగ; రహి నెంతేఁ దాలిచెన్ గప్పయున్ 101

కం॥ ఏనుఁగు వెనువెంటనె తన
ప్రాణంబులు గోలుపోయి పర్వతతుల్యం
బైనట్టి పలలపిండము
గా నై యాలోయలోనఁ గన్పడుచుండెన్ 102

శా॥ ఆ యేనుం గటఁ దాను జేసిన యకళ్యాణాత్మదుశ్చేష్టకుణ్
ప్రాయశ్చిత్తము నందినట్టి స్థలి భవ్యం బంచు శైబ్యాన్వయో
ద్గేయుండై తగు చోళభూమిపతి, యా దేశాన నిర్మించె స్వ
శ్రేయోరాజ్యపు రాజధాని సకల శ్రీవల్లికా వాలముణ్ 103

కం॥ తన మేనిమాంసముఁ బులుం
గున కీవిగ నిచ్చిన శిబికులమున జన్మిం
చిన వాఁడా చోళవిభుఁడు
మునుపటి ఱేండ్ల వలె ధర్మముగఁ బాలించెణ్ 104

కం॥ ఆయన మహి ధర్మక్రీ
డాయుక్తము గాఁగ "దుర్బలస్య బలం రా
జా" యను సామెత కీడుగ
న్యాయపథం బందు జనుల నడిపించెఁ దగణ్ 105

కం॥ ఆ విన్నకత తిరంబుగఁ
గోవలను మనమున నిలిచి కూర్చె ముదంబాఁ
పై వినిచె నాత్మకథయును
నా వంతయు డాప కాతఁ డాభిక్షుకికిణ్ 106

కం॥ ఆకతఁ గవుంది నెమ్మది
సాకల్యంబుగ విని యవసానంబునఁ బ్రా
జ్ఞా కలిత వచస్కముగా
నా కోవలనునకు నిట్టు లనియెణ్ బ్రీతిణ్ 107

*...: దంపతులకుఁ గవుంది గావించిన పునరోధము :...*

సీ॥ ఇంద్రియోన్మాదంబు సాంద్రంబుగా ఱేఁగ
నెల్లవాఁ డపమార్గమే భజించుః

నుప్పైన సుడిగాలి నోడ చందంబునఁ
గ్రిందు మీఁదై పెద్దక్లేశ మొందుఁ
నట్టినరునికి సర్వాత్మకుండైన యా
దైవంబు పాదపద్మములె శరణ్యఁ
మాదేవదేవుని యంఘ్రులు నమ్మిన
వానికి సిలుఁ గెట్టిదేని సోఁక

తే॥ గీ॥ దీమహాసత్య మెఱిఁగియు నెల్లవార
లేలొ కో ప్రమాదంపడి యెప్పు డాత్మ
నాదిదేవుని సేవింప రతనిఁ దలఁప
రప్పనం బొనర్పంగ లే రతని కాత్మ 108

కం॥ ఈ లోకముల సృజింపను,
నాలోకింపను, దుదకు లయం బొనరింపఁ
జాలిన వాఁ డాతండు, త
దాలోకనముఁ బొనర్చు నాతఁడు కృతియౌ 109

కం॥ ఆరు లాఱుగురు భజింపఁగ
విరివిలాక్రీడన్ మృగయుఁడు వేటాడంగా
నరుదైన మహాటవి యీ
శరీరము, మదనదవాగ్నిఁ జను బూడిదయై 110

సీ॥ అస్థిరంబైన దేహంబు నందాస్థ స
న్నంబైనఁ గామంబు నాశమందుఁ;
గామంబు నశియింపఁ గలుగు శమదమాది
సంపత్తి; దానిచే శాంతి యబ్బుఁ;
శాంతి యబ్బిన మోక్షసౌధ సోపాన ప
రంపర దృగ్గోచరమగు; దాన
నాత్మసాక్షాత్కార మనుభూతమౌ; దాన
నపునర్భవవిభూతి యావహిల్లు;

తే॥ గీ॥ ఈప్రయత్నానఁ గనుగల్గెనేని జగము
సర్వము సముద్ధరించు; నీసత్య మెఱిఁగి

దంపతులు మీరు మెలఁగుఁడు; దైవ మెపుడు
మంచి పెంచును; జెడ్డను ద్రుంచివైచు 111

తే॥ గీ॥ అనుచు జ్ఞానోపదేశంబు నాచరించి
నట్టి యాజైనభిక్షుకి యాస్యము గని
మంచి యెన్నటికేఁ జెడ్డ మలఁపఁ గలదె?
యనుచుఁ గణ్ణగి ప్రశ్నించె నాతురముగ 112

సీ॥ అనిన భిక్షుకి దాని కనియె నోయమ్మ! యీ
జగతిఁ గాంచనము కాంచనము గాక
యన్య మెట్లౌ; నట్లయగు మంచి మంచియ
చెడ్డ యొకప్డు మంచిని నడంచు;
నంతమాత్రన చెడ్డ కగునె సదాజయం
బబ్ద మాలిక సూర్యు నావరించి
నిస్తేజ మొనరించు; నిస్తేజుఁ డౌనె సూ
ర్యుం డంతమాత్ర? చంద్రుండు రాహు

తే॥ గీ॥ బారిఁ బడి యట్ల యుండునె బయలువెడలి
స్వప్రకాశంబు చూపకే? సాధ్వి! తుదకు
మంచి నెగ్గు; సత్యము గెల్చు; మాయుఁ చెడ్డ
ధర్మబద్ధుండు చనఁ డెప్డు తప్పుదారి 113

కం॥ అనవుడు ధర్మపథంబునఁ
జను తనకే నాఁటికైన జయమౌ నని నె
మ్మనమునఁ గణ్ణగి తలఁచెను;
గనెఁ దృప్తిన్ గోవలన్ ప్రకామం బంతన్ 114

—: కందపల్లె :...

సీ॥ ఊరయూరి పొలిమేర దరసి దానిని దాఁటి
కాల్వేట్టి రావలఁ గందపల్లె
నందున్న దొక్క జైనాలయం, బందున్న
దొక్కయశోకమ్రా; యురిఁరుహము

క్రిందఁ గూర్చుండి రాయందఱు చ్చోటఁ గ
　　　　వుంది యరివనును బూజసేసె;
నమ్మూర్తి సుప్రసన్నావస్థలో నున్న
　　　　చందాన నుండె; నా శాంతమూర్తి

తే॥ గీ॥ మూర్ధమున కుపరితలాన మూఁడుగొడుగు
లొక్కదానిపై నొక్కటి యుండు నట్లు
మర్పఁబడియుండె; నాశిల్ప మహిమ వారి
కనుల మనముల రెంటి నాకట్టుకొనియె 115

తే॥ గీ॥ పరమపురుష విలీనంబుఁ బడయఁ గోరు
ప్రాణికి విభేద్యములగు కాయంబు, మాన
సంబ హంభావ మను త్రివిధంబు లైన
యావరణముల కాగొడ్డు లంకములగు 116

....: *బ్రాహ్మణ పాంథుని వృత్తాంతము* :....

సీ॥ ఆ మువ్వు రారాత్రి యందుండి, మేల్కొని
　　　　భానుండు పొడుచుడు బయలువెడలి,
యెడచెట్లతోఁపుల నడుమనుండిన యొక్క
　　　　పాషాణమయమండపంబు సేరి,
రద్దాని కొకప్రక్క నబ్జసరం బుండెః
　　　　వారటఁ జూచిరి పాంథు నొకని;
వాఁడును బాండ్యభూపాలు "నెందుంజెవి
　　　　యనును" ప్రశంసించి, యతఁడు "తెన్నా

తే॥ గీ॥ వాను" గా "మీనవానుగా" ఁబడసి యున్న
ఖ్యాతి, గంగ ప్రాంతంబునే గాక శీత
కుధరసానువుల జయించు కొన్నరీతి
విపులముగ వారలకు విన్నవించి, "మఱియు 117

ఉ॥ "ఆర్యపదైకదండ" బిరుదాంచితు ఁడాత్తఁడు స్వప్రతాప శౌం
డీర్య కృతాభిధుండుః సుమ నింబదళా వృత మాలికాధరుం

డర్యమ తేజుఁ డాజలధి యాహిమశైలము గెల్చియుఙ్ భుజా
శౌర్య కృశానుతేజమున శత్రునృపాలుర నెల్ల మాడిచెన్ 118

కం॥ తన మీనకేతనం బొ
య్యనఁ గడల నటింప దిగ్జయస్తంభములఙ్
జనపదములందు నాటిం
చినవాఁడా భూవిభుండ జేయుఁ డరులకుఙ్ 119

ఆ॥ వె॥ పుణ్యవంతమైన "పొదియలు" మలయందు
వాస ముస్నవాఁడు పనఁటికొడుకు
విశ్రుత చరితుండు విఖ్యాతమహిముండ
గస్త్యమౌని, గురుఁడు కలఁడ తనికి 120

కం॥ తన కీర్తి లక్ష్మికి నభము
వినీల మణిగృహ మొనర్చి పేర్చిన విద్వ
జ్జన వినుతుఁ డుగ్రపాండ్యుం
డనువాఁ డతని కులకర్తయై పేర్గాంచెన్ 121

ఉ॥ వేఁగి హుటాహుటిన్ "బహరులీ"నది గ్రుక్కకుఁ ద్రావి, యాత్మభూ
భాగము నెల్ల మ్రింగుటకుఁ బైపయి దూఁకిన వారిరాశినిఙ్
సాఁగఁగ నీక బల్లెపుఁగొనన్ మగిడించిన యుగ్రుఁడీ మహా
భాగుని యన్వవాయమున భాస్కరతేజముతోఁ బ్రకాశిలెన్ 122

ఉ॥ వాసవు వీరకంకణము బద్ధలుసేసి స్వపాలితప్రజల్
గాసి, నవగ్రహాదులను గాంచక యుంటకు, వానిచే ననా
యాసముగాఁ బ్రవర్షణము నంది సుభిక్షము ధాత్రి కిడ్డ తే
జోఽసముఁడు గ్రపాండ్యుఁడు విశుద్ధచరిత్రుడు కాఁడె యేరికిన్ 123

ఉ॥ ఆ మహనీయు కృత్యముల కబ్బురమొందినవాఁడు దేవతా
స్వామి స్వకంధరంబున విభాసిలు కల్పకమాలఁ దీసి య
భ్భూమివరావతంసు గళముఙ్ గయిసేసి తలంగిపోయె సం
క్షేమము భూమికిఙ్ నృపునిచే జనియించు నటంచు నెంచుచున్ 124

శా॥ ఆ పాండ్యుండు సుధాంశువంశమున కుద్యత్కేతనంబై తగెన్
పాపుల్ దద్విభు ధర్మపాలనము నోపంజాల కా యా దెసల్

ప్రాపుంగాఁ గొని రెల్లపంటలకు ౘద్రాజ్యంబు కాణాచి,"ల
క్ష్మీపూర్ణం బయి దేశమెల్లను విరాజిల్లెఁ శుభావాలమై" 125

కం॥ అని పల్కి విప్రుని గనుం
గొని తమదే జనపద మిటకున్ వచ్చుట కే
మి నిమిత్తంబ ని కోవల
ననఁగా వెండియును నాతఁ డనె నీ పగిదిఁ 126

కం॥ వినుము "కుడుమలై" ప్రాంతం
బున "మన్‌కాడు" మదభజన భువి; తిరుపతిఁ గ
న్గొనఁగా నచ్చటినుండి ప
యనమైతిని బుణ్యతీర్థ యాత్రాకాంక్షన్ 127

కం॥ ఒక కొన్నిదినంబుల క
య్యకలంక క్షేత్రమునకు నరిగితి; సర్వా
త్మకుఁడై శ్రీవేంకటపతి
ప్రకాశిలు నటన్ జగద్వి వర్ధన పరతన్ 128

తే॥ గీ॥ గంగవలెఁ బవిత్రంబు "లాకాశగంగ"
"పాపనాశన" మాదియౌ పరమపుణ్య
ఝరులు, ఘుంఘుమార్భటి సదా స్తవముసేయఁ
బరఁగు శ్రీవేంకటేశ్వరస్వామి యచట 129

తే॥ గీ॥ వచ్చి పోయెడు భక్తులు వడ్డితోడఁ
దనకుఁ గానుక లర్పింపఁ దనిసి తనిసి
యభయ హస్తంబుతో శరణార్థి రక్ష
ణం బొసంగు స్వామి యట ననారతంబు 130

తే॥ గీ॥ అచటనుండి రామేశ్వరమరిగి యందు
విష్ణు సుప్రతిష్ఠితమయి వెలుఁగు లీను
చున్న శివలింగమును గాంచి యుద్గతపుల
కాంగుఁడ నయి నుతించితి నరుస మొదవ 131

కం॥ గౌరీరమణా! శారద
ధారాధరగాత్ర! కుంభిదమనా! కరుణా

పారావార! మహేశా!
కారుణ్యముతోడ నన్నుఁ గావం గదవే! 132

కం॥ అటనుండి మధుర కేగితి
నట మీనాక్షీశు సుందరాఖ్యమహేశున్
బటుతరభక్తిని గొలిచితిఁ
జటులా ఘము లెల్ల నొక్క క్షణమునఁ గూలెన్ 133

తే॥ గీ॥ అచటు వీడి శ్రీరంగాన కరుగుదెంచి
యోగనిద్ర మునింగి క్షీరోదధిని న
నంతశయనుఁడౌ శ్రీరంగనాథుఁ గొల్చి
ధన్యజన్ముండ నైతి, ముదంబు గొంటి 134

తే॥ గీ॥ ఇది నెడుంజెవియనువిభుఁ డేలు భూమి
ధర్మపాలనంబున కిది స్థాన మంచు
నెఱిఁగి యిటకు విచ్చేసితి; నీమహీశుఁ
డేలు నీభూమి నాకిపు డిరవు సుమ్ము 135

కం॥ అనవుడు మధురానగరికిఁ
జనవలెఁ దెరు వేది చెపు మసందిగ్ధముగా"
నని కోవల నన విప్రుం
డనె నిబ్బంగిని సుపులకి తాంగుం డగుచున్ 136

## *మధురాపురమునకు బ్రాహ్మణుఁడు తెలిపిన మార్గములు*

సీ॥ ఆ మధురాపురి కరుగుట కొకమూఁడు
మార్గంబు లున్నవే; మార్గమైన
మధురకుఁ గొనిపోవు మనల; మధుర యన్న
దా నగరికి సార్థమైన పేరు;
క్షీరాబ్ధి మథనంబు సేయుచో వాసుకి
గ్రక్కిన గరళంబు ప్రజల నంత
మొందించుట గనిఁయర్ధేందుచూడుఁడు దానిఁ
గ్రోలి యావెన్క నా హాలహలము

తే॥ గీ॥ నమృతముగ మార్చినట్టి దివ్యస్థల మది,
మధుర మయ్యది యమృతంబు మాడ్కి, కాన
నా నగరి మధుర యనంగ నందెఁగీర్తి
యంతియేకాదు; కల దొండు దంతము; వినుము 137

ఉ॥ రక్కసుఁ డొక్కరుండు మధురాపుర వాసులఁ జంపఁ గోరి తాఁ
గ్రక్కసమైన యొక్కకరిఁ గన్గొలుపంగ, హరుండు దాని పే
రుక్కు నడంచి పొంతగిరి యోరకుఁ బంపి పురంబు గాయు మం
చక్కరిఁ బంచె; దాన నది "యానమలై" యని యెక్కె వాసికిన్ 138

సీ॥ కడిమితోఁపుల నట్టనడుముగా వలపలి
దారి యాప్రోలికి, దనరియుండు;
నా దారిబడిని శుష్కవనిజములు క
ట్టెండిపోయిన చెర్వులుండు మిగుల
నెండిన చెఱువుల నెలజింకల గుములు
దగదొట్టి నీటికై తనుకుచుండు;
నంతియ గా కక్కడక్కడ నారణ్య
కపిశాచములు పథికవ్రజంబు

తే॥ గీ॥ మోసగింపఁ కపటవేషములు ధరించి
చుట్టు తిరుగుచుండును, దుర్గస్తోత్రమొ? శివ
నామమో? విష్ణునామమో? నాల్క నిలుప
నవి యథాపూర్వరూపంబు నందుచుండు 139

తే॥ గీ॥ ఆ మరుస్థలి మరవలన్ నామమునఁ బ్ర
సిద్ధమౌ రైతుకొలము వసించు; నద్ది
వృష్టిలేమిచే భూములు బీడువడుడు
బాధపడుచుండు జీవనోపాధి లేక 140

ఉ॥ దారినిఁబోవు తెర్వరుల తండము పైఁబడి దోఁచుకొంటయో?
సారెకుఁ బొంతపల్లెలకుఁ జాఁగి హరించిన గొడ్ల నమ్మటో?
దారుణహింసకున్ బ్రజలఁ దార్చుటయో? తమ వృత్తి గాఁగ నా
మారవ భూమిలోఁ బసులమాడ్కిఁ జరించుచు నుండుఁ బాపియై141

తే॥ గీ॥ ఈ మనుజరాక్షసుల పీడ నీఁగి బయటఁ
బడిన సిరులకాణాచి యౌ పాండ్యరాజ్య
మందు సిరుమల ప్రాంతాన కరుగవచ్చు;
నా స్థలము పాడిపంటల కాటపట్టు 142

సీ॥ ఈ పర్వతంబుపై నెన్నియో పొలములు
కనులకుఁ బచ్చగాఁ గానిపించు;
నరఁటి, పసుపు, సజ్జ, వరి చెఱకును, జొన్న
వెల్లుల్లి యట విరివిగ ఫలించుఁ;
బొలములకు నిరువైపులఁ బోఁక, టెంకాయ
యనఁటి, మావి, పనస యాదియైన
ఫలవృక్షముల నేత్రపర్వమై కన్పించు
తోఁట లెన్నేనియుఁ దోఁచుచుండు

తే ॥గీ॥ విరియఁ బూఁచిన తంగేడు కరణి సస్య
లక్ష్మి కీడుగ నుద్యానలక్ష్మి వెలయుఁ;
బాండ్యరాజ్యాన సిరుమల ప్రాంతమందుఁ
జూడఁగలిగిన వారెల్ల సుకృతు లయ్య! 143

సీ॥ దాఁపటుదారినిఁ దారుచోఁబల్లపు
భూములు కడవంగఁ బోలు, ఁజాల
నెమ్మిగా నున్న యానేల యంతయు వన్య
పుష్పాల రమ్యమై పొలయఁజేయుఁ
బ్రచురత రారణ్య రామణీయకమును;
మార్గమధ్యమున సంపత్కరములు
పావనక్షేత్రాలు దేవాలయంబులు
కొల్లగాఁ గనులకు గోచరించు

తే॥ గీ॥ నేచ్చటచ్చటఁ బ్రాక్ప్రవహంబు లైన
నదులు తీర్థాలు పెక్కు కన్పట్టు ననుచు
నాతఁడు వచింప ఁగోవల "నంబ! నడక
పట్టుదుమె" యనంగఁ గవుంది వల్లె యనియె 144

ఉ॥ అవల వారు మూవురు ప్రయాణము సేయఁదొడంగి; రర్కుఁ డే
పై వడఁ జిమ్ముచుండెఁ; దనయాస్యమునన్ వఱువుట్లు పుట్టఁ గాఁ
ద్రోవను జెట్టు నీడకడ రొప్పుచు నిల్చిన కణ్ణగిన్ విభుం
డీవగఁ బల్కు "నావలన నిట్టియవస్థ జనించె నీ కయో! 145

ఉ॥ ఎప్పుడు నెండ కన్నెఱుఁగ వింతులు పల్వురు గొల్వ మేడపై
నుప్పరిగన్ వసించెడి కృశోదరి వీ వి టులౌట నోర్వ" నా
నొప్పులకుప్ప "నాథ! గత మూరక త్రవ్వికొనంగ నేల? నే
దప్పిని గాసి నొందితి వడన్ జలమిచ్చి తలంగు మీయెడన్"! 146

....: వనదేవత :....

చం॥ అనవుడు కోవలన్ కనుల నశ్రువు లుబ్బఁగఁ గొంతఁ దేర్చి యి
ట్లను "నట నున్న యల్లపడియన్ జల ముండఁగఁ బోలు, ఁజెల్వ! నీ
వును వెనుకొమ్ము న న్నటకుఁ బోయి జలంబును గ్రోల్తు నిన్ను నా
వనితయు వానితోడఁ జనె వారిని గ్రోలఁగ నీటిగుంటకున్ 147

ఉ॥ వారలు నీరు గ్రోలి వడఁబాసి వనీమహిజంబు నీడకున్
జేరిరి; జైనభిక్షుకియుఁ జేసయిగన్ గొనితెమ్ము నాకునున్
నీరని కోరఁ గోవలను నీటికి గుంటను జేర వాని మై
తీరును గాంచి యొక్క వనదేవత యీగతి నెంచె నాత్మలోన్ 148

ఉ॥ ఈ నవమోహనాంగకుని నే కృతినీమణి గన్నదో? కనం
గా నరుడైన వీని నయగారపుమాటల పన్నకంబుచే
నైనను, బచ్చిమోసమున నైనను బొందఁగఁ జాల నైతినే
నే నెటు లౌదు దేవత వనీస్థలి కంచును మాయలాఁడియై 149

కం॥ అసదృశ విలాసములతో
వసంతమాలగఁ దనర్చి వానికడకు మై
పస నిగుడ వచ్చి యిట్లనె
హసితము వెన్నెలలు గాయ నాననసీమన్ 150

ఉ॥ నేను వసంతమాలఁ; నిను నేఁటికిఁ గాంచితిఁ బూర్వజన్మపు
ణ్యాన దరిద్రురాలు నిధినట్టుల; పల్కుల ముల్కులన్ భవ

న్మానస మే నగల్చుటకు మాధవి నాపయిఁ గోపపడ్డదై
నా నిలయంబు వీడు మని నన్ను నరాని దురుక్తు లాడుచున్ 151

కం॥ మెడఁ బట్టి త్రోఁచి యిఁక నా
గడపం ద్రొక్కకు మటంచుఁ గఠినముగ ననెన్
కడుపుం బూడ్చుకొనుటకై
పడవచ్చునె పరుల నోటఁ బరిపరిగతులన్? 152

ఉ। ఏలొకొ కాని మాధవి రహింపదు తొల్లిటిమాడ్కి నీపయిన్
గాలి యొకింత పర్విన వికారము సూపుచు, వెల్ల బోవుచున్
బూలసరంబుఁ గాలికొనఁ బోలునె త్రోయఁగ నీకు ముగ్ధగో
పాల! రమింప రమ్మ నుచు బాహుల నింగినిఁ జేర్చు గౌఁగిటన్ 153

ఉ॥ ఎప్పుడు నేడ్చు; నొక్కమెతు కెంగిలిసేయదు; పూలదండలన్
గొప్పునఁ దాల్చియున్ విసరికొట్టును ముక్కలుగాఁగ నేలపై,
నొప్పులకుప్ప నేను నిను నొందియుఁ బాసితి; నింక నేల నా
యొప్పులు కాల్పనే? యనుచు నూరక చెక్కటఁ జేయిసేరుచున్154

ఉ॥ నీ నయనా వలేహ్య రమణీయ శరీర విలాస వైభవ
శ్రీ నెదఁ దాల్చి గ్రుక్కిళులు మ్రింగుచు నుంటిని నాఁటి నుండియున్
గాని భుజంగికా పిహిత కౌసుమకుంజమ వైతి వప్డు; నేఁ
డైనను నాదు కోర్కిఁ జరితార్థము సేయుము; నీకు దక్కితిన్ 155

తే॥ ॥గీ మాధవిని వీడినాఁడవు మంజుగాత్ర!
దివ్యసుందరి నన్నింకఁ దేఱిచూడు
మనుచుఁ బ్రార్థింపఁగాఁ గోవలను, ధరా సు
పర్వ వాక్యము లెల్ల భావమునఁ దలఁచి 156

మ॥ ననుఁ గామించి వసంతమాల యయి నన్ గన్పాఁమగా డాయు మో
హినియేఁ గామపిశాచి యేని యిది యౌ టెంతే నిజం బంచు నెం
చినవాఁడై యతఁ డీశ్వరీస్తవము సేసెన్, దల్లిరో! యీ పిశా
చి ననున్ సోఁకక యుండఁ జూడు మెద నాషేమాన" కంచా త్మలోన్
157

సీ॥ ఆ మంత్రజపమున కా కామరూపిణి
భయపడి తనదు రూపంబు దాల్చి

యతనికిఁ బ్రత్యక్షమై నిన్నుఁ గాన వం
చింప నెంచిన నజ్ క్షమింపు మంచుఁ
బ్రార్థించి యీ వృత్త మా కణ్ణగికిఁ గాని
యా కవుందికిఁ గాని యనకు మంచు
వెండియుఁ బ్రార్థించి వెడలిపోయె నెటకో
యంత నా కోవల నంబుసరసిఁ

తే॥ గీ॥ దారి తజ్జలముల నొక్క తామరాకు
దొప్పఁ గైకొని తెచ్చి యెంతో ముదాన
నా కవుందికి నొసఁగిన నదియు నీరు
ద్రావి సంతృప్తి ననియెఁ దద్దార కిటుల 158

శా॥ నారీ! చండకరుండు మండిపడుచున్నాఁ డెండయున్ జేట్ల నం
గారా ల్చిమ్మెడు నట్టు లున్న ద;విసెజ్ గాళుల్; తనుగ్లాని ని
గ్గారించున్, మధురాపురంబు దరియంగా శక్యమే నీకు; న
య్యారామస్థలిఁ జేరి, సేఁద చెడఁగా నాపైఁ బ్రయాణింతమే? 159

కం॥ అనవుడు కణ్ణగి తలయూఁ
చె; నంత వా రొక్క తోపుఁ జేరిరి; యందొ
క్క నెలవునఁ గాళిగుడి యుం
డెను; జొచ్చిరి వార లా గుడిన్ గడుభక్తిజ్ 160

## —: మరవలు కాళికను బూజించుట :—

తే॥ గీ॥ అందు సేఁదదేఱిరి ముప్వు ర; చట మరవ
జాతి కారాధ్యదైవతమై తనరిన
కాళికేశ్వరి నెలకొని గ్రాలుచుండె
భక్తు లప్పనసేసెడు బలులు గొనుచు 161

చం॥ మరవలు కాళికేశ్వరికి మాటికిఁ బూజలు సేయుచుజ్ నిరం
తరము భజించు చామె కరుణామయదృష్టికి తాము సర్వదా
యిరవయి నట్లుగాఁ దలఁతు రెప్పుడు తామొ నరించు హత్యలున్
తెరువులు కాఁచి కొట్టుటలు దేవికి సమ్మత మంచు నెంత్రు లోన్ 162

క౦॥ వారా కాళికగుడిఁ బూ
జారంభము దాఁక గడపి రం;తట నచ్చోఁ
బ్రారబ్ధం బయ్యెఁ బవి
త్రారంభము తాండవమహా మరుదుగ, దానక 163

సీ॥ చనుగవ రుచి పైకి ఁజననీక యొడలెల్లఁ
గప్పిన పులితోలు కళవసంబు
పదనురా రాఁచి నెన్నుదుటిపైఁ గుంకుమ
పూవుతోఁ దీర్చిన కావిబొట్టు,
నెగఁగట్టి ముడిఁచిన సిగ వెండి నెలవంక
పొందున మెఱుఁగారు పందికోర;
మంచిగందపుఁబూత నించిన మెడలోన
దళసరి పులిగోరు తాళిబొట్టు

తే॥ గీ॥ వెలయఁ జేతిలో నొక తడవిల్లు దాల్చి
చియ్యఁబట్టిన నల్లనిజింక నెక్కి
కలికిగుబ్బల జవరా లొకర్త యపర
కాళిగా భక్తుల నడుమఁ గ్రాలుచుండె 164

కం॥ కాళీభూమిక దాల్చి త
దాలయమున నెదురుగాఁ దదబ్జేక్షణ భ
క్తాళికి నడుమ నిలువఁగా
శాలిని యను నొక్కతె యతి చండాకృతియై 165

తే॥ గీ॥ తనకుఁ గాళికాశక్తి పూనిన దని శివ
మెత్తి చిందులు ద్రొక్కి మిన్నెక్కి యచట
గుములు గుములుగ నున్న భక్తులను జూచి
పలికె నావేశమున నిట్లు ప్రతిభయముగ 166

సీ॥ విక్రమలక్ష్మికిఁ బెట్టనికోట యీ
మరవజాతి పరాక్రమంబు నీఁగి
యేలకో నిర్వీర్యమై లావుచెడి చచ్చు
పీనుంగుగా నయ్యె; విప్రుల వలె

శాంతజీవనులరై చట్టములకు లొంగి
తిరి యేల గొఱ్ఱెలై? మరవలార!
దావానలాన శైత్యంబు జలంబుల
తైక్ష్ణ్యంబు కలుగు చందంబు కాదొ?

తే॥ గీ॥ పందతనము మరవజాతిఁ బ్రభవ మౌట
బాటసారుల దోఁచుటో? బాహుబలము
మెఱయ నెల్లజనపదాల మీఁద వ్రాలి
దోఁచుకొంటొ? గా కొండు బ్రదుకు తగు నొకొ? 167

తే॥ గీ॥ స్వర్గమున దాస్య మొనరించి బ్రదుకు కంటె
నరకమున రాజ్యపాలన వరము సుండు!
కూలినాలితో జీవింపఁ గోరుకంటె
పూటరైయెనను బ్రభువు కావుటయ మేలు 168

ఆ॥ వె॥ ఎఱచి నంజుకొనుచు నుఱుగులు గ్రక్కు టెం
కాయకల్లు ద్రావి కైపు మెఱసి
కోర్కులెల్లఁ బడయఁ గ్రొన్నెత్రు నైవేద్య
మిడుఁడు దేవి కనుచు మిడిసి చూచి 169

కం॥ ఈ పగిది నొనర్చిన మీ
దోపిళ్లు యథాతథముగఁ దుఱగలిఁగొను, మీ
కా పై దేవి కటాక్షం
బేపై వర్ధిల్లు; జూడుఁడీ నాపలుకుల్ 170

సీ॥ అనవుడుఁ జెంత నుండిన యొకకొందఱు
కుఱ్ఱవాండ్రుదు ద్రేకఘోరు లగుచుఁ
గత్తుల నుదుటిపై గాయంబు లొనరించు
కొని నెత్రు పాఱించి "కొనుము దేవి!
బలి" యంచు పలికిరా పలుకులు శాలిని
విని సెబాసు! మరవ వీరులార!
భక్తి చూపితి రిట్లు భగవతి పరితుష్ట
మతి యయ్యెః నింకొక్క మాసమునకు

శాంతజీవనులరై చట్టములకు లొంగి
తిరి యేల గొఱ్ఱెలై? మరవలార!
దావానలాన శైత్యంబు జలంబుల
తైక్ష్ణ్యంబు కలుగు చందంబు కాదొ?

తే॥ గీ॥ పందతనము మరవజాతిఁ బ్రభవ మౌట
బాటసారుల దోఁచుటొ? బాహుబలము
మెఱయ నెల్లజనపదాల మీఁద వ్రాలి
దోఁచుకొంటొ? గా కొండు బ్రదుకు తగు నొకొ? 167

తే॥ గీ॥ స్వర్గమున దాస్య మొనరించి బ్రదుకు కంటె
నరకమున రాజ్యపాలన వరము సుండు!
కూలినాలితో జీవింపఁ గోరుకంటె
పూటయైనను బ్రభువు కావుటయ మేలు 168

ఆ॥ వె॥ ఎఱచి నంజుకొనుచు నుఱుగులు గ్రక్కు టెం
కాయకల్లు ద్రావి కైపు మెఱసి
కోర్కులెల్లఁ బడయఁ గొన్నెత్రు నైవేద్య
మిడుఁడు దేవి కనుచు మిడిసి చూచి 169

కం॥ ఈ పగిది నొనర్చిన మీ
దోపిళ్లు యథాతథముగఁ దుఱగలిఁగొను, మీ
కా పై దేవి కటాక్షం
బేపై వర్ధిల్లు; జూడుఁడీ నాపలుకుఁ 170

సీ॥ అనవుడుఁ జెంత నుండిన యొకకొందఱు
కుఱ్ఱవాండ్రు ద్రేకఘోరు లగుచుఁ
గత్తుల నుదుటిపై గాయంబు లొనరించు
కొని నెత్రు పాఱించి "కొనుము దేవి!
బలి" యంచు పలికిరా పలుకులు శాలిని
విని సెబాసు! మరవ వీరులార!
భక్తి చూపితి రిట్లు భగవతి పరితుష్ట
మతి యయ్యెఁ నింకొక్క మాసమునకు

తే॥ గీ॥ మిగుల లాభంబు సేకుఱు మీకు నొక్క
దాడిలో; నెడుంజెవియన్ సుదారుణ మగు
శాసనం బంత మొందుఁ; దచ్ఛాస నాంత
మైన నింక నెక్కుడు లాభ మగును మీకు" 171

కం॥ అని యుచ్చైః కంఠస్వర
మునఁ బల్కి ప్రజాసమూహమున నొకచో నుం
డిన కణ్ణగిని నిజాంగుళి
కొనతోఁ జూపించి క్రేటుకొనుచున్ బలికెన్ 172

మ॥ అదిగో! చూడుఁడు మీర లెల్ల నలపుణ్యస్త్రీని; నీలోకమం
దుదితం బైన పతివ్రతాతిలక మా యున్నిద్రపద్మాక్షి; చం
ద్ర దివానాథులు వెల్గుదాఁక వెలుఁగున్ దద్ధామ యాదర్శమై
పాదవున్ దక్షిణదేశ మెల్లెడల నా పూఁబోఁడి కీర్తిద్యుతుల్ 173

కం॥ అనవుడు సోత్సాసంబై
న నవ్వు నగి, మగనితో వినం జొప్పడ వా
వనిత యపభ్రంశము లని
యనియును గణ్ణగి ప్రసన్నయై రాజిల్లెన్ 174

సీ॥ అంతట వారి చిం దవసన్నమయ్యె; నా
లోనఁ ద్రావిన కల్లులొట్టియలకుఁ
గోసిన మేకలు కోళ్లు మున్నగువాని
కొ కలెక్కలే దట నున్నవార
లవ్వాని మాంస మట్లల్లై యాదేవికి
నర్పనం బొనరించి రమితభక్తి
తమజాతి యైశ్వర్య మమితంబు కావుట
కోయమ్మ! తోడ్పడుమీ యనాథ

తే॥ గీ॥ జనుల మమ్ము రక్షింపుము; జయము మాకు
నెల్లకార్యంబులం గూర్పు మేఁము నీకు
భక్తుల మొసంగు శరణము భగవతి!" యని
వే యనువుల వేడిరి నడుజేయి దాఁక. 175

ఆ॥ వె॥ అర్ధరాత్ర మౌట నాత్మ నెఱిఁగిన యా
మూవు రపుడు పాండ్యభూమిపాలు
చండశాసనంబు శ్లాఘించి రిట్టి దీ
యవనిలో నపూర్వ మనుచు మిగుల. 176

ఉ॥ ఆ నరపాల పాలనము నందు ఘటిల్లదు చోరబాధ సుం
తైనఁ బథంబు నంద నుచు నాత్మఁ దలంచిన కోవలన్ నిశా
యానము చేతఁ గబ్బిగికి నాతపతాపము కాదు, శైత్యమెం
తేనియుఁ గల్గు ఱే, నిపుడ యేగుద మంచుఁ గవుందిఁ జూచినన్ 177

ఆ॥ వె॥ ఆమె వల్లె యనియెఁ; నంత నామూవురు
తక్కురాత్రి యెల్ల దారి నడచి
వేఁగుఁబోఁక నొక్క విప్రుల పల్లియ
చిత్తములు రహింపఁ జేరుకొనిరి 178

తే॥ గీ॥ అచటి విప్రకుటుంబంబు లాదినుండి
వేదవేదాంగవిద్యలు విడిచి నృత్య
గాన విద్యలు జీవికగా ననార
తంబు జీవించు చుండి రుదారకీర్తి 179

కం॥ మూవు రట నొక్క విప్రుని
యావాసమున బసచేసి రంతట నచ్చోఁ
గోవలను వారల న్విడి
తా వెడలెన్ గాల్యవిధిఁ యథావిధిఁ దీర్పన్ 180

...: కోవలన్--కౌశికుల సమాగమము :....

తే॥ గీ॥ కాల్య కృత్యములం దీర్చి కణ్ణగినిఁ గ
వుందిఁ గనుగొన నతఁడు విప్రు గృహమునకుఁ
దిరిగి వచ్చుచో నారి భూసురుని దొంటి
కౌశికుని దైవ వశమునఁ గనె నొక కడ 181

ఉ॥ కాంచి వివర్ణుఁడై యిటకుఁ గౌశికుఁ డేగతి వచ్చెఁ: దైవమీ
వంచకు చేత నన్నుఁ బఱపన్ దలపోయుచు నున్న దేమొ? ప్రా

క్సంచిత కర్మ మెట్లయిన గాసి యొనర్చు ననున్; నరుండు త
ప్పించుకొనం గలాఁడె విధి? వేఱిడినై విధి దూఱనేటికిఁ 182

కం॥ అని లోఁ దలంచు నాలో
ననఁ గౌశికుఁ డతని డాసి నయనప్రియ! నే
నిను నేఁటికి నైనను గను
గొనఁ గలిగితి; నీవు కరుణకుఁ నెల వైతిఁ 183

ఉ॥ నీవు పుహారు వీడి యెట కేగితివో యని పౌరు లెల్ల నెం
తో వెతఁ గూరి కూరి విధి దూఱిరి; మాధవి దూఱి రిం;క నే
వేవియొ దానితల్లిని సహింపఁగ రానివి పల్కె రెంతగా
నో? వినిపింతు వారు తల కొక్క తెఱంగున నన్న పల్కులఁ 184

సీ॥ వెనుక ముందును జూడ కనీశ మిచ్చెడు దాన
కర్ణుండు తుదకు బికారి యయ్యెఁ
దన పెఱ యన నెఱుంగని ధర్మరాజు తా
నీ నాఁటి కొక చచ్చుపీనుఁ గయ్యెఁ
బల్కిన పల్కు తప్పని హరిశ్చంద్రుండు
తలయెత్త కిపుడు దద్దమ్మ యయ్యెఁ
బితృనానతి ఁదల నిల్పెడు రామచంద్రుఁడ
క్కట నేఁడు వెఱిపుచ్చకాయ యయ్యెఁ

తే॥ గీ॥ బృథ్విలోఁ గుబేరులకుఁ గుబేరుఁ డీ ది
నంబునకు లుల్లిగాఁడయ్యె నయనవంతు
ల మ్మహాత్ముని జూడ రా జంద్ర గాక
యొండు రీతిగాఁ దలఁప రం చొగిఁ బలికిరి 185

సీ॥ కొడుకుపోఁకకు గోడు గుడిచెడు నీతల్లి
పడకఁ గఱచుకొన్న బల్లి యయ్యెఁ;
గుండెటికొమ్మ య్యెఁ గొడుకని విలపించు
త్వజ్జనకుఁడు వాడి వత్త యయ్యె
నోట నాలుక లేని కోటీశుఁ డే మాయె
నో యను నీచుట్టలూచ లైరి;

పగకాఁడు కూలె నే వగ యని కూయు నీ
పొరుగు వా రెండిన మ్రోడు లైరి;

తే॥ గీ॥ చేయి మీఁదుగా నడచిన శ్రీవిభుండు
నేఁ డె వని పంచ నణఁగిఁయున్నాఁడొ యనుచు
కలఁగు లెంకలు కొయుగూర కాడ లైరి
నిన్నుఁ బాసిన నెగులున సన్నుతాంగ! 186

ఉ॥ నిన్నుఁ దలంచుకొంచు, మది నెవ్వగఁ గూరుచు, నిన్నుఁ గానఁగా
నెన్నియొ దేశము ల్దిరిగి, యెందు నినుజ గనఁజాల కాపులె
ల్ల న్నయనాశ్రుపూరము వెలార్చుచు వెక్కుచు నున్నవారు; ని
న్గన్న మహాత్ము లొందెడు వగజ వివరింప నశక్తుఁడజ విభూ! 187

ఉ॥ కోవల నెందు నైనఁ గనుగొన్న భవత్పితరుల్ త్వదార్తిచేఁ
జావుకు సిద్ధమైరి; కడసారి నినున్ గనఁ బూని యున్న వా
ర్జీవ మటంచు నాతనికిఁ జెప్పుఁడు; మర్వకుఁ డంచుఁ దీర్ఘ యా
త్రా పరివస్య నేగు జనతజ గడు వేడుదు రయ్య నీ చెలుల్ 188

ఉ॥ ని న్నెడఁబాసి, సొంపుచెడి నేఁడు పుహారు పురంబు రాజు కా
నున్న రఘుప్రవీరుని వియోగముచేఁ గృశయౌ నయోధ్య నా
నున్నది; చంద్రరాక కయి యువ్విళు లూరు చకోరి యట్టు ల
భ్యున్నత! నీదురాక కయి యున్ముఖమై పురియున్న దిప్పుడుజ 189

తే॥ గీ॥ నీదు తల్లిదండ్రులగతి, నీదు బంధు
జనులగతి నెఱింగించితి; సర్వ మీవ
యనుచు నమ్మిన మాధవి యనదగతి వ
చింతు నవధారు సద్గుణ శ్రీ నిధాన! 190

*...: కౌశికుఁడు వర్ణించిన మాధవి దుర్దశ :...*

ఉ॥ ఎచ్చటి కీవు పోయిన దొకింత యెఱుంగక యేడ్చి యేడ్చి తాఁ
బిచ్చిది యయ్యె మాధవి; వివేకము గోల్పడె; నీదు చుట్టముల్
కచ్చియ లాడి యాడి మన కణ్ణగి పచ్చని కాపురంబునజ
జిచ్చు ఘటించి బోగముది చేటొనరించె నటంచు దూఱుటన్ 191

ఉ॥ ఎల్లరుఁ దన్నుఁ దిట్టుటకు నేడుచు; నిన్ను స్మరించి యూఱడుఁ
బొల్లయి పోయె నాదు వలపుందఱితీప ని వెచ్చ నూరుచుఁ
దల్లిని దిట్టు; నీ దెసకుఁ దారుట కేదియు లేదు పాయమం
చుల్లముఁ జేత బాదుకొను; నొక్కొక మాఱె డ నవ్వుఁ బిచ్చిగన్ 192

ఉ॥ పూర్వము నీ వొసంగిన విభూషణముల్ వలిపెంబు లాదిగా
సర్వము ముందు నుంచుకొని సారెకుఁ గౌగిటఁజేర్చి నొక్కుచుఁ
బార్వణచంద్రవక్త్ర! యని పల్కుచు మూర్ఛిలు; మూర్ఛ నీఁగి యా
యుర్వర నీవు దక్క యొరుఁడొ క్కఁడు దఁ గరుణింప లేఁడ నుఁ
193

ఉ॥ పూవులు గన్న నేవ గొను; బోటులఁ గన్గొన నెట్టఁజేయుఁ గ
న్నా; వలమాన మానసమునం దెడఁ దోఁచిన నిన్నుఁ జూచుఁ గ్రొం
బూవుల వ్రాలి ఝుమ్మ నుచు మ్రోఁగెడి తేఁటుల బాఱఁద్రోలుఁ; గే
శీవనిఁ గంటకాటవి వలెన్ గను; జల్లని గాలిఁ గంపిలున్ 194

ఉ॥ నీవును దా శయించు శయనీయముఁ గన్గొని యూర్చి యశ్రుధా
రావిల నేత్రముల్ మొగుచు, రాజశుకంబుల కోకిలించుఁ బా
రావత కంఠహుంకృతుల రాయిడి లోఁ దలపోయు నేదియో?
మావులఁ గూయు కోకిలల మాధవి గన్గొని తిట్టు మాటికిఁ 195

ఉ॥ ఎందఱు లేరు సాధ్వులగు నింతులు, భర్తృవియోగ తప్తలై
గుందెడువారు? పుణ్యగుణకోవిద! మాధవి వంటి సాధ్వి నే
నెందును గానఁ; దొంటి విధ మెల్లఁ ద్యజించి కృశాత్మయై కడున్
వందుఱుచుఁ దపస్వినిగఁ బ్రాణములన్ ధరియించు మేనునఁ 196

ఉ॥ భోగినిగా జనించె నని పొల్లుగ లోకము పల్కుగాక వే
శ్యాగుణ మొందు మాధవి దెసఁ గల దం దువ యేని ప్రాణ మేఁ
ద్యాగ మొనర్తు; లంజియల యందుఁ బతివ్రత యంచు మాధవిన్
నే గణియింప ఁదప్పుగునె? నీహృదయం బను సాక్షి యుండఁగన్ 197

ఉ॥ ఏరికిఁ జెప్పకుండ పురి నీవు త్యజించుట విన్నవాఁడనై
యారట మొంది మాధవి గృహంబున కేగితి; నన్నుఁజూచి దం
భోరువు కౌశికా! దయితుఁ డొక్కటి యేనియుఁ జెప్పకుండ నా
ద్వారము కేని రాక తనదారిని బోయినవాఁడు వింటివే 198

ఉ॥ ఏ నొకనాఁడు నన్ బ్రియుని నేమియుఁ బల్కి యెఱుంగ విప్రియం
బా; నవమోహనాంగుఁడును నాడఁడు విప్రియ మొండు మాధవిన్
దాను ద్యజించి పోవునని దైవ మొకండ యెఱుంగు నేమొ? ము
న్నే నొనరించి నట్టి యఘ మీ పరిణామము గూర్చె నీ విధిన్ 199

ఉ॥ ఏలొకొ ప్రాణనాథుఁడు వహించెను నాపయి విప్రియంబు నా
మేలు తలంగెఁ; గన్న మణిమేఖల బొత్తిగ విస్మరించె; నా
పాలిటి దైవతంబు వలె వచ్చితి వీవు; మహాపదంబుధిన్
దేలుచు నున్న నాకు నొక తెప్పవు గమ్ము మహీసురోత్తమా! 200

ఉ॥ పూనుము నాయెడన్ నెనరు; పొమ్ము జగంబున నెల్లచోట్ల కెం;
దైనఁ బ్రియుండు చేపడుట యబ్బిన వే కొనితెమ్ము, నాబహిః
ప్రాణము కోవలన్విభుఁడు దారుఁడు; నా నుడి నీముఖంబుగా
వాని శ్రవఃపుటిం బడిన వానికిఁ గాలొక చోట నిల్చునే? 201

ఉ॥ ఆయనఁ దెచ్చి నాదు విరహాగ్ని శమింపగఁజేయు మయ్యా! వి
ప్రా!" యని యొక్క తాళదళ మందొకజాబును వ్రాసి పంపె ల
క్ష్మీయుత! కొమ్మటం చొసఁగి, "మేలగుఁ గావుత నీకు" నా ముఖ
చ్ఛాయ పెరుంగఁ గోవలను జాబును విప్పి పఠించె నీగతిన్ 202

—: మాధవి కోవలనునకుఁ బంపిన సందేశము :—

ఉ॥ నీ పదదాసి మాధవి వినీత సదాశయ యేకవేణియై
నీ పయి నొట్టుపెట్టుకొని నెత్తిపయిం ఘటియించి యంజలిన్
బాపవిహీనచిత్తమునఁ బల్కుచు నున్నది; దీనియర్థమున్
దేపకు సంస్మరించి తరితీపా నరింపక లో మథింపుమా! 203

ఉ॥ ఏను బతివ్రతన్; హృదయ మిచ్చిన దానను; నృత్య గాన వి
ద్యా నిధి; దేహమ మ్మికొను నన్వయ మందు జనించి నంత మా
త్రాన నయోగ్య నెట్లు వుదు; ధర్మము; శౌచము, పాంసులత్వమున్
బూని నినున్ భజించితిని ముక్కున వ్రేలిడ నెల్లవారలున్ 204

ఉ॥ ప్రేపులు రేలు నిన్న ను సరించుచు నుంటిని జాయవోలె నీ
కాపద నాకు సంపదగ నౌనె మహాత్మ! యొకప్డు నీకు నౌ

నాపద నాకుఁ బాలు గలదంచు నెఱుంగవె? వృద్ధిహీనులం
దీ పదదాసి నిన్విడదద, యెండదె ధాన్యము తోడఁ దట్టయున్ 205

ఉ॥ నాఁడు పయోధి తీరమున నాథ! విహారము సల్పువేళ నే
నాడిన కోడిగంపునుడి యందలి చాతురి కీలె ఱుంగ? కీ
వోడి పరాభవించినది యూరక మాధవి నన్నటంచు న
న్వీడితి కిన్కఁ; భావుకత పేర్మిగలాఁడవు, సేయుదే యిటుల్ 206

ఉ॥ ఏ నలనాఁడు నీ హృదయ మెట్టిదొ? నీయనురాగ మెంత లో
తైనదియో? యెఱుంగ నటు లాడితిఁ గాక; మఱొండు గాదు, నీ
పై ననురక్తితో విసరివైచిన పూవులదండ నల్లత్రాఁ
చై ననుఁ గాటువేసెఁ; దల నావిధి వ్రాసిన వ్రాఁతపేరిమిన్ 207

ఉ॥ ఆ యొకమాట కిల్లు విడి యాప్తుల వీడి పుహరు వీడి తో
జాయను వెంటబెట్టుకొని సాఁగితి వెచ్చటి కార్య! కొండలున్
లోయలు, చెట్టుపుట్టలు, వనుల్ గడిదుర్గము లెల్ల దాఁటి నా
చాయ వహింపఁ గూడదని సంగర మేమయినన్ వహించితో? 208

సీ॥ "అమ్మ యున్నను నాట కరుగు నేమో పాప
వెలికని సౌధంబు వీడియేగ
వమృత మైనను నాకు నర్పింప కెంతగాఁ
బ్రార్థించినను నమ్మకైన నిడవు,
నీకూతు రీతప్పు నేఁడొ నర్చె నని యిం
టను గల యవ్వ చెప్పినను వినవు;
దాసియో? బోటియో? దండింప నలిగి నేఁ
దినకున్న నమ్మ పిల్చినను దినవు;

తే॥ గీ॥ తల్లి! రావమ్మ ముద్దులవెల్లి! యనుచు
నన్నుఁ బిలుతువు గద నాయనా" యటంచు
నార్తి గొను మణిమేఖల యన్నపలుకు
లెద నగల్చుచున్నవి; నీకు నెట్టులున్నొ? 209

ఉ॥ భోగిని మాధవిన్ మరగి పుణ్యచరిత్రుఁడు కోవల నిజ
శ్రీ గళితంబుగాఁ దనపురి న్విడి ధారుణిలో బికారి యై

నాపద నాకుఁ బాలు గలదంచు నెఱుంగవె? వృద్ధిహీనులం
దీ పదదాసి నిన్విడద, యెండదె ధాన్యము తోడఁ దట్టియున్ 205

ఉ॥ నాఁడు పయోధి తీరమున నాథ! విహారము సల్పువేళ నే
నాడిన కోడిగంపునుడి యందలి చాతురి కీలె ఱుంగ? కీ
వోడి పరాభవించినది యూరక మాధవి నన్నటంచు న
న్వీడితి కిన్కఁ; భావుకత పేర్మిగలాఁడవు, సేయుదే యిటుల్ 206

ఉ॥ ఏ నలనాఁడు నీ హృదయ మెట్టిదొ? నీయనురాగ మెంత లో
తైనదియో? యెఱుంగ నటు లాడితిఁ గాక; మఱొండు గాదు, నీ
పై ననురక్తితో విసరివైచిన పూవులదండ నల్లత్రాఁ
చై ననుఁ గాటువేసెఁ; దల నావిధి వ్రాసిన వ్రాఁతపేరిమిన్ 207

ఉ॥ ఆ యొకమాట కిల్లు విడి యాప్తుల వీడి పుహారు వీడి తో
జాయను వెంటబెట్టుకొని సాఁగితి వెచ్చటి కార్య! కొండలున్
లోయలు, చెట్టుపుట్టలు, వనుల్ గడిదుర్గము లెల్ల దాఁటి నా
చాయ వహింపఁ గూడదని సంగర మేమయినన్ వహించితో? 208

సీ॥ "అమ్మ యున్నను నాట కరుగు నేమో పాప
వెలికని సౌధంబు వీడియేగ
వమృత మైనను నాకు నర్పింప కెంతగాఁ
బ్రార్థించినను నమ్మకైన నిడవు,
నీకూతు రీతప్పు నేఁడొ నర్చె నని యిం
టను గల యవ్వ చెప్పినను వినవు;
దాసియో? బోటియో? దండింప నలిగి నేఁ
దినకున్న నమ్మ పిల్చినను దినవు;

తే॥ గీ॥ తల్లి! రావమ్మ ముద్దులవెల్లి! యనుచు
నన్నుఁ బిలుతువు గద నాయనా" యటంచు
నార్తి గొను మణిమేఖల యన్నపలుకు
లెద నగల్చుచున్నవి; నీకు నెట్టులున్నొ? 209

ఉ॥ భోగిని మాధవిన్ మరగి పుణ్యచరిత్రుఁడు కోవల నిజ
శ్రీ గళితంబుగాఁ దనపురి న్విడి ధారుణిలో బికారి య్యై

సేఁగికిఁ బాత్రమయ్యె నని శ్రీపతి! లోకము దూఱు నన్ను, నే
నీగతి నింద్యనైతి; నిట కీ వరుదెంచిన మాయ నెల్లయుణ్ 210

ఉ॥ లంజియ నంచు నన్ విడఁ దలంచుట కేమియు నార్తినొంద, నే
లంజియ నైన నౌదును' దలంగని నీపయి నాదుప్రేమ తా
లంజియ కాదు; నేఁ బలుకులన్ హృదయంబు వెలార్చితిన్ మనో
రంజన! యింక నా కరము వ్రాయఁగ జాలదు; నన్ క్షమింపుమా!211

తే॥ గీ॥ జాబు చదవుట ముగిసె; యత్రస్రపూర్ణ
వదనుఁ డయ్యెను గోవలణ్; బ్రాహ్మణుండు
తన ప్రయాణంబు సఫలమౌ నని తలంచె
నపుడు వాఁడు నా విప్రుని కనియె నిట్లు 212

....: *కౌశికునికిఁ గోవలణ్ ప్రత్యుత్తరము* :...

చం॥ అభిజనముం ద్యజించితిని; నాప్తుల పీడితిఁ దల్లిదండ్రులం
దభిరుచి మానితిణ్ జెలుల నందఱి ద్రొబ్బితి, లక్ష్మిఁ బాసితిణ్
బ్రభువును బోలె న న్గొలుచు వారల వీడ్కొని యేగుదెంచితిణ్
క్షుభిత మనస్కుగాఁ జలిపి కోమలి మాధవి ముంచితిన్ వెతన్ 213

తే॥ గీ॥ తప్పు మాధవిదో? యొండె దానితల్లి
దో? వసంతదో? యొండె నాదో? యెఱుంగు
దైవ మొక్కండ; యన్యుల తరమె యెఱుఁగ?
నేది యెపు డెట్లు జరుగునో యెవరి కెఱుక? 214

ఉ॥ నన్ను గుఱించి మాధవిని నా తలిదండ్రులు తిట్టుచున్నవా
రన్న భవమ్ముఖోద్గళితమౌ నుడి వీనుల సూది గ్రుచ్చిన
ట్లున్నది; కమ్మ యొం డిడెద, యుర్వీసురా! కొనిపొమ్ము, వారి కి
మ్మన్నియుఁ దేటతెల్లమగుః నంతట వారు త్యజింత్రు తిట్టుటన్ 215

మ॥ తన దౌర్గత్యము తెల్పె మాధవి; యయో! దౌర్భాగ్యదామోదరుం
డను; నేఁడే మధురాపురంబునకు వేడ్కన్ బోవుచున్నాఁడ; నం
దు నెదో బేరము పెద్దయెత్తున నొనర్తుణ్ శ్రీని నార్జింతు నం
చు నివాసం బెడఁబాసి వచ్చితిని నీశుం డెట్లు చే యిచ్చునో 216

ఉ॥ మే నిల నున్నదాఁక మణిమేఖల విస్మృతి నొందనేర నం
చే నని నట్లు కూతునకు; నేదియొ బేరము సేసి పెద్దగా
శ్రీనిధినై జనంబు నుతిసేయఁగఁ దొల్లిటివైభవంబుతో
నేను బుహారు వత్తు నని యేర్పడ మాధవికిన్ వచింపుమా. 217

కం॥ నా విని కౌశికుఁ డప్పుడ
కావేరీనగరమునకుఁ గాల్సాఁగించెన్
గోవలను వెనుదిరిగి వి
ప్రావాసమునన్ గవుంది నాలిన్ జేరెన్ 218

**...: కణ్ణగీ కవుందులతోఁ గోవలన్ మధుర దరియుట :—**

సీ॥ ఆ సమయమున మహీసుపర్వులు దుర్గ
తన్నునకు విలయ తాండవంబు
గావించు చుండిరి! కోవలన్ వీణ క
రమున మీటుచునె దుర్గాస్తవంబు
నొనరించి యచ్చోట నుండిన సంగీత
విద్యోప జీవులౌ విప్రబుధుల
కామోద మొనరించి యాత్మ గానకళా ప్ర
వీణత్వము వెలార్చి వినుతి కెక్కి

తే॥ గీ॥ యంత వారిని దోకొని యచటు వెడలి
యానినెల చివర గురువారాన నయన
మధుర మధురఁ బ్రవేశించె మధురరోచు
లరుణ కరములు ప్రాచిని నలముచుండ 219

ఉ॥ భానువులన్ సరోజినికిఁ బైడి మెఱుంగులు సంతరించి; వై
గైనది కాంచనాంబుమయిగా నొనరించి. దిగంగనా పరి
మ్లాన ముఖంబులం గల తమంబు హరించి వెలింగెఁ బాటల
శ్రీ నరుణుండు రోదసిని జేకొనువాఁడును బోలెఁ దూర్పునన్ 220

ఉ॥ సారస కుంజ వాటికల సౌరభవాహినిఁ దోఁగి తోఁగి; కా
సార తరంగ డోలికల సారెకు నట్టిటు లూఁగి యూఁగి; త
త్తీర లతాకుడుంగముల ‹దేపకుఁ దేపకు నాగి యాగి యు
వ్వారికిఁ బ్రోడతెమ్మెరలు స్వాగత మిచ్చెఁ బ్రభాతవేళలన్ 221

కం॥ కెలఁకులఁ గలకల కూసెడు
జలపక్షులు తనకు సౌఖశాయనికులుగా
జలజాంతర్గతయై యు
న్న లక్ష్మి తదుష స్సమయమునన్ మేల్కొనియెన్ 222

కం॥ ఆదట నాహ్వానించెనొ
నా దైవాజ్ఞన్ బురంబునన్ శ్రీ మీనా
క్షీ దేవాలయ ఘంటా
నాదము లామూవురిన్ వినస్తైనసులన్ 223

కం॥ సారెకుఁ బ్రాసా దా గత
భేరీ శంఖారవములు వీనులవిందై
వారికి నానందం బిడె
దూరాగమన శ్రమంబు తోడ్తోఁ దొలఁగన్ 224

శా। బ్రాహ్మంబైన ముహూర్త వేళ వటువుల్ వైగైనదీ సైకత
బ్రహ్మారణ్య నిబద్ధ పత్త్రకుటికా రాజిన్ సమాసీనులై
బ్రహ్మధ్యాన మొనర్చి సుస్వరముగా వల్లించు స్వాధ్యాయముల్
బ్రహ్మానందము మీఱ వారు విని రాప్రాభాతకాలంబునన్ 225

మ॥ తన సద్వృత్త యశో నుభావమున సీతన్ బోలఁగాఁ జాలు సా
ధ్వని నీ కణ్గిఁ జూడ నాకు నగు పావిత్ర్యం బటంచున్ దలం
చినవాఁడై ప్రథమా గ మూర్ధమున నాసీనుండు తా నయ్యె నాఁ
గ నినుం డయ్యెడఁ దోఁచెఁ బ్రాగ్దిశను బ్రేంఖజ్జ్యోతిరుద్ద్యోతియై 226

సీ॥ నాల్గుమూలలకుఁ దిన్నగ నేగుచోఁ బుట్టి
నెగసిన రథనేమి నిస్వనములు,
పద మెత్త కున్న మావటి సిల్లుసూపిన
వెత మ్రోఁగు గజముల బృంహితములు,
ధౌరిత కా ది గతముల నాజూకుగా
సాఁగు హయముల హేషారవములు,
వివిధా స్త్రవిద్యా వివేకంబు వెలయించు
గండంద్ర కఠినాంఘ్రి ఘట్టనములు,

తే॥ గీ॥ సాగర తరంగ ఘోషంబు చందము గొనఁ
బఱపు టిసుకతిన్నెల సూత్రపట్టినట్టు
లేపుగా నున్న టెంకాయ తోపులగము
లలరు వైగైతటిని జేరి రాపథికులు 227

కం॥ జను లెక్కువగా లేకుం
డిన రేవుబడిని హుటాహుటిన్ వారా వా
హిని దాఁటి పారమునకున్
జని రప్పుడు కోవల నసె జాయకు నిట్టుల్ 228

కం॥ ఐన కర భిన్న కమలం
బాననముగ. నూర్మిరేఖ యవకుంతనముం
గా నీ కీ డైనది వై
గైనది; యీదృశ్య మీవు కణ్ణగి! కనుమా 229

కం॥ అని పరిహాసముగా. బ
ల్కిన ప్రియు నొక్కింత వాఁడికేగంటన్ గ
న్గొనెఁ గణ్ణగి, వా రంతట
మునుకొని చని చొచ్చి రొక్కపూవుందోఁటన్ 230

సీ॥ అందుండి వారు సూర్యాలోకరేఖల
విస్పష్టముగఁ గానిపించుచున్న
పుణ్యాలయంబు గోపురమునకు నెఱంగి
నగరదేవతకుఁ బ్రణామము లిడి
యటనుండి సాఁగి సాంద్రారామములు దాఁటి
యవలి వరిపొలాల నధిగమించి,
పరిఖ దాఁటి నగరి బాహ్యాభాగము సేరి
గవను డాసి యట టెంకాయతోఁపు

తే॥ గీ॥ లరఁటి తోఁపులు చిన్నజలాశయములు
వాని గట్లు కటునిటు జొంపముగ నెదిఁగి
యున్న వెదురుపొదలు గాంచి యుత్కటమగు
మధుర సౌభాగ్యమునకు సమ్మదము పడుచు 231

తే॥ గీ॥ దారి పొడవునఁ దెరువర్ల దప్పిదీర్ప
సారె కెడనీరు, మజ్జిగ, సిరు పోయ
వరుసగా నిల్పిన చలిపందిరులఁ గాంచి
మూవు రాత్మల మివుల సమ్మోదపడిరి 232

సీ॥ ఆ ప్రాంతమున నిల్చి యవ్వారు మీనాక్షి
దేవాలయము తక్కు దేవళములు
హలపతా కాంకిత బలరామ దేవాయ
తనము, మయూరకేతన సమిద్ధ
మైన సుబ్రహ్మణ్యు నాలయంబును గాంచి
రటనుండి సాఁగి, యచ్చట విదేశి
పథికజనంబులు బసచేయు నొకధర్మ
సత్రంబు సేరి రా; సత్రమందుఁ

తే॥ గీ॥ గణ్ణిగిఁ గవుంది నుంచి యోగ్యమగు గృహము
వాసమునకై వెదుకఁగఁగోవలను బయలు
వెడలి ఖడ్గధారి సుభట వితతి రక్ష్య
మాణమైన దుర్గద్వార మహిని డాసె 233

## —: మధురా నగర వర్ణనము :—

తే॥ గీ॥ వాయు కంపిత కేతనపాణి నెత్తి
పావురాగుబాళింపులఁ స్వరముఁతో వి
దేశిపథికులఁ బిలిచెడు తెఱఁగునఁ దగు
మధుర మధురాంగనా నేత్ర మధురఁ జొచ్చె 234

చం॥ నగరము సొచ్చి ఫుల్ల సుమన స్సముదాయ పరిమ ళాపగా
భిగత మధువ్రతాంగనల వీనులవిందగు గానమాధురిఁ
సొగపును గొన్నవాఁడుబలెఁ జోద్యమునఁ గడలెల్లఁ జూచుచుఁ
సొగసరి కోవలన్ నడచుచుఁ దిరుగాడెను నాల్గువీథులఁ 235

ఉ॥ కోటలు, పేఁటలుఁ గుడులు, గోపురముల్, బస, లన్నసత్రముల్
నాటకసాల లంగడులు నర్మగృహంబులు, కేళి భూమిభృ
జ్జాటము, లట్టకంబులు, విశాలపథంబులు, మిద్దెటిండ్లు, పూఁ
దోఁటలు చూచుచ చ్చెరువుతో మధురాపురి వాఁడు క్రుమ్మరెఁ 236

ఉ॥ కోక తొలంగఁ ద్రోసికొని క్రొమ్మెయిడాల్ వెలి కుబ్బిపాఱ, నా
జూకుగఁ గ్రొమ్ముడిన్ వికచ సూనసరంబులు దాల్చి, వాసనల్
బ్రాఁక బొజుంగులన్ వెదకు వారవధూటుల, వారి యౌవన
శ్రీకి మొగంబు వేల్చు విటశేఖరులన్ గనెఁ బ్రోల నెల్లెడన్ 237

ఉ॥ మేడల మించుటోవరుల మిన్కులు చిమ్ముచుఁ బ్రోలి సొంపులన్
జూడగ వచ్చియున్న సురసుందరులో యనఁగా వెలుంగు పూఁ
బోఁడుల నృత్యగానముల ముచ్చటయౌ పురిఁ జూచి చూచి యా
వీడు ధరాగతం బయిన వేల్పులపట్నము నాఁదలంచె లోన్ 238

కం॥ పలువగల సంపదలకున్
గొలువై వస్వోకసారకున్ బ్రతియౌ ప్రో
లలరించె వానిఁ గులుకులు
జెలువును గలుగు వగలాఁడి చెలువు దలిర్పన్ 239

కం॥ మునిమాపు దాఁక నగరం
బునందుఁ దిరుగాడి సత్రమున నున్న కవుం
దినిఁ గణ్ణిగిఁ జేరి వచిం
చె నిట్లు వారికి మధుర విశేషము లెల్లన్ 240

సీ॥ కనకకాంతుల నెల్లకడలకు విరఁజిమ్ము
ప్రాసాదముల మేలి వైభవంబు
వివిధవస్తు సమృద్ధి వెలయించు నాపణ
వీథికా సౌభాగ్య విభ్రమంబు
విరుల బుక్కాము తెర్వరులపైఁ జల్లి మే
ల్పడుచున్న యారామలక్ష్మి వలపు
నూర్మికా కంకణ యుత యౌచు నెల్లర
రంజించు కాసారరమ బెడంగు

తే॥ గీ॥ కలిగి సిరులకుఁ డెంకియై క్రాలు మధురఁ
గంటి, నేత్రసాఫల్యంబు ‹గంటి ననుచుఁ
గవి తెఱంగున వర్ణించు ధవుని గాంచి
సొలసెఁ గణ్ణిగి; జైనభిక్షుకియు మురిసె 241

## ....: మాదలన :....

చం॥ పనివడి వచ్చె నచ్చటికి బ్రాహ్మణుఁ డొక్కఁడు "మాదలన్" సమా
ఖ్య నెసఁగుచున్ "తలైంచగన" గ్రామమునందు వసించువాడు, పా
వన గుణ శీల వర్తనుఁడు, వంద్యుఁడు మున్నొ కనాఁడు కీర్తితో
ఘనుఁడగు కోవలన్విభుని గాంచిన వాఁడు యదృచ్ఛ నయ్యెడన్ 242

తే॥ గీ॥ అతఁడు కన్యాకుమారి యాత్రార్థ మరిగి
తిరిగి వచ్చుచున్న నియమపరుఁడు, కోవ
లన్విభుని గుర్తుపట్టి తల్లలితయశము
నా కళించుకొని వచించె నతని కిట్లు 243

తే॥ గీ॥ నేను నీ కీర్తిలక్ష్మిచే నిన్నెఱుఁగుదు
ధీర! మణిమేఖలాదేవి పేరు నీవు
తనయ కిడ్డ యానాఁటి వృత్తాంత మెల్ల
నచ్చు గ్రుద్దినట్లున్నె నీ యాత్మయందు 244

సీ॥ అనాఁడొ కమదపుటేనుఁ గొక్కని, గూని
ముదుసలి బ్రాహ్మణుఁ బొరిగొనంగ
రా, నీవు ధైర్యాన వానిని రక్షించి,
దాని సుతీక్ష్ణ దంత ద్వయంబు
నడు మధిష్ఠించి తన్మద మెల్లను దలంగి
నట్టి యా సాహసో దంత మిప్డు
కనులకుఁ గన్పట్టు గతి నున్నద; దియును
గా కొకనాఁడు భూకాంతునాజ్ఞఁ

తే॥ గీ॥ జంపఁ బడఁబోవు నొకయువజాని యాలి
యేడ్పు విని కృప వానికై యీవ యసువు
లీఁగఁ బోయిన వృత్తాంత మిపుడు దలఁచు
కొనుచు నీ త్యాగ మనుపమం బని స్మరింతు 245

ఉ॥ కాని యరిష్ట మేదియొ యొకండు నినున్ దిగమ్రింగఁబోవు న
ట్లో నవమోహనాంగ! మది నూహఁగ నొక్క విధానఁ దోఁచు నా
కైః న భయంపడంగఁదగ దః య్యది నీ తొలిజన్మమందు నే
దే నొక దుర్విపాకమున కీవు ఫలంబుగ నెన్ను మాత్మలో 246

సీ॥ నావుడు కోవలన్ బాపని కిట్లను
నట్టిభయంబు నన్నలమి యున్న
ద ధిపునాశ్రయమున యందున్న యొక క్షుద్ర
వంశజుఁ డెనుఁబోతుపైకి నన్ను
నెక్కించి, కణ్ణగి నెంతయుఁ గ్రూరుఁడై
బాధించి నట్లు స్వప్నంబు గంటి
నాపై నిరువుర మే మైహికవాసన
లొ కటొక్కటిగ నెల్ల నుజ్జగించి
తే॥ గీ॥ పొందితిమి ముముక్షుస్థితి భూసుపర్వ!
పక్వ మైనట్టు దలఁతు మా బ్రదుకు జగతి
ననఁ గవుందియు నా బాపఁడా దరమున
నా సతీపతులం గనులార, గాంచి 247

ఉ॥ ఇక్కడి కెట్లొవచ్చితిరి; యీ కనిపించెడు పేఁట వాసముం
దక్కఁడు; భిక్షులన్ యతుల దక్క మఱొక్కరి నిందు నుండనీ
రెక్కడి కైన నేగి వసియింపఁగ మిక్కిలి యోగ్యమౌ గృహం
బొక్కటి చూచికొం దనుచు నొక్కముఖంబుగఁ బల్కె రంతటన్ 248

....: మ దా రి :...

ఆ॥ వె॥ అపు డటకు మదారి యను నొక్కగొల్లది
యరుగుదెంచె! నద్ది యా కవుంది
కెఱుక యౌట, వారి నిద్దఱి దానికి
నాదరంబున నది యప్పగించి 249

కం॥ మీ యింటికిఁ గొని చనుమీ
జాయాపతుల నిరువురిని, ఁజాయగతిన్ నీ
వే యెడ వీరి విడకు మ
మ్మా! యని పలుకుచుఁ గవుంది యచటు విడి చనెన్ 250

ఉ॥ అంత మదారి యల్లదిగొ! యా కనిపించెడు పూలతోఁట కం
తంతనె మా గృహంబు కల ద,య్యది మీకు నివాసయోగ్యమం
చెంతయుఁ బిల్వ నయ్యిరువు రేకముఖంబుగ వల్లె నాఁగఁ జూ
పింతుఁ బథంబు మీ కనుచు వేడుక మున్ జనఁగా సతీపతుల్ 251

తే॥ గీ॥ దాని ననుసరించి చని రా దారి భర్త
పిఱుఁద ఛాయ తెఱంగున వినయ వినమి
తాంగియై చను కణ్ణగినిం గని తల
కొక్క రీతిగ నిల్లెంచిర క్కడి వ్రజ 252

కం॥ కన్యకయో? క్షీరాంబుధి
కన్యకయో? భూధరేంద్ర కన్యకయో? కా
కన్యకు నేతాదృ గసా
మాన్య చ్ఛాయాప్తి యే క్రమంబునఁ గలుగుఁ 253

సీ॥ చిగురాకుల మెఱుంగు జిగి యెల్ల వడఁబోసి
కైకొని యిట్లం టు కట్టె నేమొ?
యనఁటులఁ గల నున్నఁదన మంతయును దెచ్చి
పొడవుగా నిటు నారుపోసె నేమొ?
యిసుకతిన్నెల లోన నెసఁగు గుంద్రఁదనంబు
గ్రహియించి యిటు మూట గట్టె నేమొ?
కలువఱేకులయందుఁ దొలకాడు మిసిమిని
గొనితెచ్చి యిట్ల చ్చు గ్రుద్దె నేమొ?

తే॥ గీ॥ ధాత నాఁగ నీసతికి పదంబు, లూరు
వులు, నితంబమ్ము లక్షులు పోలుచు, నీ య
నన్య లభ్య లావణ్యసౌందర్యములకు
నాకరము, దీనిఁ గన్న యయ్యనఘు లెవరొ? 254

## ...: కోవలన్ కణ్ణగి మదారి యింట వసించుట :—

ఉ॥ దారి జనోక్తి కుబ్బుచు మదారి గృహానకు వారి నిర్వ్వరన్
జేరిచి, స్నాన మార్చి, తగుసేవలఁ బ్రీతి యొనర్పఁగా అయ్యై
పేరిటిదాని నాత్మసుతఁ బెట్టి స్వగేహము కణ్ణగిపదాం
భోరుహధూళి సోఁకునకు బూనెను శౌచ మటంచు నెంచె లోన్ 255

కం॥ కోవలను ముదంపడి త
త్సేవకుఁ దద్భక్తికిఁ మదిన్ మెచ్చుచు మా

కి వీట నీడ నొసఁగుట
నావాసం బిడిన పుణ్య మబ్బెను నీకుఁ 256

ఉ॥ మా మొగ మీ వెఱుంగ వ నుమానము నీ కెద లేదు మా యెడన్.
నీ మన మో మదారి! నవనీతముతోఁ దులఁ యింతకున్ గృపా
భూమిని నిన్నుఁ జూచితిమి; పోయెను మా యశుభంబు లెల్ల నీ
మోమును గాంచి నంత; నొక పుణ్యసతిఁ గనినార మీ పురిన్ 257

కం॥ నీ యొనరించిన యుపకృతి
కే యనువున (బ్రత్యుపకృతి యే మొనరింపం
బోయెదమో యెఱుఁగము మా
కీ యెడ నినుఁ జూపె దైవ మీ గతిఁ దల్లీ'' 258

చం॥ అనవుడు గొల్లభామ వినయంబున నెన్నిదినాల నుండియో
వనితయు నీవు త్రోవబడి వచ్చుట మిక్కిలి డస్సినారు; భో
జన మొనరింపుఁ డొక్కరవ శ్రాంతి యుడంగు; ననంతరంబ మీ
యనియెడి దెల్ల నే వినెద ''నంచు వచించె స్మితాంకి తాస్యమై 259

తే॥ గీ॥ దాని నుడి విని కణగి తత్క్షణంబ
షడ్రసోపేత మైన భోజన మొనర్చి
పతికి వడ్డించి తినిపించె; వాఁడు నాల
గించు నాలో మదారి కావించెఁ బాన్పు. 260

తే॥ గీ॥ పాన్పు మీఁదఁ బరుండి కోవలను భార్య
సరస మాడుచు నొసఁగు కప్పురపువీడ్య
మందు కొని యొనర్చుచుఁ దన దైన తొంటి
వృత్తము స్మరించుకొని తనవెలఁది కనియె 261

మ॥ ఒక పుణ్యాత్ముని యన్వవాయమున నే నుత్పన్నుఁడై నృత్యగా
న కళా రాధన నొక్క వేశ్యకు నధీనం బైతి; నా యట్టివా
నికి నీ యట్టి పతివ్రతా తిలకమున్ నిర్మించెఁ బాపిష్ఠి బ్ర
హ్మ కులస్త్రీగ; విచిత్ర మీ విషమసంబంధంబు చర్చింపఁగన్ 262

ఉ॥ చే ధన మున్నదాఁక ననుఁ జేకొని కన్నులఁ గప్పికొన్నదా
మాధవి; పాదదాసివలె మన్నన సేసిన దీశుగా నమా

రాధన మాచరించినది; "ప్రాయము నాది త్వదీయ మం"చు ని
ర్బాధముగా వచించినది; పాసిన దా ధనమెల్లఁ జెల్లఁగన్ 263

ఉ॥ బోగమువారి కొంపలకుఁ బోయి, ధనంబులు కొల్లవెట్టి నీ
బాగుఁ దలంప నైతి మును; భామిని! ఐనను నీవు నాకు నీ
సేఁగిని నూఁతయష్టి వలెఁ జేపడి తగ్గిని నెత్తి నిడ్డ నా
పైఁ గుసుమంపుటెత్తుల నవారిగఁ జల్లితి వీవు కణ్ణగీ! 264

తే॥ గీ॥ హాలహల మొక్కగ్రుక్కలో నారగింప
మొదట నినుఁ జెప్పి యవల నా భూతనాథుఁ
బేర్కొనఁగ జెల్లు; గాకున్న విషము సుధ నొ
నర్చు గారడి వనియే ననంగఁ బోలు 265

కం॥ తల్లిం దండ్రిం గ్రాచితి;
నల్లరి పాల్జేసితి నిను; నైనను నన్నున్
జెల్లని కాసుగ నెన్నవు
కల్ల నిజము తెలిసికొనియుఁ గనలవు నేఁడున్ 266

ఉ॥ పాలును నీరు వేఱు పరపంగల హంసిని నిన్ను వీడి నే
నేలొకొ కొంగ నంచ యని యెన్ని తదాస్యఝషంబు నయ్యు నే
వేలుపా చల్లగాఁ గనుట వెల్వడి దక్కితి నీకుఁ గావునన్
లోలుని నన్ను నీతికుశలున్ బొనరింపుము నీ ప్రవర్తనన్ 267

కం॥ వయసునఁ బిన్నవు; సుమతీ!
యయినను జ్ఞానమునఁ బెద్దవ, ప్లేటన్ వి
ప్రియమేఁ జేసిన నోర్చితి;
ప్రియుఁడని భావించి నన్ను విడ వీ నాఁడున్ 268

ఉ॥ కొండలు, లోయలుఁగా గుహలు కోనలు కానలు నేళ్లు దాఁటి నా
యుండినచోటు స్వర్గ మను యోచనతోఁ జనుదెంచి తీవు; లే
కుండిన నెండ కన్ను లమ నోర్వఁగ నేరని నీవు మత్త వే
దండ మృగేంద్ర ముఖ్య భయదంబగు మార్గము త్రొక్క నేటికిన్ 269

కం॥ నా విని కణ్ణగి దయితా!
నీ విజ్ఞానరవి భోగిని నీరద మా

లా వృతుఁడై వెలుగమి నా
జీవిత నందన వనమునఁ జీఁకటి తోఁచెన్ 270

ఉ॥ ఐనను సత్పథంబు విడ కన్వహ మే భవదీయపాదముల్
మానస మందు నిల్పి యొక మంచి దినంబున నన్నుఁజేరు నా
ప్రాణవిభుండు తప్పదని భక్తి భజించుచు నుంటి, నా మదూ
హానుగుణంబుగాఁ బ్రియ! త్వదాగమనంబు ఘటిల్లె నీక్రియన్ 271

కం॥ నీ మన మిప్పటికి నిజము
గా మాఱినదని తలంచి కమనీయాకా
రా! మునుపటి దెల్ల మఱచి
యీ మెయి నమ్మకముగ నిను నెయిదితి ననియెన్ 272

ఉ దాని మృదూక్తి కుబ్బి "తలిదండ్రులఁ బోచగఁ బాసి తా, ప్తవ
ర్గానకు దూర మైతి, చెలికత్తెల వీడితిః కొంప గోడియున్
మానితి వౌర! న న్నొకని మాత్రమ రక్షకుఁగాఁ దలంచి యె
ద్దానిని నైన నోర్వఁ దెగి తారిన నీ ధృతి కేను మెచ్చితిన్ 273

కం కలనా డింతులు వలతురు
వలపింతురు; లేనినాఁడు వాడిన పూవుం
బలెఁ ద్రోయుదు రిది, నీయెడఁ
బొలఁతీ! నాకు విపరీతముగఁ గన్పట్టున్ 274

చం నిను సుఖపెట్టఁగా ఁదలఁచి నే నిట వర్తకముం బొనర్ప వ
చ్చినదియుఁ ఁజిల్లిగవ్వయును జేతను లేనిదియున్ వధూటి! నీ
కు నెఱుక నాఁగఁ గాంత! మది కొంకక నూపుర మొం దొసంగె, దీ
నినిఁ దెగనమ్మి వర్తకము నేఁడ యొనర్పు మ టంచుఁ బల్కుచున్275

తే॥ గీ॥ వనిత త్యాగంబునకు మెచ్చి వాఁడు నేఁడు
సేద దీఱిచికొని తేపు పోదు విపణి
కనుచు శయనించెఁ బాన్పున, నంత నదియు
విభుని కౌఁగింట నిదురించె వేఁగు దనుక 276

...: అందె నమ్మేటకుఁ గోవలన్ మధురకు బయల్వెడలుట :...

తే॥ గీ॥ వేగ కాల్యంబు లొనరించి ప్రియ యొసంగు
నందె మూట గట్టుకొని స్మితాస్యుఁ డగుచు
'పోయెద' నటంచుఁ బలికి య ప్పూవుఁబోఁడి
వీడ్కొని, మదారి కనుచుండ వీటి కరిగె 277

సీ॥ అరుగు నవ్వఁడు వాని కభిముఖంబుగ నొక్క
కుండలి చనుదెంచెఁ; గోవల నది
యపశకున మటంచు నాత్మ నెఱుంగక
నడచుచో నడుమ సందంశకంబు
హస్తంబున ధరించి యగసాలె యొక్కండు
చనుచుండె; వాని వెన్కనె కళాదు
లొక కొందఱు నడచు చుంట కన్గొని యాతఁ
డది కమ్మసాలె తెర్వ ని యెఱింగి

తే॥ గీ॥ అడిఁ గనుగొన్న యగసాలె యంతికమున
కరిగి, "రాజకాంతలు దాల్ప నర్హమైన
యొక్క యందె యున్నది; దాని కుచితమైన
వెల మదింతువె" యని వాని పృచ్ఛ చేసె 278

....: టక్కరి కమ్మసాలె :...

తే॥ గీ॥ అనుడు రాజులకుఁ గిరీట మాదియైన
యాభరణముల నిర్మించు నట్టి వలఁతి
నందెకు మదింపు విడుట నా కరిదియే? మ
హాత్మ! యేది యందియ? చూపు మనుచు నడిగె 279

ఉ॥ ఆతఁడు మూట విప్పి తన యందియ యాతని చేతి కిచ్చెఁ; వాఁ
డా తపనీయనూపురము నట్టిటు త్రిప్పి పరీక్ష సేసి సం
ప్రీతిని బొంది వస్త్రమున వెండియు దానినిఁ జుట్టి కోవలన్
చేతికి నిచ్చి యాత్మగృహసీమకుఁ దోకొని పోయి యిట్లనున్ 280

తే॥ గీ॥ ఇది యమూల్యంబు, దీనిని నృపుఁడు దక్క
యన్యుఁ డొక్కండు కొనఁజాలఁ డవనిపతికిఁ

జెప్పి వచ్చెద; నందాక శ్రీనిధాన!
మా గృహంబున నుండు మచవిగె వాఁడు 281

సీ॥ ఏగుచు నాతఁ డి ట్లెన్నె లో" మున్నొక్క
వారము క్రిందటఁ బట్టమహిషి
ప్రాసాదమునకు నన్ రప్పించుకొని తన
నగలపెట్టియఁ దెచ్చి నా కొసంగి
యందు నుండిన వివిధాభరణములలో
నాత్మ కించిన యొక్క యంగుళీయ
కము నేరి నాదు హస్తమునఁ బెట్టి 'కళాద!
దీనికిఁ బ్రతి నొకదానిఁ జేయు

తే॥ గీ॥ మనుచు నా కాజ్ఞ యొసఁగి యుండినది; యప్పు
డెల్లవారలఁ గనుబ్రామి యే నమూల్య
మైన యందున్న యొకయందె నపహరించి
యవన వణిజున కొకనికి నమ్మియుంటి 282

తే॥ గీ॥ అతఁడు మఱునాఁ డిచటు వీడి యాత్మదేశ
మరిగె; నీచౌర్యమునకు రెండవ దినంబు
దేవి భూషణమంజూష తెఱచి చూచి
యందుఁ దనయందె లేమిక నార్తిఁబొంది 283

ఉ॥ నా రమణీయ పావనలినంబునకుణ్ గయిసేఁత యైన మం
జీరము గాన రా దెవని చేఁబడెనో యెటు వోయెనో? ధరి
త్రీరమణుండు నాకు సవరించు విభూషణరాశి కే యలం
కారముఁ దత్పదాంగదముఁ గానక జీవము దాల్తు నేవిధిణ్ 284

తే॥ గీ॥ ప్రాణమున కంటె నెక్కుడు ప్రాణ మధిపుఁ
డతని కంటెను నెక్కుడు ప్రాణ మందె
అందెఁ దాల్పక జీవింప నంచు రాణి
యనలమున విధి చూఁడినట్లవనిఁ బొరలె 285

ఉ॥ అంతిపురంబు నందుఁ గల యాంధ్రు నెడుంజెవియుణ్ వసుంధరా
కాంతుని చెంత కేగి యొకకాలిది నీసతి నూపురంబు పే

ట్యంతరమందు నున్నది, కటా! కనిపింపదు; రాణి యెంతయో
వంత వహించి నేలపయి (బడ్డది యై పొరలాడు నావుడున్ 286

కం॥ పడ(తుల నుడి విని భూమీం
ద్రుడు డంతిపురమునకు (గొప్పెరుందేవి( గనన్
వడివడి( జనియె( బిఱుందన
పడ(తులు రా శుగ్వివర్ణవదనుం డగుచున్ 287

కం॥ చని యేర్వకు మని బుజ్జవ
మొనరిచి, యొకకొంత రాణి యూరట గనినం
తనె, పతి నను నాస్థానం
బునకున్ బిలిపించి యెఱుపు మోమున( దోపన్ 288

సీ॥ ఓయి! కళాద! నీ కొక యుంగరము దన
కించు నట్టిది కానిపించి రాణి
దీనికి( బ్రతి నొండుదానిని నిర్మించి
నా కొసంగు మనుచు నగలపెట్టె
నీ చే నిడిన దట; నీవు నా యుంగర
మునకు (బ్రతి నొనర్చి పోయితి వట
నీవు పోయినవెన్క దేవి భూషణపేటి
తెఱచి చూడంగ నందియ యొకండు

తే॥ గీ॥ వెల మదింపరానిది కనిపింప దద్ది
దేవికి( గడుంగడు బ్రియంబు దీని విషయ
మడుగ నిన్ను( బిల్పించితి; నన్నృతమాడ
కున్న తెఱ(గెల్ల వివరింపు మన్న నేను 289

తే॥ గీ॥ అదలి చేతులు పిసికికొం చదిరి చచ్చి
యంటి నాతల్లిదండ్రుల యాన వైవ
మాన! నా యాలుబిడ్డల యాన! యెట్టి
పాప మెఱుంగ, నైన నొకండు వాకొనియెద; 290

చం॥ మునుపొ క మాయలాడు నరపుంగవ! తాను విదేశి రాజదూ
త నని వచించి మీ యవసథంబున( జేరి కుమారు కంతమం
దు నడరు వజ్రహారమును దొంగిలి నట్లె వా(డొ యొకండు రా
జ్ఞి నగ హరించి యుండు నని నేనొక యూహగ( బల్కొదన్ బ్రభూ! 291

ఉ॥ నా విభుఁ డిట్టి చౌర్యము వినంబడు నెప్డొ యొకప్డు లోక మం;
దీవు విదేశిదూత హరియించిన రాజకుమారు హారముఁ
బావుగఁ జేసి యందె హరణంబు నొకానొక లేకివానిపై
ద్రోవఁగఁజూతు వంతయు నెఱుంగనె నీమొగ మేను గన్గొనన్ 292

ఉ॥ రాజును నే నెఱుంగుదును; రాజకుమారుఁ డెఱుంగు హారమే
యోజ హరింపఁగాఁబడెనొ? యొక్కనిపై నణుమాత్ర మేనియుఁ
వ్యాజముచేత నొండె నపవాదిని నొండెఁ గళాద! సందియం
బే జనియింప దప్పు డరు దియ్యది తొల్లిటి దాని కంటెనుఁ 293

ఉ॥ దేవిడి నున్న నాయి వలెఁ ద్రిమ్మరుచుంటివి; రాణి కొప్పెనుం
దేవి నినున్ గృపన్ గనిన దీనికి నింత యొనర్చి తయ్యయో!
యేవిధిఁ జేతులాడినవి యిట్టిది చేయఁగ నీకుః నందియన్
నీవ హరించి యుందువని నే నొక యూహగ నెంతు నెమ్మదిఁ 294

కం॥ ఐనను నూపురచౌర్యము
నే నీ సభవారి ముందు నీపై మోఁపన్;
గాని యుపాయమునఁ గళా
దా! నీవే చోరుఁ బట్టఁ దగుదువు; మఱియున్ 295

తే॥ గీ॥ మొగ మెఱింగిన వాఁడవు; తెగఁ దలంప;
నొక్కవారము గడు విచ్చుచున్నవాఁడ
నీ గడువులోన నగఁజోరు నీవ తెచ్చి
నాకు నర్పిం పవలె; నిది నీకు ముదల 296

సీ॥ అందాక నిన్ను నే నందియ దొంగగా
సంశయించిన సమాచార మతిర
హస్యంబుగా నుంచు; మవధి ముగిసి పోవు
నాలోన విషయంబు దేల వలయు,
నొకవేళఁ దేలక యున్న నిన్ రక్షకో
ద్యోగికి నొప్పగింతును; సమస్త
మతఁడ వెలికి దీయు; మృతియొ? బ్రతుకొ? తేల్చి
కొమ్ము; పా ప్మ ని పల్కెఁ గువలయేశుఁ

తే॥ గీ॥ డపి మొవలు బయ లుబ్బుఁ జౌర్యంబు; వధ్య
శిల నధిష్ఠింతుః కావుండు సిలుఁగు దలఁగి
యంచుఁ గోటివేల్పులకు నే నన్నహంబు
మ్రొక్కుచుంటి; ఫలించె నామ్రొక్కు నేఁడు 297

ఉ॥ భారమునన్; స్వరూపమున, వన్నియ, శిల్పము నందు రాణి మం
జీరము బోని దొండు తనచేతను బడ్డది; దాని స్వామి యే
ధారుణి వాఁడొ? వాఁడు తను దా వలఁ జిక్కిన పిట్ట యయ్యె ధా
త్రీ రమణుండు నా తల విదిర్చిన నిప్పుల తాప మీఁగెదన్" 298

కం॥ అని చింతించుచుఁ బేరు
బ్బున నాస్థానము దరిసి ప్రభుఁడు ప్రాసాదం
బున నున్నాఁడని విని చ
య్యన నచటికిఁ బ్రభుని గనుటకై యరుదెంచెన్ 299

ఉ॥ భూవిభుఁ డప్పు డంతిపురమున్ జొరఁ బాఱినవాఁడు కొప్పెరుం
దేవి మనోనుతాపమున దిగ్గనఁ బానుపు నందు వ్రాలి మో
మా వలవైపు ద్రిప్పుకొని యగ్నిచెఱంగుచుఁ దీవ్ర రోషభా
వావిలయై హసంతివలె నాత్మ మఱుంగుచు నుండఁ గన్గొనెన్ 300

చం॥ కనుగొని విస్మితాత్ముఁడయి కాంచెద నీ లలితాంగి చందమె
ల్ల నని యొకింత డాసి, యొక లాగున నున్నది నాప్రవృత్తి భా
మినుల నెవరైె యే నొకతె మెప్పునకై యొఱఁగించె నేమొ? యం
దె నెగులునన్ సుతీవ్రత మదిన్ గొనె నేమొ యటంచు నెంచుచున్ 301

ఉ॥ చెక్కిలి మీట వ్రేలికొనఁ జేత విదిర్చె; మణీసరంబులన్
జిక్కె డలింపఁ బోయిన రచించెను స్వస్తికముద్ర బాహులన్;
బొక్కుచు నుంటివేల యన మోమును గప్పెను బైటకొంగునన్
జక్కెర యయ్యెఁ జేద నిన సారెకు నశ్రులు రాల్చెఁ గన్నులన్ 302

ఉ॥ "పేరలుకన్ వహించుటకుఁ బ్రేయసి! యియ్యది హేతువం చు నో
రారఁగఁ జెప్పరాదొ?" యన నయ్యది దిగ్గన లేచి "యేమియున్
నేరని బుచ్చిగానివలె నీవు నటింతువు, నాటకంబులన్
నేరిమి మీఱ నాడుటకు నీ వొకరుండవ జాణవో ప్రభూ! 302

చం॥ నను గనుఁ బ్రామి యా తరుణనర్తకిచే నొక కీలుబొమ్మవై
నను దిన మాచ్చు నెట్లటుల నాడెద వి; ట్లు బొ నర్చుకంటె బా
కునఁ బడఁ గ్రుమ్మరాదొ? యది ఘోరమ టంచు దలంతువేని యే
మనుకొన వత్సనాభ యిడి యైన ననుఁ బొరిగొమ్ము వల్లభా! 304

ఉ॥ నన్నొక చీరికిం గొనవు; నా దెస యింతయుఁ దేరిచూడ వే;
మన్నను నోకిలింతువు; ప్రియం బొకటేనియుఁ జెప్ప విం తకే
మున్నదొ నీ మనంబున; నయో యన వం; దియఁ గొన్న చోరుఁడెం
దున్నది యేఁ గనుంగొన వ; నుత్తమురాలను; నీకుఁ బ్రేయసిన్ 305

కం॥ అనుడు నెడుంజెవియన్భూ
మినాథుఁ డొక్కటియు ననక మీనాక్షీదే
విని బ్రార్థించుచు నున్నాఁ
డ; నందియం దిరిగి పొందుట యసత్యంబే? 306

కం॥ ఈనాఁడో? మఱునాఁడో
దానిని దెప్పింతు ననుచుఁ దగఁ బలికి నృపుం
డూనికతో వెలి కుఱుకగ
నా నాడింధముఁడు గాంచి యాత్రంపడుచుఁ 30

సీ॥ పాండ్యవంశ క్షీరవారాశి రాకాని
శాకర! సాంద్రదయశః ప్రసార!
ఓ నెడుం జెవియన్మహీనాథ! కనుగొంటిఁ
బురమునఁ జోరు నూపురము తోడ
దేవర! వాఁడెట్టి దీమసంబు గలండొ?
జడియక దాని నా కడకుఁ దెచ్చె
రాజకాంతల కాల రాణింపఁదగిన దీ
యందియ యిది యమూల్యంబు చుమ్ము!

తే॥ కీ॥ దీని వెల మదింపఁగ నోపుదేనిఁ గొమ్ము
నాఁగ తేండ్లు దక్కొరులు కొనంగజాఁల
రధిపునకు దీని నెఱిఁగించి యరుగుదెంతు
నని వచించి వచ్చితి నిట కడచి పడుచు 308

ఉ॥ నాలితనంబువాఁ డతఁడు నా సదనంబున నున్నవాఁడు భూ
పాలకులాబ్ధికౌస్తుభమ! పాఱఁగనోపఁడు; వంటయింటికుం
దే లయినాఁడు; మీ రిపుఁడు దిట్టతనంబు గలారి, జోదులన్
వాలు లొసంగి యంపుఁ డిదె వానిని నందియతోడఁ దెచ్చెదన్ 309

శా॥ పాలం ద్రొళ్లిన బల్లివాఁ డెటకుఁ బోవంజాలు నిందుండి యం
చా లోచింపకుఁ డార్య! సర్ప మలుపం బౌఁగాక చామోఁదగా
వాలౌ దండము కొంత మేలు; చను నవ్వాఁ డేను బోకుంటినే
"నాలస్యా దమృతం విషమ్మ" నెడువాక్యం బెన్నుఁడా త్మజ్ఞ ప్రభూ
310

ఉ॥ నావుడు ఱేఁడు నెమ్మొగమునన్ జిఱున వ్వొడఁ దోఁపఁ గొప్పెరుం
దేవికి దీనితో మిగులఁ దృప్తి ఘటించెద; నాదు రాజ్యమం
దీవిధి ధర్మముండు నని యెల్ల రెఱుంగఁగఁ గొందు ఁజోరునిం
గావఁ కదెబ్బకుం బడును గావుతఁ బిట్టలు రెండ టం చెదన్ 311

కం॥ తలఁచుచుఁ బ్రతిహారంబునఁ
గల ముప్వురి ఖడ్గకరులఁ గడకంటఁ గనన్
దలతో మ్రొక్కుచు దరియుడుఁ
బలికెన్ భూమీవిభుండు వారికి నిట్టుల్ 312

సీ॥ ఓరి! యాయుధపాణులార! మీ రీ యగ
సాలెవాని బడిని సాఁగి పొందు;
వీనిచూపించిన వానిచే రాణిమం
జీర ముండిన వాఁడ చోరుఁ డంచు
భావించి తోడ్తోన వాని శిరంబు నే
యొక సంశయము లేక యుత్తరింపుఁ;
డావల, రాణి పాదాంగదము గ్రహించి
కొనిరఁడు; జాగరూకులుగ నుండుఁ

తే॥ గీ॥ డిది మనంబున నిడుకొనుఁ డింతకు మును
రాజపుత్రుని కంఠహారంబు గొన్న
చోరుని పగిది నేఁటి యీ చోరుఁడుఁ గను
మొఱఁగి చనకుండ చూడు,డో మొఱకులార! 313

తే॥ గీ॥ అని ముదల యొసంగి చనియె; నంత వారు
చనిరి; కాని న్యాయస్థానమున విచార
మొనరుచుట లేక దండింప నొప్పదన్న
యాది నియమమునకు భంగ మయ్యెనాఁడు 314

## —: కోవలన్—రాజభటులు :—

కం॥ ఆ నాడింధము నింటికి
భూనాథుని భటులు పోయి ముంగిటఁ గనిరం
భోనిధికన్యా వల్లభుఁ
బోని ఘనునిఁ గోవలన్విభునిఁ బుణ్యాత్మున్ 315

కం॥ కని వాని దైన సిరి కు
బ్బి, నిర్మలతకున్ గరంగి, వినయమునకు మె
చ్చి, నిరాడంబరతకు లో
గి నమ్రులై రాజభటులు కెరలక యుండన్ 316

తే॥ గీ॥ స్వర్ణకారుఁడు కోవలన్ చాయఁ జూచి
వీరు రాజాజ్ఞచే వచ్చి నార రం, దెఁ
జూపు మనవుడుఁ గోవలన్ జూపె మూట
విప్పి మంజీర మంత భూవిభుని భటులు 317

కం॥ ఓయీ నీ వెవఁడవు? పే
రే యది? యెందుండి యిటకు నేతెంచితి? నీ
కీ యందియ యెట్లు బ్బిన
దీ యెల్లన్ దెలుపు మనఁగ నిట్లనె నతఁడున్ 318

ఉ॥ నే నొక నాగరుండను; వణిక్కులజాతుఁడ; (బేరు కోవలన్
నా నెల వా పుహారుపురి! నా జవరాలిది యీ పదాంగదం
బే నిట దీని నమ్మి యెదియే నొక బేరము సేయఁ గోరి రా
జానుగులార! యిమ్మధుర యందుఁ బదం బి డినాఁడ నావుడున్ 319

ఆ॥ వె॥ వీఁడు బ్రదికి చెడినవాఁడు గా కన్యుండు
గాఁడు; దొంగ వాలకంబు లేదు

వీని మొగమున నని విభుపంచిన భటులు
కొంకి జంకున గుజగుజలు వోవ 320

...: కమ్మసాలె కుచ్చితపు మాటలు :...

కం॥ కని లోలో సందేహిం
చి నాప్రయత్నము వృథాగఁ జనఁ దగదని యెం
చి నృపాజ్ఞ వారిం దలపిం
చి నాలి నాడింధముండు చిడిముడి పడుచున్ 321

కం॥ మీ రిట గుజగుజ వోవుట
సారెకు నా మనము నందు సందియమున కా
ధారం బౌ చున్నది యని
వారలకు జనాంతికముగఁ బదపడి పలికెన్ 322

కం॥ ఈతఁడు తనయ్యందియ మీ
చేత నిడెన్; రాణియందె చెలువున నది వి
ద్యోతం బౌ చున్నది; యే
లా తడఁబాటి; తఁడు దొంగలాఁగున లేఁడో? 323

చం॥ ఎవని మొగంబుపై నయిన నీతఁడు దొంగని వ్రాసియుండునే?
చవటలు మీరు; నూపురము సాక్షి యితం డొకదొంగ యౌటకే;
ల వెఱగు దాల్చినార రొ? క లాఁగయి మెత్తగ నున్న వార రే;
మివిధమొ? తెల్పెదన్ వినుఁడు మీకొక తొల్లిఁటి చౌర్యవృత్తమున్ 324

ఉ॥ తా నొక దూరదేశ వసుధాపతి కొల్వున రాయబారి నం
చీ నరపాలు మందిరము నెక్కటిచోరుఁ డొకండు సొచ్చి మున్
గానని హస్తలాఘవము ఁగన్పడఁ జేసి హరించినాఁడు ప్రా
ణానకునున్ దెగించి నరనాథు కుమారుని కంఠహారమున్ 325

ఉ॥ స్వామినిఁ గన్నుఁ బ్రామి, పరిచారకులన్ గికురించి, యంగనా
భూమికఁ బూని వాఁడు నృపపుత్త్రుని సౌధము సొచ్చి జ్ఞాతుఁడై
వే మహిపాత్మజుండు జళిపించిన ఖడ్గముఁ దప్పికొన్నవాఁ
డై మణికంఠహార మ సహాయత దొంగిలినాఁ డెఱుంగరే? 326

కం॥ తన విజయమునకుఁ జిహ్నము
గ నాతఁడు నృపాలుసూను కరవాలంబున్
గొని చనియె; నింతదనుకా
తని జాడ యెఱుంగఁగాదు తర మెవ్వరికిన్ 327

కం॥ తూలమయి యెగిరి చనెనో?
గాలిబడిని చనెనో? లేక గారడిచేఁ బైఁ
దేలుచుఁ జనెనో? వేఱొక
లీలం జనెనో? యెఱుంగ లేఁడె వ్వాఁడున్ 328

కం॥ దొంగల వ్యూహంబులు వే
భంగులు, బాలకులు మీరు, వానినిఁ గనిపె
ట్టంగల సామర్థ్యము మీ
కుం గలదే? యేదొయొకఁడు గొఱుఁగుట దక్కన్ 329

ఉ॥ ఒక్కొకవేళ యోగులుగ, నొక్కొకవేళఁ దుటారికాండ్రుగా
నొక్కొకవేళ భోగులుగ, నొక్కొకవేళఁ గటారికాండ్రుగా
నొక్కొకవేళఁ ద్యాగులుగ, నొక్కొకవేళ హుడుక్కకాండ్రుగా
టక్కరిరూపు లూని నికటస్థితులన్ దెగి దోఁతు రెల్లెడన్ 330

కం॥ మీ రాక హేతు వీతం
డే రీతిని నే నెఱుంగ నిప్పుడ మంత్రో
చ్చారణబలమున మాయం
బై రాజును మిమ్ము ముంచు నాశ్చర్యమునన్ 331

ఉ॥ కావున లోఁ దలంపకుఁ డొకం డిఁక మీ కరవాల శక్తికిన్
గావొ నరింపుఁ డీతని నెకాయెకి; చిక్కిన చోరధూర్తునిన్
బోవిడి వెన్క వందురుట పోలదు; నాపలు కాదరించి ధా
త్రీవిభు నాజ్ఞసేయుఁ డిఁక లెక్కడఁ బోకుఁడు మీనమేషముల్ 332

కం॥ అని యున్నవి లేనివి ప
ల్కి, నిజేప్సితసిద్ధి కొడయు లెంకలఁ బురికొ
ల్పి, నయనములతో వెడ న
వ్వి, నేర్పున జనాంతికముగ వెండియు ననియెన్ 333

ఉ॥ ఏటికిఁ బెక్కువాక్యము లహేయమ మీకు నరేంద్రునాజ్ఞ, టా
టోటుల పాలి మృత్యువు నెడుంజెవియన్ ప్రభుఁడా; తఁ డల్కతోఁ
బాటలవక్త్రుఁ డైనఁ జెడువారలు మీరల; కాన మీరు మీ
యాటలు కట్టిపెట్టి తెగుఁడంచు మఱొక్క దఫా వచించితిన్ 334

సీ॥ అనుడు నెడుంజెవియన్ ప్రభుండు సమస్త
మహికి సమ్రాట్టుఁ సంభావ్య మతని
యాజ్ఞప్తి మనకు; జాగైన దిప్పటి కిం; కఁ
దడవు సేయుట కాదు ధర్మ మ నుచు
నతని పంపిన యోధులం దొక్కఁ డొకఁడు
తనదు పట్టాకత్తి తడవుకొనక
యొఱనుండి దూసి య య్యొఱపరి పరదేశి
మెడపైకి విసరె; నమ్మేటి వ్రేఁటు

తే॥ గీ॥ పడ్డ కోవలన్ భూమిపైఁ బడియెఁ మెడకు
గాయమై భోరు మని నెత్రు కారఁజొచ్చె;
మడువుగట్టె నెత్తు ర; తఁడా మడువునందు
మునిఁగె; ముక్కున నూపిరి కునుకుచుండె 335

తే॥ గీ॥ చేయి మీఁదుగా నడచిన శ్రీవిభునకు
నట్టి దురవస్థ విధిబల్మి నావహిల్లె!
ఇంతగాఁ బ్రదికియుఁ దుద కింటి వెనుకఁ
జావ నయ్యె నంట కు నద్ది సరిగ న య్యె 336

సీ॥ అవలా యోధులు కోవలన్ కడనున్న
యందియుఁ గైకొని యవనివిభుని
యాస్థానమున కేగి రా; కుచ్చితపుటగ
సాలెవాఁడును దోడ సాఁగి మున్న
ప్రభువును దర్శించి రాజాధిరాజ యం
దియఁ దెచ్చితి మనఁ బృథ్వీవిభుండు
యందియఁ గొని కాంచి యది రాణిదే యని
నిశ్చయ మొనరించి నెగులు వాసి

తే॥ గీ॥ చొక్కుచును, దొంగతనపుటాచూకి దెల్పి
నట్టి యగసాలెవానికి, నాభరణము
తెచ్చిన సుభటులకుఁ గాన్క లిచ్చి తోన
చనియె దేవేరి మోహనసౌధమునకు 337

ఉ॥ పూవులపాన్పుపై నుబుసు బోట్లకుఁ జెప్పుచు నున్న కొప్పెరుం
దేవిని గాంచి నీ నెగులు దీర్పఁగ చోరహృతంబు నూపురం
బోవనజాక్షి! తెచ్చితి ని నొప్పగ ఁగొమ్మని చేతి కిచ్చె; ధా
త్రీవరు రాణియుఁ బ్రియునిఁ బ్రేమ నుతించుచు నిట్లు వాకొనెన్338

సీ॥ ప్రాణేశ! ప్రాణంబు ప్రాణ మీ యందియ
పోఁకకు మిగుల వాపోవుచుంటి
నా పదాలంకరణమ్ముఁ గన్నులఁ
గాంచఁగల్గితి నింతకాలమునకు
నిది హృతంబై నప్డు డీ వొప్పరికము సూ
పినవాఁడ వని యవివేకిని నయి
పరుసంబు లాడి నీ భావంబు గాయంబు
గావించితిని గాని కాంచనైతి

తే॥ గీ॥ వెన్నవంటి నీహృదయ మందున్న కూర్మి
యనుచుఁ గందోయి తడి సేసి కొనఁగ విభుఁడు
కీరవాణిని నిండుఁగౌఁగిటికిఁ దార్చి
కరఁచెఁ; దత్కుచస్పర్శకుఁ గరఁగెఁ దాను 339

*మదారి యింటనున్న కణ్ణగికి దుర్నిమిత్తములు తోఁచుట*

కం॥ విధి దుర్విపాక వశమున
మధురన్ గోవల నకాల మరణోన్ముఖుఁడై
వ్యథ నొందుచుండ, నిచ్చట
విధుముఖి కణ్ణగి వియోగపీడా తురయై 340

ఉ॥ పోయిన పోఁకగా విభుఁడు పోయెఁ; ఁబురంబున నేమి పుట్టెనో?
నాయెద క్రాఁగుచున్నది; వణంకుచు నున్నది దక్షిణాంస మే,

దో యొక చెప్పరాని భయ మూఁచుచు నున్నది మేని నెల్ల; గం
దోయికి దుర్నిమిత్తములు దోఁచుచు నున్న వరిష్టశంసులై 341

ఉ॥ ఏలొకొ? కాంతుఁ డెచ్చటికొ యేగినయట్లు, పుహారు వత్తువా
గోల యటంచుఁ బల్కినటు; కుంకుమబొట్టు ధరించి తేలనే
ఫాలము నందు నన్నటులు; భార్యకు భర్త ఋణాను బంధమే
బాల! యటంచుఁ జెప్పినటు భావమునన్ గనుపట్టు మాటికిన్ 342

కం॥ అని చింతించుచు దైన్యం
బున స్వాస్థ్యం బొక్కకొంత పుట్టమికి మనం
బునఁ గ్రుంగుచు బాష్పంబులు
గనులం గార్చుచు మదారి కడ కేతెంచెన్ 343

కం॥ చనుదెంచిన కణ్ణగిఁ గని
యనుత్తమ మదారి యేల నమ్మా! యొక రీ
తినిఁ దాల్చిన దానవు; నీ
మనమున వ్యథ నీదురూపు మఱిమఱి తెలుపున్ 344

సీ॥ నావుడుఁ గణ్ణగి నా వల్లభుఁడు మధు
రానగరికి నూపురంబు నమ్మఁ
జనినవాఁ డింత ప్రొద్దునకుఁ దిరిగిరాఁడ,
యయ్యమూల్యపు టందె నందు విలుచు
కొనఁ గల్గు ధనికుఁ డొక్కరుఁ డుండఁడో? లేమి
నన్యనగరమున కందె తోడ
చనియెనో? యొండె దానిని నమ్మి ధనముతో
నేతేరుచోఁ ద్రోవ నేదియేని

తే॥ గీ॥ యొక్క పోరామి గల్గెనో? యొండె; నొండె
నీ మిషంబున నను వీడి యెచటికేని
పరుపుదీసెనో? కాక యే భంగి యేని
కానిచో నింతఁ దడయంగ నౌనె పతికి? 345

కం॥ ఈ నా మనోవ్యథకుఁ దో
డై నా వామేతరనుయ నాంస భుజంబుల్

చానా! స్ఫురించు; నింకే
దో నా యనరాని దొకటి తోఁచు మనమునన్ 346

తే॥ గీ॥ ఛాయఁ బాయుచు నున్నాఁడు సవిత; చక్ర
వాక పద్మినీ పత్త్రకవర్తి యైన
సహచరునిఁ గాన కఱచు; నే చాయ నే మ
దారి! కనులకు దుర్నిమిత్తములె తోఁచు 347

కం॥ నావుడు మదారి కణ్ణగి
తో వత్సా! నాకుఁ దోఁచె దుశ్శకునము లే
వేవో? దురంత మేదో?
దైవము తలపెట్టిన దని తలఁచుచు వగతున్ 348

సీ॥ వివరింతు నీ కవి వినవె! యాఁబోతుకో
డెల కన్నులూరక క్రుశలు వెలార్చు;
ఱేపు ప్రొద్దున! నగరికిఁ గొనిపోఁ బ్రొయ్యఁ
గరఁగఁ బెట్టిన వెన్న కరఁగదయ్యె;
భయమునఁ దోఁకలు పైకెత్తుకొని యాలు
గుంపుగా నొకచోటఁ గూడి యఱచు
లేఁగల మెడఁ దగల్చిన పట్టెడల నుండి
గజ్జియ లొక్కటొక్కటిగ రాలు;

తే॥ గీ॥ దారుణ విపత్తునకు నిమిత్తంబు లివ్వి
కావునఁ గురువై చిందుతోఁ గణ్ణగి! బల
రామకృష్ణులఁ గొలిచి పోరామి వచ్చు
దానిఁ దప్పించు కొంద మం చూని పలికె 349

కం॥ వెనువెంటనే యపేత
స్తనులగు నొకకొంత మంది తరుణులు నృత్యం
బొనరించి రిష్టదేవత
ల నర్చనము సేసిరి నుతులన్ గడు; నాపై 350

సీ॥ హరిదత్త మాలికాధరుని బ్రాండ్యాన్వ వా
యమణీ, నెదుంజెవి యన్మహేంద్రుఁ;

దపనీయ మయ చక్ర ధరుఁడై యశోధ్వజ
శోభియౌ కరికాల చోళవిభుని;
సాగరతరణంబు సలిపి కాదంబుల
సర్వనాశ మొనర్చి క్ష్మాతలమున
విజయధ్వజంబుల వెలయఁ జేసిన చేర
వంశజు సెంగుట్టవన్నృపాలు

తే॥ గీ॥ నైక విధములఁ బొగడిరి; నర్తనాప
సాన మగుడు వైగైనది స్నాన మాడి
రంతఁ గోవలు వధ మధురా గతుం డొ
కండు దెల్ప మదారి సకలము వినియె 351

—: కణ్ణగికి మదారి కోవలు హత్య నెఱింగించుట :—

కం॥ మిను విఱిఁగి మీఁదఁబడిన
ట్లు నంత సాగరము లొక్కటైనట్లు; జగ
త్తు నవస్థితి గనినట్లై
పనవుచు నింటికి మదారి పరువెత్తి వగఁ 352

సీ॥ గాత్రంబు కంపింపఁ, గన్దోయి శోకబా
ష్ప ప్రవాహంబులు జాలు వాఱ,
నా వఱచిన భంగి నాక్రందన మొనర్చు
చొండొక్క టాడక బంద యట్లు
కణ్ణగీదేవి చెంగట నిలువంబడె
నంతనా పతిదేవి యమ్మదారి
నేమి వాటిల్లెనో యెఱిగింపు మన నెంత
భాగ్య హీనవొ యేమి పలుకుదాన

తే॥ గీ॥ నంచు మొదలు నఱుకఁ గూలు నరఁటి వోలె
నేడ్చు చది భూమి వ్రాలె; న య్యింతిమిన్న
వెల్లవెల్లనై చేతులు పిసికికొనుచుఁ
దెల్పుము మదారి! యేడ్వకు ధీర వీవు 353

సీ॥ వా కొనరాని యే వార్తనో నా చెవిఁ
బడవేయఁ జాలక బాధపడెదు
కాక! యొండేమియుఁ గాదు నా వల్లభు
తిరిగి రామిని నీదు స్థితినిఁ దలఁచు
కొన్న కొలంది నా కున్న ధైర్యంబును
సన్నగిల్లుచు నున్న దు; న్న దున్న
యట్లు వాకొనుము వే యనుడు మదారి ద
గ్గుత్తికతోఁ దల్లి! కోవలన్వి

తే॥ గీ॥ భుండు రాణి పాదాంగదమున్ హరించి
నాఁడ ని నెడుంజెవియను భూనాథు భటులు
నట్ట నడువీథి నీ ప్రాణనాథు......నింక
నింత కంటెను జెప్పెడి దేమి గలదు? 354

కం॥ అనవుడు కణ్ణగి స్వరుపా
త నిపాతిత వల్లి నాఁగ ధర వ్రాలి మునిం
గెను మూర్ఛ; మదారి జలం
బును మోమునఁ జల్లి దాని మోహముఁ దేర్చెన్ 355

ఆ॥ వె॥ కొంతవడికిఁ దేఱి యెంత యభాగ్యనో?
తల్లి వోలె మము మదారి ప్రోచి
తిద్దఱ; నొకఁ డేగె; నిఁక నాకు దిక్కెవ్వఁడి?
యనుచుఁ జుట్టు నున్న యతివలఁ గని 356

## —: కణ్ణగి శోకము :—

కం॥ ఇది నిజ మేనా? తల్లీ!
సుదారుణముగా విభుం డుసురు విడుట ను ని
య్యది మబ్బు లేని పిడుగి
ట్లె దాటుగా మీఁదఁ బడియె; నయో! యెటు లోర్తున్ 357

కం॥ ఎద రెండుగ వ్రీలుచు ను
న్న దమా! తలవ్రాఁత తప్పునా? జీవిత మె

ల్లి దురంత వేదనకు నా
స్పదముగ సాఁగింప జగతిఁ బ్రభవించితినా? 358

ఉ॥ చావు దలంగ నెవ్వని కశక్యము; యైనను నాదు వల్లభుం
డీ వగ చావు చచ్చుట సహింపఁగ రానిది; నన్నుఁ గాంచెనే
వావిడి యేడ్చు గుండులును బండలు నయ్యెయొ! క్రూర మైన యా
దైవము నింద మోఁపి పతిఁ దాఁ గొనిపోకకు నుమ్మలించెదన్ 359

....: కణ్ణగి కోపావేశముతోఁ బల్కిన పల్కులు :...

ఉ॥ నా పతి దొంగయా? నృపుఁడు నా సతి యందియ దొంగిలించినాఁ
డీ పలుగాకి యంచు వధియించెను నా పతి; నీ నృపాలుఁడ
య్యో! పసరంబొ? గాక సురయో? యగు; నా పతి మోముఁ జూచినన్
శ్రీపతి యంద్రుడు గాని కికురించిన దొంగని యందురే జనుల్ 360

ఉ॥ నా వెలలేని నూపురము నాణెము కన్నులఁ జూచి చూచి పృ
థ్వీవరుఁ డొక్క కైతవము పెట్టినవాఁ డయి నాదు నందియన్
నా విభు నొక్క పెట్ట హరణం బొనరించినవాఁడు గాని శి
క్షావిధి సేయ ధర్మమును గైకొని నట్టిఁడు కాఁడు సూడుఁడీ 361

కం॥ అన్యాయశీలుఁ డీ రా
జన్యుం డిందుండ మీకు సాఁగదు బ్రతుకో
మాన్యచరితలారా! దౌ
ర్జన్యము గల రాజ్యమును నరక మంద్రు బుధుల్ 362

తే॥ గీ॥ స్వైరముగ ధర్మమును వీడి సంచరించు
ప్రభువు రాజ్యాన ధర్మదేవత వసించు
నెట్లు? ధర్మ మిందుండె నే నెట్ల ధర్మ
మిట్లు తల యెత్తఁ గలిగెనో యిప్పురమున? 363

కం॥ ఓ ధర్మదేవతా! నీ
కా ధారం బిట పుహారు నందు బలెన్ లే
దే ధైర్యముతో నుండెద
వీ ధర్మేతరు భువిని బహిష్కృతవు బలెన్ 364

తే॥ గీ॥ నీవు ధర్మంబు పాలించు దేవి వేని
నా విభుఁ డధర్మనిరతుండొ? భూవిభుండొ?
పల్కు మందఱు వినునట్లు; పల్క వేని
నీ వధర్మదేవత వని నిందపడెదు 365

కం॥ అని పల్కి క్రుంకబోయెడు
నిను నించుకసేపు నిలిపి ఈవును సత్యం
బును బల్కఁగ నోడి భయం
బున సాగర మందుఁ గూలఁ బోయెదవె ప్రభూ! 366

...: ఆ కా శ వా ణి :...

సీ॥ గంపంత కంటితోఁ గాతువు జగ మెల్ల
నారాయణుండు నీ నడుమ నుండు.
బ్రహ్మదేవుండును బరమేశ్వరుండు నీ
యంద వాసం బుం దు రంద్రు బుధులు
మూలంబు నీవు వేదాలకు, నింతియ
గాదు, సత్యమునకుఁ బాదు వీవు;
కాన సత్యంబు పల్కఁగ నోడకుము నా వి
భుఁడ ధర్మనిరతుండొ? భూ విభుండొ?

తే॥ గీ॥ పల్కు మందఱు వినునట్లు భానుదేవ!
యనుడు "నీపతి దొంగకాఁ డవనివిభుఁడ
ధర్మపరుఁడై భవత్పతి తల తెగ నఱ
కించెఁ గాన నీ పురిని మండించు నగ్ని 367

కం॥ అను నొక్క వాణి యంబర
ము నుండి వీతెంచె; నయ్యపూర్వవచనమున్
విని గొల్లపడుచు లందఱు
ననూన హర్షంబు నొంది రద్భుతపడుచున్ 368

...: కణ్ణగి గొల్లపడుచులతో మధురకు నేగుట :....

తే॥ గీ॥ అట్లు హర్షాద్భుతము లందు నంగనలకు
ననియెఁ గణ్ణగి వెండియు నమ్మలార!

ఏను బతిదేవతన యేని యీ నృపాలు
ప్రోలు మసిబొగ్గులై మాడి పోవుఁగాక 369

తే॥ గీ॥ రండు నాతోడ మీరు పురంబునకు య
థార్థవృత్తంబు చూపింతు నంతయు నని
వారిఁ దోడ్కొని ధైర్యంబు పైకొనంగఁ
జొచ్చె మధురానగరము నక్షోభ్యయగుచు 370

తే॥ గీ॥ కణ్ణగి యమాను పాకృతిఁ గాంచి నాగ
రకులు సంభ్రమా శ్చర్యంబులకు నధీను
లై యొకండు పల్కంగ నే మగునొ? యంచు
నూర కుండ వాకొనె నిట్లు వార నొకఁడు 371

సీ॥ మనరాజు చేఁత దాల్చిన న్యాయ దండంబు
వంగి వంకరపోయె, ప్రజల కెల్ల
నాపద లాసన్న మైనవి; శరదిందు
ధవళైక వర్షత్రధరుఁడు మఱియు
న్యాయభల్ల కరుఁడు దారుఁడా తెన్నువాఁ
సార్వభౌముని ధర్మ శాసనంబు
చనియె నేయూరికో? కొని మ్రింగె నప్పుణ్య
ధర్మ కీర్తిశశి న ధర్మరాహు

తే॥ గీ॥ వౌర! లేకున్న నొక్క పుణ్యాంగన మును
కని విని యెఱుంగని వెతలఁ గాంచు నెట్లు?
చెట్టు చెడు సమయమునకు ఁబుట్టు ఁగుక్క
మూఁతిపిందె లన్నది మన పురికిఁ జెల్లు 372

కం॥ ఈ మధురా పురమునకు న
నామకుఁ డొక్కండు భూమి నాథుం డయ్యెఁ
నేమంబు దప్పె; నిఁక నే
మే మో పుట్టఁగల దేల నిచట వసింపఁ 373

కం॥ వంకాయ కైన దిప్పుడు
టెంకాయకు వచ్చు జేవు; డెప్పర మైనఁ

శంకింపక డీకొను నా
తంకవిహీనుం డెవండు ధరణీనాథుఁడా 374

ఉ॥ మచ్చున కేని లేఁడొ కఁడు; మానుషభావము సున్న జేని కే
పొచ్చెము లేని రాజ్యమును బొగ్గులు సేయఁగ దాపురించినాఁ
డచ్చును వేసి యూళ్ళవయి కంపిన క్రొవ్విన యా పఱెద్దు వీఁ
డిచ్చట నుంటి మేని మన మందఱ మీల్గుట తప్ప దెప్పుడున్ 375

కం॥ అనవుడు బాహాటముగా
జను లౌనౌ నని పలికిరి, సతు లెల్లరు భ
ర్తను గోల్పోయిన కణ్ణగిఁ
గనుఁగొని యేడ్చిరి మహాను కంపామతితోన్ 376

కం॥ అంతట వా రెల్లరు న
య్యింతినిఁ గోవలను కడకు నేగించిరి; య
క్కాంతయుఁ బతిపై వ్రాలి దు
రంతము నొందితివె నాథ" యని యి ట్లేడ్చెన్ 377

—: *కణ్ణగి చావనున్న కోవలనును జూచి శోకించుట* :—

కం॥ ఎత్తున కెత్తిచ్చి కొనిన
యత్తరు పన్నీట జలక మాడిన నీ వీ
నెత్తుటి మడుఁగునఁ దోఁగుట
కెత్తెఱఁగున నోర్తు? వ్రాఁత నేమని యందున్ 378

చం॥ కడుపును జేతఁ బట్టుకొని కాలి డినాఁడవు దీనఁ ఁగాని యే
చెడు కణ మందు నిష్ఠురముఁ జేరితివో హృదయేశ! మిత్తి పా
ల్పడితివి; నేఁడు పై వలువ పక్షులు తన్నుక పోయి నట్టి దే
ర్పడినది; మేతకై చనిన పక్షిని మిత్తి యెదుర్కొనెఁ గటా! 379

శా॥ నీ వీ నా యెద నున్నదాన వని ము న్నీవాడు నామాటలో
నా వంతేనియు లేదు సత్యము; నిజం బౌనేని నీమాట యి
ట్లీ వే యేగుట మొండికట్టె నయి నే నిచ్చోట నిట్లుంట యె
ట్లో? వాక్కే యుపచార మౌ ననుచు నీ వట్లంటి గా కీ శ్వరా! 380

తే॥ గీ॥ "పోదు" నంటివి విపణికిఁ బోవు నపుడు
పోవువాఁ డొక్కరుఁడు చెప్పి పోఁడు; నీవ
యొక్కఁడవ చెప్పిపోతి వీ యువిద నేల
పిలువవో? వెంటఁబడు నని వెఱచి తేమొ? 381

కం॥ నా కప్రియ మొనరింపవు;
నీ కేను బ్రతీప గాను నిష్కారణ మీ
వీ కణ్గి వదనం బే
లా కన్గొన వంత విషమ నైతివె కాంతా! 382

కం॥ అని యేడ్చు కణ్గి స్వరం
బు నెఱింగిన కోవలన్విభుఁడు "వచ్చితివే
ననుఁ గనఁ గణ్ణగి!" యని మూ
సెను గన్నులు శాశ్వతముగఁ జిట్టచివరకున్ 383

ఆ॥ వె॥ తత్ప్రతి చనుట గని తల్లి! నీ కీ పట్టు
కూర్చెనే విధి యని గోలుగోలు
మనిరి చుట్టు నున్న వనితలు; వారి వా
క్యముల కది మఱియును నడలి యడలి 384

కం॥ జీవిత దీపంబవు నా
కీ వా ఱితి లోని స్నేహ మింకక మున్నే
నే వత్తిని; బొగచూఱితి
నోవి యనెడు కజ్జలంబునున్ బైఁ గ్రమ్మెన్ 385

ఆ॥ వె॥ చెట్టు మీఁదఁ బక్షి చేడియతోఁ గూడి
ననుపుదీయముగ బెనంగు తఱిని
బిడుగు వడియె; ఁబోతు మడిసె; ఁజెట్టును గూలె
వాయి రాల్పడంగఁ గూయుఁ బేంటి 386

కం॥ గృహకర్తవు; సహచరుఁడవు,
రహస్సఖుండవు; లలితకళారసికుఁడవు, వీ
వు; హృతుఁడ వైతివి; విధిచే
నహృతం బొక్కండు గలదె యవనిని నాకున్ 387

కం॥ నీ వను తోడిమకు సితనై
పూవుంబలె నింత దనుక పాలిచితి; నే ఝుం
ఝూవాయువొ దుల్చెఁ దొడిమఁ
బూవే దుమ్మున స్వరూపమున్ గోల్పడునో? 388

కం॥ నీ వక్షః ప్రియసఖినై
జీవంబు న్నంత దనుక శ్రీవలె బ్రదుకం
గా వాంఛించితి దయితా!
యా వాంఛిత మనిలదీపమై యడఁగాఱెఁ 389

కం॥ స్త్రీయును బురుషుండు నదీ
తోయంబులఁ దేలి యాడు తుంగలు; రెండుఁ
బాయ వొకానొక చోటన్
బాయున్ వేఱొ క్కచోట బ్రహ్మాజ్ఞమెయిఁ 390

కం॥ నీ గాత్రంబున నొక సగ
భాగము గైకొన్న ధర్మపత్నిని నే; నెం
దే గితి నను విడి శుభసముఁ
జాఁగ విడిచి మఱలిరాని సర్పంబుబలెఁ 391

తే॥ గీ॥ అలు పోయిన వేఱొక యాలు కలుగు
మగనికి; మగండు పోయిన మగఁ డొకండు
కలుగు నెట్లా లి! కీ పాటి తెలివి గలఁడొ?
లేఁడొ? దాయ దుర్విధి, దోసెఁ గీడు నీకు; 392

ఉ॥ నీ యనుబంధముఁ విడక, నీ కొకనాఁడు ప్రతిపఁ గాక నీ
పోయిన పోక లెల్లయును బుద్ధిఁ దలంపని నీ మనఃప్రతి
చ్ఛాయను నన్ను వీడి చనఁ జాలితి; వెంతకు లేవు కాంత! నా
కూయి సురంగనా వృతునకున్ వినిపించునొ? లేదొ నీ కయో 393

కం॥ "నా" యను వా రెవ్వరు నా
కీ యిల లే రున్న నీవు నేగితి; సిరియున్
బోయెను; బ్రదుకును నీతో
పోయెను; నేఁ బ్రాడు లేని బొంగర మైతిన్ 394

కం॥ జీవకళ నీ మొగంబున
నా వంతేని దలఁగదు ప్రియా! యిది స్వప్నం
బో? విభ్రాంతియొ? మోహం
బో? వికృతి గనవి సమాధియో? మరణంబో? 395

తే॥ గీ॥ హంసియును మయూరియు నీవు నచటు విడిచి
యిటకు రం "డేరు నడక మే" తే వచింతు"
నన్ను నీమాట రాఁగ "నీవ" నుచు ఇలికి
తిదియ తలపోయ బాకుగా నెడఁదఁ జీల్చు 396

ఉ॥ పూవున కంటె మెత్తనిది పో ప్రియు నీమెయి; బాకుపోటు తా
నే వగ నోర్చె? నీ వసువు లీఁగుటయే తన కిష్టచేష్టగా
దైవము కోరు నేని యిటు దారుణ వైశసముం బొనర్ప కే
పూవున నైన నిన్నుఁ బొరిపుచ్చుట కేనును సమ్మతింపనే? 397

తే॥ గీ॥ మృత్యువు హరించు కొనిపోయె మృదు శరీర!
నిన్ను నుచు నేను విలపింప; నీ వకాల
మృత్యు ముఖమునఁ బడితి వన్ మేటివగపు
బరిచియై గుండె రెండుగ వ్రక్కలించు; 398

తే॥ గీ॥ చెట్టునకు నంటికొని యున్న పట్టు వోలె
నేను ని న్నంటుకొని యుంటి నిన్ని నాళ్లు
పిడుగుపాటునఁ దల తెగి వ్రీలి పడియెఁ
జెట్టుఁ గాని వ్రీల దొకింత పట్టు స్వామి! 399

తే॥ గీ॥ లక్ష్మి, గృహలక్ష్మి, సాహిత్యలక్ష్మి, గాన
లక్ష్మి, నృత్యలక్ష్మియు భవల్లలన, లందు
నాద్య మును విడితివి; ద్వితీయుఁ విడిచితి
విపుడు; తక్కిన ముగ్వురి నెట విడిచితి 400

తే॥ గీ॥ అస్తమించితి నా జీవి తాబ్జరవివి
నీవు; నీ ఛాయ నయ్యుమ నేను దయిత!
యస్తమింపక యుంటి; నెం దైన ఛాయ
యుంట తేజ మారుట యున్నె? వ్యుత్క్రమ మిది. 401

కం॥ అని గతము ద్రవ్వికొనుచ
యయ్యసిందిత చరిత్ర జాల నైనను గరగిం
చు నటుల నేడ్చుచు నుండఁగఁ
గని శతవృద్ధొ కఁడు పలికెఁగన్నీ రొలుకన్ 402

—: వృద్ధ వాక్యము :—

కం॥ మరణంబు సాగరము స్త్రీ
పురుషు లిల నదీనదములు; ముందో? వెనుకో?
వరుసగఁ దద భిముఖమ్ముగఁ
బరువెత్తుదు రందుఁ గ్రుంకుపా టొందుదురున్ 403

తే॥ గీ॥ చచ్చి పుట్టినవారు విశ్వమునఁ గలరు;
చచ్చి బ్రతికిన వాఁ డేఁడు జగతి లేఁడు;
పగిలిన పనంటి ఘూ టొండు పనఁటి బొంధ
నౌ; నదియు పొందుటన నసాధ్యంబు కాదె? 404

కం॥ వెనుకో? ముందో? యందఱు
చనువా రొక్కండు జగతి సాఁగఁడు; సర్వం
డును జను; నేమాత్రము చన
నని కొండొకఁ డెన్నఁ గాని యాతఁడును జనున్ 405

కం॥ కలిసి పెనఁగిన రెండా
కులలో నొక్కండు సడలి కూలెఁ నేలన్
విలపించుచున్న దన్యము
కలకాలంబు న్నె కూలుగాకది యుఁ దుదన్ 406

ఆ॥ వె॥ వృద్ధుఁ డాడిన నుడి విని వివృతద్వార
మట్లపోలె నైన యయ్యమ యెద
నుండి తేఁగుచు వెలి కుబికె శోకంబు; త
దార్తి వెండియు నది యనియె నిట్లు 407

—: కణ్ణగి తాపోప శాంతి :—

ఉ॥ ఎంతకు లేఁడు దుర్విధి, సహింపని కాంతుని బాసియున్కి కొం
దంతది కూర్చి నా బ్రతుకు నంతయుఁ జీఁకటి సేసినాఁడు ని

శ్చింతము గాఁగ వాఁడు తన చేసిన చేఁతకు నవ్వుఁ గాక నా
కింతకు మించు కీడు ఘటియింపఁగ వానికి దొమ్మ లున్నవే 408

ఉ॥ పోయినవాఁడు పోయె, ఁదనపోయిన చోటును జెప్పఁ డాయె నే
చాయఁ దదంతికంబునకు సాఁగుదు; సాఁగితి నేని వాని నే
నీ యిల కెట్లు తెత్తు; నిది యేను నెఱుంగుదు; ఁకాని శోక మె
చ్చైచ యెద వ్రీల్చి యీ నుడుల నన్నిటిఁ దాన వెలార్చె నీగతిన్ 409

కం॥ పోయిన వారికి నేడ్చుట
సేయరు మతిమంతు లేడ్చి సేయున దొండు
న్నే? యిలఁ బాసి చనినవాఁ
డే యనువునఁ దిరిగి వచ్చు; నేమ ని యేడ్తున్ 410

కం॥ అని యేడ్చి యేడ్చి చుట్టును
దనతో విలపించు గుబ్బెతలఁ గ్రోధమునన్
గని నిరపరాధి నా ప్రా
ణనాథుఁ డాతని హరించె నరనాథుఁ డయో! 411

—: *కణ్ణగి నెడుంజెవియను ప్రాసాదమున కేగుట* :—

ఉ॥ ఇంతదురంతమున్ సలిపి యేమి యెఱుంగని వాఁడుఁబోలె ని
శ్చింతము గాఁగ గుండెపయిఁ జేతిని వైచుక నిద్రపోవు భూ
కాంతుని వంశ మొక్క క్షణకాలము లోనన బుగ్గిసేసి నా
వంతఁ దలంగు దాన నని భామ ప్రతిజ్ఞ యొనర్చె ధీరయై 412

సీ॥ తక్క నూపురము హస్తమునఁ దాలిచి నాదు
విభుఁడొ? చోరుండు భూవిభుఁడొ? నేఁడు
ప్రత్యక్ష సాక్ష్య పూర్వముగ నిరూపింతు
రండు నా తోడ పౌర ప్రముఖులు!
నేఁ బతివ్రతనేని నిఖిలభూతంబులు
నా కిప్డు సుప్రసన్నంబు లగును
గా కని ప్రతిభయాకారంబుతో మన్ను
మిన్ను కక్క పిడుచ గా మ్రింగుటకును

తే॥ గీ॥ బోలె నవని కేతెంచిన కాళి యనఁగ
ఱేఁగి గజ విక్రమంబుల ఱేని తోర
ణంబు కడ కేగె; ఁబౌరజనములు పిఱుఁద
కొంద ఱరిగిరి; నిలిచిరి కొంద ఱచట 413

కం॥ వారీ నగరికి నీ గో
త్రారమణుని కేదియో సుదారుణ దోషం
బారంభము కా నున్నది
ప్రారబ్ధము తప్ప దనుచు నని రి భ్భంగిన్ 414

సీ॥ కన్నులున్నవొ? లేవొ? ఖలుఁడైన విధికి ని
వ్వారి నిప్పగిదిఁ చేద్వరచె; నయయొ!
ఎట్టి దాయకు నేని యిట్టి యధ్వాన్నపుఁ
బట్టు రా కుంట మేల్పట్టుఁ గాక;
ఎచ్చోటఁ బుట్టిరో? ఎచ్చోటఁ బెరిగిరో?
నిచ్చోట కేతేర నేమి కతమొ?
ఏ నగరికి నేగు చిమ్మధురాపురి
కెపుడు వచ్చిరొ దైవ మెఱుఁగుఁ గాక!

తే॥ గీ॥ తొంటి పుట్టున నే దంపతులను బాపి
రో? యిచట నీ పగిది నైరి; యే యనఘుల
కైనఁ దలవ్రాఁత తప్పకో నలవి యగునె
యనుచుఁ దలకొకరీతిగా ననిరి పురిని 415

కం॥ ఆనాఁడే మునిమాపున
భూనాయకు సతికి స్వప్నములు భయదములై
నానా రీతులఁ గన్పడఁ
గా నాతుర యై భయంబు గదిరిన మదితోన్ 416

## ....: కొప్పెరుందేవి దుస్స్వప్నము :....

ఉ॥ భూవరుఁ డున్న యంతిపురి మోసలకుం జనుదెంచి కొప్పెరుం
దేవి విముక్త కంఠముగ దేవ! నెడుంజెవియన్మహీశ్వరా!
ప్రోవుము నన్నుదీన నని రోదనముం బొనరించె, భూపుఁడున్
దేవిడిలోని కప్పుడ సతీమణిఁ దోకొనిపోయి యిట్లనున్ 417

కం॥ విలాభయ మే నుండఁగ?
నీలాఁగున నేడ్చి బెదరె దేలా? రాణీ!
పోలునె ధీరకు నీ కన
గా లోలాయతనయన స్వకాంతున కనియెన్ 418

సీ॥ ఉర్వీంద్ర! యిప్డు నే నొక్క స్వప్నము గంటి
నందు మీ శశిధవళాతపత్ర
మవనిపైఁ బడినది హస్తాన మీ తాల్చు
రాజదండంబు వక్రముగ నయ్యె
నన్యాయ మేదియో యతిదారుణం బొక్కఁ
డైన రీతిని ద్వారమందు వ్రేలు
ఘంట యథేచ్ఛంబుగా మ్రోఁగెఁ జీఁకటి
నిశ ఘోర రవము విన్పించె; పగలె

తే॥ గీ॥ కలిగె నుల్కా నిపాత మొక్కండు; క్రూర
దారు ణాశుభ మేదియో దాపురింపఁ
బోవుచున్నది మనకు నీ పురికిఁ గూడ
దైవ మేలనో వక్రించె ధరణినాథ! 419

సీ॥ మీ పూర్వవంశ్యుల మేటి యయ్యుగ్రపాం
డ్యనరేంద్రుఁడు పాలనంబునను గలిగె
నట! మున్ని టులె భవిష్యదరిష్ట సూచక
ములు కొన్ని యప్పు డంభోనిధి తన
చెలియలి కట్ట భంజించుకొని కుమారి
దేశంబు మ్రింగ నేతేర నుగ్ర
పాండ్యుఁడు కుపితుఁడై భల్లంబుఁ గొని పైకి
విసరి వైచె నట్టి యా విసురున

తే॥ గీ॥ కబ్ధి తోఁక ముడుచుకొని యరిగె నంట
వెనుక కిపు డేమి జరుగునో యనుచుఁ బలుకు
చుండ; నృపుఁడు మాఱా డక యూరకుండె!
నంత నొక్క ప్రతీహారి యరుగుదెంచి 420

...: ప్రతీహారి కణ్ణగి రాకఁ జెని కెఱిఁగించుట :....

సీ॥ ప్రళయా నిలమునకు బైకి లేఁగిన బడ
బా నాసికా నల జ్వాల యనఁగ
ఘన ఘర్షణంబున జనితమై నిలువుగా
నవని బడ్డ యిరమ్మ దార్చి యనఁగ
జగము నిర్వనము సేయఁగ బుట్టి పారిఁబొరి
నెల్లఁ గ్రమ్మిన దావహేతి యనఁగ
తఱి వేచి మధుర నిర్దగ్ధంబు సేయ నా
యితమైన యగ్ని లోహిత యనంగ

తే॥ గీ॥ రౌద్ర వీర భయానక రసము లొక్క
యచ్చునం బోసి రూపంబు నావహించి
సత్త్వ మొసఁగెనో విధి నాఁగఁ జాన యొకతె
రాజ! నినుఁ జూడ వచ్చె దోరణము కడకు 421

తే॥ గీ॥ చేత నూపుర మొండు దాల్చినది కోప
వహ్నిఁ గ్రక్కుచున్నది? యని పల్కె బ్రభుఁడు
వెంటనె ప్రవేశపెట్టు మా వెలఁది ననుచు
నరిగె సభకు సభార్యుఁడై యచ్చెరువున 422

కం॥ అవిలంబితముగఁ గణ్ణగి
యవనీపతి సభను జొచ్చె; నా వెన్క ప్రజా
నివహము; సతి కెదురుగఁ బతి
దివిటీ కెదురున్న దివ్వె తెఱఁగు వహించెన్ 423

కం॥ కని విని యెఱుఁగని రౌద్రం
బున సభ్యుల బీతు గొలుపు పుణ్యాంగన మో
మున దీనత్వముఁ గందో
యని బాష్పముఁ గాంచి ధారుణీంద్రుఁడు మదిలో 424

కం॥ కరుణము రౌద్రము స్త్రీత్వము
ధరించి యాస్థానమునకు దారసిలెనో? యం

చరసెడు నెడ నదిపతి కిటు
కొఱవు లెగయఁ గనులఁ గ్రేటుకొనుచుఙ్ బలికెఙ్ 425

## ...: కణ్ణగి రాజుతో సంభాషించుట :...

కం॥ ఈ నగరికి విభుఁడవు నీ
వేనా? హితధర్ముఁడ నని యీవే నా పే
రూ నినది చ్చటి యీ వీ
రేనా ని న్గొలుచుచున్న హితులు? నరేంద్రా! 426

కం॥ నావుడు వాఁడి ప్పరి కే
నే విభుఁడను; జనులు నన్ను హితధర్ముం డం
డ్రు; వీరే కొలిచెడు హితు
లీ వె వతవొ? తెలుపు మనఁగ నింతి యిటు లనెఙ్ 427

కం॥ కోటులకుఁ బడగ లెత్తిన
సాఁటి కొలఁది లేని యొక్క సాహునకు సుతఙ్
జూటె ఋఁగని మఱొక మహా
కోటీశ్వరునకు ననుంగుఁ గోడలను బ్రభూ! 428

తే॥ గీ॥ ఆ కుబేరకల్పున కొప్ప నాత్మజుండొ
కండు త్యాగవిభూతిఁ గర్ణుండు, సద్గు
ణమ్ములకు నిధి కోవల న్నామధేయుఁ
డా మహానుభావునకు నర్ధాంగి నేను 429

కం॥ ననుఁ గణ్ణగి యని యందురు
వినీత నని తల్లి తండ్రి విభుఁడు శ్వశురులున్
నను మన్నింతు రిటకు వ
చ్చునంత వర కేఁ బ్రభూ! యసూర్యం పశ్యఙ్ 430

కం॥ అని తన వృత్తాంతంబును
వినిచిన కణ్ణగికి భూమివిభుఁ డిట్లను నే
మి నిమిత్తంబున నయ్యాభి
జనముమ నీ వారి విడిచి పాఁగితి విటకుఙ్ 431

కం॥ అనవుడు నది దౌర్భాగ్యం
బున డెప్పర మొకఁడు మాకు భూపతి! స్వపురం
బునఁ గల్గ నేను నాయన
యును నిట కేతెంచినార మొక్కట నంతన్

సీ॥ తన కోలుపోయిన ధన మెల్ల వెండియు
నార్జింపఁ దలఁచి నా కనియె దయితుఁ
డీ మధురాపురి నేదేని బేరంబుఁ
గావింపఁ గోరుదుఁ గాని నాకు
మొగ మెఱుంగని చోట మూలధనం బెవ్వ
రిత్తు రనంగ నే నేల యొకని
చేఁజాచి యాచింప? శ్రీనిధి! మాతల్లి
యా నాఁ డొసంగిన యందె లున్న

తే॥ గీ॥ వివిగో? వీనిలో నొక్కటి యే ప్రభువున
కేని విక్రయింపుము; నీ కభీష్టమూల
ధనము సిద్ధించు నని పల్కి దయితు చేతి
కందె నొకదాని నిచ్చి పురి కంపియుంటి 433

కం॥ నా రమణుం డిప్పురి మం
జీరము తెగ నమ్మ తఱిని క్షితిపతి! యతనిన్
జోరునిగాఁ గైకొని నీ
క్రూరాజ్ఞన్ నీదు భటులు కూల్చిరి కినుకన్ 434

తే॥ గీ॥ దొరను దొంగగా భావించి దుడుకుఱేఁడ!
నాదు వల్లభుఁ జంపిరి. నీదు సుభటు
లుర్విపతులకు వినఁ జెవు లుండుఁ గాని
కానఁ గన్ను లుండ వను వాక్యంబు నిజము 435

సీ॥ అని పల్కి కణ్ణగి నట్టె కన్గొని యుల్కి
యురలఁ గన్నుల ఁబల్కె నుర్వినాథుఁ
డేను బాండ్యుఁడ; శుద్ధ మైనది నా వంశ
మెఱుఁగ నధర్మమే నీ కులమునఁ

క

బుట్టిన తొల్లింటి భూపాలు రందొక్క,
డైనను లేఁ డధర్మాత్ముఁ డేల
యున్న దొక్కటి లేని దొక్కటి పల్కెడు
పాండ్యు ధర్మసభ లోపలికి వచ్చి;

సీ

తే॥ గీ॥ రాణి యందియ దొంగిలి రాజవీథి
నంగడిని నీ మగం డమ్మ టరసి భటులు
రాజు నాజ్ఞఁ జంపిరి; యకారణ వధంబు
కాదు; పల్కకు మిం కొండు కాఱు లతివ! 436

తే॥ గీ॥ న్యాయ రక్షణమునకు దండన మొనర్తు
రవనిపాలురు; సత్య ధర్మా వనంబు
రాజ ధర్మంబు; కా దనరాదు బ్రహ్మ
కైన; నీభర్తఁ జంపు టన్యాయ మెట్లు? 437

సీ॥ అనుడుఁ గణ్ణగి జేని కనె నిట్లు కోటీశు
లందఱికిఁ గుబేరుఁ డైన వాని
కేకైకపుత్త్రుఁ డోయీ! నాదు వల్లభుఁ
డతఁ డెట్లగును దొంగ? యానసంబు
గనుగొన్న వారికిఁ గాదో యవగతము
దొంగ యైనది యొండె దొర యయినది;
యింత విచారింప కేల నాపతి నిర్ని
మిత్తంబ చంపించి తుత్త నింద

తే॥ గీ॥ మోపి? నాకత్తె కేదు రేది భూమి నన్ను
చెడ్డగర్వాన నా కింత చెట్టచేసి
నట్టి పాపివి; ఛీ! ఛీ! దురాత్మ! నీవు
రాజవో? యమరాజవో? ప్రజ కెఱుంగ 438

కం॥ దండ్యుల దండింపమియు; న
దండ్యుల దండించుటయు నధర్మ మటంచున్
బాండ్యా! యెఱుఁగవె? నీకున్
దండ్యా దండ్య వలోక దక్షత లేదో? 439

కం॥ కొండొక్క యుప్పుఁగల్లునఁ
గుండెడు పా లెట్లు చెడునొ? కుపతీ! యట్లే
కొండిక యధర్మమున నీ
మండల మఖిలంబు సర్వమంగళమ యగుఁ 440

తే గీ దాని నుడులకు సభవారు స్తబ్ధులై యొ
కండు పల్కనే మగునొ? యొకండు పల్క
కున్న నేమగునో యని యూరకుండి
రపుడు జేవురించిన యాస్య మమర ఱేఁడు 441

ఉ దానికి నిట్లు పల్కు; వనితా! సతి వాతని కీవు; వాఁడు నీ
ప్రాణవిభుండు; వానిని నొకప్పుడు దొంగ న నేర వీవు; లో
కాన మగండు దొంగ యనఁ గల్గిన స్త్రీ ప్రభవించి యుండెనే
స్త్రైణ మధర్మ మందిర మసత్య రతం బగు టేమె ఱుంగమే? 442

తే॥ గీ॥ అతఁ డచోరుఁ డం చీవు కొండాడు టేమి
యరుదు? రాణి పాదాం గదం బాపణమున
నమ్మ నాతఁడు దొంగ కా కన్యుఁ డగునె?
నన్నుఁ గను బామ వచ్చితే నంగనాచి! 443

కం॥ కను లున్నవారు చోరుం
డని రీ వొక్కతెవు మాత్ర మాతఁ డచోరుం
డనుచున్న దాన వింతకుఁ
గను లున్నవొ? లేవొ? నీకుఁ గన జాత్యంధా! 444

తే॥ గీ॥ అనుడు ప్రేటు వడ్డ యురగాంగన విధాన
బుస్సు మని మ్రోఁగుచు నమర్ష మూర్ఛిత యయి
కణ్ణగి నరేంద్రు మోమునఁ గన్ను లునిచి
యుంగలంబులు ఛిమ్ముచు నిట్లు పలికె 445

సీ॥ అందియ దొంగ నా యాత్మేశ్వరుఁడు కాఁడు
దుష్టాత్మ! యందియ దొంగ వీవ;
యయ్యమూల్యపు టందియన్ గని "రత్నహా
రీ తు పార్థివ" యను నీతి చెల్లు

క| రాజుల కన్న దుర్గర్వమున హరించి
యుందువు గాక! వే ఱొండు గాదు
ధర్మ కంచుకమును దాల్చిన గోముఖ
వ్యాఘ్రంబ వీవు; పాండ్యాపశదుఁడ

సీ తే॥ గీ॥ వై తదన్వయ కీర్తి పా తగలఁ జేసి
తింత సేసిన నీవు మఱెంత సేయ
వకట! నీవు ధర్మక్షేత్ర మందు నలము
కొన్న మల్లెవు; సతులకుఁ గొల్లడమవు 446

కం॥ మునుపటి శిబి మాంధాతల
కు నాకు ధర్మమున గోటి కొన యంతైనన్
జనియింపదు వ్యత్యయ మని
యనుకొనుచున్నావు నీ వహంభావమునన్ 447

తే॥ గీ॥ అట్టు లనుకొంట కూర్మదు గ్ధాభిషేక
మాచరించుట, తలయందు నభ్రసుమము
దాల్చుట, శశ శృంగ రచిత ధనువు నరుల
నాజిఁ దునుమాడఁ బూనుట యౌఁనృపాల; 448

ఉ॥ నీ వొక క్షుద్ర భూపతివి, నీ కిది కార్య మకార్య మిద్దియన్
భావన సుంత యైననఁ గనుపట్టదు; తొల్లిటి రాజధర్మ మన్
పూవుల సెజ్జ నిప్పుకలఁ బోసితి; నీ ప్రియ దాల్చు రత్నభూ
షావళి పైని నీకుఁ గల యయ్యను రాగమ చంపె నా పతిన్ 449

చం॥ ఒక పరదేశి హస్తమున నుండిన యందియఁ జూచి యెవ్వఁడో
యొకఁ డరుదెంచి "యంగడిని నుండుట చూచితి నేఁడు రాణి పా
దకటక హర్త" నంచన యథార్థమొ? కాదొ? యటంచు లోన నె
న్నక యెటు చంప నాజ్ఞ నిడి నాఁడవు; తేఁడవొ కాక రాడవో 450

తే॥ గీ॥ అజ్ఞతానిధీ! యె ద్దీ నె నన్న గాటఁ
గట్టు మన్నట్టు లున్నది గాని యొండు
భంగిగా లేదు నీ చేఁత; పాలకుండు
వట్టి యవివేకి యేఁ బ్రజ బ్రతుకు సున్న 451

కం॥ అకలంక శీలుఁ డగు నరు
నొకనిఁ బలి గొని యధర్మయుక్తిగ నీ యు
ర్వికి నేలికవై ధర్మము
న కే నధిష్ఠానమ నన నగరే లోకుల్ 452

తే॥ గీ॥ సత్య ధర్మాలు దిగఁద్రావి సతుల కార్తిఁ
కూర్చు రాజబంధూ! యెట్లు గూరుచుంటి
రాజ సింహాసనంబునఁ ద్రప తొఱంగి
చెలువ పార్శ్వానఁ గులుకంగ సిగ్గు లేదె? 453

కం॥ అని పలుకు కణ్ణగినిఁ గని
జననాథుం డింత సాహసంబున నృపు కొ
ల్వున మాటాడిన స్త్రీ నేఁ
గని యెఱుఁగ నటంచు నెంచి కనలునఁ బలికెన్ 454

కం॥ చనుఁ జన దని వగవక, యే
మనునో జేఁడ నక తెగి నిరాకుల మతివై
చనునే నీ నోరికి వ
చ్చిన తెఱఁగునఁ గాఱు లఱవ? స్త్రీవో? కావో? 455

తే॥ గీ॥ ఒడలు తెలియక మాటాడెదో? పిశాచ
మావరించినదో నిన్ను? నట్లు కాక
నైజవిధమో? వచింపుము నాతి! నాఁగఁ
బతికిఁ గణ్ణగి వెండియుఁ బలికె నిట్లు 456

సీ॥ పుడమి కొడయుఁడవు; కడలేని సంపద
రాజ్యంబు గలిగిన రాజ వీవు;
కలిమి బల్మిని నొడ ల్దెలిసియో తెలియకో
యాడినఁ జెల్లు నీ; కావరింప
దే పిశాచము నన్ను; నిది నైజవిధమును
కాదు; స్త్రీ నే; నొండు గాను, గనుమ
నేను బల్కిన దెల్ల నిజము నిరూపింతు
దీనిని సాక్ష్యంబుతో నరేంద్ర!

తే॥ గీ॥ సత్య మాడువారి నెఱుంగు స్వామి యంద్రుడు;
సత్య మాడు వారికి సాహసంబు మెండు
కాన కంచు కంఠము తోడ నేను బల్కు
చున్న దానను గాక వేఱొండు గాదు 457

సీ॥ అనుడు నెడుంజెవియఁగ గణ్ణగికి నిట్లు
పల్కు భామా! నీదు పల్కు లందు
సత్యంబు దోఁచిన సరి; యట్లు గా కొండు
గాఁ దలఁ దీయింతుఁ గాని విడువ;
నేట దూఁకుటకు ము న్నిది యా వలనికి
సాఁగుటో? నడుమన చావు గొనుటొ?
నిర్ణయించుకొనుము; నీ వల్లభుని చెంతఁ
బట్టువడిన రాణి పాదకటక

తే॥ గీ॥ మిదిగొ? కొను మని కణ్ణగి కిచ్చె; నదియు
నందియ గ్రహించి మాటికి నట్టు నిట్టు
త్రిప్పి; యందియ తనదిగాఁ దెలిసికొని మొ
గంబు నందు విశ్వాసంబు కడలు కొనఁగ 458

కం॥ తనుఁ దాఁ గనుఁగొను; రాజుం
గనుఁగొను; సభవారి యొరఁ గనుఁగొను; సింహా
సన మందుఁ గొప్పెరుందే
విని గనుఁగొనుఁ; ధుట్టతుదకు వికవిక నగుచుఁ 459

—: కోవలన్ దొంగ గాఁడని కణ్ణగి నిరూపించుట :—

సీ॥ ఇట్లనెఁ గణ్ణగి ఇది యెంత పని నెడుం
జెవియన్మహారాజ! యవితథమగుఁ
గాత! నా ప్రతిన; నా కాంతుఁడు దొంగ గా
దని నిరూపింతు మీ కనుల యెదుటఁ;
గొప్పెరుందేవి నీ కూర్చున యుల్లాలు
ధరియించు పాదాంగదముల యందు
నింపఁ బడిన మణినికర మే జాతిదో
వాక్రువ్వ మీ సభవారు వినఁగ

తే॥ గీ॥ ననుడు నా విభుం డాణిముత్యా లటంచుఁ
బలికె బిగ్గరగా; జేని పల్కునకు ఁబ
యోద గర్జితమునకు మయూరి వోలె
నుబ్బి తబ్బిబ్బగుచు ననె నుర్విపతికి 460

ఉ॥ నేను ధరించు నందియల నింపఁగఁ బడ్డది పద్మరాగ సం
తానము; రాణి పాదములఁ దాల్చెడు నందెల నున్న దచ్చ ము
క్తా నికరం బటంచు వసుధాపతి! యంటివి; కన్నులం గనం
గా నవు రాణి పాద కటకంబున నేమణి జాతి యున్నదో? 461

కం॥ అనుచుఁ గణ్ణగి యందియ
తన చేతి బలంబు కొలఁది ధరణీస్థలిఁ గొ
ట్టెను. బగిలిన యా నూపుర
మునుండి వే పద్మరాగములు వెల్వడియెన్ 462

సీ॥ ముక్కలై పడ్డ నూపురముఁ దద్గర్భ ని
గతము లౌ పద్మరాగములు గాంచి
విస్తుపోయె ధరణీవిభుఁడు, తద్ధవళాత
పత్త్రంబు విఱిఁగి క్ష్మా పైని బడియె
జననాథు చేతి కాంచన దండము బుజుభా
వంబు గోల్పడె; సభవారు సభయు
లై చిత్రముల భంగి నైరి గద్దియ పైని
కొప్పెరుందేవియుఁ గొయ్యఁబాఱెఁ

తే॥ గీ॥ గణగి కుపిత కాళికా కార మూని
క్ష్మాపతిని నెడుంజెవియమఁ గాంచి ఓరి
మూర్ఖ! చూచితే భగ్ననూపురము నెకఁ గ
నుంగొనుము నాదు శెండవ నూపురంబు 463

తే॥ గీ॥ అనుచుఁ జే నున్న రెండవ యందె భూత
లమునఁ దా బాహుబలము కొలందిఁ గొట్టెఁ
బద్మరాగంబు లందుండి బయలు పడె న
రిష్ట సూచక కోల్కా కణాళియొ యనంగ 464

కం॥ ఆ దృశ్య మెల్లఁ గన్గొని
భూదారుఁడు శిరము వంచి పొంగెడు చింతా
వేదనలు కనులఁ దోఁపఁగ
స్త్రీదేవత కిట్టు లనియె ఁజే మోడుచుచున్ 465

ఉ॥ నే నపరాధి; దుర్మతిని; నీవు మహీస్థలి జన్మగొన్న శ
ర్వాణివొ? వాణివో? జలరుహాక్షుని రాణివొ? గాక యొండు గా;
వైనది నాకు శాస్తి; యిత రాంగనయుం బలె నెంచినాఁడ నిన్
మానవతిన్ బతివ్రతను; నాకు వినాశము తప్ప దింతకున్ 466

ఆ॥ వె॥ పాల వంటి పాండ్య వంశానఁ బుట్టిన
హాలహలమ నేన; నన్యవృత్తు
లౌ పతివ్రతలకు హాని చేకూరిచి
బ్రదుకు నెట్లు జగతి పాంసనుండు 467

కం॥ ఒక కోటీశ్వరు సుత వీ
వొక కోటీశ్వరున కాలి వొక దోషము లే
ని కులాంగన వేఁను ద్వదీ
య కోప వహ్నికి సమిధగ నైతి సుచరితా! 468

ఉ॥ ఓ పతిదేవతా! కుల మహోన్నతిఁ గూర్చిన పాతకుండ; నీ
పాపము నేను ద కొక్కరుఁడు పాంసనుఁ డేనియుఁ జేయఁ డేఁడు? నీ
ప్రాపును మొగ్గ వోలె నఖరంబునఁ ద్రుంచితిఁ గించ లేక, నీ
కాపురమన్ పయోఘటముఁ గాలను దాఁచిన నన్ శపింపుమా! 469

కం॥ అనుచు సభవారి దిక్కై
యనర్హుఁడను రాజ్యమేల? యన్నృత మధర్మం
బును వృత్తిగఁగల యగసా
లె నమ్మి ధర్మతరువుఁ బెకలించిన వాఁడన్ 470

సీ॥ కొప్పెరుందేవికిఁ గూర్చిన యందియఁ
గపటవృత్తి హరించి కమ్మసాలె
యాకారమున యందు నా కులభామిని
యందియ యట్టిది యమ్మకమున

కనఘుండు కోవలన్ గొనితేఁర దనతప్పు
బాపికొని నను గన్ బ్రాము కొఱకు
రాజేంద్ర! యీనాఁడు రాణి మంజీరంబు
దొంగిలించినవాఁడు దొరికె నాఁడు

తే॥ గీ॥ భటుల బంపుం డనుచు వేడఁ బంపు చేసు
నందె చేఁగల వానిని నట్టె నఱికి
తేరుఁ డందియ యని యంటి, వారు నట్లు
జంక కొనరించి రీ; హత్య జరిగె దాన 471

ఉ॥ నా యవిచార కారితకు నాశన మయ్యె నదోషి యొక్కఁ డెం;
తో యపకీర్తి కెక్కినది దూఱ ను మాట కపాత్ర మై సుధ
ర్మాయతనంబుగా విదిత మైన మదన్వయ మీ; యనిందిత
స్త్రీ యనుతాప మే నను నశింపఁగఁ జేసెడుఁ గాలసర్పమై 472

చం॥ అనుపమమై బుధప్రతమౌ "సహసా విదధీత న క్రియా"
మను నుడి ధర్మ నిర్ణయము నందుఁ బ్రమాణముగా, నకృత్య మే
యనువున మున్నొనర్పను; బదాంగద మెవ్వరి దన్న నిర్ణయం
బున బొరపా టొనర్చితిని బుద్ధి చలించుట ఁజేసి దుర్విధిన్ 473

సీ॥ అతి నిర్మ లాత్ముని ననపరాధు నొకని
కాసుకు గాకుండ గావు వెట్టి
యుర్వి మున్ పుట్టని యొక పతిదేవత
పసుపు కుంకుమముల ఁబా డొనర్చి
న్యాయ పాలకుఁడు 'మినావను' వంటి భూ
కాంతుని కీర్తి ని గాకు సేసి
వనితపైఁ గల మోహమున సదసద్వివే
కంబునకు ఁదిలోదకంబు లిచ్చి

తే॥ గీ॥ పైఁబడితిఁ గాక! యే నింక బ్రదికి యేమి
మూట గట్టుక పోదు? నా బోటి పాపి
బ్రదికి యుండియుఁ జచ్చిన వానితో స
ముండుఁ నా కింకఁ బరమేశ్వరుండ దిక్కు 474

తే॥ గీ॥ అనుడు సభ్యుల నేత్రంబు లశ్రుపూరి
తంబు లయ్యె; హా హా నినాదంబు లుప్ప
తిల్లెఁ దదుపరి; కొప్పెరుందేవి యాత్మ
నాథుని యవస్థ కార్తయై నలఁగుచుండె 475

సీ॥ అంత భూపతి యీశు నాత్మ ధ్యానించుచుఁ
"బరమేశ్వరా! నాదు దురిత మెల్ల
సమయింపు మీ; పుణ్యసతి మూలమున నాకుఁ
గలిగించితివి దేవ! యలఘుబోధ
మింక నే నొం డొల్ల; నీ జగంబున నాదు
పాపంబు నా యన్వవాయ జనితు,
లైన రాజన్యుల కంటకుండు నటుల
దయఁ జూడు మర్ధేందుధర! మహేశ!

తే॥ గీ॥ నాదు ప్రాణంబు లర్పించి నా యొనర్చి
నట్టి చెట్టకు నిష్కృతి నందు వాఁడ
ననుచు మూర్ఛో పహతుఁ డైన యట్టు లపుడ
యవని తలమునఁ బడి తోన యసువు లీఁగె 476

కం॥ అప్పగిది నెడుంజెవియను
కుప్పన కూరగ ధరిత్రిఁ గూలి చనంగా
నప్పుడమితేని భామిని
ముప్పిరి గొను దుఃఖభారమున ని ట్లెడ్చెన్ 477

సీ॥ ప్రాణేశ! నీవు నా ప్రాణంబు ప్రాణంబ
వీ; నన్ను విడిచి యె ట్లేగి నాడ;
వవిధవ గా బ్రతు కంతయు నీడేర్చి
విధవగా నిపుడు జీవింతు నెట్లు?
చంద్రుండు చన నెట్లు చాంద్రి ప్రకాశించు?
మేఘంబు చన నెట్లు మెఱుపు మెఱయు?
నాధారమైన చెట్ట వనిఁ గూలఁగఁ జుట్టు?
కొని యున్నతీవయుఁ గూలదెట్టు?

తే॥ గీ॥ లడిగినది యెల్ల నిచ్చెద వబ్ది ధీర!
పూవునుం దావియుం బోలె నీవు నేను
నుంటి మిన్నాళ్లు; పోవు న ష్టాక్క మాట
యైనను వచింప కొంటి నె ట్లరిగినావు? 478

కం॥ ఓ సామి! నీవు సన నీ
ప్రాసాదము వల్లకాడు వలెఁ గన్పడి యా
వాసమున కనర్థం బౌ;
వాసవ సమ! నీ పిఱుంద వచ్చెద నేనుꣳ 479

కం॥ అని యేడ్చు; మీఁద వ్రాలును;
స్తన సంబాధముగ నురము తాడించు కొనుꣳ
చనితే మనోహరా! యను
విని యీ యనద నుడి తిరిగి వే చనుదెమ్మా! 480

కం॥ అని పల్క రాణిఁ గన్గొని
కనుల ప్రవాహముగ బాష్ప కణికలు రాలꣳ
దను వెల్లను గంపింపఁగ
ననియెꣳ గణ్ణగి యథార్థ మౌ వాక్యంబుꣳ 481

కం॥ నా నెత్తి పైని గొడుగును
నీనాథుఁ డకారణంబ! నిలువునఁ గూల్చెꣳ
నే నెట్లేడ్తునొ? వల్లభ
హీనా! యబ్బంగి నీకు నేడ్వఁగ నయ్యెꣳ 482

కం॥ నీ కాంతు క్రూరచేష్టకు
నా కన్నులు లేని దైవ మౌ నని యూఁచెం
గాక శిరంబును; రాణీ!
లేకుండిన నిట్టి దీపురినీ బాటిలునే? 483

కం॥ ఒరులకు నే మొనరించునొ
నరుం దదియ యీ జగంబునꣳ బ్రాపించుꣳ
ధర విత్తన మే జాతిదొ?
తరు వా జాతిద ఫలంబు తజ్జాతిద యౌ 484

కం॥ తన కాలో? తన కన్నో?
తన చేయో? తెగిన నరుఁడు తాపము నొందున్
దనకై తా నేడుచు; న
న్యున కా దుర్దశ జనింప నొవ్వఁ డొకింతేన్ 485

తే॥ గీ॥ అన్యులకు నపకారంబు నాచరించి
ప్రతిఫల మనుభవింపని వాఁడు గలఁడె?
మంట దూఁకినఁ దను వెక్కిం మాడకుండు
ధాత కైనను వాని ముత్తాత కైన 486

కం॥ అది యటులుండ నిమ్మో
సుదతీ! యింకొక్క మాట సూటిగ నీవో
నెద నాటు నట్లు పలికెద
నదరు బెదరు లేక విను మనాకుల మతివై 487

కం॥ సతులకు నపకృతి సేసెడు
నతఁ డెన్నటి కేని చెడుట యయథార్థము కా
ద, తివా! సతులు న్నెద దై
వతములు తీర్థంబు లాలు వర్ధిలు చుండున్ 488

....: పుహారు పతివ్రతలు :...

కం॥ సతి యెంత యబల యైనను
నతిబల యే! దాని శక్తి యతిలోకం; బే
నితరము నెఱుంగ; మా పురిఁ
బతివ్రతల మహిమ నీకుఁ బల్కెద వినుమీ! 489

కం॥ తన శీలము చెడె నను దూ
ఱు నీఁగ; సతి యొకతె యొకతరువుఁ దన వంటిం
టిని సాక్ష్యము నిమ్మన న
ట్లొ నరిచి యది దాని శీల మోమిన వొకటన్ 490

సీ॥ కరికాల చోళ భూవరునకు గూతురు
మహితాత్మ కల "దాడిమండి" యవఁగ

"వంజిక్కన" ను పేరివాఁ "డాడిమండికి"
వల్లభుఁ డతఁ డొక వాసరమునఁ
గావేరి తటిని ముఖ ద్వారమున ఁబడ
నల లెత్తికొని పోయె నతని; నప్పు
డీదుట యన నేమొ యెఱుఁగని య "య్యాడి
మండి" నిజేశ్వరు మనుచు కొఱకు

తే॥ గీ॥ నా నదీ జలముల దూఁకె; నా బుధ నుతి
పూత పరమ పాతివ్రత్యమునకు మెచ్చి
దవ్వుగా నెత్తి కొని చన్న తరఁగ లతనిఁ
దెచ్చి యా యమ్మకు నొసంగి తలఁగి చనియె 491

కం॥ ఇట్టి పతివ్రత లెందఱొ
పుట్టిరి రాణీ! పుహారు పురమున; నీ యేఁ
బుట్టితి నట్టి స్థలంబున
న ట్టవుటఁ జివరి మాట నవధారు సతీ! 492

కం॥ త్రెళ్లెను నా పతి విధిచేఁ
ద్రెళ్లెను నీ పతియుఁ నీ పురియు జిల్లే ళ్ళ
ల్లెళ్లై సున్నకు సున్నయు
హళ్లికి హళ్లీగ మసన మట్లయి పోవుఁ 493

కం॥ ఆ దారుణవాక్యము విని
రోదించుచు రాణి కొప్పెరుందేవియు క్ష్మా
మీదం బడి మడిసెన్ సుమ
హా దారుణ మంచు లోన నదవద యగుచుఁ 494

కం॥ అభయము మన కిఁక లేదని
సభవారు కవోష్ణ బాష్ప జల ధారలతో
సభయులుగ వెలికిఁ బోయిరి
యభయం కరమైన తెరవు నరసి కొనంగఁ 495

సీ॥ మధురాపురిని మాడ్చి మసిఁజేయ డిగిన రు
ద్రాంబికయో యేమొ యనియె నొకఁడు

జనులను గబళింప వనితగా నైన మ
హామారియో యేమొ యనియె నొకఁడు
భూపాల వంశంబు పారిగొన నున్న మ
హా మృత్యువో యేమొ యనియె నొకఁడు
కొండొక రూపంబు కోరి కైకొను వైద్యు
తానల ప్రభ యేమొ యనియె నొకఁడు

తే॥ గీ॥ క్రౌర్య మెల్లను గొనితెచ్చి కరువు గట్టి
యజుఁ డతివగఁ దీర్చెనొ యేమొ యనియె నొకఁడు
సభను వీడ్కొని యిండ్లకు సాఁగు నపుడు
చకిత చకితా త్మమై నట్టి సభ్యసమితి 496

## —: కణ్ణగి మధురను శపించుట :—

కం॥ ఆ వెడలు చున్న సభ్యులు
నా వసుధాపతి సభ నిటు నటుగా సతి క్రో
ధా వలమాన దృగంచల
యై వామ స్తనమును గుడి హస్తము తోడన్ 497

సీ॥ పెకలించి మధురపై విసరి "నేఁ బతిభక్తి
సత్యవృత్తియు గల దాన నేని
యీ రెండు గుణములు దారుణంబుఁ డగు మహా
పీతిహోత్రుని మొలిపించు నేని
యేమియు నెఱుఁగని నా మనోనాథుని
తలను దొంగతనము పులిమి బలిమి
నన్యాయ వృత్తి నయ్యనఘుఁ జంపించిన
యీ నెడుంజెవియన్ మహీశుఁ డేలు

తే॥ గీ॥ మధుర యెల్లను భగ్గున మాడి బూది
యగును గాత;ఁ బతివ్రత లర్భకులు ధ
ర్మామరులు వృద్ధు లాలు పోరామిఁ జెక్కు
చెదర కగ్నిఁ గూలక మిగిలెదరు గాక 498

కం॥ అని శాపం బిచ్చిన వెం
టనె వైశ్వానరుఁడు తా హుటాహుటి నడతో
చనుదెంచి దాని ముంగల
వినీతుఁడై నిలిచి పలికె విసుమానముతోఁ 499

## —: అగ్నిదేవుఁడు మధురను దహించుట :—

సీ॥ ఏ నగ్నిదేవత, నేతెంచి నాఁడను
నీదు శాసనమున; నేఁడు సాధ్వి!
ఆడినెలను బహుళాష్టమియును శుక్ర
వారమ్ము మఱియును భరణి కృత్తి
కాతారకాథ్యంబు కణ్ణగి! నీవు నా
వరమునఁ బుట్టిన భవ్యమూర్తి
వెచ్చోట నీవు ము న్నెవ్వరు పొందని
యత్యాహితం బొంది తప్పరంబు

తే॥ గీ॥ మధుర, నొక త్రుటిలో దీని మాడ్చి వట్టి
బూదిఁ గావింతుఁ; జూడు మో పుణ్యకాంత!
యనుచు జాజ్వల్యమాన కీలా తి భయద
మైన యాస్యంబుఁ దెఱిచె న య్యగ్ని; యంత 500

సీ॥ రవరవగాఁ బొగల్ కవిసి యెలుగుబంట్ల
మేని వెంట్రుకలకు సూను లగుచు
నొక కొంత పెఱిగి మింటికి సాఁగి నాఁచుతీ
వల చుట్టలకు సహపాఠు లగుచు
మఱి కొంత బలసి వంకర టింకరగ నేగు
త్రాఁచుపాముల కన్నదమ్ము లగుచు
నిఁకఁ గొంత లావయి యిటునటు దూఁగు నే
న్గుల తొండములకు నసుంగు లగుచు

తే॥ గీ॥ బయుల గంధర్వ నగరులఁ బాదుకొల్పు
చంత కంతకుఁ బెఱిగి కొండంత లగుచు

విశ్వరూప మూనిన కృష్ణు వెం(డుక లన
నంతటను దామ యగుచు మి న్నలము కొనియె 501

సీ॥ చక్కగా మింటికి సాఁగుచుఁ; బడమటి
గాలి తాఁకునకు భుగ్నంబు లగుచు;
వలయా కృతిని గొంచు; వాలుగాఁ దూఁగుచు;
బడిబడి దెసలకుఁ (బాకి కొనుచుఁ
బడుచును; లేచుచుః సుడులు వెట్టుచుఁ; (గింది
వలనికిఁ (గుంగుచుఁ; బలుచ పడుచు;
జెట్టు చేమల కెక్కి చిందులు (త్రొక్కుచు
నెత్తైన చోటుల నత్తమిలుచు;

తే॥ గీ॥ శూన్య దేశాల నెల్లను జూఱఁ గొనుచు
మృత్యుదేవత తా వినిర్మించు కొన్న
నీలిపట్టు చేలల గుడారా లనంగ
ధూమ పంక్తులు రోదసీ సీమ నిండె 502

సీ॥ అహమ హమిక తోడ నా ధూమపంక్తి గ
ర్భము లీగికొని నిప్పు రవ్వ లెగసె;
నా నిప్పురవలు మి న్నంతయుఁ దామయై
పగటి నక్షత్రాల భంగి నుండె;
నా రవ్వలకు వెన్క నహిపతి నాల్కల
బలె నీల లోహి తార్చులు జ్వలించె;
నవి గాలి కింతింత లై బయ లెక్కుచుఁ
దలల నార్పుచు నెల్ల నలమికొనియెఁ

తే॥ గీ॥ జెట్లపై కెక్కెః మిద్దెలఁ జేరుకొనియె;
భవనములఁ దూఱె; వలభులఁ బాదుకొనియె;
నట్టములఁ జొచ్చె; సౌధంబు లందు విడిసె
భూమి నాథుని (ప్రాసాదమునకుఁ బఱచె 503

తే॥ గీ॥ జ్వలనుఁ డర్చు లఁ నాల్కలు చాఁచి చాఁచి
పూరి పాకలు చవిగొని సార మెక్కి
సౌధములు మ్రింగి మేడలు చప్పరించి
యధిపు ప్రాసాద మంతయు నారగించె 504

ఉ॥ పచ్చని భూమి తెల్లయును బాడఱె; బాలురు వృద్ధు లాదిగాఁ
జచ్చిరి యెల్ల మానవులు; చచ్చెను గొడ్డును గోదయుఁ; గనుల్
విచ్చక చూతు మేని నలు వీథులు బూడిద కుప్ప లయ్యె ము
న్నచ్చునఁ బెట్టి నట్లు కన నౌ మధురానగరంబు రూపఱెఁ 505

ఆ॥ వె॥ నల్లఁ బడని చోటు వల్లకాడుగఁ గాక
తొంటి గతిఁ గనులకుఁ దోఁచు చోటు
కాపురం బొనర్పగాఁ గలిగిన చోటు
కాన రాదు మధురఁ గాన రాదు 506

తే॥ గీ॥ సర్వభక్షకుఁ డా రీతిఁ జమరి చమరి
పురము సర్వంబు భక్షింపఁ బుణ్యవంత
మైన స్త్రీపుంస మొక కొంత యవసితంబు
గాక శేషించె సతి యనుగ్రహము పేర్మి 507

కం॥ ఆ మిగిలిన వా రీ యమ
భూమీంద్రు కులంబు నగరముఁ గాల్పించెఁ
మే మెల్లఁజెడితి మని యా
భామిని నొక పొల్లు మాట పలుకర యలుకన్ 508

సీ॥ వా రంద ఱొక చోట వలయంబుగాఁ జేరి
యెంత యైనది? యెవ్వఁ డేని మనల
నిట్లగు నంచు ము న్నెంచెనే? యీతల్లి
కీ తల్లి భర్తకు నింతసేసె
మనతోఁడె ఋంగమే? మహితాత్మ యీ సతి
మానవి కా దీ; సుమంగళాంగి
నెత్తిపై గొడుగును నిలువునఁ గూల్చినాఁ
డద్దాని కీ శాస్తి యైనది పతి

తే॥ గీ॥ కెంత సేసిన వారికి నంత గలుగు
ననుచు నేక కంఠముగ మాటాడుచుండ
కనులు చెమ్మగా నొక మూఁడుకాళ్ల ముసలి
హరికిఁ దెలియు నన్నెము పున్నె మశుభము శుభము 509

ఆ॥ వె॥ సీత పుట్టె లంక చెడియెఁ, గణ్ణగి పుట్టె
మధుర యగ్ని మిడుత మాడ్కి మాడె;
మడిసె జేఁడు! వాని పడఁతియు మడిసెను
మడిసి రెల్ల రంగు మాసి నట్లు 510

తే॥ గీ॥ అగ్నిదేవు శాసించిన యా మహాత్మ
రాలి శక్తి యపూర్వ మం చాత్మ నెన్నె;
దాని వారు పత్నిదేవి గా నుతించి
కరము జేజేలు వెట్టి రంకురితభక్తి 511



శ్రీ ర స్తు.

# మం జీ ర వి లా స ము

## ఉ త్త రా ర్ధ ము

—: మధురాపురాధి దేవత కణ్ణగికిఁ బ్రత్యక్షమగుట :—

సీ॥ కణ్ణగి యానతి గైకొని జ్వాలనుండు
మధురాపురం బెల్ల మసి యొనర్చె
నే వాడఁ జొచ్చిన నే వీధి కా లిడ్డఁ
గొండ లంతలు బూది కుప్ప లుండె
నా దృశ్య మీక్షించి యన్నగరా ధిదే
వత మధురాపతి బాష్పవృష్టిఁ
గురియుచు సంతాప ఘూర్ణమాన హృదయ
యై యామె యెదుటికి నరుగుదెంచి

తే॥ గీ॥ "సతివి నీవు; నీయది యల చండికాంబ
శక్తి కంటెను మిన్న; యీ జగతి నిన్ను
బోలు వారు లేరు మహాత్మురాల! యింక
నా యొనర్చు నీ యభ్యర్థ నంబు వినుము 1

కం॥ అనవుడు "నా బడిఁ జనుదే
రు నీ వెవతవ మ్మ? నన్నె ఋంగుదె? నా పొం
దిన చేటు, దాన నగు నీ
యనలో పప్లవ మెఱుఁగుదె?" యను కణ్ణగికిన్ 2

సీ॥ మధురాపతి వచించు, "మానిని! నా కెల్ల
యు నెఱుక; కాని నా మనవి వినుము
మధురాపురమున ధర్మము నాల్గు పాదాల
నడచు చుండినది; యన్యాయ మొకటి

యెన, నాఁడు జనింప దీ నాఁడును జనింప
దైనను నొక్క యన్యాయ మెదియొ
పుట్టఁగ గణగణ మ్రోఁగెడు గంట యి
య్యవసరంబున నాదు చెవులఁ బడియెఁ

తే॥ గీ॥ గాక; తడవులం బట్టి యీ గంట కర్ణ
పేయ వేద ఘోషణముల వినుచు చుండు
నట్టి నగరమున కరిష్ట మిట్టి దయ్యె
విధి విలాసంబు వక్రింప విశ్వవినుత! 3

కం॥ మను నీతి కండ చోళుని
వినియుందువు గద! యతఁడు శిబికి పోలిక; యా
తనిఁ బోలిన ధర్మప్రభు
లనేకులు గలిగిరి పాండ్య నన్వయ మందున్ 4

కం॥ వా రసిధారావ్రతముగ
ధారుణి ధర్మంబు నిలిపి తరలిరి దివికి
ట్లీ రాజు నెడుంజెవియన్
ప్రారబ్ధంబున నధర్మ వశుఁడై చచ్చెన్ 5

సీ॥ అగు నీతనికి నిట్టు లవసాన మని నేను
మున్న యెఱుక గల్గి యున్న దానఁ
నాషాఢమున బహుళాష్టమిని భరణి
కృత్తికల్ రెండును హత్తిన తిథి
శుక్రవారమున నీ క్షోణినాథుండు దు
ర్మరణ మొందు ననియు; ఁబురము సర్వ
మొకసారిగా శుచి కాహుతి యగు ననియు ని
ర్ణీతమై యున్న దా నిర్ణయమున

తే॥ గీ॥ కన్యథాత్వము లేమికి నగ్ని నీఱు
సేఁత సాక్షి యింతకు మున్నె ఁజెలువ! నీకు
నైన యన్యాయ మట్టిద యీ నగరిని
గొరలి యుండిన దిది యొక క్రొత్త గాదు 6

కం॥ కావుననే దుర్విధి నీ
కీ విధి నన్యాయ మిట్టి దిట జరిపించెన్
నీ వైనను నే నైనను
నే వా రైనను దల విధి కీయఁగ వలయున్ 7

తే॥ గీ॥ పడఁతి! పుట్టుఁ బ్రారబ్ధా ర్థవంబున సుకృ
తా మృతరసంబు దుష్కృత హాలహలము
ప్రాప్తి పర్యాయముగ రెంటి నాని జీవి
తమున సుఖదుఃఖము లను ద్వంద్వంబు నొందు 8

తే॥ గీ॥ ఇది తులాగ్ర సంభవము కా దేల కనలె
దమ్మ! నీవు స్థితప్రజ్ఞ వని తలంతుఁ
గాన నీ మనోహరుని ప్రాగ్జన్మవిషయ
మొలి వినిపింతు; విని మది నూఱడిలుము 9

## —: కోవలన్ పూర్వజన్మ వృత్తాంతమును మధురాపతి కణ్ణగి కెఱిఁగించుట :—

సీ॥ వెలయుఁ గళింగ మన్ విషయంబు; సింహపు
రము దానఁ గలదు; తద్రమణుఁడు వసు;
వతనికి సంరక్షణాధికారి భరతుం
డనువాఁడు; పతి నీకుఁ బ్రాగ్భవమున;
నా వసురాజున కహితుండు కపిలపు
రా ధీశుఁడు కుమారుఁ డను నొక ప్రభుఁ;
డాతని పురినుండి వ్యాపారి సంగముం
డనువాఁడు వసుపురి కరుగుదెంచె;

తే॥ గీ॥ నాగతుఁడు వాఁడు నగల బేహారి యౌటఁ
గాంచియును భరతుం డొక్క కైతవమున
నతఁడు రిపురాజు ప్రణిధి యంచా త్మపతికిఁ
జెప్పి చేయించెఁ దచ్ఛిర శ్ఛేదనంబు. 10

కం॥ కావుననే దుర్విధి నీ
కీ విధి నన్యాయ మిట్టి దిట జరిపించెన్
నీ వైనను నే నైనను
నే వా రైనను దల విధి కీయఁగ వలయున్ 7

తే॥ గీ॥ పడఁతి! పుట్టుఁ బ్రారబ్ధార్ణవంబున సుకృ
తా మృతరసంబు దుష్కృత హాలహలము
ప్రాపు పర్యాయముగ రెంటి నాని జీవి
తమున సుఖదుఃఖము లను ద్వంద్వంబు నొందు 8

తే॥ గీ॥ ఇది తులాగ్ర సంభవము కా దేల కనలె
దమ్మ! నీవు స్థితప్రజ్ఞ వని తలంతుఁ
గాన నీ మనోహరుని ప్రాగ్జన్మవిషయ
మోలి వినిపింతు; విని మది నూఱడిలుము 9

## —: కోవలన్ పూర్వజన్మ వృత్తాంతమును మధురాపతి కణ్ణగి కెఱిఁగించుట :—

సీ॥ వెలయుఁ గళింగ మన్ విషయంబు; సింహపు
రము దానఁ గలదు; తద్రమణుఁడు వసు;
వతనికి సంరక్షణాధికారి భరతుం
డనువాఁడు; పతి నీకుఁ బ్రాగ్భవమున;
నా వసురాజున కహితుండు కపిలపు
రా ధీశుఁడు కుమారుఁ డను నొక ప్రభుఁ;
డాతని పురినుండి వ్యాపారి సంగముం
డనువాఁడు వసుపురి కరుగుదెంచె;

తే॥ గీ॥ నాగతుఁడు వాఁడు నగల బేహారి యౌటఁ
గాంచియును భరతుం డొక్క కైతవమున
నతఁడు రిపురాజు ప్రణిధి యంచా త్మపతికిఁ
జెప్పి చేయించెఁ దచ్ఛిర శ్ఛేదనంబు.

సీ॥ అతఁ డీల్గు టెఱిఁగి యా వ్యాపారి సతి నీల
యవ్వసు నగరికి నరుగుదెంచి
యంతయు నెఱిఁగి శో కాకుల హృదయయై
కాలు గాలిన పిల్లి కరణి నగరిఁ
బదునైదు దినములు భ్రమియించి భ్రమియించి
కనుల నశ్రులు కార్చి కార్చి కడకుఁ
బావనతిథి గల పదునైదవ దినంబు
నం దొక్క కొండ కొమ్మ ధివసించి

తే॥ గీ। దయితు పదములు మాటికిఁ దలఁచి కొనుచు
నచటి నుండి క్రిందికి దూఁకి ప్రాణ మీగి
వెండియును నిజనాథుని విబుధపురము
నందుఁ గలిసికొని సుఖంబు లంది తనిసె. 11

సీ॥ అది యట్లు దూఁకుచు "నన్మ న్మనోనాథు
ననిమిత్తముగ హత మార్చిన ఖలుఁ
డాగామి జన్మంబు నం దిదే మాడ్కని
నదవ చావునకుఁ బా లౌను గాక
ఆతని సతియు నా యట్ల శోకా కుల
దీనాత్మయై పురిఁ దిరిగి తిరిగి
పదునైదవ దినానఁ బర్వతా గ్రం బెక్కి
యిల దూఁకి తన ప్రాణ మీగి యవల

తే। గీ॥ శాంత చిత్తయై నిజనాథు స్వర్గసీమఁ
గలసికొని నిర్వృతిని బొందుఁ గాక యని మ
హా భయంకర శాపా ఖహతులఁ జేసె
నిన్ను నీ పతి; నది మీకు నేఁడు గలిగె. 12

కం॥ అని పల్కిన మధురాపతిఁ
గని కణ్ణగి విస్తుపోయి కలిగిన తన య
య్యనుభూతినిఁ దలపోయుచు
మనమున శంకింప కనియె మధురాపతికిన్. 13

సీ॥ మధురాపురం బెల్ల మాడి బొగ్గ య్యె; నిం
కను నక్క డక్కడః గానవచ్చు
మంటలు కొన్ని; యో మధురాపతి! జ్వాలనుఁ
జల్లారు మనము నా శాసనమున;
ననఁగ నదియు నట్ల యగ్నిని బోధించె;
జ్వాలనుండు తోడనఁ జల్లఁ బడియె;
నంతటఁ గణ్ణగి యాత్మేశ్వరు సమాగ
మంబునకై తమకంబు గొనుచు

తే॥ గీ॥ విజయదేవత గాఁ బురి వెలసియున్న
'కొఱ్ఱవై' గుడి కడ కేగి కూరుచుండి
గాజు లెల్లఁ బో నడచుక కానిపించె
నట్లు తన కబ్బిన విధవా వ్యంజనంబు. 14

కం॥ "నా రమణుఁడు నేఁ బడమటి
ద్వారంబున నాఁడు పురికి వచ్చితి మి;టు నా
ధీరుఁడు చన నొంటరిగాఁ
దూరుపు ద్వారమున వీడుదుఁ బురి నకటా!" 15

సీ॥ అని చింత సేయుచు నా పతిదేవత
నగరంబు వెల్వడి నాల్గు దెసలు
సింహావ లోకంబు సేసి వైగై యేటి
కుల్లసిల్లుచు నున్న నున్నత తటి
పై కెక్కి నడచుచుఁ బ్రాంతమ్మున "నెడువేల్"
పాద ముద్రిత పుణ్య పర్వతంబు
దరిసి యటఁ గల యుద్యానం బొకటి స్వూచి
యచ్చట సుచ్ఛాయ మైన యొక్క

తే॥ గీ॥ రావి క్రిందఁ గూర్చుండి విశ్రాంత యయ్యె
దాని రమణీయ రూప సౌందర్యములకు
ధీరతకును సమాకృష్టు లైరి చెంతఁ
గొండ పల్లెల నివసించు కోయవారు 16

తే॥ గీ॥ అట్టు లాకృష్టు లైన య య్యాటవికులు
కణ్ణగిని డాసి కేల్మోడ్చి కరము భక్తి
"దేవి! నీవు వేలస్వామి దేవి వా?" య
టంచుఁ బృచ్ఛ సేయంగఁ "గా న"ని వచించి 17

సీ॥ వెండియు నే నొక్క విఖ్యాత వైశ్య వం
శంబునఁ బుట్టిన చాన; గొప్ప
కోటీశ్వరు సుతుండు కోవలకా పతి నాకు;
నతఁ డొక భోగిని నాశ్రయించి
యున్న దంతయు దాని కూడ్చిపెట్టి దరిద్రుఁ
డై మధురాపురి కరుగుదెంచి
వెలలేని నాయందియల లోన నొకదాని
నమ్మఁ బోఁగా మధు రాధినాథు

తే॥ గీ॥ భటు లతనిఁ జోరుఁ డనుచును బట్టి చంపి
రతఁడు దొంగకాఁ డనుచు సత్యంబు ఋజువు
చేయఁ బ్రభుఁడు సభార్యుఁడై జీవ మెడలె
మధుర నల్క శపించితి; మాడె నదియు 18

తే॥ గీ॥ ఇంకఁ బదునైదు దినముల కేను బతిని
గలిసికొని స్వర్గమున కేగఁ గలను; విభుని
రాక నే నిరీక్షించు చీ రావి క్రింద
నుండఁ గలదాన నని పల్కి యూరకుండె. 19

తే॥ గీ॥ ఆ పతివ్రత పలుకుల నాలకించి
యద్భుతంపాటునఁ బులకి తాంగు లగుచుఁ
బదర కే పుట్ట లోన నే పాము గలదొ
యెఱుఁగ నేరికిఁ దర మని యెంచుకొనుచు 20

కం॥ పదునైదవ దివసంబునఁ
బొదలం గల యా విచిత్రమును జూచుటకై
ముదము పడుచు నవ్వనమున
నదరు బెదరు లేక యుండి రయ్యాటవికుల్. 21

కం॥ పదునాల్గవ దివసము తుదిఁ
బదునైదవ దినము మొదల వనమెల్లఁ బ్రభా
భ్యుదయమున వెలింగెన్ వి
ద్యు దధిష్ఠిత మైన తెఱఁగుఁ దోపఁగ నంతన్ 22

—: ఇంద్రాగమనము :—

సీ॥ వినువీథి నలనల్ల వీతెంచు గాలి కు
డ్డీనమౌ మేలి కడాని పడగ;
దిగువలోకము చూడఁ దివురుచుఁ దన మోము
నొగి వ్రాల్చు మాతలి యున్న నొగలు
వాగె రాపున కోర్వ వల్లగామి సెలవు
లఁ లాల లోడ్చు తెల్లని హయంబు
గిరగిరఁ దిరుగుచు ధర మీఁద నాగుట
కై యారటపడు రథాంగకములు

తే॥ గీ॥ తనరఁ గణ్ణగీదేవి దాపునకు వచ్చి
నిలిచె నరదంబు; కోవలన్ లలిత మధుర
వేషమునఁ ఐంద్రునట్లు లో వెలుఁగుచుండె;
నింద్రుఁడు రథంబు డిగి వచ్చి యింతి కనియె 23

...: ఇంద్రుండు కణ్ణగిని స్వర్గమునకు గొంపోవుట :....

కం॥ లోకాభి నుతవు కణ్ణగి!
నీ కీర్తి జగాన నిలుచు; ని న్నె పతకుఁ బై
లోకంబుల గాని; దిగువ
లోకంబుల గాని సరి పలుక నౌ నాకున్ 24

కం॥ కన్యకవో? హిమభూధర
కన్యకవో? క్షీరవార్ధి కన్యకవో? గా
కన్యవు గా వీవు; జగ
న్మాన్యవు; స్త్రీలోకమునకు నగవు విశుద్ధా! 25

కం॥ నీ పుణ్యచరిత వినిచిన
నోపికతో వినిరి దివ్య యువతులు; వ్రేళుల్
మోపిరి ముక్కున; సాధ్వీ!
నీ పదముల వ్రాలఁ దెమ్మ నిరి నిన్న టకున్ 26

కం॥ దేవీ! పతివ్రతాదేవత
వీవు; సమారాధ్య వౌదు వెల్లరికిన్; నీ
పావన చారిత్రము వినఁ
బావితుఁ డౌ జగతి నెట్టి వాఁడును భద్రా! 27

కం॥ అని యగ్గించుచుఁ గణ్ణగి
వినూత్న కల్ప ప్రసూన వితతుల నర్చిం
చిన వాఁడై కోవలనున
తు నేడమ దేస రథమున నిడుకొని దివి కేగెన్ 28

తే॥ గీ॥ ఆ మహాద్భుత దృశ్య మయ్యాటవికులు
కన్ను లారఁ గనుంగొని కంచుకిత శ
రీరులై తమకుఁ గలి విదారణంబు
జన్మ సాఫల్య సిద్ధియు సంభవించె 29

కం॥ ఇట్టిది కని విని యెఱుఁగము;
పుట్టం బో దింక మీఁద భూమి ననుచు లో
మిట్టాడు హర్షమునఁ దమ
పట్టులకుం జనిరి భక్తి బహుళము గాఁగన్ 30

## సెంగుట్టువన్——వెన్మల్ దేవి

సీ॥ పతితోడఁ గణ్ణగి స్వర్గంబునకు సేంద్ర
గాఁ జన్న నేక కొంత కాలమునకు;
వనవాస మభిలషించిన తన రాణి "వే
న్మల్దేవి" కోరిక న్మనుప దలఁచి
చేరక్షితీశుండు "సెంగుట్టువన్ నామ
ధేయుండు భరతనదీ తటమున

నొక వీడు నెలకొల్పె సకల రాజోపభో
గంబుగాఁ బరిచారికా గణంబు

తే॥ గీ॥ తన్ను సేవింప నొక కీడు తారకుండ
నుర్వి నేల వచ్చిన పురుహూతుఁ డనఁగఁ
జూపఱు నుతింప భోగాల చూఱ గొనుచు
రాణితో[వసించెను దద రణ్యభూమి 31

కం॥ పచ్చని తృణములు మేయుచు,
నచ్ఛంపుం బడియ నీటి నానుచు, వనమం
దుచ్చావచముఁగ ఁదిరుగుచు
గిచ్చికజా లాడుకొను మృగీ వారంబుల్ 32

సీ॥ అందుగుఁజిగుళుల హస్తాగ్రముఁన ఁద్రుంచి
సహచరి కందిచ్చు సామజమ్ము
లిష్టమౌ మెత్తని యెఱచి చూలా లైన
ప్రియ నోట నిడిచెడు పెద్దపులులు;
తేనెఁ దాఁ గ్రోలి మీఁదికి మోర యెత్తిన
భామను గ్రోల్చెడు భల్లుకమ్ము
లెండ కోర్వక కొల నుండు చోటికిఁ దారు
దార ననుసరించు సైరిభములు

తే॥ గీ॥ కన్న బిడ్డను బొట్టకు ఁగఱచుకొని త
రూచ్చశాఖలు ప్రాకుచు నున్న ప్రియను
బాయ కనుపుచ్ఛముగఁ బోవు వానరములు
కంటి కింప "వెన్మత్తేవి" కాంతున కను 33

కం॥ ఈ వన్య మృగంబుల కో
ఖా వహ చేష్టలు కనులకు నానందంబున్
గావించు, నింద యుండెద
భూవల్లభ! కొన్ని మాసములు నిశ్చింతన్ 34

కం॥ నా యీ ప్రార్థన కో స్వా
మీ! యడ్డొ క్కండు నాక మేకొనుఁడు; తదు

చ్ఛాయలు, పచ్చని పొలములు,
నా యెదఁ జొక్కించుచు నయనంబుల కించున్ 35

కం॥ అనవుడు తేఁ దంతిపురం
బు నీకు (జేదుగ. నరణ్య భువి తీపుగ న
య్యేనొ కాక! యీ యభీష్టము
చనునే కోరంగ నీకు జనపతి సతికిన్ 36

కం॥ శుక పిక మయూరికా శా
రికా కలరవ ప్రతి ముఖరితమై సుఖదా
యక మౌ నంతఃపురికిఁ శ్రు
తి కటు నద న్మృగము వనము దేవి! సమమే! 37

కం॥ ఐనను రాణివి నా కీ
వే నీ ప్రియవల్లభుండ; నీ నీ కోర్కెన్
నే నెటు కాదని యందున్;
నేనును నీ తోడ నీ వనిఁ నివసింతున్ 38

కం॥ అనుచు (దన కోర్కె మన్నిం
చిన విభుతోఁ గూడిమాడి జీవించుచు న
వ్వన తిర్య క్చే ష్టితములఁ
గనుగొనుచుఁ దదా ఖరామ్య కలన కలరుచున్ 39

....: లుబ్ధకులు పెంగుట్టవనునకుఁ గణ్ణగి వృత్తాంతము నెఱిఁగించుట :....

కం॥ సతి యుండె; నవ్వనంబునఁ
బతియుఁ ద దనుగామియై నివాసం బుండెన్;
సతియుఁ బతియు నిట్లుండఁగఁ
గతిపయ దినములకు. లుబ్ధక ప్రజ వటకుఁ 40

సీ॥ చనుదెంచి తాము దెచ్చిన పుట్టతేనియ
పెన్నేరిగడ్డలు వెదురుబియ్య

మాడిగాఁ గలిగిన యడవి దినుసులు భూ
పతికిఁ గానుక వెట్టి పల్కె రిట్లు;
దేవర! యీగడ్డఁ దిరుగు వాలుమెకాలు
రేయుం, బవళ్ళు; గాచించు జనుల
వాని ధాకకుఁ దట్టుకో నేరక వసింతు
మెత్తైన చెట్లపై నేము చప్ప

తే॥ గీ॥ రముల; వెదురుబియ్యపు టోగిరంబు తేనె
మాకు జీవనా ధారమా, మాట యట్టు
లుండ నిమ్మొకమీడ! మీ రుండు నిటకు
నేము వచ్చుటకుఁ గలదు హేతు వొండు 41

కం॥ వినుమో సామీ! యీ భూ
మిని నింతకు మున్నె పుడును మేము కని యెఱుం
గని దొక్కటి జరిగిన దే
మును దానిన్ గని సుకృతులముగ నైతి మయా! 42

కం॥ ఇందు శరీరము తోడనె
పొందిన దమరా లయంబు పుణ్యాంగన యో
ర్తుం దలము చూచితిమి యా
సుందరి ఁగణ్గి తదభిద క్షోణీనాథా! 43

సీ॥ తన పతి మధురలోఁ దలఁదీయ ఁబడ్డ య
నంతర మా సతి యన్నగరము
వెలికి వచ్చి "నెడువేల్" నిలయమౌ నొక గిరి
దరసి. యాగిరికిఁ బ్రాంతమున నున్న
యొకతోపుఁ జొచ్చి యందున్న సుచ్ఛాయమౌ
నొక దావి మూలాన నుంటఁ జూచి
"దేవి! వేలస్వామి దేవివా నీ వ?" ని
పృచ్ఛ సేసితి మేము; వెలఁది కాన"

తే॥ గీ॥ టంచుఁ బల్కెఁ నే విధవగా నయ్యలార!
మీకుఁ గన్పడు చుంటిని; మీరు నన్ను

నవిధవగఁ నెంచు డీచోట నద్ది మీరు
కాంచెద రసంశయముగ మీ కనులతోడ 44

తే॥ గీ॥ ఇంకఁ బదునైదు దినముల కేను బతిని
గలిసికొని స్వర్గమున కేగఁ గలను; విభుని
రాక నే నిరీక్షించు చీ రావి క్రింద
నుండఁ గలదాన నని పల్కి యూరకుండె 45

తే॥ గీ॥ ఆ పతివ్రత పలుకుల నాలకించి
యద్భుతం పాటునఁ బులకి తాంగుల మయి
పదర కే పుట్ట లోన నే పాము గలదొ?
యెఱుఁగ నేరికిఁ దర మని యెంచు కొనుచు 46

కం॥ పదునైదవ దివసంబునఁ
బొదలం గల యా విచిత్రమును జూచుటకై
ముదము పడుచు నవ్వనమున
నదరు బెదరు లేక యుంటి మవనీ నాథా! 47

ఉ॥ ఆ యమ పల్కి నట్లు పదునైదవ నాఁడు రథం బొ కండు కం
దోయికి విందుఁ గూర్చు చల తోపున రావి కుజంబు చెంతకుఁ
డాయఁగ వచ్చె; లో మిసిమి డంబు గలాఁ డొకఁ డుండె; వేఱు వాఁ
డా యరదంబు డిగ్గి కను లార్పక నా సతి నట్టె చూచుచుఁ 48

కం॥ చనుదెంచి మ్రొక్కి తాఁ దె
చ్చిన వాడని పూల దాని సేవించి రథం
బున నున్నవాని కెడమ దె
స నుంచుకొని మింటి కెగసి క్ష్మాపతి! చనియెన్ 49

కం॥ మును దీనిఁ జూడ రెవ్వరు;
వినియు నెఱుగ రేము దీని విస్పష్టముగాఁ
గనినార మని నివేదిం
చిన యయ్యాటవికుల ననిచెన్ బతి; యంతఁ 50

—: కణ్ణగి పేర నాలయమును నిర్మించుటకు రాణి రాజును బ్రేరించుట :—

సీ॥ దేవికిఁ గణ్ణగి దేహ పరిత్యాగ
వృత్తాంత మంతయు వినిచె; నామె
మన యేలుబడి నున్న మహిలో నిది ఘటిల్లె
మన భాగ్య మింతంత యన దరంబె?
దేవ! యా సాధ్విఁ బత్నీదేవతగ నొక్క
దివ్యా లయమునఁ బ్రతిష్ఠ సేసి
యర్చించు టర్హ మంచనుడు మంత్రి పురోహి
తా దు లోం కారంబు నాచరించి

తే॥ గీ॥ భూమి వల్లభు నాకార్యమునకు సుముఖు
గా నొనర్చిరిః యంత భూకాంతు డామ
హత్తరమగు పవిత్ర కార్యం బొనర్పఁ
బద్ధతి నెఱింగింపఁ దనఁగ బతికి వారు 51

సీ॥ హైమవతీ దేవి యావిర్భవించుటఁ
బరమ పావన మైన ధరము నుండి
కణ్ణగీ దేవి విగ్రహము మలచుటకై
దివ్యశిల నొకటి తేర వలయుః
నా విగ్రహము నాలయమునఁ బ్రతిష్ఠించి
త దభిషేకమునకు దైవతనది
యైన భాగీరథి యంబులఁ దెప్పింప
వలయు భూతలనాథ! బద్ధతి యిది

తే॥ గీ॥ యని వచింప నామోదించి కనులఁ బ్రీతిఁ
గురియు వాడునుం బోలె నై కొండిక నగి
భేరి నినద పూర్వముగ మా పేర నివ్వి
ధమునఁ జాటింపుఁ డనుచు ముదల యొసంగె 52

సీ॥ వినుఁడు జంబూద్వీపమున నున్న ఱేఁడులు!
సెంగుట్టువన్ పతి సేయు నాజ్ఞ

నింతకు మున్ను దుర్దాంతము లైన మా
బలములు కర్ణాటకుల వధించి
గంగులఁ గట్టుల వంగీయులఁ గదంబ
కొంకణుల ఁగళింగకుల వధించి
విజయ ధ్వజంబుల వెలయించి, యసిపుత్రి
కా రక్త ధారల గాంగ వారిఁ

తే॥ గీ॥ గడిగి కొనియె; నిష్ఠా క పుణ్యకాంత ప్రతిమ
మలఁచుటకు వలయు శిలఁ దే మంచుమలకు
విజయ యాత్రకై యిప్పుడ వెడలుచున్న
విదిగొ! యవహితులై యుండుఁ డెల్లవారు 53

...: సెంగుట్టువను విజయ యాత్ర :...

తే॥ గీ॥ ఆ మొదల బడి మంత్రులు శ్రీముఖములఁ
దమిళ రాజ్యాల మూఁటి చిహ్నములు, వ్యాఘ్ర
మీన ధనువు లచ్చొత్తించి తోన రాజ
ధానిఁ గల వివిధ నృప దూతల కనిపిరి 54

కం॥ వారును దమ యేలికలకుఁ
జేర క్షితినాథుఁ డిడిన శ్రీముఖము భయ
స్ఫారిత వినయ వివేకో
దారు లగుచు వెంట వెంట ననిపిరి భక్తిన్ 55

సీ॥ మున్ను కన్యాకుబ్జ పుర రాజపుత్రి స్వ
యంవ రోత్సవ సమయంబు నందు
దక్షిణ దేశ భూదార త్రయంబును
ద్రమిళ ప్రజల నెల్లరఁ దృణమునకుఁ
గైకోక పోవుట గాక కాకుల వలె
నల్లగా నుండు గేణపుఁడు మున్ను
గాఁ గల దక్షిణ క్ష్మాపాలు రెట్లు న్న
త హిమాద్రి శృంగ మూర్ధమ్ము లందు

తే॥ గీ॥ విజయ చిహ్నాలఁ జెక్కించి వెలసినారొ?
యని పలికిన యార్యావర్త జనపతుల దు
రుక్తి వంజికక్రూరున కోలి వచ్చు
ప్రజ వలన విని సెంగుట్ట వన్నృపుండు 56

తే॥ గీ॥ కనుల నిప్పుల నుమియుచుఁ గదనసీమ
నౌత్తరాహుల దుర్గర్వ మణఁతుఁ గాక
ప్రతి యొనర్పక దూ ఱిగు వలను లేదొ
కంత నుచు భూరిసైన్యుఁడై దండు వెడలె 57

సీ॥ మగధపాలకులు నిర్మదులు సూత్రవర క
ర్ణారులు త ద్దాక్షిణాత్య చక్ర
వర్తికి సెంగుట్టవనునకుఁ దమ కున్న
నౌకల నొసఁగి సైన్యముల గంగ
దాఁటించి రావల దరి క్షుద్ర భైరవ
సింహ ధనుర్ధర శ్వేత కనక
విజయా ది పాలురు వెలయించిన యనుప
మ వ్యూహముల నెల్ల మట్టు వెట్టి

తే॥ గీ॥ త న్మహాసేన నిజ ఖడ్గధారకు బలి
వెట్టి, విజయలక్ష్మికి మనఃప్రీతి నెఱపి
గంగ గట్టున జయపతాకల ప్రతిష్ఠ
సలిపె సెంగుట్టవన్మహాచక్రవర్తి 58

—: మాదలన్ వృత్తవృత్తాంతమును రాజునకు వినిపించుట :—

కం॥ ఈ విజయా నంతర మా
క్ష్మావరుఁ డమ్మంచుములకు ఁజని తత్రత్యం
బౌ వివిధ తీర్థ చయమును
సేవించి కృతార్థుఁ డయ్యె క్షీణా ఘుండై 59

తే॥ గీ॥ విశ్వకీర్తి పత్నిదేవి విగ్రహమున
కుచిత మౌ విమల గ్రావ మొక్కటి గొని

తిరుగు మొగ మయ్యె; స్వ విజయ పరముగా "ఇ
మయ వరంబన్" బిరుద మూనె మహివిభుండు 60

సీ తిరుగు పయనమున ధీశాలి సెంగుట్ట
వన్నృపాలకుఁడు సవాహినీకు
డై యరుదెంచుచు నమరాపగా దకి
ణ తటంబున విడిసి నయనములకుఁ
బండువుగాఁ గొలు వుండె; నత్తఱిని బా
వన గాంగ జలముల ఁబ్రస్థరమున
కభిషేక మొనరించి రయ్యుత్సవమ్ముఁ బ్రే
కకుల నడుమ నుండి కాంచువాఁడు

తే గీ "మాదలణ" పేరివాఁ డొక్క మహిసురుండు
రాజు లేని కాలమునఁ దద్రాష్ట్రమున ఁబ్ర
వర్తిలిన వింత లెల్లను బ్రభుని కిట్లు
పండొలిచి పెట్టినట్లు చెప్పం దొడంగె 61

తే గీ ధారుణీంద్ర! కవుండిచేఁ దన కొసంగఁ
బడ్డ కణ్ణగిదేవి ఁగోవలను విభుని
రక సేయుమికి శుగగ్ని ఁగ్రాఁగి క్రాఁగి
చిట్ట చివరకు వహ్నిఁ జొచ్చెఁ మదారి. 62

తే॥ గీ॥ అనుఁగు బిడ్డల వోలె ఁదన్ను నుసరించు
కణ్ణగికోవలనులు లోకంబు పాసి
చనుట యెఱిఁగి ప్రాయోపవేశంబు నొంది
కోల్పడె నుసురు జైన భికుకి కవుంది 63

తే॥ గీ॥ సర్వ మెఱిఁగిన కోవలన్ జనకుఁడు శత
వృద్ధుఁడు మసత్తువాను శ్రీఁ బేదల కిడి
సన్న్యసించి విరాగియై జను లెఱుంగు
నట్టు బౌద్ధవిహారంబు నందుఁ జేరె 64

తే॥ గీ॥ కూలిరి కొడుకుఁ గోడలు సాల కిడ్డ
వెన్నుగాఁడియు నిద్రాడు విఱిగి పడ్డ

పగిది నే నింక నిల నేమి బావు కొందు
ననుచుఁ బతి త్రోవ కయికొనె నతని సతియు 65

కం॥ అనలు వరంబునఁ బుట్టిన
తనయను జామాతను విధి దయ మాలి యుతం
చెను నా బ్రదు కేమిటి కని
మనైక్కను విభుండు భిక్షు మార్గము గొనియెన్ 66

కం॥ కొండంత యల్లుఁ డీలిగె
నుండిన మగఁ డూరు విడిచి యుఱికెః నిఁకన్ నే
నుండిన నూడిన నేమని
యాండాళమ్మయుఁ బతి త్రొ వవలంబించెన్ 67

ఉ॥ నా వశ వర్తియై మెలఁగి నాఁడుః సుఖంబులఁ దేల్చి నాఁడు నన్
గోవల నట్టివానిఁ బోరి గొన్న పిశాచిని నంచు మాధవీ
దేవియు గుండు కొట్టుకొని దేశముఁ ద్రిమ్మరు చార్తి నొక్క బౌ
ద్ధా వసథంబు ఁజేరె స్వకృతా ఘముఁ బాయు నుపాయ మెంచుచున్ 68

తే॥ గీ॥ కన్నతల్లి తోడ మణిమేఖలయు ఁజేరె
నప్పు డా బౌద్ధమతమున యందు నహహా!
చేనిలో నావు మేయంగ దాని దూడ
గట్టుపై నిల్చి మేయుట గలుగు నెట్లు? 69

కం॥ మాధవి పోకకు వగచుచు
బాధకు లో నగుచుఁ జిత్రపతి యుండఁగ ఁదా
నా ధూర్త గనుంగొనఁ జని
"హా! ధిక్క" ను చెద యవిసి ప్రియంవద ఁజచ్చెన్ 70

కం॥ దారుణమౌ నీ చెట్టకుఁ
గారణ మౌ కమ్మసాలె కణ్ణగి శాప
ప్రేరిత వహ్ని జ్వాలా
వారంబున మాడి మిడుత వలె మసి యయ్యెన్ 71

## ....: వెట్రివేలు ప్రభువు :...

సీ॥ అమ్మహాగ్ని ప్రళయా నంతరము నెడుం
జెవియన్మహీనాథు చిన్నతోఁడు
విపులతేజస్కుండు "వెట్రివేల్‌చెవియను"
సింహాసనం బధిష్ఠించి రాష్ట్ర
మందుఁ దక్కన వేయిమంది నాడింధము
లం బట్టి ధర్మా వలంబ మగుచుఁ
గ్రాలు పత్నీదేవి కణ్ణగికిఁ బ్రియంబు
గల్గు నట్లొ క్కటఁ గావువెట్టి

తే॥ గీ॥ దద్రుధిరమునఁ బురదేవతకు ఘటించెఁ
దనువు; వరుణుఁ డబ్బలికి సంతసము చెంది
కుండపోతగ వర్షించి మండల మఖి
లంబు వివిధ సస్య శ్యామలం బొనర్చె 72

కం॥ అని జరిగిన వృత్తాంతం
బును మాదల నా ధరావిభునకు నెఱింగిం
చె నమృత ధారా మధురము
గ నెల్ల సభ్యులకు ముదము గల్గఁగ నంతన్ 73

## —: సెంగుట్టవను స్వర్ణతులాభారము—దానాదికము :—

కం॥ సెంగుట్టవన్మహీశుఁడు
బంగారమునఁ దులఁ దూగి బ్రాహ్మణులకుఁ ద
క్కుంగలుగు పేదసాదల
కుం గురులకు మాదలమున కుఁదాని నిడెన్ 74

తే॥ గీ॥ అట్లు స్వర్ణతులాభార మనుభవించి
రాణ్మణి విజయలక్ష్మీ పురస్సరముగఁ
బావన గ్రావ ఖండంబుతో వెడలె స్వ
రాష్ట్రమునకు సైన్యములు పార్శ్వములఁ గొలువ 75

## ....: కణ్ణగి విగ్రహ ప్రతిష్ఠ :...

సీ॥ చేరదేశంబును జేరి సెంగుట్టవన్
రాజచంద్రుఁడు తన రాజధాని
వైజయంతము క్రిందు పఱచు రమ్యాలయం
బొకటి నిర్మించి విధ్యుక్త రీతి
నందుఁ బత్నిదేవి యైన కణ్ణగి విగ్ర
హముఁ బ్రతిష్ఠింపించె నార్య సంప్ర
దాయా నుగుణముగా నావల నొక మహా
యజ్ఞంబు సేయించి యవని సురుల

తే॥ గీ॥ కెల్లనున్ భూరి దక్షిణ లిచ్చె; మఱియు
దాన ధారా జలంబుల ధరణిఁ బంకి
లం బొనర్చె; జాతి విచక్షణంబు లేక
పేదలకుఁ గూడు గుడ్డ లిప్పించె మిగుల 76

తే॥ గీ॥ పట్టుపడి బందిఖానాల బాధపడుచుఁ
బొగులు చున్న యార్యావర్త భూమిపతుల
నితర బందీల నెల్ల నుర్వీశ్వరుండు
విడువఁ బంచె నయ్యుత్సవ వేళఁ గరుణ 77

సీ॥ ఆ యుత్సవము కన్నులారఁ గనుంగొన
వచ్చె విశాలాక్షి; వచ్చె మరక
తముః వచ్చె దేవాంఢి; తనుపుగా వేడుక
లన్నియు గన్గొని; యవని విభుఁడు
సెంగుట్టవన్ప్రభు చెంతకు ఁజని వారు
ముప్పురు రాజేంద్ర! పుణ్యకాంత
కణ్ణగి, యయ్యమ్మఁ గని పుహారు పురంబు
పూతమై ధారుణిఁ బొందెఁ గీర్తిఁ

తే॥ గీ॥ దత్ప్రతిమనుఁ బ్రతిష్ఠించి ధన్యగా నొ
నర్చితి వీ పురంబు; నిన్ సన్నుతింపఁ

వరమె మాకని పల్కి తద్రాజధాని
మతమునం జేరి పోయిరి మహిత వృత్తి 78

సీ॥ అంతఁ బత్ని దేవ తాలయ పోషణ
మునకు సెంగుట్టవక్ష్మాభూమిపాలుఁ
డగ్రహారంబు లనంతశాలిక్షేత్ర
సంతతు లెన్నొ యొసంగి నాఁడు
చిరబద్ధ ముక్తులౌ సింహళ గజబాహు
మాలవ కంగు దేశాల ప్రభువు
లౌత్తరాహులు పల్వు రాదేవి కణ్ణగిఁ
బూజించి తమదేశములకుఁ జనిరి

తే॥ గీ॥ ముక్తులై చిన్నఱేండ్లు స్వపురములందుఁ
గణ్ణగికి నాలయంబులు కట్టి పెక్కు
మాన్యము లిడి పోషించుచు మఱియు నాడి
నెల జరుపుచుండిరి తిరుణాళ్ళ లఘుభక్తి 79

సమాప్తము.



